Islami Kirdar (Telugu)

# ఇస్లామీయ వ్యక్తిత్వం

మూలం

**ముహమ్మద్ అల్ గజాలి**

ఉర్దూ అనువాదం

**అబ్దుల్లాహ్ ఫహద్ ఫలాహి**

తెలుగు అనువాదం

**కె.ఎం.ఎ. సుబ్‌హాన్**

# విషయసూచిక





# 1 వ భాగం

# ఇస్లామీయ ప్రాథమిక విధులు!

# నైతిక విలువల ప్రాధాన్యత!!

- దైవ సందేశ లక్ష్యం : నైతిక విలువల పరిపూర్తి
- నమాజ్ సమస్త చెడుల నుండి పరిరక్షిస్తుంది
- జకాత్ పరిశుద్ధతు దోహదకారి
- రోజా (ఉపవాసం) దైవనిష్ఠకు దర్పణం
- హజ్ ప్రాపంచిక వ్యామోహాన్ని తగ్గించే సాధనం



# దైవ సందేశ లక్ష్యం- నైతిక విలువల పరిపూర్తి

అల్లాహ్ సందేశహరులు ముహమ్మద్(స) తన పుట్టుక ప్రధాన లక్ష్యం గురించి, సందేశ ప్రచార విధానం గురించి ఈ క్రింది పదాలలో క్లుప్తంగా వివరించారు.

'నేను కేవలం ఉత్తమ నైతిక ప్రమాణాల పరిపూర్తి కొరకు మాత్రమే ప్రభవింపజేయబడ్డాను' (ముఅత్తా గ్రంథం)

చరిత్రలో శిలాక్షరాలుగా, చెరిపివేయడానికి వీలులేని సజీవ గుర్తులను, తన మహోన్నత సందేశ కిరణాల ద్వారా వ్యాపింపజేసి, దానిచుట్టూ ప్రజలను సమీకృతం చేయడానికి చివరి దైవప్రవక్త ముహమ్మద్(స) అవిశ్రాంత కృషి సలిపారు. ఈ అవిశ్రాంత కృషి కేవలం ప్రజలను నైతికంగా సౌందర్యవంతులుగా తీర్చిదిద్ది వారి ద్వారా ప్రపంచానికి ఒక మహోజ్వలమైన అత్యంత సుందరమైన సమాజాన్ని నిర్మించడం తప్ప మరేమీ కాదు. ఈ మహోజ్వల సమాజం వైపునకు ప్రజలు చైతన్యంతో, స్పష్టమైన అవగాహనతో ఆకర్షితులు కావాలి.

దైవారాధనలు ఇస్లాంలో విధి చేయబడ్డాయి. వాటిని విశ్వాసపు మూలస్తంభా లుగా పేర్కొనడం జరిగింది. ఈ మూల స్థంభాలు మానవుడికి ఎటువంటి ప్రయోజనా లను చేకూర్చని- ఆచరణలకు పురికొల్పని- నిష్ఫలమైన అగోచర విషయాల సాధనకు సంబంధించినవి కావు. ఇస్లాం ఆదేశించిన సమస్త ఆరాధనా విధులు మనిషిని నైతిక విలువల శిక్షణకు, వ్యక్తిత్వ వికాసానికి అందుకు అవసరమైన పరిశ్రమకు, వాటి చల్లని నీడలో జీవించే అలవాటుకు శిక్షణ గరుపుతాయి. పరిస్థితులు ఎన్ని మలుపులు తిరిగినప్పటికీ ఎన్ని మార్పులకు లోనైనప్పటికీ. ఆరాధనా విధుల శుభాల ద్వారా జీవితం నిత్యనూతనంగా మలుచుకునేలా తర్ఫీదు లభిస్తుంది.

# నమాజ్: సమస్త చెడుల నుండి పరిరక్షిస్తుంది

మానవుడు ఆసక్తితో సంపూర్ణ హృదయంతో, ఏ విషయాల అభ్యాసాన్ని కొన సాగిస్తాడో ఆ అభ్యాసమే నమాజ్ పేరిట మానవునిపై విధి చేయబడింది. ఈ అభ్యాసం ద్వారా నిత్యం జీవితాన్ని పరిశుభ్రంగా, పవిత్రంగా, శుచిగా, ఆరోగ్యంగా, తన బాహ్య అంతరంగాలను మనిషి వుంచుకోగలడు. దైవగ్రంథం దివ్యఖుర్ఆన్, ప్రవక్త(స) సత్ సంప్రదాయం ఈ విషయానికి సజీవ సాక్ష్యాలుగా వున్నాయి. అల్లాహ్ విధి (ఫర్జ్)

చేయబడిన నమాజ్ 'స్థాపన' గురించి ఆదేశించిన సందర్భంలో అందులోని వివేకాన్ని ఇలా తెలియచేయడం జరిగింది.

'నిస్సందేహంగా నమాజ్ సమస్త అసభ్యకర చెడు కార్యాల నుండి నిరోధిస్తుంది.'

చెడుల నుండి ఆపడం, చెడు మాటలు, ఆచరణల నుండి మనిషిని శుభ్రపర్చడం కూడా నమాజ్ పరిధిలోనిది. ఒక హదీసె ఖుదసిలో అల్లాహ్ ఇలా సెలవిచ్చినట్లుగా ప్రవక్త(స) ఉద్బోధించారు.

'నేను కేవలం వారి నమాజ్‌ను మాత్రమే అంగీకరిస్తాను. వారు నా మహోన్నతను అంగీకరించడం ద్వారా అణుకువను కలిగివుంటారు. నా సృష్టితాలకు వారు చేసిన మేలును గుర్తుచేయరు. నా అవిధేయతకు దూరంగా ఉంటారు. నా నామ స్మరణలో రోజులు గడిపేవారు. పేదవారిని, బాటసారులను, బలహీనవర్గాలను, ఆపదల్లో, కష్టాల్లో ఉన్నవారిని కరుణతో చూసేవారు' (హదీసె ఖుదసి)

## జకాత్ : పరిశుద్ధతకు దోహదకారి

జకాత్, ప్రమాణబద్ధ ఆర్థిక స్తోమత కలిగినవారిపై విధి చేయబడింది. జకాత్ ప్రజల జేబుల నుండి వసూలు చేయబడే 'పన్ను' కాదు. అది ఒక కారుణ్యం. దయగల హృదయానికి చిహ్నం. ఆర్ద్రతతో కూడిన జీవనానికి గుర్తు. సమాజంలోని విభిన్న వర్గాలమధ్య భౌతిక పరిచయంతోపాటు, మానసిక ప్రేమ బంధాన్ని నెలకొల్పే సాధనం. జకాత్ చెల్లింపుకు సంబంధించిన వాస్తవికతను దివ్యఖుర్‌ఆన్ ఇలా విశదీకరించింది.

**'ప్రవక్తా! నీవు వారి సంపదల నుండి సదఖా తీసుకొని వారిని పరిశుద్ధపర్చు. ఇంకా, సన్మార్గంలో వారిని ముందుకు నడుపు.' (ఖుర్‌ఆన్, 9: 103)**

మనిషి ఆంతర్యాన్ని, ప్రాపంచిక మాలిన్యం నుండి శుభ్రపరచడం, సమాజాన్ని గౌరవనీయమైన ఉన్నత స్థానానికి చేర్చడం, జకాత్ ప్రప్రథమ లక్ష్యంగా వుంది.

ఈ కారణంగానే ప్రవక్త(స) 'సదకా' చెల్లింపును అత్యంత విశాలమైన లోతైన భావంతో స్వీకరించారు. ఈ చెల్లింపు ప్రతి దైవవిధేయునిపై (ముస్లింపై) విధి.

**'తన సోదరుని ముందు చిరునవ్వు నవ్వడం సదఖా(దానం); మంచి మాటల ఆదేశం ఇవ్వడం సదఖా, చెడు కార్యాల నుండి నిరోధించడం సదఖా, దారి తప్పి**

**తిరుగుతున్న బాటసారిని మార్గం చూపడం సదఖా, రహదారిలో నష్టం కలిగించే ముళ్లు, ఎముకలు, కూసురాళ్ళు తొలగించడం సదఖా, తన బొక్కెనతో నీళ్ళు చేది ఇతరుల పాత్రను నింపడం సదఖా, ఒక అంధుడిని అతని గమ్యం వరకు చేర్చడమూ సదఖాయే'** *(బుఖారి గ్రంథం)*

అని సదఖా (దానం) విశాలత్వాన్ని అద్భుతంగా, హృద్యంగా ప్రవక్త(స) ఆచరణాత్మకంగా సెలవిచ్చారు.

నిరంతరం ఘర్షణలు, కక్షలు, కార్పణ్యాలతో మునిగివుండిన సంచార జాతుల ప్రజలను, అప్పటి వాతావరణాన్ని సంబోధిస్తూ ఇవ్వబడిన పై ఆదేశం, ఇస్లాం వాస్తవ లక్ష్యాన్ని, దాని ఉద్దేశాన్ని తెలియపరుస్తుంది. అజ్ఞానంతో, మూఢనమ్మకాలతో మునిగి తేలుతూ వుండిన నాటి అరబ్బు తెగలను, మానవతా ఔన్నత్యం వైపునకు పిలుస్తూ నాయకత్వం అందిస్తూ మార్గదర్శకత్వం అందించినట్లు స్పష్టమవుతుంది.

## రోజా (ఉపవాసం) దైవ నిష్ఠాగరిష్టతకు దర్పణం

ఉపవాసం ఇస్లాంలో విధి చేయబడటానికి ప్రధాన కారణం : కేవలం కొన్ని రోజులపాటు మనిషి తన కోరికలను దాస్యంనుండి, చెడుల నుండి నైతిక రుగ్మతల నుండి విముక్తి పొందడం కాదు. తత్భిన్నంగా ఉపవాసం ఒక సంపూర్ణమైన, శాశ్వత మైన శిక్షణగా విధి చేయబడింది. ప్రవక్త(స) ఈ విషయంగా ఇలా సెలవిచ్చారు.

'ఏ వ్యక్తి (ఉపవాస స్థితిలో) అబద్ధం పలికాడో– ఆ అబద్ధంపై ఆచరించడం మానలేదో– అతడి ఆకలి దప్పికల అవసరం (అనగా అతని ఉపవాసం) అల్లాహ్‌కు ఎంత మాత్రమూ లేదు' (బుఖారి గ్రంథం)

మరొక ప్రవక్త ప్రవచనంలో ఇలా సెలవివ్వబడింది : 'ఉపవాసమంటే; కేవలం అన్నపానీయాలు వదిలివేయడం కాదు. తత్భిన్నంగా చెడు మాటల నుండి, అసభ్య అశ్లీల కార్యాల నుండి, దూరంగా ఉండేదాని పేరే ఉపవాసం. ఒకవేళ ఎవరైనా ఉ పవాస స్థితిలో మిమ్మల్ని దూషిస్తే– లేదా మీతో గొడవ పడితే అతడితో 'అయ్యా! నేను ఉపవాసిగా ఉన్నాను' అని పలికి పక్కకి తొలగిపోండి. (అనగా నేను నీతో గొడవ పడను) (బుఖారి గ్రంథం)

దివ్యఖుర్‌ఆన్ ఉపవాసాల పరమార్థాన్ని ఇలా బహిరంగపర్చింది.

**'విశ్వసించిన ప్రజలారా! ఉపవాసం మీకు విధిగా నిర్ణయించబడింది. ఏ**

**విధంగా మీకు పూర్వం ప్రవక్తలను అనుసరించేవారికి కూడా విధించబడిందో. దీనివల్ల మీలో భయభక్తులు జనించే అవకాశం ఉంది.'** ***(ఖుర్ఆన్– 2: 183)***

## హజ్ : ప్రాపంచిక వ్యామోహాన్ని తగ్గించే ఒక సాధనం

పవిత్ర స్థలాలను సందర్శించాలని, వాటి సందర్శనార్థం యాత్రలు చేయాలని స్తోమత ఉన్న ప్రతి మనిషి అప్పుడప్పుడూ అనుకుంటూ వుంటాడు. మనిషిలోని ఈ సహజ కోరికను ఇస్లాం తన విధులలో ఒకటిగా చేర్చివేసింది. అయితే ఈ యాత్రలు కేవలం యాత్రలుగా వుండకూడదు. ఈ యాత్రలు– ఆరాధనగా, నైతిక విలువలకు ఆలంబనగా, వ్యక్తిత్వ వికాసానికి సోపానాలుగా, తాత్విక భావజాల పరిచింతనను విశాలపర్చేదిగా వుండాలి. ఈ కారణంగానే సృష్టికర్త అల్లాహ్ హజ్‌యాత్ర ఆదేశాలను అందిస్తూ ఈ క్రింది విషయాలను స్పష్టపర్చాడు :

**'హజ్ మాసాలు అందరికీ తెలిసినవే. ఈ నిర్ణీత మాసాలలో హజ్ చేసే సంకల్పం వున్న వ్యక్తి అప్రమత్తుడై మెలగాలి. హజ్ సమయంలో అతడు కామ చేష్టలకూ, దుష్కార్యాలకు, ఘర్షణలకూ దూరంగా ఉండాలి. మీరు చేసే ఏ పుణ్యకార్యమైనా అది అల్లాహ్‌కు తెలుస్తుంది. హజ్ యాత్రకు ప్రయాణ సామగ్రిని తీసుకు వెళ్ళండి. భయభక్తులు అన్నిటికంటే ఉత్తమమైన సామగ్రి. కనుక వివేకవంతులారా! నాకు అవిధేయత చూపకండి.'** ***(ఖుర్ఆన్, 2: 197)***

ఇస్లామీయ జీవన వ్యవస్థలో పైన పేర్కొన్న విలువలకు, ఆదేశాల సంచయనానికి, ఆరాధనలకు అత్యంత ప్రాధాన్యత వుంది. ఈ కారణంగానే ఈ విధి అయిన ఆదేశాలు ఇస్లామీయ విశ్వాసానికి మూల స్థంభాలుగా వున్నాయి. ఇస్లామీయ జీవన వ్యవస్థలో ఆరాధనలకు నైతిక విలువలకు, వ్యక్తిత్వ వికాసానికి గల లోతైన అవినాభావ సంబంధం ఎంతటి దృఢంగా వుంటుందో స్పష్టమవుతుంది.

ఇస్లామీయ ఆరాధనల అంతరంగం (ఆత్మ)– బాహ్య ఆచరణలు వేర్వేరుగా ఉన్నట్లు బయటికి కనపడినా వాటి లక్ష్యం విషయంలో ఈ రెండు సమ్మిళితమై వుండి, దైవప్రవక్త ముహమ్మద్(స) పుట్టుకకు పరమార్థంగా కారణంగా ఉన్నాయి. నమాజ్, రోజా, జకాత్, హజ్ తదితర ఇస్లామీయ ఆరాధనలు, ఆదేశాలు, అనుసరణలు, వాటి వాస్తవికతలు అన్నీ వ్యక్తి వికాసానికి దోహదపడే సాధనాలుగా, శుచి శుభ్రతలకు సోపానాలుగా వున్నాయి. ఈ ఆరాధనల ద్వారా మానవ జీవితం సమస్త చెడుల నుండి

రక్షింపబడుతుంది. మహోన్నత శిఖరాలకు చేరుతుంది. ఈ ఆచరణల శుభాల ద్వారా తప్పనిసరిగా అత్యంత సహజంగా పొందే లాభాలను ఇస్లామీయ ఆరాధనలు మనిషికి అందిస్తాయి. ఈ ఉత్తమ వ్యక్తిత్వ వికాసానికి,నైతిక విలువలకు ఇస్లామీయ ధర్మంలో సర్వోత్కృష్ట స్థానం వుంది. ఈ విషయాన్నే సృష్టికర్త అల్లాహ్ ఈ క్రింది విధంగా తెలియపర్చాడు.

**'యదార్థం ఏమిటంటే, దోషిగా తన ప్రభువు ముందు హాజరయ్యేవాడికి నరకం తప్పదు. అందులో వాడు చావనూలేడు, బ్రతకనూ లేడు. ఆయన సాన్నిధ్యంలో విశ్వాసిగా హాజరై, సత్కార్యాలు చేసివున్నవాడు- అలాంటి వారందరికి ఉన్నత స్థానాలు వున్నాయి. నిత్యం పచ్చగా వుండే ఉద్యాన వనాలు వున్నాయి. వాటి కింద కాలువలు ప్రవహిస్తూ వుంటాయి. వాటిలో వారు శాశ్వతంగా వుంటారు. పరిశుద్ధతను పాటించే వ్యక్తికి లభించే ప్రతిఫలం ఇదే.'**

***(ఖుర్ఆన్, 20: 74-76)***

పై ఆరాధనల వాస్తవికతల ద్వారా రుజువు అవుతున్నది ఏమిటి? ఇస్లామీయ ఆరాధనలు అన్ని మనిషిలోని మానసిక కల్మషాలను కడిగివేసే సాధనాలు. మనిషి అంతర్యాన్ని విశాలవంతం చేసే జ్యోతి శిఖలు. దైవంతో సంబంధం కలుగజేసే సోపానాలు. తోటి మనుషులతో వున్న సంబంధాలను సమున్నతం చేసే, మెరుగుపర్చుకునే సాధనాలు. ఒక్కమాటలో మనిషి వ్యక్తిత్వం అన్ని కోణాలలో, అన్ని రంగాలలో సంపూర్ణంగా వికసించడానికి ఉపయోగపడే దివ్య ఔషధాలుగా ఇస్లామీయ ఆరాధనలు వున్నాయి. వీటి ద్వారా లబ్ధి పొందడం క్షేమకరం కాగా, నిర్లక్ష్యం వహించడం వ్యక్తికి, సమాజానికి వినాశకరం తప్ప మరేమీకాదు.



# 2వ భాగం

# నైతిక విలువల బలహీనత- విశ్వాస బలహీనతకు చిహ్నం

- నైతిక విలువలు లేని విశ్వాసం అసంపూర్ణం
- పంక్తులలో వక్రత, మానసిక ఆందోళనలు, ప్రభావ రహిత సజ్దాలు
- దరిద్రుడు ఎవరు?
- కపట స్వభావుల గుర్తింపు

# నైతిక విలువలు లేని విశ్వాసం అసంపూర్ణం

విశ్వాసం ఎంతటి బలవత్తరమైన శక్తి అంటే, అది మనిషిని నీచత్వం, తుచ్ఛమైన విషయాల నుండి నిరోధిస్తుంది. మహోత్కృష్ట సుగుణాల వైపునకు, మానవీయ విలువల వైపుకు ప్రోత్సహిస్తుంది. ఈ కారణంగానే సృష్టికర్త అల్లాహ్, తన దాసులను ఏదైనా సత్కార్యం వైపుకు ఉత్సాహపర్చినప్పుడూ లేదా చెడు పట్ల అసహ్యతా భావాన్ని కలిగింపజేసినప్పుడూ వారి హృదయాలలోని విశ్వాసాన్ని తప్పనిసరి అంశంగా తీర్మానించాడు. ఉదాహరణకు అల్లాహ్ తన దాసులను 'తౌబా సూరా'లో, తన పట్ల నిష్ఠ (తఖ్వా)ను స్వీకరించమని, సత్యాన్ని మాత్రమే పలకమనీ తాకీదు చేశాడు. 'యా అయ్యుహల్లజీన ఆమనూ' అనగా ఓ విశ్వాసులారా! అని సంబోధించాడు.

**"విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. సత్యవంతులకు తోడ్పడండి"**
***(ఖుర్‌ఆన్, 9: 119)***

దైవ సందేశహరులు(స) ఒక వ్యక్తిలో విశ్వాసం దృఢంగా, శక్తిమంతంగా నాటుకొని వుంటే దాని సహజ ఫలితంగా ఆ వ్యక్తిలో ఉన్నతమైన, క్రియాశీలమైన నైతికత, వ్యక్తిత్వం జనిస్తుందని స్పష్టపర్చారు. అదేవిధంగా ఏ వ్యక్తిలో నైతికతలు పతనం అయితే అతని విశ్వాసం కూడా అదే పతనావస్థలో వుంటుందని సుస్పష్టం చేశారు. ఏ వ్యక్తి అయితే సభ్యతా సంస్కారాలను పాటించకుండా అనైతిక ఆచరణలు సాగిస్తూ ఎవరినీ లెక్కచేయని చెడు అలవాట్లలో కూరుకునిపోయి వుంటాడో-అటువంటి దౌర్భాగ్యుని గురించి ఇస్లామీయ మహోపాధ్యాయులు ముహమ్మద్(స) ఇలా సెలవిచ్చారు :

**'లజ్జ, సిగ్గు విశ్వాసానికి కవలల్లాంటివి. ఎవరైతే అందులో ఒకటి వదిలేశాడో-అతను రెండవ దానిని కూడా కోల్పోతాడు.'**

ఒకసారి ప్రవక్త(స) ఒక అన్సారీ ఇంటివైపునుండి వెళుతూ వున్నారు. ఆ అన్సారీ తన సోదరుడిని సిగ్గు, లజ్జల గురించి విమర్శిస్తూ వున్నాడు. ఆ దృశ్యాన్ని చూసి ప్రవక్త 'అతడిని వదిలేయండి. ఎందుకంటే సిగ్గు, లజ్జలు విశ్వాసంలో భాగమై ఉన్నాయి' అని చెప్పారు. ఏ వ్యక్తి తన పొరుగు వాడిని ఇబ్బందులకు గురిచేస్తాడో వారి హృదయాలను గాయపరుస్తాడో- అతడిని ఇస్లామీయ ధర్మం 'హృదయ కాఠిన్యం' (పాషాణ హృదయం)

గలవానిగా తీర్మానించింది. ఇటువంటి వ్యక్తిగురించి ప్రవక్త మహోపాధ్యాయులు(స):

'దైవసాక్షి! అతను విశ్వాసి కాడు. దైవసాక్షి! అతను విశ్వాసి కాడు. దైవసాక్షి! అతను విశ్వాసి కాడు' అన్నారు. దానికి అనుచరులు 'ఆ వ్యక్తి ఎవరు ప్రవక్తా?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్త 'ఎవరి చేష్టల వల్ల, అతని పొరుగువాడు సురక్షితంగా లేడో ఆ వ్యక్తి' అని స్పష్టమైన తీర్పును ఇచ్చారు. (బుఖారి)

ప్రవక్త(స) తన క్రియ సహచర నేస్తాలను వ్యర్థ విషయాల నుండి, వినాశకర పనుల నుండి దూరంగా వుండమని హెచ్చరిక చేశారు. ఈ సందర్భంలో

**'ఎవరైతే అల్లాహ్ పట్ల- తీర్పుదినం పట్ల విశ్వాసం కలిగివుంటాడో- అతడు పలికితే మంచిమాటను పలకాలి. లేదా మౌనం పాటించాలి అని హితోపదేశం చేసేవారు' (బుఖారి)**

ఈవిధంగా ఇస్లామీయ విశ్వాసపు సత్యత, పరిపూర్ణతల ద్వారా మనిషి వ్యక్తిత్వం సుగుణభరితమవుతుంది. దాని ఆధారంగా ప్రసాదించబడే సంక్షేమకర శుభకర ఫలాలను అందించడంతోపాటు వాటిని పరిరక్షిస్తుంది కూడాను.

## పంక్తుల్లో వక్రత, మానసిక ఆందోళనలు- ప్రభావరహిత సజ్దాలు

విధి గావించబడిన ప్రాథమిక ఆరాధనల విషయంలో నిర్లక్ష్యం వహిస్తూ ప్రజల మధ్య మాత్రం తాము ఆరాధనల స్థాపన కొరకే పుట్టామని ప్రదర్శనాబుద్ధి గల ముస్లింలుకూడా మనకు తారసపడతారు. ఇటువంటి వారు ఏకకాలంలోనే విశ్వాసానికి, నైతిక వర్తనకు విరుద్ధమైన చర్యలు చేయడానికి ఏమాత్రం వెనుకాడని వారై వుంటారు.

ఇటువంటి వారి విషయంలో ప్రవక్త(స) హెచ్చరిక చేయడంతోపాటు ముస్లిం సమాజాన్ని వీరి నుండి జాగ్రత్తపడమని, అప్రమత్తులై వుండమని తాకీదు చేశారు.

ఇస్లామీయ ఆరాధనల అసలు ఆత్మను, దాని ప్రమాణబద్ధ స్థాయిని అర్థం చేసుకోని వ్యక్తి మాత్రమే చైతన్యరహితంగా ఈ ఆరాధనలను నెమరువేస్తూ వుంటాడు. ఒక పసిబాలుడు కూడా కొన్ని సందర్భాలలో నమాజ్ అంశాలను అనుకరిస్తూ,

వాక్యాలను పఠిస్తూ తాను నమాజ్ నెరవేరుస్తున్నానని భావిస్తాడు కదా! అదేవిధంగా ఒక నటుడు కూడా అత్యంత శ్రద్ధతో, ఆసక్తితో నమాజ్ ఆచరిస్తున్నట్లు నటించి చూప గలడు. కాని, ఈ చర్యలు, నటనలు, అనుకరణలు వాస్తవిక లక్ష్యసాధనకు ఏమాత్రం దోహదపడేవికావు. నమాజ్, రోజా తదితర ఆరాధనలను ఉత్తమ స్థాయిలో నెరవేర్చ డానికి, అందులోని మాధుర్యాన్ని ఆస్వాదించడానికి వున్న ఒకే ఒక్క షరతు ఏమిటంటే- ఆ ఆరాధనలు ఆచరించే వ్యక్తి ఉత్తమ నైతికతతో తొణికిసలాడుతూ వుండాలి. అప్పుడు మాత్రమే తప్పుడు ఫలితాలు అందవు. ఎవరిలో ఈ విశిష్టమైన వైధుర్యం వుంటుందో వారి ఆరాధనలు ఫలవంతం అవుతాయి. ఎవరిలో ఈ విశిష్టత శూన్యమో వారి ఆరాధనలు వివర్ణకాలైపోతాయి.

ఇమాం అహ్మద్(రహ్మ) ఉల్లేఖనం ప్రకారం 'ఒక వ్యక్తి ప్రవక్త మహోపాధ్యా యులను ఇలా అడిగాడు. 'ఓ అల్లాహ్ సందేశహరుడా(స)! ఫలానా స్త్రీ తన నమాజ్, రోజా, దానధర్మాల కారణంగా చాలా ప్రసిద్ధి చెందింది. కాని, ఆమె తన ఇరుగు పొరుగు వారితో నిత్యం గొడవపడుతూ పరుష పదజాలాలు ఉపయోగిస్తూ వారి మనసులను గాయపరుస్తూ వుంటుంది. మరి ఆ స్త్రీ పర్యవసానం ఎలా వుంటుందీ? దానికి ప్రవక్త(స) వారు 'ఆమె నరకంలో ప్రవేశిస్తుంది' అని జవాబిచ్చారు. ఆ తరువాత ఆ వ్యక్తి మరలా ఇలా ప్రశ్నించాడు. 'ఓ ప్రవక్తా! ఒక స్త్రీ తన నమాజ్ ఉపవాసాల పట్ల అంతగా శ్రద్ధాసక్తులు చూపదు. (కాని వాటిని ఆచరిస్తూ వుంటుంది) కాని, ఆమె తన వద్దనున్న జున్ను ముక్కలను ఇతరులకు దానం చేస్తుంది. ఇరుగు పొరుగు వారిని ఏమాత్రం కష్టం కలిగించదు. (వారి మనసులను గాయపర్చదు) అన్నాడు. అప్పుడు ప్రవక్త(స) 'ఆమె స్వర్గవాసి!' అని సెలవిచ్చారు.

పై ఉల్లేఖనం ద్వారా ఉన్నత వ్యక్తిత్వపు విలువలను అంచనా వేయవచ్చు. పై సంఘటన ద్వారా దానధర్మాలు చేయడం ఒక సామూహిక ఆరాధనగా రుజువయింది. ఈ ఆరాధన ద్వారా సమాజం లాభపడుతుంది, సంక్షేమకరమవుతుంది. ఈ కారణం గానే నమాజ్, రోజా లాంటి ఆరాధనల్లో కొంత కొరతలు ఉన్నప్పటికీ, అంతిమ పరిశీలనలో పై రెండు ఆరాధనలు వ్యక్తిగత ఆరాధనలు అవుతాయి. వీటివల్ల కేవలం ఆ వ్యక్తి మాత్రమే ప్రయోజనం పొందుతాడు. కాని దానధర్మాల ఆరాధన వల్ల మొత్తం సమాజం లబ్ది పొందుతుంది. ఈ కారణంగానే ప్రవక్త మహోపాధ్యా యులు రెండవ స్త్రీని స్వర్గవాసిగా ప్రకటించారు.

ప్రవక్త(స) పై ప్రశ్నను సాధారణ ప్రశ్నగా భావించలేదు. దానిని ధర్మంతో ఉత్తమ నైతిక విలువలకు ఉన్న సంబంధం దాని ప్రాముఖ్యతలు వివరిస్తూ జవాబి చ్చారు. సహచర సమాజానికి శిక్షణ గరిపారు. ఆరాధనల వాస్తవికతను ప్రపంచానికి స్పష్టపర్చారు. ఈ వాస్తవికతల ద్వారా,ఈ భౌతిక ప్రపంచంలో అనంతమైన శాంతి సంక్షేమాలకు, ఉత్తమ స్థితిగతులకు బాటలు వేశారు. అదే సమయంలో పరలోకంలో నరక విముక్తికి, తీర్పుదిన సఫలతకు ప్రాతిపదికలుగా ఈ నైతిక ప్రమాణాలనే వుంచారు.

ఇస్లామీయ జీవన విధానంలో - వ్యక్తిత్వ నిర్మాణంలో- నైతిక విలువలకు ఇంతటి ప్రాధాన్యత వుండబట్టే ప్రవక్త(స) ఈ విషయాలను నిష్పాత్మకంగా మార్గదర్శనం అందించారు. నిరంతరం తన బోధనల ద్వారా, శిక్షణాత్మక ఆచరణ ద్వారా నైతిక విలువల ప్రాధాన్యతలను తన సహచరుల హృదయాలలో నాటుకునేలా, మనో మస్తిష్కాల్లో ఉత్తమ నైతికతా వేళ్ళు పాదుకునేలా కృషి చేసేవారు. ఫలితంగా విశ్వాసం- సంక్షేమం, ఉత్తమ నైతికతలు విడివిడి అంశాలు కావనీ, ఈ మూడు సమ్మిళితమైన రూపమే 'ఇస్లాం' అనీ, తన సహచరుల హృదయాలలో తాత్వికంగా, సైద్ధాంతికంగా, భావజాల పరంగా గట్టిగా నాటుకునేలా చేశారు.

## (ఇస్లాంలో) దరిద్రుడు ఎవరు?

ప్రవక్త మహోపాధ్యాయులు ఒకరోజు తన ప్రియ సహచరులను ఉద్దేశించి (ఇస్లాంలో) 'ముఫ్లిస్ (దరిద్రుడు) అని ఎవరిని పిలుస్తారో తెలుసా?' అని ప్రశ్నించారు. అందుకు వారు 'ఎవరివద్ద (దీనార్- దిర్‌హమ్) ధనం లేదో అతనిని మేము ముఫ్లిస్ (దరిద్రుని)గా భావిస్తాము' అని జవాబిచ్చారు. అప్పుడు ప్రవక్త 'ప్రళయదినాన అల్లాహ్ సమక్షంలో తన నమాజ్, ఉపవాసాలు, జకాత్ పుణ్యాలతో ఒక వ్యక్తి హాజరవుతాడు. కాని, ఆ వ్యక్తి ఇతరులను పరుష పదాలతో తిట్టి వారి మనసులను గాయపర్చి వుంటాడు. తన స్వార్థం కోసం రక్తపాతం సృష్టించి వుంటాడు. ఇతరులపై దౌర్జన్యం చేసివుంటాడు. ఇతరుల హక్కులను కొల్లగొట్టి వుంటాడు. అల్లాహ్ ఈ వ్యక్తి సమస్త పుణ్యఫలాలను అతనిచేత పీడించబడినవారందరికి పంచివేస్తాడు. ఇంకా బాధితులు మిగిలివుంటే, ఇతని పుణ్యఫలాలు ఖాళీ అయిపోతే పీడితుల పాప ఫలాలను అతడిపై మోపబడతాయి. చివరికి అతడిని నరకాగ్ని గుండంలోకి విసిరివేయడం జరుగుతుంది.

ఈ వ్యక్తియే నా ఉమ్మత్‌లో అసలైన ముఫ్లిస్ (దరిద్రుడు) అని స్పష్టంగా తెలిపారు.' (ముస్లిం)

ఇస్లామీయ విలువల ప్రకారం పైన పేర్కొన్న వ్యక్తియే నిజమైన దరిద్రుడు. ఈ దరిద్రుడు వేల రూపాయల సరుకు కలిగివుంటే- రెండు వేల రూపాయల అప్పు వున్న వ్యాపారిని పోలివుంటాడు. కొన్ని ఆరాధనలను నెరవేర్చడం ద్వారా తన్ను తాను ధార్మికునిగా భావించే వ్యక్తి బహిరంగంగా 'షిర్క్'కు పాల్పడుతున్నాడు. (షిర్క్ అనగా: దేవునికి సాటి కల్పించటం- ఆయన ఆదేశాలలో ఇతరులకు భాగం కల్పించడం, సృష్టితాలను ఆరాధించడం వగైరాలు) ప్రజలతో దురుసుగా ప్రవర్తిస్తూ పేద, అవసరార్థుల పట్ల కఠినంగా, దౌర్జన్యపూరితంగా ప్రవర్తించే వ్యక్తిని దైవభీతి, దైవప్రీతి, దైవ నిష్ఠ గలవానిగా ఎలా భావించగలం?

ప్రవక్త మహోపాధ్యాయులు ఈ విషయాలనే చక్కటి ఉదాహరణతో ఈ క్రింది విధంగా తెలిపారు.

'ఉత్తమ నైతికత శుభ్రమైన నీటిలా వుండి తప్పులను, పొరపాట్లను కడిగి వేస్తుంది. అదేవిధంగా నైతిక రాహిత్యం వ్యక్తి ఆచరణలను పుల్లనీళ్ళు కలిపిన తేనెలా చెడిపివేస్తుంది.'

## కపట స్వభావుల గుర్తింపు

మనిషి అంతరంగంలో నీచ - నికృష్ట, అనైతికత ఎప్పుడైతే చోటుచేసు కుంటాయో- వాటి తాలూకు నష్టాలు కూడా వెంటనే బహిర్గతం కావడం మొదలెడ తాయి. తద్వారా మనిషి వ్యక్తిత్వం ప్రమాదంలో పడిపోతుంది. అప్పుడు ఆ వ్యక్తి దుస్తుల హద్దులను అతిక్రమించిన దిగంబరునిగా ధర్మం నుండి వేరుబడిపోతాడు. ఆ సమ యంలో ఆ వ్యక్తి చేసే విశ్వాసపు ప్రకటన కేవలం ఒక అబద్ధం మాత్రమే అవుతుంది. నైతిక విలువలులేని ధర్మపరాయణతకు ఇస్లాంలో పూచిక పుల్లంత విలువ కూడా వుండదు. ఒకవైపు తన్నుతాను అల్లాహ్‌కు అంకితమై పోవడం, మరోవైపు కల్లోల ఉపద్రవాలు సృష్టించడం ఎలా సాధ్యమవుతుంది?

స్వచ్ఛమైన నైతికతకు, విశ్వాసానికి గల సహజ సంబంధాన్ని ప్రవక్త ముహ మ్మద్ (స) వారి ఈ క్రింది ప్రవచనం తేటతెల్లంగా విశదపరుస్తుంది.

'ఏ వ్యక్తిలో పేర్కొనబడే మూడు దుర్గుణాలు వుంటాయో– ఆ వ్యక్తి కపట స్వభావి అవుతాడు. అతడు ఉపవాసం పాటించినప్పటికీ, నమాజ్ ఆచరిస్తూ వున్న ప్పటికీ, హజ్ ఉమ్రాలు నిర్వర్తించినప్పటికీ, తన్నుతాను ముస్లింగా చెప్పుకున్నప్పటికీ అతడు కపట స్వభావియే. మొదటిది ఆ వ్యక్తి ఎప్పుడు మాట్లాడినా అబద్ధం పలుకు తాడు. రెండవది అతడు వాగ్దానం చేస్తే దానిని నెరవేర్చడు. ఇక మూడవది అతనికి అమానతుగా ఇచ్చిన దానిలో మోసం చేసి దాచుకుంటాడు.' (ముస్లిం)

మరొక ఉల్లేఖనంలో ప్రవక్త(స) 'కపటికి మూడు దుర్గుణాలుంటాయి. అతడు నమాజ్, రోజా ఆచరించినా, తన్నుతాను ముస్లింగా పేర్కొన్నా అతడు కపటియే. ఆ దుర్గుణాలు: మాట్లాడినప్పుడల్లా అసత్యం పలుకుతాడు. వాగ్దానాన్ని నెరవేర్చడు. ఒప్పందాన్ని పాటించక భంగపరుస్తాడు' అని స్పష్టంచేశారు.

ఇదేవిధంగా మరో ప్రవచనంలో ఆయన ఇలా తెలిపారు: ఏ వ్యక్తిలో ఈ నాలుగు దుర్గుణాలు వుంటాయో అతడు కపటి అయివుంటాడు (మునాఫిక్), ఈ నాలుగు దుర్గుణాల్లో ఏ ఒక్కటి వున్నా ఆ మేరకు కపటత్వం అతను కలిగి వుంటాడు. మొదటిది : అమానతులో ద్రోహానికి పాల్పడతాడు. రెండవది: సంభాషణలో అబద్ధాలు పలుకుతాడు. మూడవది : ఒప్పందాన్ని అతిక్రమిస్తాడు. నాల్గవది : ఘర్షణకు దిగినప్పుడు తిట్ల పురాణాన్ని మొదలెడతాడు.' (బుఖారి గ్రంథం)



# 3వ భాగం

# ఆదర్శవంతమైన వ్యక్తిత్వం

- ప్రవక్త మహోపాధ్యాయుల నైతిక బోధనలు
- ప్రవక్త(స) ఉత్తమ నైతిక ప్రమాణం
- ప్రవక్త (స) ఖుర్ఆన్... ఆయన ఫుర్ఖాన్ (గీటురాయి)
- ప్రవక్తే యాసీన్ ... ఆయనే తాహా!

# ప్రవక్త మహోపాధ్యాయుల నైతిక బోధనలు

ప్రవక్త మహోపాధ్యాయుల నైతిక బోధనలను గమనిస్తే- వాటి ద్వారా ప్రజలకు ఉత్తమ నైతిక ప్రమాణాలు- వాటి ద్వారా మధుర ఫలాలను ప్రసాదించే జ్యోతులుగా కానవస్తాయి. ఈ బోధనలు ప్రజల్లో వ్యక్తిత్వ వికాసానికి అవసరమైన వనరులను వికసింపజేస్తాయి. నైతిక విలువల ముత్యాలతో ప్రజల ఒడులు నిండిపోతాయి. ఈ ఉత్తమ నైతిక విలువల జీవిత లక్ష్యం- దాని గమ్యం దైవ సందేశ పరంపరలో తప్పని సరి భాగంగా వుంటుంది. ఈ జీవిత లక్ష్యం-గమ్యంలో ఎవరైనా దుర్మార్గాలను జనింపజేయ ప్రయత్నిస్తే అది ధర్మంను మరలిపోవడంగా- ధర్మం కోరుతున్న బాధ్యతల కాడిని తమ భుజాలనుండి తీసిపారవేయడంగా పరిగణించబడుతుంది.

భౌతిక ప్రయోజనకర సాధనాలు- వాటి తాలూకు సుఖాలు నైతికత అనిపించుకో బడవు. తత్ వ్యతిరేకంగా ధర్మం ఏ సూత్రాలను తన జీవితంలో పాటించమని ఆదేశి స్తుందో అవే నైతిక విలువలుగా భావించబడతాయి. ఈ విలువల పతాకాన్ని సమున్నతంగా ఎగురవేసినవారిని గౌరవించడం, అనుసరించడం జరగాలి.

ఇస్లాం ఉత్తమ మానవీయ విలువల స్థాపనను, వాటి తాలూకు ప్రతిఫలాలను తన అనుయాయులచేత స్వీకరింపజేసేలా వారిని ఉత్సాహపరుస్తుంది. ఈ విలువ లను, వాటి సూత్రాలను ఒకదాని తర్వాత మరొకటి తమ జీవితాలలోకి ఆహ్వానిం చేలా, ఆచరించేలా తుదకు స్థాపించేలా తర్ఫీదు చేస్తుంది.

ఇస్లామీయ మహా బోధకులు, మహోపాధ్యాయులు, చివరి దైవప్రవక్త ముహమ్మద్(స) వారినైతిక వర్తనలన్నింటినీ సమీకరిస్తే అది ఒక మహా గ్రంథంగా దర్శనమిస్తుంది. ఈ గ్రంథాన్ని అధ్యయనం చేసే ప్రతి ఒక్క పఠిత, సామాజిక కార్యకర్త, సంస్కర్త, నాయకుడు- ప్రతి సమస్యా పరిష్కారాల క్రమాన్ని ఈ గ్రంథంలో గమనించి ఆశ్చర్యచకితుడు కాకుండా వుండలేడు.

ప్రవక్త(స)లో నైతిక సుగుణాలను, వాటి వివరాలను శీర్షికల వారీగా వివరించ డానికి ముందు- ఆ ఉత్తమ సుగుణాలకు, స్వభావాలకు అలవాటు పడవలసిందిగా, అత్యంత ఉత్తమంగా ఇస్లాం ఉదాహరణలతో సహా వివరించింది. ఈ ఉదాహరణల నుండి కొన్నింటిని ఈ సందర్భంగా పేర్కొనడం సముచితంగా వుంటుంది.

ఉసామా బిన్ షరీక్ (రజి) ఉల్లేఖనం ప్రకారం 'మేము ప్రవక్త సన్నిధిలో మా

తలలపై పిచ్చుకలు కూర్చొని వున్నాయా? అని అనిపించేంత నిశ్శబ్దంగా– ఏకాగ్రతతో కూర్చొని వున్నాము. మాలో ఏ ఒక్కరికీ మాట్లాడే శక్తి లేకుండింది. ఇంతలో కొంత మంది అక్కడికి వచ్చి ప్రవక్త(స)ను ఇలా ప్రశ్నించారు. 'అల్లాహ్ దృష్టిలో, ఆయన దాసులలో ఆయనకు అత్యంత ప్రియమైన దాసుడు ఎవరు?' అందుకు 'అందరిలో అత్యధిక నైతిక విలువలు కలిగివున్న వ్యక్తియే అల్లాహ్ దృష్టిలో ఉత్తముడు' అని ఆయన పలికారు. (హిబ్బాన్)

మరో ఉల్లేఖనంలో ఇలా సెలవివ్వడం జరిగింది 'మనిషికి అన్నింటికన్నా ఉత్తమమైన వరంగా ఉత్తమ నైతిక విలువలు ప్రసాదించబడ్డాయి.' (తిర్మిజి)

మరో సందర్భంలో ఇలా ప్రశ్నించడం జరిగింది. 'ముస్లింలలో ఏ ముస్లిం విశ్వాసం పరిపూర్ణమైనది?' దానికి జవాబుగా ఆయన 'ఎవరు నైతిక విలువల్లో ఉత్తముడో అతనిది' అని జవాబివ్వడం జరిగింది. (తిబ్రాని)

అబ్దుల్లా బిన్ ఉమర్(రజి) ఒక ఉల్లేఖనంలో ఇలా సెలవిచ్చారు : 'నేను ప్రవక్త ఇలా సెలవిస్తూ ఉండగా విన్నాను. 'మీలో, నాకు అందరికంటే ప్రియమైన వ్యక్తిఎవరో చెప్పనా? అలాగే ప్రళయ దినాన నాకు అత్యంత సమీపంగా వుండే వ్యక్తి ఎవరో తెలుపనా?' ఈ ప్రశ్నలను రెండు లేక మూడు పర్యాయాలు అడిగారు. అందుకు మేము 'ఓ దైవప్రవక్తా! తప్పకుండా సెలవివ్వండి' అని వేడుకున్నాము. అప్పుడు ఆయన 'మీలో అందరికంటే ఉత్తమ నైతిక వర్తనుడే ఆ వ్యక్తి' అని బదులిచ్చారు. (అహ్మద్)

మరొక ప్రవచనంలో ప్రవక్త మహోపాధ్యాయులు ఇలా బోధించారు : 'ప్రళయ దినాన విశ్వాసి ఉత్తమ నైతిక విలువలే త్రాసులో అన్నింటికన్నా బరువైన ఆచరణలుగా తూచబడతాయి. సృష్టికర్త అల్లాహ్ అశ్లీలాన్ని, అసభ్య పదాలను ఇష్టపడడు. ఉత్తమ నైతికత కలిగివున్న వ్యక్తి, తన వ్యక్తిత్వపు ఔన్నత్యం ద్వారా నమాజ్, రోజాల ఫలాలను పొందే స్థాయికి చేరుకుంటాడు.' (అహ్మద్)

పైన పేర్కొనబడిన బోధనలు కేవలం ఒక నైతిక సంస్కరణోద్యమంలో నిమగ్నమై ఉన్న ఒక తత్వవేత్త చేసివుంటే అంతగా ఆశ్చర్యపడవలసిన అవసరం వుండేది కాదు. అయితే ఈ బోధనలు ఒక మహోన్నతమైన ధార్మిక జీవన విధానాన్ని స్థాపించేందుకు అవిరళంగా శ్రమిస్తున్న వ్యక్తి నుండి వినిపించబడుతున్నాయి. ఈ ప్రపంచంలోని ఇతర మతాలన్నీ తమ దృష్టిని మొట్టమొదట కేవలం ఆరాధనలపై మాత్రమే కేంద్రీకరించాయి అనేది మరువకూడదు.

చివరి దైవప్రవక్త(స) వివిధ ఆరాధనలను, వాటి విధులను నిర్వర్తించడంతో పాటు శత్రువులతో ఆత్మరక్షణ కొరకు సుదీర్ఘ కాలం పోరాడుతూ వున్నప్పటికీ ఇస్లామీయ ధర్మస్థాపన వైపునకు కూడా పిలుపునిచ్చారు. ప్రవక్త(స) తన అనుచరులకు ధర్మప్రచారంలోని విస్తృతిని, దాని వైవిధ్యభరితమైన ఆచరణలను, వాటి వాస్తవికతలను అవగాహనపర్చడంతోపాటు వారిని ప్రళయదినం నాడు ఆచరణ త్రాసులో కేవలం తమ నైతిక సద్వర్తనలు మాత్రమే బరువుగా వుంటాయని స్పష్టపర్చారు. తద్వారా ఇస్లాంలో నైతిక విలువలకు, సద్వర్తనకు ఎంతటి ప్రాధాన్యత వున్నదో అవగతపర్చారు.

ఇస్లాం ధర్మ వాస్తవికత ఏమంటే; అది మానవుల మధ్య నైతిక సద్వర్తనా పూర్వక సంబంధాన్ని స్థాపించడంతోపాటు సృష్టికర్త, ఆయన దాసుల మధ్య అత్యున్నత స్థాయి సంబంధాన్ని కూడా ఏర్పరుస్తుంది. ఈ రెండు సంబంధాలు ఒకే ఆకాశపు రంగుగా రంగరించబడివుండి నాణేనికి రెండు పార్శ్వాల్లాగా వుంటాయి.

నేటి ప్రపంచంలో అనేక ఇతర మతాలు 'మీరు ఏ విశ్వాసాన్ని కలిగివున్నా మీ పాపాలు కడిగివేయబడతాయనీ, ఏదో ఒక గురువును అనుసరించడం, ఆశ్రయించడం ద్వారా తప్పులన్నీ మన్నించబడతాయనీ' అనేక అబద్ధపు శుభవార్తలు వినిపిస్తూ వున్నాయి.

కాని, ఇస్లాం ఈ వాదనను నిర్ద్వందంగా త్రోసిపుచ్చుతుంది. కేవలం వ్యక్తి సంకల్పం, భావజాలం, తాత్వికతలు, సహేతుకతపై నిలిచి వున్నప్పుడు మాత్రమే అతనికి ఆచరణల ఫలితాలు లభిస్తాయని ఇస్లాం ప్రకటిస్తుంది. మానవ సంక్షేమంతో పాటు ధార్మిక విధుల నెరవేర్పు, విధేయతా అనుసరణలు మాత్రమే వ్యక్తిలో చెడులను కడిగివేయగలవని స్పష్టపరుస్తుంది. మనిషిలో ఒక మహాద్భుత సత్యజ్యోతిని వెలిగిస్తుంది. ఈ వెలుగు ఆధారంగా ఆ వ్యక్తి ఉన్నత నైతిక స్థాయికి చేరుకోగలుగుతాడు.

హజ్రత్ అనస్(రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త(స) 'దాసుడు ఆరాధనల విషయంలో (కొంత) వెనుకబడిఉన్నప్పటికీ,అతను తన ఉత్తమ నైతిక ప్రవర్తన ద్వారా పరలోకంలో ఉన్నత స్థానాలను, మహోన్నత స్థాయిని పొందుతాడు. అదే సమయంలో తన (చెడు) అనైతిక ప్రవర్తన ద్వారా నరకంలో అత్యంత అధమ స్థాయిలోకి నెట్టివేయబడతాడు.' (తిబ్రాని)

విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయెషా(రజి) ఇలా ఉల్లేఖించారు; 'ఒక

విశ్వాసి తన ఉత్తమ నైతికతల పునాదిపై, ఉపవాసాలు వుండేవారి, రాత్రి వేళల్లో నమాజ్ ఆచరించేవారి స్థాయికి చేరుకుంటాడు.' (అబూదావూద్)

ఇదే విషయం అనేక ఉల్లేఖనాలలోనూ సెలవివ్వబడింది. ప్రవక్త(స) సెలవిస్తూ వుండగా నేను విన్నాను అంటూ ఇబ్నె ఉమర్ ఈ క్రిందివిధంగా ఉల్లేఖించారు: 'ఆరాధనల్లో సంతులనం పాటించే ముస్లిం, తన ఉత్తమ నైతిక నడవడి ద్వారా, సహృదయం ద్వారా- ఉపవాసాలు పాటించే, రాత్రి తహజ్జుద్ నమాజ్‌లో అల్లాహ్ వాక్యాలను పఠించే వ్యక్తి స్థాయికి చేరుకుంటాడు.' (అహ్మద్)

అబూ హురైరా(రజి) ప్రవక్త(స) వారి ప్రవచనాన్ని ఇలా ఉల్లేఖించారు. 'ఒక విశ్వాసి మంచితనం, సహృదయతలే అతని ధర్మపరాయణతకు చిహ్నాలుగా వుంటాయి. అతని దయ, కరుణలే అతని బుద్ధిగా విరాజిల్లుతాయి. అతని ఉత్తమ నైతిక వర్తనమే అతని వంశంగా వుంటుంది.' (హాకిమ్)

ప్రవక్త మహోపాధ్యాయుల మరో ప్రవచనాన్ని అబూజర్ (రజి) ఇలా ఉల్లేఖించారు: 'తన హృదయాన్ని కేవలం విశ్వాసం కొరకు ప్రత్యేకించుకున్న వ్యక్తి సఫలుడయ్యాడు. కల్మషంలేని హృదయంతో తన నోటిని సత్యంపలికేందుకు ప్రత్యేకించిన వ్యక్తి సాఫల్యం పొందాడు. ఈ వ్యక్తి మనసు సంతృప్తితో, స్వభావం రుజుమార్గంతో ముడిపడి వుంటుంది. ఇహపరలోకాల్లో ఈ వ్యక్తి విజయుడు అవుతాడు.' (ఇబ్నె హిబ్బాన్)

## ప్రవక్త(స) ఉత్తమ నైతిక ప్రమాణం

కేవలం ఉపదేశాలు- 'ఇవి చేయండి- అవి చేయండి' లాంటి ఆదేశాల జారీల వల్ల ఏ సమాజంలోనైనా ఉత్తమ నైతిక విలువలను పాదుకొల్పడం సాధ్యంకాదు. మానవ సమాజం కేవలం బోధనల ద్వారా మాత్రమే ఉత్తమ సమాజంగా పరిణామం చెందదు. అందుకు నిరంతర శిక్షణ, పర్యవేక్షణలు అవసరమవుతాయి.

ప్రపంచ చరిత్రలోనే అత్యుత్తమ నైతిక ప్రమాణాన్ని నెలకొల్పిన ప్రవక్త ముహమ్మద్(స)ను ఆదర్శంగా, నమూనాగా, కొలబద్ధగా స్వీకరించనంతవరకు ఒక వ్యక్తి శిక్షణ సవ్యమైన రీతిలో కొనసాగజాలదు. చెడు ప్రవర్తన, నైతిక పతనం గల వ్యక్తి ఈ సమాజంపై ఉత్తమ స్థాయి ప్రభావాన్ని కలుగజేయలేడు కదా!

ఏ వ్యక్తి వ్యక్తిత్వం, ఉత్తమ నైతిక విలువలతో ముడిపడివుండటం గమనించి

అబ్బురపడటం జరుగుతుందో– ఎవరి వ్యవహార సరళిలోని ఔన్నత్యం గమనించి అతనిని కీర్తించాలని మనసు ఉవ్విళ్ళూరుతుందో– ఎవరి జీవితం ద్వారా ప్రయోజనం పొందాలని మనసు సంతోషంగా, స్వచ్ఛందంగా తపనపడుతుందో– ఎవరి అడుగు జాడల్లో నడవడం ద్వారా ఇహపర సఫలతలు లభించడం తథ్యమని మనసు దృఢంగా, ప్రేమగా విశ్వసిస్తుందో– ఆ వ్యక్తిత్వం ద్వారా మాత్రమే అత్యుత్తమ శిక్షణ లభించ గలదు.

అంతేకాదు, తన సహచర సమాజంలో సైతం ఇదే తరహా నైతిక విలువలను స్థాపించడానికి, అభివృద్ధి పరచడానికి ఆ మార్గదర్శకునిలోని సుగుణాలు, విలువలు సుసంపన్నంగా వుండటమూ తప్పనిసరి.

ప్రవక్త మహోపాధ్యాయులు తన సహచరులను ఏ ఉత్తమ నైతికవిలువల వైపునకు ఆహ్వానించేవారో – ఆ నైతిక విలువలకు స్వయంగా చిరునామాగా, నమూనాగా, ఉత్తమ ప్రమాణంగా వుండేవారు. తన ప్రసంగ పాఠాల ద్వారా,మృదు మధుర సంబోధనా సరళి ద్వారా జ్ఞానామృతాన్ని తన సహచరులకు అందించే ముందు వారి ఎదుట తన సుగుణ సుగంధ భరిత జీవితం ద్వారాఉత్తమ నైతికతలను ప్రదర్శిం చేవారు.

అబ్దుల్లాహ్ బిన్ ఉమర్(రజి) ప్రవక్త సుగంధ శోభాయమాన జీవితాన్ని వివరిస్తూ ఇలా చెప్పారు. 'దైవ సందేశహరులు ముహమ్మద్(స)వారిలో కనీస స్థాయిలో కూడా ఎటువంటి దుర్గుణం కానవచ్చేది కాదు. వారి నోటి నుండి ఏనాడూ పరుష పదం వెలువడి ఎరుగదు. ఆయన తరచుగా ఇలా సెలవిచ్చేవారు. 'అందరికంటే ఎక్కువ నైతిక విలువలు కలవారే మీలో ఉత్తములు' (బుఖారి)

ప్రవక్త అనుచరులు హజ్రత్ అనస్(రజి) ఇలా తెలియజేస్తున్నారు : 'నేను ప్రవక్త(స) వద్ద పది సంవత్సరాలు సేవలు అందించాను. అల్లాహ్ సాక్షి! ఆయన ఏనాడూ నన్ను 'ఉఫ్' అని కూడా అనలేదు. ఈ పని ఇలా ఎందుకు చేశావు? ఆ పని ఇలా ఎందుకు చేయలేదు? అని కూడా విసుగు ప్రదర్శించలేదు.' (ముస్లిం)

మరొక సందర్భంలో అనస్(రజి) గారే ఇలా ఉల్లేఖించారు : 'మా అమ్మగారు, కొన్ని సందర్భాల్లో ఆయన చేతిని పట్టుకొని తాను కోరుకున్న చోటులకెల్లా తీసుకొని తిరిగేవారు (ఆయన విసుగు చెందేవారు కాదు) ఏ వ్యక్తి అయినా కరచాలనం చేస్తే

ఆ కరచాలనం చేసిన వ్యక్తి తన చేతిని వెనక్కి తీసుకోనంతవరకు ఆయన చేతిని వెనక్కి తీసుకునేవారు కాదు. ఆ వ్యక్తి తన చూపులను మరల్చుకోనంతవరకు, ఆ వ్యక్తి ముఖం నుండి తన చూపులను మరల్చుకునేవారు కాదు. కూర్చునే సమయంలో సైతం ఇతరుల కంటే ముందుకు తన మోకాళ్ళను ఉంచేవారు కాదు. (తిర్మిజి)

దైవప్రవక్త(స) వారి కొన్ని ప్రత్యేక ఆచరణల గురించి వారి శ్రీమతి హజ్రత్ ఆయెషా (రజి) ఇలా తెలియపర్చారు : 'దైవప్రవక్త(స) రెండు విషయాలలో ఏదైనా ఒకదానిని ఎంచుకునే అవకాశం వచ్చినప్పుడు, సరళమైన, సులభతరమైన దానినే ఎంచుకునేవారు. అందులోనూ ఏ లోపమూ, పాపము లేకుంటేనే సుమా. అందులో ఏదైనా పాపకారకమయ్యే అంశం వుంటే ఆ విషయం నుండి వీలైనంత దూరంగా తొలగిపోయేవారు. దైవప్రవక్త(స) ఏనాడూ, ఎవరిపైనా వ్యక్తిగత కక్ష తీర్చుకోలేదు. కాని అల్లాహ్ ఔన్నత్యాన్ని కించపర్చే విషయంలో ఆయన కోపం ఉవ్వెత్తున ఎగిసి పడేది. దైవప్రవక్త(స) తన భార్యలనుగాని, సేవకులను గాని, ఎప్పుడూ ఎవరిని తన చేతితోకొట్టలేదు. అయితే– అల్లాహ్ మార్గంలో, అధర్మ శక్తులతో తప్పకుండా ధర్మ యుద్ధం చేసేవారు. (ముస్లిం)

అనస్(రజి) ద్వారా మరో హదీసులో ఇలా ఉల్లేఖించబడింది; 'నేను దైవప్రవక్తతో కలిసి వెళుతూ ఉన్నాను. ప్రవక్త(స) వారు ఒక లావుపాటి దుప్పటిని తన భుజాలపై కప్పుకొని వున్నారు. హఠాత్తుగా ఒకపల్లెటూరి మొరటు అరబ్బు ఆయన భుజంపై ఉన్న దుప్పటిని ఎంత బలంగా లాగాడంటే దుప్పటి అంచు ప్రవక్త మెడ భాగాన్ని ఒరుచుకుంటూ ఎర్రటిచారలు కానవచ్చాయి. 'ఓ ముహమ్మద్(స)! ఏ సంపదనైతే అల్లాహ్ మీకు ప్రసాదించాడో అందులోనుంచి నా భాగాన్ని నాకు ఇప్పించండి!' అని అడిగాడు. ప్రవక్త ఆ మోటు అరబ్బును దరహాస వదనంతో సంతృప్తిపరిచి అతనికి కొంత నగదును బహుకరించవలసిందిగా ఆదేశం జారీచేశారు.' (బుఖారి)

ప్రవక్త సతీమణి ఆయెషా (ర) ఇలా తెలిపారు : 'ప్రవక్త(స) ఒక సందర్భంలో 'సృష్టికర్త అల్లాహ్ పరమ దయాళుడు' ఆయన మానవులలో దయ కారుణ్యాలను ఇష్టపడతాడు. దయార్థ్ర హృదయుడైన మానవునికి అల్లాహ్ ప్రసాదించే ఫలితం చాలా గొప్పది. అదే సమయంలో కఠిన హృదయుడిని అంతగా శిక్షించడు కూడా. అల్లాహ్

దయ, కరుణలు ప్రదర్శించే వ్యక్తికి ఇచ్చేంత ప్రతిఫలం మరి ఏ ఇతర అంశానికీ ప్రసాదించడు' (ముస్లిం)

మరో ఉల్లేఖనం ప్రకారం 'ఏ వస్తువులో మృదుత్వం వుంటుందో– ఆ వస్తువును, ఆ మృదుత్వం అత్యంత సుందరంగా మార్చివేస్తుంది. అదేవిధంగా ఏ వస్తువు నుండి మృదుత్వం తీసివేయబడుతుందో– ఆ వస్తువు కాఠిన్యపు వికారాన్ని పొందుతుంది' అని ప్రవక్త (స) వారు నుడివారు.

జాబిర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త(స) ఇలా ప్రవచించారు : 'సృష్టికర్త అల్లాహ్– దయ, కరుణ, మృదు స్వభావానికి ఇచ్చే ప్రతిఫలం మరే దానికి ఇవ్వడు. అల్లాహ్ ఒక దాసుడిని తన ప్రియతమునిగా చేసుకున్నప్పుడు అతని హృదయాన్ని దయ,కరుణలతో నింపివేస్తాడు. మృదు స్వభావాన్ని ప్రసాదిస్తాడు. ఏ గృహాలు కరుణ, దయ మృదు స్వభావాలకు దూరంగా ఉంటాయో– ఆ గృహాలు (అల్లాహ్ ప్రసాదించే) ప్రతి శుభ సంక్షేమాల నుండి దూరం చేయబడతాయి.' (తిబ్రాని)

ఒకసారి ప్రవక్త(స) సతీమణి ఆయెషా(రజి)ను 'ప్రవక్త(స) ఆచరణ ఇంటిలో ఎలా వుంటుంది?' అని ప్రశ్నించారు. అందుకు ఆమె(రజి) జవాబిస్తూ 'వారు తమ కుటుంబసభ్యుల సేవలోవుంటారు. నమాజ్ సమయం ఆసన్నమైనప్పుడు వుజూ చేసి నమాజ్‌కై బయలుదేరుతారు' అని చెప్పారు.

అబ్దుల్లా బిన్ జాబిర్ (రజి) ఇలా ఉల్లేఖిస్తూ వున్నారు: 'నేను ప్రవక్త(స) వారి లాగా చిరునవ్వులు వెదజల్లే వ్యక్తిని ఇంతవరకు చూడలేదు.'

హజ్రత్ అనస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం 'దైవప్రవక్త ముహమ్మద్(స) అందరి కంటే ఎక్కువ నైతికత కలిగివుండేవారు. నాకు పాలు విడిచిన తమ్ముడు 'అబూ అమీర్' వుండేవాడు. అతని వద్ద 'నగీర్' అని పిలవబడే రోగగ్రస్త ఆడ పిచ్చుకవుండేది. మా తమ్ముడితో హాస్యమాడుతూ 'అయ్యో అబూ అమీర్! నీ నగీర్‌కుఎంతటి బాధ కలిగిం దబ్బా!' అని చెప్పేవారు.

దైవప్రవక్త(స) తన కాలమంతటిలో గొప్పదాతగా సుప్రసిద్ధులు. వారు ఏనాడూ పిసినారితనంతో వ్యవహరించలేదు. ఆయన గొప్ప సాహసి, సత్య ప్రకటనలో ఆయన ఏనాడూ వెనుకంజ వేయలేదు. న్యాయాన్ని నిరంతరం పరిరక్షించేవారు. ఆయన తన తీర్పులతో ఏనాడూ అతివాదానికి లోనుకాలేదు. తన సంపూర్ణ జీవితంలో అత్యంత సత్యసంధులుగా, అమానతుదారుగా వున్నారు.

## ప్రవక్త(స) ఖుర్ఆన్... ఆయనే ఫుర్ఖాన్ (గీటురాయి) ఆయనే యాసీన్! ఆయనే తాహా!!

విశ్వప్రభువు అల్లాహ్ మానవ సమాజం మొత్తాన్ని మరీ ప్రత్యేకంగా ముస్లిం సమాజాన్ని, ప్రవక్త ముహమ్మద్(స) వారి ఉత్తమ అలవాట్లను, అత్యుత్తమ సుగుణాలను అనుసరించమని ఆదేశించాడు. తమ జీవితాలలో, ప్రవక్త(స) పవిత్ర జీవితం ద్వారా వెలుగును, మార్గదర్శకాన్ని పొందమని ఆజ్ఞాపించాడు.

**'వాస్తవంగానే అల్లాహ్ ప్రవక్తలో మీకు ఒక మంచి ఆదర్శం వుండినది. అల్లాహ్ అంతిమ దినంపై ఆశలు పెట్టుకొని అత్యధికంగా అల్లాహ్‌ను స్మరించే వ్యక్తికి.'**

***(ఖుర్ఆన్, 33: 21)***

ఖాజీ అయ్యాజ్ ఈ విధంగా పేర్కొంటున్నారు : 'దైవప్రవక్త(స) అందరికంటే అత్యుత్తమ నైతికతను, మహోన్నత వ్యక్తిత్వాన్ని కలిగివుండేవారు. అందరికంటే గొప్ప దాతగా, అందరికంటే ఎక్కువ ధైర్యవంతులుగా వుండేవారు. ఒక రాత్రి మదీనా వాసులంతా ఒక భయానక శబ్దానికి భయపడిపోయారు. కొందరు దళంగా ఏర్పడి శబ్దం వచ్చిన దిశగా బయలుదేరారు. దారిలో వారికి ప్రవక్త(స) ఎదురుపడ్డారు. ప్రజలందరికంటే ముందుగా, ఒంటరిగా ఆ శబ్దం గురించి ఆరా తీయడానికి వెళ్ళారు. అబూ తల్హా (రజి) గుర్రంపై కనీసం 'జీను' కూడా లేకుండానే ఆయన సవారీ చేస్తూ వచ్చారు. ఆయన మెడలో కరవాలం వ్రేలాడుతూ వుంది. ఆందోళన చెందవలసిన, భయపడవలసిన విషయం ఏమీ లేదని' ప్రజలకు ఆయన సాంత్వన వచనాలు పలికారు.

హజ్రత్ అలీ(రజి) ఇలా ఉల్లేఖించారు: 'యుద్ధజ్వాలలు చెలరేగినప్పుడు, సమరం ముమ్మరం అయినప్పుడు మేము ప్రవక్త(స) గురించి ఎక్కువగా ఆందోళన చెందేవారం. ఎందుకంటే; ఆయన ఎప్పుడూ కదన రంగంలో ముందుండేవారు. శత్రువుకు అత్యంత చేరువుగా వుండేవారు.'

జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ ఉల్లేఖనం ప్రకారం : 'ప్రవక్త(స)ను (ఎవరైనా, ఎప్పుడైనా, ఏదైనా అడిగి 'లేదు' అని అనిపించుకున్నవారు ఎవరూ లేరు) అర్థించిన వారిని ఎప్పుడూ 'లేదు' అని చెప్పలేదు.

ప్రవక్త (స) శ్రీమతి హజ్రత్ ఖదీజా(ర), ప్రవక్త(స) వారిపై దివ్యవాణి ఆవిష్కరిం

పబడిన ప్రారంభంలో భయాందోళనలకు గురైనప్పుడు వారిని ఉద్దేశించి ఇలా చెప్పారు :'మీరు బలహీనుల బాధ్యతలను స్వీకరిస్తారు. నిరుపేదల కొరకు సంపాదిస్తారు. సత్యం కోసం నిలబడినప్పుడు ఎదురయ్యే కష్టంలో మీరు సహాయకులుగా నిలుస్తారు."

ఒకసారి ప్రవక్త శిఖామణి వద్దకు డెబ్బై వేల దిర్హంలు కానుకగా వచ్చి చాపపై గుట్టగా పోయబడ్డాయి. ఆయన ఒకే విడతలో ఆ సంపదనంతా పంచివేశారు. ఏ ఒక్క యాచకుడినీ రిక్తహస్తాలతో పంపలేదు. చివరికు గుట్ట మొత్తం ఖాళీ అయిపోయింది.

ఒకసారి ఒక యాచకుడు ప్రవక్త(స) వద్దకు వచ్చి సహాయం అర్థించాడు. 'నా వద్ద ఈ సమయంలో నీకు సహాయపడటానికి ఏమీ లేదు. కాని, నా పేరు చెప్పి నీకు అవసరమైన సరుకులు కొనుగోలు చేసుకో. నా వద్ద రొక్కం వచ్చిన వెంటనే దానిని నేను చెల్లిస్తాను' అని పలికారు. అక్కడే వున్న ఉమర్(రజి) 'ఓ ప్రవక్తా! మీ అధీనంలో లేని విషయాలకు అల్లాహ్ మిమ్మల్ని బాధ్యునిగా చేయలేదు కదా?' అని చెప్పారు. ఈ మాటలు విన్న ప్రవక్త(స) గారి వదనం విచారంతో నిండిపోయింది. అదే బృందంలోని ఒక అన్సారు 'ఓ దైవప్రవక్తా(స)! (అల్లాహ్ మార్గంలో) ఖర్చుచేయండి. లేమి గురించి భయపడకండి' అని చెప్పారు. ఈ మాటలు విన్న మహోపాధ్యాయుల (స) ముఖారవిందం చిరునవ్వుతో వెలిగిపోయింది. అప్పుడు నాకు ఈవిధంగానే ఆదేశించబడింది' అని పలికారు(స).

ప్రవక్త(స) తన సహచరులను బహుదా ప్రేమించేవారు. ఏనాడూ వారి పట్ల ద్వేషం – విసుగు ప్రదర్శించేవారు కారు. ఆయన(స) ప్రతి తెగ, జాతుల్లోని సర్దారులు, గౌరవనీయులను బాగా ఆదరించేవారు. వారిని వారి వారి తెగలకు బాధ్యులుగా నియమించేవారు.

దైవప్రవక్త(స) నిరంతరం తన సహచరుల యోగక్షేమాలను తెలుసుకుంటూ ప్రత్యక్షంగా కలుసుకుంటూ ఉండేవారు. తన వద్దకు వచ్చిన కానుకలను ప్రతి ఒక్కరికి వాటాలు పెట్టి అందరించేవారు. ప్రతి ఒక్క సహచరుడు తనకుతాను ప్రవక్త(స) వారికి 'నాకంటే ప్రియతముడు మరొకడు లేడు' అని భావించేవారు.

ఏ వ్యక్తి అయినా ప్రవక్త(స)ని అవసరం రీత్యా అయినా లేదా సాహచర్య భాగ్యం కోసమైనా దరిచేరితే– వారిని సహనం పాటించవలసిందిగా బోధించేవారు.

తొందరపాటు మానవలసిందిగా తాకీదు చేసేవారు. అవసరార్థికి వీలైనంతవరకు సహాయపడేవారు. లేనిపక్షంలో మృదుభాషణంతో సాగనంపేవారు. ప్రవక్త(స) కారుణ్య కెరటం ప్రతి ఒక్కరిని ముంచివేసేది. ఆయన ప్రజలకు సంరక్షకులుగా వుండి, సత్యం సమన్యాయాలలో, స్థాపనలో దృఢంగా వుండేవారు.

ప్రవక్త(స) ముఖారవిందం నిరంతరం మందహాసంతో నిండివుండేది. స్వభావంలో మంచితనం ఉట్టిపడుతూ వుండేది. విశాల హృదయులై, మృదు స్వభావులై వుండేవారు. కాఠిన్యం ఏ కోశానా కానవచ్చేది కాదు. గొడవలు, వాదోపవాదాలు ఆయనకు నచ్చవు. అసభ్య పదాలు అస్సలుపడవు. శపించడం, వ్యక్తిగతంగా విమర్శ చేయడం, శృతిమించి పొగడటం ఆయన వ్యవహారసరళికి విరుద్ధాలు. అనవసర విషయాలను విస్మరించేవారు. నిరాశ నిస్పృహలను ఎన్నడూ దరిచేరనిచ్చేవారు కారు.

ప్రవక్త (స) శ్రీమతి ఆయెషా(రజి) ఇలా తెలియజేస్తున్నారు : 'దైవప్రవక్తను మించిన నైతికత గల వ్యక్తి మరొకరు లేరు. ఆయనను, ఆయన స్నేహితులు, ఇంటివారు పిలిచినప్పుడువెంటనే స్పందించేవారు.'

జాబిర్ బిన్ అబ్దుల్లా (రజి) ఇలా ఉల్లేఖించారు : నావైపు చూసినప్పుడల్లా చిరునవ్వు నవ్వేవారు.

ప్రవక్త మహోపాధ్యాయులు తన అనుచరులతో చతురోక్తులు విసురుతూ హాస్యమాడేవారు. వారితో కలిసిమెలిసి వుండేవారు. వారికి అత్యంత సన్నిహితంగా వుండేందుకు కృషి చేసేవారు. వారి పిల్లలతో ఆటలు ఆడేవారు. వారిని తన ఒడిలో కూర్చొబెట్టుకునేవారు.

స్వతంత్రులైనా, బానిసలైనా, సేవకురాలైనా ఎవరు ఆతిథ్యమిచ్చినా తప్పక స్వీకరించేవారు. మదీనా నగరం నుంచి దూరంగావున్న రోగులను కూడా పరామర్శిం చడానికి వెళ్ళేవారు. వికలాంగుల వివశత్వాన్ని గౌరవించేవారు.

అనస్(రజి) ఇలా తెలియజేశారు: 'ఎవరైనా దైవప్రవక్త(స) చెవిలో ఏదైనా చెప్పడానికి వస్తే వారి మాట పూర్తయ్యేవరకు చెవి తొలగించేవారు కారు. ఎవరైనా కరచాలనం చేస్తే- ఆ వ్యక్తి చేయి విడవనంత వరకు వదిలేవారు కారు. 'సలాం' చెప్పడంలో తనే ఎప్పుడూ ముందుండేవారు. 'ముసాఫా' చేయుటంలోనూ ముందుండేవారు. సమావేశాల్లో ఎక్కువ స్థలాన్ని ఆక్రమించి కూర్చునేవారు కారు.'

తన సందర్శనార్థం వచ్చిన వారిని ప్రవక్త(స) తగురీతిగా గౌరవించేవారు. అనేక

సందర్భాలలో తన పై గుడ్డను పరిచి దానిపై కూర్చుండపెట్టేవారు. తన దిండును వారికి అందించి అనుకూల వసతి కల్పించేవారు. దానిపై కూర్చునేందుకు తటపటాయిస్తే వారిని కూర్చోవలసిందిగా మరీ మరీ విజ్ఞప్తి చేసేవారు.

తన సహచరుల వంశ నామావళిని దైవప్రవక్త బాగా గుర్తుపెట్టుకునేవారు. వారిని మంచి మంచి పేర్లతో, బిరుదలతో ప్రేమపూర్వకంగా సంబోధించేవారు. తను సంభాషిస్తున్న వ్యక్తి పూర్తిగా తన సంభాషణను ముగించనంతవరకు మధ్యలో తను మాట్లాడేవారు కారు.

అనస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం 'ప్రవక్త(స) వద్దకు ఏదైనా కానుకలు వచ్చి నప్పుడు వాటిని 'ఫలానా వారి ఇంటికి చేర్చండి. ఆవిడ ఖదీజా(రజి)కు స్నేహితు రాలుగా వుండేది. ఆమెను చాలా ప్రేమించేది.' అని చెప్పి మరీ పంపేవారు.

హజ్రత్ ఆయెషా(రజి) ఈవిధంగా పేర్కొన్నారు: 'నేను ఖదీజా (రజి) పట్ల ఈర్ష్య చెందినంతగా మరే మహిళ పట్లనూ ఈర్ష్య చెందలేదు. నోటి ద్వారా ఆమె ప్రస్తావన పలుమార్లు నేను వింటూ వుండేదానిని. ఇంటిలో ఏదైనా మేక జిబాహ్ చేయబడి నప్పుడు అందునుంచి ఖదీజా(రజి) వారి స్నేహితులకు ఒక భాగం తప్పనిసరిగా వుండేది. ఒకసారి ఖదీజా(రజి) సోదరి ఇంటిలోకి రావడానికి అనుమతి కోరింది. ఆమెను చూసిన వెంటనే దైవప్రవక్త(స) ముఖారవిందం సంతోషంతో వెలిగిపోయింది. మరోసారి ఖదీజా(రజి) స్నేహితురాలు వచ్చి నాటి సంఘటనలను, తనకు ఆమెతో గల సాన్నిహిత్యాన్ని గుర్తుచేసింది. ప్రవక్త(స) ఆమెతో అత్యుత్తమంగా సంభాషించారు. ఆమె వెళ్ళిన తర్వాత 'ఈ మహిళ ఖదీజా (రజి) కాలంలో తరచుగా వస్తూ వుండేది. సంబంధాలను సజీవంగా వుంచడం విశ్వాసానికి సంకేతం' అని దైవప్రవక్త(స) సెలవిచ్చారు.

ప్రవక్త మహోపాధ్యాయులు తన బంధువులతో అత్యంతప్రేమగా వ్యవహరించే వారు. గౌరవనీయులు, ఉత్తములైన వ్యక్తులకు ఎక్కువ ప్రాధాన్యతనిచ్చేవారు.

అబూ ఖతాదా(రజి) ఉల్లేఖనం ప్రకారం : ఒకసారి 'నజాషీ' రాజుగారి ప్రతినిధి బృందం దైవప్రవక్త(స)ను దర్శించవచ్చింది. స్వయంగా లేచి నిలబడి వారిని సాదరంగా స్వాగతించారు. ప్రవక్త సహచరులు 'వారి సేవకు మేమున్నాము కదా!

అని చెప్పగా, అందుకు 'వారు ఒకప్పుడు మన సహచరులను గౌరవించారు. కనుక, నేను స్వయంగా వారికి సేవ చేయాలని కోరుకుంటున్నాను' అని బదులిచ్చారు.

అబూ ఉసామా ఉల్లేఖనం ప్రకారం 'ఒక సందర్భంలో దైవప్రవక్త ఒక కర్రను ఊతంగా చేసుకొని మా మధ్యనుంచి బయలుదేరగా మేము వారి గౌరవార్థం లేచి నిలబడ్డాము. అప్పుడు ఆయన(స) 'లేచి నిలబడకండి! ఒకరిగౌరవార్థం మరొకరు లేచి నిలబడే అజ్ఞాన వైఖరిని అవలంబించకండి!' అని హితోపదేశం చేశారు.

ఒక సందర్భంలో దైవ సందేశహరులు ఇలా స్పష్టం చేశారు. 'నేను ఒక దాసుడిని (అల్లాహ్‌కు) ఇతరులకు అవసరమైనట్లుగానే నాకూ ఆహారం అవసరమే. ఇతరుల మాదిరిగా నేనూ కూర్చుంటాను. (విశ్రాంతి నాకూ అవసరమే).' దైవప్రవక్త తన కంచర గాడిదపై ప్రయాణించేసమయంలో మరొకరిని తన వెనుక కూర్చుండబెట్టుకొనేవారు. పేదవారి కష్టాలను, వ్యాధిగ్రస్తుల ఇబ్బందులను అడిగి తెలుసుకునేవారు. పేదవారితో, సహచరులతో సమానంగా కూర్చునేవారు. సభ ముగిసిన తరువాత కొంతసేపు కూర్చుండి తదుపరి వెళ్ళేవారు.

దైవప్రవక్త(స) ఒక పాత దిండుపై కూర్చుని హజ్ చేశారు. ఆ దిండుపై ఒక చిరిగిన దుప్పటిపర్చబడి వుండింది. ఆ సమయంలో (స) ఇలా వేడుకున్నారు 'ఓ అల్లాహ్! ఇది నా హజ్! ఇందులో ఎటువంటి పటాటోపమూ లేదు. ప్రదర్శనాబుద్ధి లేదు.'

మక్కా నగర విజయం సమయాన ముస్లిం సైన్యాలు నగరంలో ప్రవేశించాయి. దైవప్రవక్త(స) తన ఒంటె దిండుపై తలవంచుకుని వినయంగా నగర ప్రవేశం చేశారు. ఆయన శిరస్సు ఒంటె మూపురానికి తగులుతూవుండింది.

ప్రవక్త(స) సాధారణంగా మితభాషులు, మౌనప్రియులు. అనవసర సమయాల్లో సంభాషణ చేసేవారు కాదు. దురుసుగా మాట్లాడేవారి పట్ల నిరపేక్షంగా వుండిపోయేవారు.

ప్రవక్త(స) చిరుదరహాసం చేసేవారు తప్ప పకపకా నవ్వేవారుకాదు. ఆయన సంభాషణ ఖచ్చితంగా పదాలు తూచి మాట్లాడినట్లుగా వుండేది. ఆయన సమక్షంలో, ఆయన సహచరులు చిరునవ్వులతో సరిపెట్టుకునేవారు.

దైవప్రవక్త(స) సమావేశాలు సహనం, నిజాయితీ, మంచితనం లాంటి సుగుణా లకు ప్రతీకలుగా వుండేవి. సభలో కేకలు, గుసగుసలు వుండేవి కావు. దోషాలు, పొరపాట్లపై వ్యక్తిగత విమర్శలు వుండేవికావు.

దైవప్రవక్త మాట్లాడనారంభించగానే ఆయన సహచరులు తమ తలలపై పక్షులు కూర్చొని వున్నాయా? అన్నంతగా కదలక మెదలక శ్రద్ధాసక్తులతో ఆలకిస్తూ వుండేవారు.

ప్రపక్త మహోపాధ్యాయుల నడక మంద్రంగా, మధ్యస్థ స్థాయిలో వుండేది. ఆయన నడకలో తొందరపాటు, కంగారు, బద్ధకమూ వుండేదికాదు.

ఇబ్నె అబీ హాలహ్ (రజి) ఈ విధంగా పేర్కొన్నారు : 'దైవప్రవక్త(స) నాలుగు విషయాల పట్ల మౌనం పాటించేవారు. సహనం వహించే సమయంలో- దీర్ఘాలోచనా సమయంలో- అంచనా వేసే సమయంలో- పరిశీలించే సమయంలో.

ఆయిషా(రజి) ఇలాఉల్లేఖించారు : 'ప్రవక్త(స) సంభాషణ ఆచితూచినట్లుగా వుండేది. ఎవరైనా ఆయన వాడే పదాలను లెక్కించదలిస్తే సులభంగా లెక్కించగలడు. ఆయన సుగంధాన్ని బాగా ఇష్టపడేవారు. దానిని తరుచుగా వాడేవారు.

ప్రపంచం తన ఆటపాటలతో- హంగూ ఆర్భాటంతో, అష్ట ఐశ్వర్యాలతో ప్రవక్త ముహమ్మద్(స) ముందు ఆవిష్కరించబడింది. విజయాల ద్వారాలు బాహాటంగా ఆయన ముందు తెరవబడ్డాయి. అయినప్పటికీ ప్రవక్త మహోపాధ్యాయులు ప్రాపం చిక విలాసాలకు, వ్యర్థ విషయాలకు అతీతంగా జీవితం గడిపారు. ఆయన మరణ సమయాన ఆయన కవచం ఒక యూదుని వద్ద తాకట్టుగా పెట్టబడి వుంది.



# 4 వ భాగం

# స్వర్గ తేజం - నరకాగ్ని కీల

- అసలు లక్ష్యం- ఆత్మ ప్రక్షాళన
- ఇస్లాం- సహజ ధర్మం
- పశు ప్రవృత్తికి విరుగుడు
- నైతికతే జీవిత రథసారథి

## అసలు లక్ష్యం- ఆత్మప్రక్షాళన

ప్రపంచంలోని ఇతర ఆధ్యాత్మిక, ఆకాశ ధర్మాలలాగానే ఇస్లాం కూడా తన సంస్కరణ, ప్రక్షాళనా కార్యక్రమాన్ని వ్యక్తితోనే ప్రారంభిస్తుంది. వ్యక్తి సంస్కరణ, వ్యక్తి హృదయ ప్రక్షాళనా కార్యక్రమాన్ని తన మొట్టమొదటి అసలైన లక్ష్యంగా ప్రకటించిన ఇస్లాం, దానిని వ్యక్తి హృదయపు లోతుల్లో బలమైన పునాదులను వేసే కృషి చేస్తుంది. తత్ఫలితంగా వ్యక్తి వికాస శిక్షణ, హృదయ ప్రక్షాళనలు రెండూ పరస్పర ఆధారాలుగా మారిపోతాయి.

దైవప్రవక్తలందరి బోధనల్లో ప్రధానాంశంగా 'మానవ హృదయ ప్రక్షాళన'యే వుండింది. ఈ అంశం చుట్టూనే వారు వారి అనుచరులను సమీకరించారు. ప్రళయ దినం వరకు ఈ బోధనలను సజీవంగా వుంచారు. వారి బోధనలు కేవలం బయటి నుంచి పట్టుకు వేలాడే బల్లులనుపోలివుండేవి కావు. ప్రపంచం విసిరే సవాళ్ళ అలలకు పట్టుజారి కొట్టుకొని పోయేవీ కావు. ఇవి పైపైన పూతవేసిన రంగులు కూడా కావు. ఈ రంగులు కాలగతిన వెలిసిపోతాయి. దైవప్రవక్తల బోధనలు హృదయపు లోతుల్లోనికి చొచ్చుకొని పోయి, అత్యంత శక్తిమంతంగా ముద్రించబడిన శాశ్వత ముద్రలుగా వుండి, తమ సైద్ధాంతిక, సూత్రబద్ధతల కారణంగా అత్యంత బలమైన శక్తిగా పరిణామం చెందాయి. మనసు చేసే మాయల నుండి, గుర్రాల పరుగు వంటి కోరికల నుండి, మానవుడిని రక్షిస్తూ సవ్యమైన తీర్పులు తీరుస్తూ అధిపత్యం వహిస్తూ వుండేవి.

సందర్భానుసారంగా కొన్ని ఆకాశ ధర్మాలు మానవ సమాజాన్ని, దాని రూపు రేఖలను, పరిపాలనలోని ప్రభుసత్తాకతలను కూడా సంస్కరిస్తూ వాటికి పట్టివున్న ధర్మేతర జబ్బులకు చికిత్సను కూడా అందించాయి. అన్ని ఆకాశ ధర్మాలు ఉమ్మడిగా ఒకే స్వభావాన్ని కలిగివున్నాయి. అది: అవి తమ సంస్కరణ ప్రక్షాళనా కార్యక్రమాలన్నింటికి ఉత్తమ నైతికతలనే గీటురాయిగా ఆధారాలుగా చేసుకున్నాయి. దృఢమైన, నిర్మాణాత్మకమైన నైతికతే ప్రతి సంస్కృతికి హామీగా నిలుస్తాయని ప్రకటించాయి.

సమాజాన్ని, పాలనా వ్యవస్థలను ప్రక్షాళించడానికి ప్రయత్నించే వ్యక్తులను విస్మరించడం ఈ సందర్భంగా ఎంతమాత్రమూ సాధ్యంకాదు. జీవితాన్ని చెడుల నుండి రక్షించుకునేందుకు, సంక్షేమ సౌభాగ్యాల పరిరక్షణకు, వ్యక్తి వికాసానికి, అతని హృదయ ప్రక్షాళన ఎంతటి అవసరమో వెల్లడించడమే ఈ వాక్యం ఉద్దేశంగా వుంది.

ఏ హృదయం వక్రతకు, పశు ప్రవృత్తికి లోనయి వుంటుందో – అది ప్రభుత్వ వ్యవస్థలో కల్లోలాలకు కారణభూతమవుతుంది. చట్టరాహిత్యాన్ని వ్యాపింపజేస్తుంది. రాజ దండమనే దుడ్డుకర్రను తన నీచమైన, స్వార్థపర లక్ష్యసాధన కొరకు, వ్యక్తిగత ప్రయోజనాల కొరకు మాత్రమే ఉపయోగిస్తుంది. తత్‌వ్యతిరేకంగా ఒక నిష్కల్మష హృదయం తన చుట్టూవున్న సామాజిక వాతావరణాన్ని సంస్కరించే బాధ్యతను తీసుకుంటుంది. మనిషిలోని మానవత్వాన్ని మేల్కొలుపుతుంది. అతని ఔన్నత్యాన్ని, మంచితనాన్ని ఇనుమడింపజేస్తుంది. అదేసమయంలో వస్తు వినియోగం, ప్రకృతి వినియోగంలో క్రమత, సమతుల్యతలు సాధిస్తుంది. ప్రభుత్వ వ్యవస్థల్లోని వక్రతలన్నింటిని, అతిక్రమణలన్నింటిని ప్రక్షాళించి పరిరక్షించే బృహత్తర బాధ్యతను తనకు తానుగా (స్వచ్ఛందంగా) స్వీకరిస్తుంది.

మనసు ఉదాహరణ– ఒక న్యాయమూర్తిని పోలివుంటుంది. అతను సుశిక్షితుడైన ఒక మంచి వ్యక్తి అయితే, తన న్యాయం ద్వారా చట్టాన్ని సమస్త చెడుగుల నుండి పరిరక్షించగలడు. న్యాయాన్ని మరింతగా ఉత్థానపర్చగలడు. అదే న్యాయమూర్తి దౌర్జన్యపరుడు, లంచాలమారి, కామపిశాచి అయితే తన తీర్పుల ద్వారా, అధికారపు హోదా ద్వారా సవ్యమైన, సత్యమైన చట్టాలను కూడా తారుమారు చేసివేసే ప్రమాదముంటుంది. ఇదేవిషయం ప్రపంచంలోని సిద్ధాంతాలను, భావజాలాలను, ప్రయోజనాలను ప్రీతికర విషయాలను ఎదుర్కొనే సందర్భంలో మానవుని మనసుకూ వర్తిస్తుంది.

ఈ కారణంగానే ఆత్మ ప్రక్షాళన జీవితంలో శాంతి సంక్షేమాలకు, శుభశ్రేయా లకు మూలస్తంభంగా వుంటుంది. హృదయ ప్రక్షాళన, మానసిక సంస్కరణలకు ప్రాధాన్యతనివ్వకపోతే ఈ ప్రపంచం దోపిడి, దుర్మార్గాల చీకట్లలో కొట్టుమిట్టాడటం ఖాయం అవుతుంది. మనిషి వర్తమానం, భవిష్యత్తు రెండు కూడా ఉపద్రవాలకు, కల్లోలాలకు నిలయాలైపోతాయి. ఈ విషయాన్ని సృష్టికర్త అల్లాహ్ తన గ్రంథంలో ఇలా పేర్కొన్నాడు.

**"యదార్థం ఏమిటంటే ఒక జాతి స్వయంగా తన లక్షణాలను మార్చుకో నంతవరకు అల్లాహ్ దాని స్థితిని మార్చడు. అల్లాహ్ ఒక జాతిని శిక్షకు గురిచేసే నిర్ణయం తీసుకున్నప్పుడు, దానిని ఎవరు తొలగించదలుచుకున్నా**

**అది తొలగదు. అల్లాహ్‌కు ప్రతికూలంగా అటువంటి జాతిని రక్షించేవాడూ - ఆదుకునేవాడూ ఎవడూ వుండడు.'** ***(ఖుర్ఆన్- 13: 11)***

మరోచోట భువిపై కల్లోలాలకు, ఉపద్రవాలకు కారణభూతాలైన సమాజాలు పతనమైపోవడానికి కారణాలను తెలుపుతూ దివ్యఖుర్ఆన్ ఇలా వ్యాఖ్యానించింది :

**'ఇది ఫిరౌన్ జాతి వారికీ, వారి పూర్వపు ప్రజలకూ సంభవిస్తూ వచ్చిన విధంగానే వీరికి సంబంధించింది. అంటే; వారు అల్లాహ్ ఆయత్‌లను విశ్వసించడానికి తిరస్కరించారు. అప్పుడు అల్లాహ్ వారి పాపాల కారణంగా పట్టుకున్నాడు. అల్లాహ్ శక్తి గలవాడు. కఠిన శిక్షనూ విధించేవాడు. ఇది అల్లాహ్ యొక్క ఈ సంప్రదాయం ప్రకారం జరిగింది; ఒక జాతి తన నడవడికను మార్చుకోనంత వరకు, అల్లాహ్ దానికి ప్రసాదించిన ఏ అనుగ్రహాన్ని ఉపసంహరించడు.'**
***(ఖుర్ఆన్, 8: 52-53)***

ఇస్లాం మానవ హృదయ ప్రక్షాళనకు- దాని శిక్షణకు తనదైన రెండు అంశాలను విశదీకరిస్తుంది. అందులో మొదటిది: మానవ హృదయంలో ఉన్నతమైన, పవిత్రమైన సహజత్వం తప్పనిసరిగా వుంటుంది. అది మంచి, సంక్షేమం, శాంతిమార్గాల వైపుకు ఉరకలు వేస్తూ వుంటుంది. అదే సమయంలో చెడు, దుర్మార్గాలను అసహ్యించుకుంటుంది. చెడు ప్రభావాన్ని చూచి ఆందోళన చెందుతుంది. మంచి, సత్యతల్లో తన ఉనికిని విస్తృతపర్చుకుంటూ ఆరోగ్యవంతమైన శాంతి సంక్షేమకర జీవితాన్ని దర్శించుకుంటుంది.

ఇక రెండవది : మనిషి హృదయంలో చెడువైపుకు ప్రేరేపించే, కోరికల గుర్రాలను పరుగులెత్తించే దుష్టభావనలూవుంటాయి. ఇవి మనిషిని సన్మార్గం నుండి దారి తప్పించి, నష్టదాయక ఆచరణలను సుందరంగా మలిచి మనిషి ముందు ఆవిష్కరిస్తాయి. వ్యక్తిని వినాశకర అగాధాల్లోకి నెట్టివేస్తాయి.

మనిషిలో దుష్ట జంతుప్రవృత్తి చారిత్రక నేపథ్యాన్ని, దానివలన సంభవించిన నష్టాల జాబితాను, తారీఖులు దస్తావేజులను పరిశీలించడం ఇక్కడ మా ఉద్దేశ్యం కాదు. కేవలం మనిషి నైజంలో పై రెండు విధాలైన మానసిక తత్వాలు ఉంటాయి అని చెప్పడం ఉద్దేశ్యం. అవి మనిషిపై నాయకత్వం వహించేందుకు ఒకదానితో మరొకటి సంఘర్షించుకుంటూ వుంటాయి. చివరికి మనిషి ఏ నైజం వైపుకు మొగ్గుచూపుతాడో

దానిపై ఆధారపడి అతని జీవిత పర్యవసానం లేక ఫలితం వుంటుందని చెప్పడమే ఇక్కడ మా ఉద్దేశ్యం. ఈ విషయంగా అల్లాహ్ ఖుర్ఆన్‌లో ఇలా విశదపర్చాడు.

**"మానవ ఆత్మసాక్షిగా, ఆ ఆత్మను తీర్చిదిద్ది ఆపై దానికి సంబంధించిన మంచీ చెడులను దానికి తెలియజేసినవాడు సాక్షిగా, నిశ్చయంగా తన ఆత్మను పరిశు ద్ధపర్చుకున్న వ్యక్తి సఫలుడయ్యాడు, దానిని అణిచివేసినవాడు విఫలుడ య్యాడు."** ***(ఖుర్ఆన్- 91: 8-10)***

ఈ విషయంగా ఇస్లామీయ మహత్తర కార్యం ఏమిటంటే అది మనిషిలోని సకారాత్మక పార్శ్వాన్ని అన్నిరకాలుగా ఆదుకుంటూ, అతని సకారాత్మక నైజాన్ని పటిష్టపరుస్తుంది. ఈ సకారాత్మక నైజపు వెలుగులో, దాని మార్గదర్శనంలో మానవుడు తన జీవితపు సుదీర్ఘ ప్రయాణాన్ని సాఫీగా కొనసాగించాలని కాంక్షిస్తుంది.

మనిషిని తన నిజమైన లక్ష్యం నుండి దృష్టిని మరల్చుతూ, అతడిని ఉన్నత స్థాయి నుండి దిగజార్చివేయ ప్రయత్నించే పాపకార్యాల ఆకర్షణ నుండి, దుష్ట పశు భావనల నుండి విముక్తి పొందే మార్గాన్ని, మార్గదర్శకత్వాన్ని సూచిస్తుంది. మానవుడి నిజలక్ష్యం- గమ్యాలను చేరుకునేందుకు అతడిని సిద్ధపరుస్తుంది.

## ఇస్లాం సహజ ధర్మం

ఇస్లాం స్వయంగా తనను 'సహజ మానవ నైజధర్మం'గా పరిచయం చేసుకుంది ఇలా ప్రకటించుకోవడం ద్వారా సకల దుష్టత్వాల నుండి తన్నుతాను పవిత్రపర్చు కుంది. ఈ విషయాన్ని దైవగ్రంథం ఖురాన్ ఇలా స్పష్టపర్చింది.

**"కనుక (ప్రవక్తా! ప్రవక్త అనుచరులారా!) ఏకాగ్ర చిత్తంతో మీ ముఖాన్ని ఈ ధర్మం దిశలో స్థిరంగా నిలపండి. అల్లాహ్ మానవులను ఏ స్వభావం ఆధా రంగా సృష్టించాడో దానిపై స్థిరంగా వుండండి. అల్లాహ్ సృజించిన స్వరూప స్వభావాలు మార్చడానికి శక్యం కానివి. ఇదే సవ్యమైన, తిన్నని ధర్మమార్గం. కాని, చాలామందికి తెలియదు.'** **(ఖుర్ఆన్- *30 : 30*)**

తనలో ఏదైనా లోపం ఏర్పడనంత వరకు కన్ను తన ధర్మమైన 'చూడటం' చూస్తూనే వుంటుంది. చెవి లోపం రానంతవరకు తన పని 'వినడం' ఆచరిస్తూనే వుంటుంది. అదే విధంగా మానవ నైజాన్ని తన సహజత్వం నుంచి బలవంతంగా

మళ్ళించనంతవరకు అది తన స్వాభావికమైన సహజ నైజం ప్రకారం మంచివైపునకు పరుగులు పెడుతూనే వుంటుంది.

మానవ సహజ నైజాన్ని ధ్వంసం చేసే ప్రేరకాలు; అయితే గతకాలపు కార్యాల పర్యవసానాలైనా అయివుంటాయి. కాకుంటే దిగజారిన మన పరిసరాల దురలవాట్లు, దురాచార, మూఢత్వాల ఫలితంగానైనా అయివుంటాయి. లేదా రెండూ కలిసిన ఫలితంగానూ అయివుంటాయి. ఈ అంశాలు మానవ సహజ నైజానికి అత్యంత ప్రమాదకారులై వుంటాయి. సకారాత్మక సహజ మానవ నైజంలో రకరకాల జబ్బులను, రుగ్మతలను జనింపజేస్తాయి. ఈ దురాచార రుగ్మతలకు వ్యతిరేకంగా పోరాడి వాటి ప్రభావ తీవ్రతను తుదముట్టించడమే ఒక సంస్కర్తకు నిజమైన జిహాద్ (ధర్మపోరాటం)గా వుంటుంది. ఈ పోరాటం ద్వారానే మానవ నైజం తన సహజ పరిశుద్ధతను పొందగలుగుతుంది. చెడుల దాడుల నుండి సహజ నైజాన్ని పరిరక్షిం చుకోవడమే ఒక నిజమైన సంస్కర్త కర్తవ్యమై వుంటుంది. ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించే సంపూర్ణ విధానాన్ని అత్యుత్తమ రీతిలో ఇస్లాం మానవ సమాజానికి అందించింది.

దైవగ్రంథంలో సహజధర్మ వివరణ తర్వాత ఇలా చెప్పబడింది.

**"(స్థిరంగా ఈ విషయంలో) అల్లాహ్ వైపునకు మరలుతూ; ఆయనకు భయపడండి; నమాజును స్థాపించండి, తమ ధర్మాన్ని వేరువేరుగా రూపొందించుకున్న,వర్గాలుగా చీలిపోయిన ముష్రిక్కులతో కలిసిపోకండి. ప్రతివర్గమూ తన వద్ద నున్న దానితోనే ఆనందపడుతున్నది'** ***(ఖుర్ఆన్, 30: 31,32)***

అవిశ్వాసానికి బదులుగా విశ్వాసాన్ని జనింపజేసుకోవడం– పాపాలకు, చెడులకు బదులుగా, విశ్వాసాన్ని జనింపజేసుకోవడం, దైవభావనలో విభజనను కాక ఏకత్వాన్ని ఆమోదించడం, తదనుగుణమైన ధార్మిక ఆచరణలు మానవుడిని సహజమైన నైజంపై స్థిరంగా వున్నాడనే విషయాన్ని స్పష్టపరుస్తాయి.

ఈ విషయాన్ని దివ్యగ్రంథం ఖుఆన్ ఈక్రింది మాటల్లో స్పష్టం చేసింది.

**'మేము మానవుడిని అద్భుతమైన ఆకృతిలో సృజించాము. తరువాత మేము అతన్ని వెనక్కి తిప్పి నీచాతి నీచుడుగా మార్చివేశాము. విశ్వసించి సత్కార్యాలు చేసేవారు తప్ప'** ***(ఖుర్ఆన్, 95: 4-6)***

మానవుడి అద్భుతమైన ఆకృతి ఏమైవుంటుంది? బాహ్య శరీరంతోపాటు అతని

అంతరంగం కూడా ఇందులో ఇమిడివుంది. ఈ ఆకృతి సత్యాన్ని గుర్తించి దానిని అంటిపెట్టుకొని వుండాలి. ఆ సత్యం కోరే ప్రతి దానిని పూర్తిచేయాలి. ఈ ఆచరణ మాత్రమే మంచిపట్ల మనిషికి వున్న నిబద్ధతగా పరిగణించబడుతుంది. మనిషి వ్యక్తిగత, సామూహిక ఆచరణలో పై రెండు విశిష్టతలను అనుసరించడమే నిజమైన ప్రజ్ఞగా భావించబడుతుంది. అదేవిధంగా జీవితంలోని అన్నిరంగాలలోసైతం, సత్యం, దాని నిష్టల ఆధిపత్యమే కొనసాగేలా కృషి చేయడమే నిజమైన జీవిత నిర్మాణంగా వుంటుంది.

అయితే మానవులలో అత్యధిక శాతం తమ కోరికల, మనోవాంఛల దాస్యం కారణంగా ఆ ఉన్నత స్థాయికి చేరుకోలేకపోతున్నారు. అథమ స్థానానికే అంటిపెట్టు కొని వున్నారు. కేవలం భౌతిక లాలసతలనే కోరుకుంటున్నారు. అందులోనే కూరుకుని పోయి సామాజికంగా సామూహికంగా అనుసరించవలసిన ఆదేశాలను తృణీకరిస్తు న్నారు. ఫలితంగా అత్యంత నీచ స్థాయికి దిగజారిపోయారు. మానవుడి ఈ స్థితినే ఖుర్ఆన్ 'అస్ఫల సాఫిలీన్' అని పేర్కొంది. హీన మానసిక స్థితిని ఒంటబట్టించుకున్న వారిని అల్లాహ్ ఈ వైపునకే మరలింపజేస్తాడు.

నీచ నైజం కలిగిన మానవుడిని తిరోగమనవాదిగా చేసి అథమస్థాయికి త్రోసి వేయడం అనేది ఆ వ్యక్తిని పూర్తిగా హెచ్చరించిన పిదపనే జరుగుతుంది. హెచ్చరించ కుండా శిక్షించడం అల్లాహ్ సాంప్రదాయానికి విరుద్ధం. అల్లాహ్ నియమాలు సాంప్రదాయాలు సత్యమైనవి, న్యాయమైనవి అయి వుంటాయి. ఈ విషయం ఖుర్ఆన్ ఈ క్రింది పదాలలో తెలిపింది:

**'ప్రజలకు, సన్మార్గం చూపిన తర్వాత మళ్ళీ వారిని మార్గభ్రష్టత్వానికి గురిచేయడం అల్లాహ్ విధానం కాదు. వారు దూరంగా వుండవలసిన విషయాలను గురించి వారికి స్పష్టంగా తెలుపనంతవరకు. వాస్తవానికి అల్లాహ్‌కు ప్రతి విషయం గురించీ తెలుసు.'** ***(ఖుర్ఆన్- 9 : 115)***

'సూరె ఆరాఫ్'లో మనిషి మార్గభ్రష్టత్వానికి గురవ్వడం గురించి, దానికి సంబంధించిన అల్లాహ్ నియమం, మార్గనిర్దేశనం గురించి ఈ క్రిందివిధంగా తెలియ పర్చడం జరిగింది.

**'ఏ హక్కూ లేకుండా భూమిపై పెద్దలుగా చలామణి అయ్యేవారి దృష్టిని నేను నా సూచనల నుండి మరలిస్తాను. వారు ఏ సూచనను చూసినా దానిని**

**ఎన్నటికీ విశ్వసించరు. ఒకవేళ సరైన మార్గం వారి ముందుకు వచ్చినా దానిని వారు అవలంబించరు. ఒకవేళ వక్రమార్గం కనిపిస్తే వెంటనే ఆ మార్గం మీదకు దుముకుతారు. ఎందుకంటే; వారు మా సూచనలను తిరస్కరించారు. వాటిని నిర్లక్ష్యం చేస్తూ వచ్చారు.'** ***(ఖుర్ఆన్, 7: 146)***

ఎవరు తమ నడవడిలో అత్యుత్తమ స్థానంలో నిలబడతారో భౌతిక, సామాజిక, చెడుల నుండి తన్నుతాను ఎవరు రక్షించుకుంటారు? అనే ప్రశ్నలకు దివ్య ఖుర్ఆన్ ఈవిధంగా స్పష్టమైన జవాబు ఇచ్చింది.

**'విశ్వసించిసత్కార్యాలు చేసేవారు.' (95: 6)** కనుక విశ్వాసం కలిగివుండటం దాని అనివార్య ఫలితమైన సత్కార్యాల సమాహారం, దాని ఫలితంగా లభించే వ్యక్తిగత ఫలితం కేవలం ఉత్తమ నైతిక విలువలేననేది సుస్పష్టం.

## పశు ప్రవృత్తి (నఫ్సే అమ్మారా)కి విరుగుడు

మనిషిలోని సహజ నైజం– దాని పరిశుద్ధత – దృఢత్వాల విషయంగా ఇస్లామీయ దృక్కోణం స్పష్టంగా తెలియపర్చబడింది. ఇంకా మనిషి ఈ సహజ నైజాన్ని కలుషితం చేసే షైతానీ వ్యవహారసరళి గురించి కూడా స్పష్టం చేయబడింది. షైతాన్‌చే ప్రేరేపించబడిన పోకిరి నైజాలను ఇస్లాం హెచ్చరిస్తుంది. కోరికల పరుగును అదుపు చేసే బాధ్యతను మనిషిలోని సకారాత్మక బుద్ధికి అప్పగిస్తుంది. ఈ షైతానీ నైజాన్ని దాని కోరికల పరుగును, మనిషిలోని సకారాత్మక బుద్ధి ముందు మోకరిల్లేలా తనకుతానుగా అల్లాహ్‌కు సమర్పించుకునేలా తయారు చేస్తుంది.

ప్రవక్త(స) వారు మనిషిలోని నకారాత్మక మనస్తత్వాన్ని ఇలా సూచించారు.

'ఆదం కుమారుడు (మానవుడు) వృద్ధాప్య దశకు చేరుకుంటాడు. అయినా అతడి రెండు గుణాలు మాత్రం అతడిని విడనాడవు. ఒకటి దురాశ, రెండవది అంతులేని కోరికల పరంపర' (ముస్లిం)

'మనిషిలో కానవచ్చే అతిపెద్ద చెడు ఏమిటంటే, భీతిని గొలిపే అతని పిరికితనం, అప్రతిష్టపాలు చేసే అతని పిసినారితనం' (అబూదావూద్)

'ఒకవేళ ఆదం కుమారుని (మనిషి)కి ఒక బంగారు లోయను ప్రసాదించినా అతను రెండవ లోయను కోరుకుంటాడు. ఒకవేళ రెండవ లోయను ప్రసాదించినా,

అతను మూడవ లోయను కోరుకుంటాడు. మట్టిలో చేరనంతవరకు ఆదం కుమారుని కడుపు నిండనే నిండదు. ఏవ్యక్తి అల్లాహ్ వైపు మరలుతాడో- పశ్చాత్తాపపడతాడో- అల్లాహ్ అతడి పశ్చాత్తాపాన్ని (తౌబాను) అంగీకరిస్తాడు.' (బుఖారి)

దివ్యఖుర్ఆన్ ఆలిఇమ్రాన్ సూరాలో మనిషి కోరుకునే అనేక భౌతిక వాంఛల గురించి చర్చించడం జరిగింది.

**"స్త్రీలూ, సంతానమూ, వెండి బంగారు రాసులూ, మేలుజాతి గుర్రాలు పశువులూ, సేద్యపు భూములు వంటి వ్యామోహాలపై ప్రేమ ఆకర్షకంగా చేయబడింది. కాని, ఇవన్నీ అనిత్యమైన ఐహిక జీవన సంపదలు మాత్రమే. అసలైన ఉత్తమ నివాసం అల్లాహ్ వద్దవున్నదే'** ***(ఖుర్ఆన్, 3: 14)***

ఇస్లాం ప్రాథమికంగా, మానవుడిని కోరికల దాస్యం మానమనీ, మనోవాంఛల వెంట పరుగు పెట్టడం ఆపమనీ కోరుతుంది. అదుపులేని కోరికల గుర్రాలపై స్వారీ చేయడం ద్వారా ఎప్పటికీ మనసును సంతృప్తపర్చలేవనీ బోధిస్తుంది. ఈ మానసిక రోగం గల వ్యక్తికి, సత్యం, సన్మార్గం వంటి విషయాలు ఎప్పటికీ రుచించవనీ హెచ్చరిస్తుంది.

మనిషి మానసికస్థితి ఎటువంటిది అంటే; అతని ఒక కోరిక- అవసరం తీరిన వెంటనే మరొక కోరికను తీర్చుకునేందుకు అది సిద్ధమైపోతుంది. అది నిత్యం కొత్తకొత్త రుచులను చవిచూడాలని కోరుకుంటుంది. ఈ రుచుల వెంపర్లాటలో అది పాపాలలో తేలియాడేందుకూ- హింస, దౌర్జన్యం, దోపిడీలకు పాల్పడేందుకు సైతం వెనుకాడదు. ఈ కారణంగానే దైవగ్రంథం నిషేధించబడిన మనోవాంఛలను వాటి అనుసరణను విడనాడమని హితవు గరిపింది.

**"మనోరథాలను అనుసరించకు, ఎందుకంటే అది నిన్ను అల్లాహ్ మార్గం నుండి తప్పిస్తుంది. అల్లాహ్ మార్గం నుండి తప్పిపోయినవారికి తీవ్రమైన శిక్ష పడటం నిశ్చయం. ఎందుకంటే, వారు లెక్కల దినాన్ని మరిచిపోయారు."**

**(ఖుర్ఆన్, 38: 26)**

తిరస్కారుల కోరికలను, వాటిని వ్యతిరేకించవలసిన అవసరాన్ని దాని ప్రాధాన్యతను దివ్యగ్రంథం ఈక్రింది మాటల్లో వ్యక్తపరిచింది.

**సత్యమే గనక వారి కోరికలను అనుసరించి వుంటే – భూమ్యాకాశాలూ, వాటి లోని జీవరాశి, దాని వ్యవస్థ ఛిన్నాభిన్నమై వుండేవి– కాదు, అయితే మేమే వారి సొంత ప్రస్తావనను వారి ముందుకు తీసుకువచ్చాము. కాని వారు తమ ప్రస్తావన నుండి ముఖం తిప్పుకుంటున్నారు. *(ఖుర్‌ఆన్, 23: 71)***

అల్లాహ్‌చే నిషేధించబడిన మనోవాంఛలకు– ఆమోదించబడిన కోరికలకు నడుమ గల వ్యత్యాసాన్ని తప్పనిసరిగా తెలుసుకొని వుండాలి. ఎందుకంటే; ధర్మ పరాయణులుగా ప్రసిద్ధిగాంచిన వారు అనేకులు ఈ రెండు అంశాలను మహా చెడ్డ రీతిలో కలగాపులగం చేసి వేశారు.

ఒకవేళ మనిషి తన జీవన సామగ్రిని, వాటి ద్వారా లభించే రుచి, ఆస్వాదనలను అభిలషిస్తే అందులో తప్పు ఏదీలేదు. కాని, ఈ అవసరమైన, ధర్మసమ్మతమైన, సహజమైన కోరికలను సైతం నీచమైనవిగా, నిషిద్ధమైనవిగా భావించడం మహా తప్పు.

పై తప్పుడు అవగాహన ఫలితంగా మనిషి అవసరమైన, గౌరవనీయమైన కోరికలను తీర్చుకుంటూనే ఒకవిధమైన అపరాధ భావనకు గురవుతూ వుంటాడు. ఈ క్రమం ఇలాగే కొనసాగితే నిషిద్ధ విషయాలను సైతం సముచిత విషయాలుగా గౌరవించే స్థితికి చేరుకుంటాడు. ఈ తప్పుడు అవగాహనకు గురైన మానవ హృదయం క్రమంగా చెడు మానవ జీవితంలో వున్న ఒక సహజమైన విడదీయరాని అంశమని భావిస్తుంది. దాని నుండి తప్పించుకోవడం సాధ్యంకాదనీ, కనుక పాపాలను ఆచరించడం తప్పనిసరి అని భావిస్తాడు, తుదకు పాపిగా పరిణామం చెందుతాడు. ఇస్లామీయ పరిభాషలో ఈ వ్యక్తి నిజమైన అపరాధిగా రూపొందుతాడు.

ఈ విషయంగా దైవగ్రంథం ప్రత్యేకశ్రద్ధతో మనిషికి మార్గదర్శకత్వం అందించింది. మనిషి ధర్మబద్ధ కోరికలను, సముచిత మనోకాంక్షలను తీర్చుకోవడం పట్ల శ్రద్ధ వహించింది. ధర్మబద్ధమైన శుచిశుభ్రతలు, పరిశుద్ధ పదార్థాలు, వస్తువుల వినియోగాన్ని ప్రోత్సహించింది. ధర్మబద్ధ, పరిశుద్ధ విషయాలను నిషేధించుకోవడం– అధర్మ అశ్లీల విషయాలకు మార్గాలు సుగమం చేయడమేనని తీర్మానించింది. ధర్మబద్ధ కోరికలను అణుచుకోవడం వల్ల చెడుకార్యాలకు, అసభ్య ఆచరణకు ద్వారాలు తెరుచుకుంటాయని హెచ్చరిక చేసింది.

**"ప్రజలారా! భూమిలోని ధర్మసమ్మతమైన, పరిశుభ్రమైన వాటినన్నింటినీ మీరు**

**తినండి. షైతాన్ చూపే మార్గాలను తొక్కకండి. వాడు మీకుబహిరంగ శత్రువు. దుర్మా ర్గాన్ని, అశ్లీలాన్ని చెయ్యండి అని వాడు మిమ్మల్ని ఆజ్ఞాపిస్తాడు. ఏ విషయాలను గురించి అయితే (అల్లాహ్ చెప్పినట్లు) మీకు తెలియదో ఆ విషయాలను అల్లాహ్ పేరుతో చెప్పండీ అని మిమ్మల్ని ప్రేరేపిస్తాడు.'**

***(ఖుర్‌ఆన్, 2: 168, 169)***

ధర్మసమ్మతమైన పరిశుద్ధ విషయాలపై ఆంక్షలు, నిషేధాలు విధించుకోమని షైతాన్ ప్రేరేపిస్తాడు. జ్ఞానం లేకుండానే అల్లాహ్‌పై అపనిందలు మోపేలా మనిషిని ఉత్సాహపరుస్తాడు. ధర్మబద్ధమైన సహజ కోరికలను బలవంతంగా అణిచివేయడాన్ని, కఠిన వైఖరుల ద్వారా నిరోధించుకోవడాన్నిగాని ఇస్లాం ఆమోదించదు. సరికదా ఈ సహజ నైజాలను, దాని పరిశుద్ధ కోరికలను, వాటి గుణాలను ఆహ్వానం పలకమని, స్వాగతించమని హితోపదేశం చేస్తుంది. ఈ నైజాల తర్ఫీదు కొరకు హెచ్చుతగ్గులు లేని మధ్యస్త మార్గాన్ని ఇస్లాం స్వీకరిస్తుంది.

## నైతికత జీవిత రధసారధి

విశ్వాసం, సంస్కరణ, శిక్షణలతో కప్పివేయబడి వుండటం సకారాత్మక నైజం కాగా, ధిక్కారం, నాస్తికత్వం, దౌర్జన్యాలు నకారాత్మక సహజ నైజంగా వుంటాయి. పై రెండు స్థితులలో కూడా నైతికతే మానవ సమాజాన్ని కంట్రోలు చేయగలుగుతుంది. దివ్యఖుర్‌ఆన్ మనిషిలోని బలహీనతలు, బాధలతోపాటు సంపద ఐశ్వర్యాల ఆపేక్ష-నిరపేక్షలు లాంటి రుగ్మతల గురించి చర్చించడంతోపాటు వాటికి సహేతుకమైన చికిత్సలను పరిష్కారాలను చూపింది. ఈ పరిష్కారాలు కేవలం ధర్మమార్గ అవలంబన ద్వారా మాత్రమే లభిస్తాయని స్పష్టం చేసింది.

**"మానవుడు తొందరపడే వాడుగా, సహనంలేనివాడుగా సృష్టించబడ్డాడు. అతనికి కష్టాలు వచ్చినప్పుడు ఆందోళన చెందుతాడు, సుఖాలు కలిగినప్పుడు పిసినారితనంతో ప్రవర్తిస్తాడు. కాని (ఈ బలహీనతకు ఈ క్రింది వారే దూరంగా వుంటారు) నమాజు చేసేవారు, నమాజులను నియమం తప్పకుండా పాటించేవారు, తమ సంపదలలో యాచకులకు, దిక్కులేనివారికి ఒక నిర్ణీత మైన హక్కును ఇచ్చేవారు, తీర్పుదినం సత్యమని నమ్మేవారు, తమ ప్రభువు శిక్షకు**

**భయపడేవారు; ఎందుకంటే వారి ప్రభువు విధించే శిక్ష ఎవరూ నిర్భయంగా వుండేటటువంటి శిక్షకాదు, తమ మర్మాంగాలను కాపాడుకునే వారు'**

***(ఖుర్‌ఆన్, 70: 19-29)***

నైతిక విలువలు మనిషిలో ఉన్నపళంగా- హఠాత్తుగా జనించేవికావు. ఈ నైతిక విలువలు ప్రారంభ దశలో దృఢంగా, శక్తిమంతంగానూ వుండవు. ఈ విలువలు వ్యక్తిలో క్రమంగా, నిలకడగా రూపుదిద్దుకుంటాయి. ఈ క్రమం పటిష్టపరచడానికి అనేక దశల నుండి ప్రయాణం చేయవలసి వుంటుంది.

కనుక నైతికత జనించి, ఫలించి పుష్పించడానికి మనిషి క్రమం తప్పక కొన్ని ఆచరణలను ఆచరించవలసి వుంటుంది. దానితోపాటు ఈ నైతికతను శాశ్వత పర్చుకోవడానికి అవసరమైన మానసికతను కూడా అభివృద్ధిపర్చుకోవలసి వుంటుంది. నమాజ్, ఉపవాసాలు, జకాత్, హజ్ ఇతర నిత్యజీవితంలో ఆచరించవలసిన ఆరాధనలు నిర్వర్తిస్తూ... తీర్పుదినంపై మొక్కవోని విశ్వాసం, బహుమానాలపై ఆశ, శిక్షల పట్ల భయం లాంటి స్థితి, ఆచరణలు అన్ని నైతిక విలువల అభివృద్ధికి దోహద పడతాయి.

ధిక్కార, నకారాత్మక నైజాలు మనిషిలో స్థిరత్వం సాధించి వున్నప్పుడు, తప్పుడు సిద్ధాంతాలు, వాదాలకు అంటిపెట్టుకొని వున్నప్పుడు, వాటి అనుకూల సమయాలలో మనిషిని వక్రమార్గాలవైపుకు, భ్రష్టత్వం వైపుకు, సమాజాన్ని నష్టపరిచేదారుల వైపుకు గుంజుకొని వెళతాయి. ఈ సందర్భాలలో వాటిని నిరోధించేందుకు కేవలం కొన్ని తాత్కాలిక పరిష్కారాలు, అత్యవసర చికిత్సలు సరిపోవు.

అనైతికతల వికటాట్టహాసపు తలను తుంచి, దానిని కనీస స్థాయికి లేదా మధ్యస్థ స్థాయికి చేర్చి మనిషిలోని సకారాత్మక- నకారాత్మక నైజాల మధ్య సమతుల్యతను సాధించే శక్తిసామర్థ్యాలు గల వ్యక్తులే, అనైతిక ధిక్కార ధోరణులను అదుపు చేయగలరు.

పై చర్చ మొత్తం సారాంశం, ఇస్లాం మనిషిలోని సహజ నైజాన్ని గౌరవిస్తుంది. ఆ సహజ నైజాల వైపుకే మనిషిని ఆహ్వానిస్తుంది. తిరస్కార, ధిక్కార గుణాలను, వారి నైజాలను హెచ్చరిస్తుంది... వాటి దృక్పథాలను సంస్కరిస్తుంది. ఇస్లామీయ విధులు, విశ్వాసాలు, ఆరాధనలు మనిషిలోని సకారాత్మక సహజ నైజాన్ని పటిష్టపరుస్తాయి.

కోరికల గుర్రాలను అదుపుచేస్తాయి. ధర్మబద్ధ మనోకాంక్షల నెరవేర్పు వైపు ప్రోత్సహిస్తాయి. మార్గదర్శకత్వం అందిస్తాయి. ఒక మనిషిలో, అతని ఆరాధనలు– ఉత్తమ నైతిక విలువలను,ఉత్తమ వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించాలి. రోజువారి జీవితంలో నిర్వర్తించే విధులు సైతం ఉత్తమ స్థాయిలో నిర్వర్తించాలి. ఈ ప్రత్యేకత సాధించబడనంతవరకు మనిషి జీవిత లక్ష్యం సాధించబడదు.... నెరవేరదు కూడా!



# 5 వ భాగం

# నైతిక నేరాలకు శిక్షలు

- నైతికత నిర్బంధం కాదు
- సమాజ రక్షణకే హద్దులు
- ఇస్లాం హృదయాలను సంబోధిస్తుంది
- సమాజ బాధ్యత

# నైతికత నిర్బంధం కాదు

గుర్రాన్ని నీటితొట్టి వరకు బలవంతంగా, గుంజుకొని వెళ్ళగలమే తప్ప దానిచేత నీటిని త్రాగించలేము. అదే విధంగా వ్యక్తిలో నైతిక విలువలు జనింప జేయడం, వాటిని వికసింపజేయడం కూడా బలవంతంగా సాధ్యమయ్యేదికాదు. అదే విధంగా మనిషిలో బలవంతంగా విశ్వాసాన్ని కూడా పెంపొందింపజేయలేము. పై పనులన్ని మనిషిలో స్థాపించబడటం ఆ మనిషి యొక్క అంతరింగిక, బౌద్ధికపరమైన స్వేచ్ఛ, స్వతంత్రలపై ఆధారపడి వుంటుంది.

మనిషిలో నిగూఢంగా ఉన్న ఈ ప్రత్యేకతల వాస్తవాన్ని ఇస్లాం గుర్తిస్తుంది, గౌరవిస్తుంది. అదే సమయంలో నైతిక విలువల పునాదిపై తన సుందర సౌధాన్ని నిర్మించే కృషిలో నిమగ్నమవుతుంది.

మనిషిని మంచివైపుకు పరుగెత్తించేందుకు, అతనిని రుజుమార్గంపైకి తెచ్చేందుకు, ఆ మనిషిపై కఠినత్వం, బలవంతం ప్రదర్శించవలసిన అవసరం ఇస్లాంకు లేనేలేదు. ఎందుకంటే; మనిషి సహజ నైజమైన సకారాత్మకతపై ఇస్లాం పూర్తి సదభిప్రాయం కలిగివుంది. మనిషి జీవిత మార్గంపై పర్చబడివున్న అడ్డంకులు, ముళ్ళు, రాళ్ళు రప్పలను తొలగించి వేసినట్లే ఒక అత్యుత్తమ తరం (సమాజం) ఉనికిలోకి వచ్చి తీరుతుందనే విషయం పట్ల ఇస్లాంకు పూర్తి నమ్మకం వుంది.

మానవ నైజంలో 'మంచి' అనేది అంతర్గతంగా వుండి తీరుతుంది. అయితే, ఈ 'అంతర్గత మంచి' ప్రభావం వల్ల వ్యక్తి మంచిమాత్రమే చేస్తాడని అర్థంకాదు. అసలు భావమేమిటంటే; మానవ సహజనైజం కేవలం మంచిద్వారానే పరిరక్షింపబడి, దాని సంరక్షణలోనే వుండాలని అభిలషిస్తుంది. ఏవిధంగా ఒక పంజరం నుండి స్వేచ్ఛ పొంది బయటపడిన పక్షి స్వేచ్ఛగా ఆకాశంలో చక్కర్లు కొట్టాలనే కోరికను ప్రప్రథమంగా తీర్చుకుంటుందో– అదేవిధంగా మానవ సహజ నైజం కూడా మంచి వెలుగులోనే పనిచేయాలని కాంక్షిస్తుంది.

మనిషి తన సహజ నైజపు విధివిధానాల బంధనాలను తెంచేసుకుని భూమికి అతుక్కొని, అధఃపాతాళానికి చేరుకొని, అందునుంచి తేరుకొని ముందుకు సాగే సామర్థ్యం కోల్పోయినప్పుడు – అతనిని ఒక వ్యాధిగ్రస్తునిగా భావించి చికిత్స చేసి అతడి వ్యాధిని పోగొట్టే కార్యాచరణను ఇస్లాం స్వీకరిస్తుంది. ఈ వ్యాధిగ్రస్తుని వల్ల

ఇతరులకు హాని కలగనంతవరకు అతడిని సమాజం నుండి వెలివేయడాన్ని ఇస్లాం అంగీకరించదు. అతడిని సంస్కరించాలనీ అభిలషిస్తూ ఈ కృషిని కొనసాగిస్తుంది.

ఈ క్రమ పరిధిలో ఎదురయ్యే ఆ నైతిక నేరాలతో ఇస్లాం యుద్ధం చేస్తుంది. ఈ యుద్ధంలో మొట్టమొదట ప్రతి మనిషి, మంచి మనిషిగా జీవించాలని ఇస్లాం కోరుకుంటుంది. సహజంగానే మనిషి మంచిగా జీవించాలనీ, తన కష్టార్జితంలో జీవితం గడపాలని కోరుకుంటాడు. తన శ్రమ ద్వారా సంపాదించిన సంపదతోనే జీవితాన్ని సులభతరం చేసుకోవాలని అభిలషిస్తాడు. దొంగతనం, దోపిడీల ద్వారా తన ఉనికిని నిలబెట్టుకోవాలని కోరుకోడు. సరిగ్గా ఈ అంశాన్నే ఇస్లాం, మనిషిని సంస్కరించేందుకు సాధనంగా ఉపయోగించుకుంటుంది.

ఒక మనిషిని దొంగతనం, (శ్రమ) దోపిడీలకు పురిగొల్పుతున్న పరిస్థితులు ఏమిటి? అని ముందుగా ఇస్లాం ఆలోచిస్తుంది. అవసరమైన నిత్యావసరాలు లభించనందువల్లనే ఈ నేరాలకు మనిషి పాల్పడుతున్నాడని గుర్తిస్తుంది. తదుపరి మనిషి ఇటువంటి తప్పుడు కార్యాలకు పాల్పడటానికి వీలులేని విధంగా పరిస్థితులు కల్పిస్తుంది. మనిషి జీవితావసరాలు సంపూర్తిగా అవసరమైన మేరకు అందించే ఏర్పాట్లు చేస్తుంది.

ఒక మనిషికి అవసరమైన జీవన సాధనాలను అందించడం, ఆ సమాజం తప్పనిసరి బాధ్యతగా వుంటుంది. ఈ బాధ్యతా నిర్వహణలో సమాజం దాని వ్యవస్థలు అలసత్వం, నిర్లక్ష్యం వహిస్తే ఈ స్థితిలో వ్యక్తి దొంగతనానికి పాల్పడటానికి వివశుడైతే, ఆ నేరం కేవలం ఆ వ్యక్తిది మాత్రమేకాదు. ఆ నేరంలో సమాజానికి కూడా పూర్తి బాధ్యత వుంటుంది.

సమాజం, దాని వ్యవస్థలు, తన పౌరుడి అవసరాల పరిపూర్తికి అన్ని ఏర్పాట్లు చేసినప్పటికీ– ఆ వ్యక్తి నేరానికి పాల్పడితే అప్పుడుకూడా ఇస్లాం ఆ వ్యక్తి, ఆ నేరం చేయడానికి గల కారణాలను లోతుగా అన్వేషిస్తుంది. శిక్ష విధించడానికి ముందు, అతడు శిక్ష నుంచి తప్పించబడటానికి కారణాలేమైనా వున్నాయా? అని పరిశీలిస్తుంది. శిక్ష విధించడంలో కూడా అలసత్వం మంచిదేనని ఇస్లాం భావిస్తుంది. మానవ మహోపకారి ముహమ్మద్(స) ఈ విషయంగా :

'ఒక వ్యక్తిని పొరపాటుగా శిక్షించడంకంటే– ఆ వ్యక్తిని పొరపాటుగా క్షమించడమే ఎంతో మేలైంది' అని పేర్కొన్నారు.

## సమాజ రక్షణకే హద్దులు

నేరస్తుని స్థితిగతుల గురించి, నేపథ్యం గురించి పూర్తి విచారణ చేసిన పిమ్మట, అతడి నైజం, తన సహజత్వాన్ని వ్యతిరేకించి ధిక్కార వైఖరి వైపుకు మొగ్గుచూపిందని తెల్చుకున్న తర్వాత– ఏ సమాజమైతే అతనిని పెంచి పోషించి తన బాధ్యతలను నిర్వర్తించిందో, ఆ సమాజంపైనే దౌర్జన్యానికి అతడు పాల్పడ్డాడని స్పష్టపర్చుకున్న తర్వాత– సమాజం ఆ వ్యక్తిపై చూపిన దయ, ప్రేమానురాగాలకు బదులుగా, నేరం చేయడం ద్వారా బదులివ్వడానికి సిద్ధమయ్యాడని స్పష్టం చేసుకున్న తర్వాత– ఈ కృతఘ్నుడిని ఇస్లాం శిక్షించ బూనుకుంటుంది. అది కూడా ఆ నేరస్తుడు ఏ అవయవంతో ఆ సమాజానికి నష్టం కలిగించాడో– ఆ అవయవాన్ని అతడి నుంచి వేరుపర్చివేస్తుంది. ఈ చర్యను విమర్శించడానికి ఎవరికైనా ఆస్కారమే వుండదు.

దొంగతనాన్ని దివ్యఖుర్‌ఆన్ ఉపద్రవంగా అభివర్ణించి అందుకు కరఖండన శిక్షగా విధించింది. శిక్షకు పాత్రుడైన నేరస్తుని గురించి ఈ క్రిందివిధంగా పేర్కొంది:

**'దుర్మార్గం చేసిన తర్వాత పశ్చాత్తాపపడి తననుతాను సంస్కరించుకునేవాడి వైపునకు అల్లాహ్ కారుణ్య వీక్షణం మరలుతుంది. అల్లాహ్ ఎక్కువగా క్షమించేవాడు, కరుణించేవాడూను.'** ***(ఖుర్‌ఆన్,5 : 39)***

ఇస్లాం సమాజ రక్షణ కోసం ఏ (శిక్షలు) హద్దులు విధించిందో– నిజానికి ఆ (శిక్షలు) హద్దులు ఒక న్యాయవంతమైన, సంక్షేమ సంస్కరణాత్మక సమాజాన్ని ఆ నేరపూరిత అవయవం నుండి రక్షించడంగా భావిస్తుంది. సమన్యాయ సమాజాన్ని హింసతోనూ, దాని సంక్షేమకర శాంతిని అలజడితోనూ, ధ్వంసం చేయాలని భావించే నేరస్తుడిని కరుణకు యోగ్యునిగా ఎలా భరించగలం?

## ఇస్లాం హృదయాలను సంబోధిస్తుంది

పై వివరణ ద్వారా ఎవరైనా, ఇస్లాం కఠినశిక్షలు విధించడం ద్వారా సమాజాన్ని బలవంతంగా మంచివైపునకు నడిపించే ప్రయత్నం చేస్తుందని భావిస్తే–అది ఆ వ్యక్తి అవగాహనారాహిత్యంగా భావించవలసి వుంటుంది. ప్రజలను బలవంతంగా

రుజుమార్గం, సత్యమార్గాల పైకి మళ్ళించడం ఇస్లాం నైజానికి పూర్తి వ్యతిరేకమైనదని తెలుసుకోవాలి.

ఇస్లాం వద్ద, మానవ సమాజాన్ని మంచివైపుకు నడిపించేందుకు వున్న అత్యుత్తమ ఆచరణ ఏమంటే, అది మానవ హృదయాన్ని సంబోధిస్తుంది నిదురించి వున్న మానవుని సహజ సకారాత్మక నైజాన్ని మేల్కొలుపుతుంది. బలవంతంగా అణిచివేయబడివున్న మానవ అంతరంగాన్ని, ఆసక్తిని అభివృద్ధి వైపుకు, నైపుణ్యాలకు పురోగమనం వైపుకు మరలిస్తుంది. మానవ హృదయాన్ని దాని నిజ దైవం వైపుకు మళ్ళిస్తుంది. ఈ లక్ష్యసాధన కోసం, సహేతుకమైన సంతృప్తికరమైన సాక్ష్యాలు, వాదాలు ప్రమాణాలు ముందుంచు తుంది. ప్రేమానురాగాల రుచిలో మానవ హృద యాన్ని మైమరిపింపజేస్తుంది. అదే సమయంలో మానవ హృదయానికి ఉత్తమ స్థాయి, ప్రమాణాలు గల నైతిక విలువలు, గుణగణాలు జనింపచేసుకోవడం- వాటిని స్వీకరించడం తప్ప గత్యంతరం లేని పరిస్థితిని కల్పిస్తుంది.

పై వాతావరణంలో మనిషిలోని శక్తిసామర్థ్యాలు, నైపుణ్యాలు ఉత్తమంగా తీర్చిదిద్దుకోవడానికి, అత్యుత్తమ నైతిక విలువలను, అలవాట్లను పెంపొందింపజేసు కోవడానికీ సహకరించే చట్ట వ్యవస్థ వుండటం అత్యంత అవసరం.

అనవసరమైన, నష్టదాయకమైన అవయవాన్ని తొలగించి వేయడం ఏమాత్రం తప్పుకాదు, సరికదా అది అవసరం కూడాను. ఎందుకంటే, మనం సమాజమనే పొలంలో రకరకాలైన సంక్షేమకర పంటలను పండించదలిచాము. ఈ వ్యవసా యంలో పంట అభివృద్ధి మాత్రమే మన లక్ష్యంగా వుంటుంది. ఈ లక్ష్యసాధన కొరకు అవసరమైతే, మనమే స్వయంగా పంటకు నష్టదాయకమైన కలుపు మొక్కలను, అనవసరమైన ముళ్ళపొదలను ఏమాత్రం సంకోచించకుండా పెకిలించివేస్తాము కదా?

సాధారణ జన సామాన్యపు సంక్షేమం - శాంతి పర్యవేక్షించడం- పరిరక్షిం చడం అత్యంత ప్రధానమైన అంశం. కనుక ఇస్లాం విధించే (శిక్షలు) హద్దుల గురించి అభ్యంతరాలు, సంకోచాలు వుంచుకోవడం ఎంతమాత్రమూ అవసరంలేదు. ఈ విష యాలే యూదుల తౌరాత్ గ్రంథంలోనూ ప్రస్తావించబడ్డాయి. ఇతర ఆకాశ గ్రంథా లన్నింటిలోనూ, ధర్మాలన్నింటిలోనూ ఈ విషయాలకే అత్యంత ప్రాధాన్యతనిస్తూ వక్కాణించాయి.

# సమాజ బాధ్యత

సమాజంలో మంచి లేక చెడులు– ఉన్నత లేక అథమ విలువలు వ్యాప్తి చెందడంలో, సమాజానికే ప్రత్యక్ష పాత్ర వుంటుందని ఇస్లాం విశ్వసిస్తుంది. ఈ కారణంగానే సమాజ సంస్కరణ కోసం, మంచిని అభివృద్ధి పర్చడం కోసం ఉన్నత విలువల స్థాపన కోసం, రాజ్యాధికార పగ్గాలు తన చేతిలోకి తీసుకోవడం తప్పనిసరి అని ఇస్లాం సూత్రీకరిస్తుంది. సామాజిక సంక్షేమాల లక్ష్యాలతో పాటుగా సమాజాన్ని సత్‌శీలమైనదిగా, చెడులను నిరోధించేదిగా, ప్రాపంచిక వ్యామోహాలకు లోనవ్వనిదిగా, సత్యమార్గంపై దృఢంగా నిలిచేదిగా తీర్చిదిద్దడం కూడా ఇస్లాం లక్ష్యంగా వుంటుంది.

మంచి స్థాపనలో సామాజిక వాతావరణపు ప్రభావాన్ని– సమాజ బాధ్యతను తెలియపర్చే వృత్తాంతాన్ని ప్రవక్త మహోపాధ్యాయులు ముహమ్మద్(స) ఇలా తెలియపర్చారు:

'ఒకానొక హంతకుడు తన పాపాలకు ప్రాయశ్చిత్తం (తౌబా) చేయదలిచి– అల్లాహ్ వైపుకు మరలాలని కోరుకున్నాడు. అప్పటి ఆ భూభాగంపై అందరికంటే అధికంగా ధార్మికజ్ఞానం గల ఒక పండితుని వద్దకు వెళ్ళి తన వృత్తాంతాన్ని వివరిస్తూ 'నేను వంద హత్యలు చేశాను. నేను అల్లాహ్ వైపుకు మరలాలనుకుంటున్నాను. అందుకు అవకాశం వుందా?' అని ప్రశ్నించాడు. అందుకు ఆ పండితుడు, 'తప్పనిసరిగా అవకాశం వుంది. నీకు – నీ తౌబాకు మధ్య అడ్డంకిగా ఏదీ వుండజాలదు.' ఫలానా భూభాగానికి వెళ్ళు అక్కడ 'నస్రా' (అల్లాహ్ సహాయకులు) అనే గ్రామం వుంది. నస్రాలోని ప్రజలు స్వర్గవాసుల ఆచరణ కలిగివుంటారు. ఆ గ్రామంలో ఎవరికీ పాపంచేసే అవకాశమే లేదు. ఈ గ్రామ సమాజంలో ఒక పాపి శ్వాస పీల్చుకోవడం కూడా కష్టంగా భావిస్తాడు. మరో గ్రామం పేరు 'కుఫ్రా'(అల్లాహ్ ధిక్కారుల గ్రామం) ఇక్కడి పౌరులు నరకవాసుల ఆచరణ కలిగివుంటారు. ఈగ్రామంలో పుణ్యాత్ముడు ఒక్క క్షణం కూడా వుండలేడు. కనుక నీవు 'నస్రా' గ్రామ పౌరసమాజంలో చేరిపో. అక్కడ నీవు నివసిస్తూ, అక్కడి ప్రజల ఆచరణను స్వీకరించి తదనుగుణంగా జీవించడం ప్రారంభించు. అప్పుడు నీ ప్రాయశ్చిత్తం (తౌబా) అంగీకరించబడటంలో ఏమాత్రం సందేహం లేదు.' (తిబ్రాని) పై హదీసును పోలిన కథనమే బుఖారి గ్రంథంలోనూ ఉల్లేఖించబడివుంది.

మానవ సహజ సకారాత్మక (Possitive) నైజ పరిరక్షణకు, అతని నకారాత్మక (Negaitive)ధిక్కార స్వభావ సంస్కరణకు - సమాజ పర్యవేక్షణ, పరిసరాల ప్రభావం తప్పనిసరి అవసర మని ఇస్లాం సిద్ధాంతీకరించింది.

పైన పేర్కొన్న అంశాలు, ఉదాహరణలు, వాటి పార్శ్వాలు, కోణాలు అన్నింటినీ దృష్టిలో వుంచుకొని, కృషికి పూనుకుంటే- ఒక పరిశుద్ధమైన నైతిక విలువలతో తొణికిసలాడే సమాజాన్ని ఉనికిలోకి తేగలమని దృఢంగా విశ్వసించవచ్చు. ఈ సమాజంలో మాత్రమే ప్రతి మనిషి సచ్ఛీలత సుగుణ విశేషాలతో, నైతిక ఉత్తమ ప్రమాణాలతో జీవించడానికి ఆస్కారం వుంటుంది.



# 6వ భాగం

# సమస్త మానవాళికి ఈ నైతికతలే అవసరం

- ముస్లిమేతరులతో వ్యవహార సరళి
- జాతికి, దేశానికి నైతికత అవసరం

# ముస్లిమేతరులతో వ్యవహారశైలి

ప్రతి ధర్మం తనదైన ప్రత్యేక జీవన విధానాన్ని, దాని తాలూకు ప్రత్యేక చిహ్నాలను కలిగివుంటుంది. ఈ ప్రత్యేకతల కారణంగానే అది ఇతర ధర్మాలకంటే భిన్నమైనదిగా వుంటుంది.

పై సూత్రానికి అనుగుణంగానే నిస్సందేహంగా ఇస్లాం తన అనుయాయుల కొరకు విధికావించబడిన ప్రత్యేక, నిర్ణీత ఆరాధనలు కలిగివుంది. అదే సమయంలో, ముస్లిమేతర సోదరులతో సంబంధంలేని, కేవలం ముస్లింలు మాత్రమే పరస్పరం పాటించవలసిన కొన్ని నిర్దేశిత విలువలు, నిబంధనలూ వున్నాయి.

అయితే నైతిక బోధనలు, ఆచరణల విషయంగా పై నియమం ఎంతమాత్రం వర్తించదుగాక వర్తించదు. ప్రతి ముస్లిం, తాను నివసిస్తున్న భూభాగంపై నివసించే ప్రజలందరితోనూ ఉత్తమ రీతిలో వ్యవహరించడం పట్ల బాధ్యుడు చేయబడ్డాడు. అంతేకాదు, ఒక ముస్లిం, తన చుట్టూవున్న ముస్లిమేతర సోదర దేశ వాసులందరితో సత్యసంధతను కలిగివుండటం తప్పనిసరి. అంతేకాదు- దాతృత్వం, వాగ్దాన పాలన, సత్ప్రవర్తన, క్షమ, పరస్పర సహకారం, హృదయ వైశాల్యం, నిజాయితీ వంటి ఉత్తమ గుణాత్మక ఆచరణలను ప్రతి ముస్లిం- మరో ముస్లింతో పాటుగా ప్రతి ముస్లిమేతర సోదరుని పట్ల ప్రదర్శించవలసి వుంటుంది.

దివ్యఖుర్ఆన్ ముస్లింలను ఉద్దేశించి- యూదులతోను, క్రైస్తవులతోను వివాదాలకు, విభేదాలకు, కలహాలకు కారణమయ్యే రీతిలో చర్చలు కొనసాగించరాదని హెచ్చరించింది. ఈ ఆదేశం ఈక్రింది విధంగా వుంది :

> **"గ్రంథ ప్రజలతో వాదించకు, ఉత్తమ రీతిలో తప్ప- అయితే వారిలోని దుర్మార్గులతో మాత్రంకాదు- వారితో ఇలా అను, 'మేము మా వద్దకు పంపబడిన దానినీ విశ్వసించాము, మీ వద్దకు పంపబడిన దానినే విశ్వసించాము. మా దేవుడూ, మీ దేవుడూ ఒక్కడే. మేము ఆయనకే విధేయులం."** ***(29: 46)***

ఇదేవిధంగా ప్రవక్త మూసా(అలై), ప్రవక్త ఈసా(అలై)ల అనుయాయులను సంబోధిస్తూ తన ఆశ్చర్యాన్ని ఇలా ప్రకటించింది; 'మీరు ముస్లింలతో వక్రమైన చర్చలు- సంవాదాలు చేయాలనుకుంటున్నారా?' ఈ వాక్యాలు ఇలా వున్నాయి.

**'ప్రవక్తా! వారితో ఇలా అను : అల్లాహ్ విషయంలో మీరు మాతో వాదులాడుతారా? వాస్తవానికి ఆయనే మాకూ ప్రభువు, మీకూ ప్రభువు. మా కర్మలు మాకు. మీ కర్మలు మీకు, మేమైతే మా దాస్యాన్ని కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకం చేసుకున్నాము.'** ***(ఖుర్ఆన్, 2: 139)***

దైవప్రవక్త ముహమ్మద్(స) జీవితంలో సంభవించిన ప్రసిద్ధ సంఘటనను చరిత్ర ఇలా రికార్డు చేసింది :'ప్రవక్త(స) ఒక యూదుని వద్ద రుణం తీసుకున్నారు. ఆ యూదుడు ఒక రోజున సమావేశంలో వుండగా తన అప్పు చెల్లించమని దురుసుగా 'ఓ అబ్దుల్ ముతల్లిబ్ వంశీయుడా! మీరు కావాలని అప్పు చెల్లించే విషయంలో తాత్సారం చేస్తారు' అని పలికాడు. దైవప్రవక్త ఔన్నత్యాన్ని భంగపరుస్తూ పలికిన ఈ పలుకులను ఉమర్(రజి) భరించలేకపోయారు. ఆ యూదునికి సభా మర్యాద నేర్పదలిచి సర్రున తన కరవాలాన్ని ఒర నుండి బయటికి తీశారు. వెంటనే మానవ మహోపాధ్యాయులు ప్రవక్త ముహమ్మద్(స), ఉమర్(రజి)ను వారిస్తూ 'ఈ యూదుడూ, నేను ఇరువురమూ ఉత్తమ వ్యవహార సరళికి పాత్రులమే. ఈ యూదునికి ఉత్తమ రీతిలో తన కోరికను వెలిబుచ్చే విధానాన్ని నేర్పండి. అదేవిధంగా, నాకు ఉత్తమ రీతిలో అప్పు చెల్లించవలసిందిగా తాకీదు చేయండి' అని పలికారు.

ఒక వ్యక్తి ఇస్లాం వ్యతిరేకి అయినా, పాపాత్ముడు, అవిశ్వాసి అయినా అతడితో న్యాయంగా వ్యవహరించమని ఇస్లాం ఆదేశించింది. దైవప్రవక్త(స) ఈ విషయంగా 'పీడితుని వేడుకోలు (ప్రార్థన) అంగీకరించబడుతుంది. ఒకవేళ అతడు పాపాత్ముడైతే దాని తాలూకు విపత్తు అతడి మీదికే వస్తుంది.' (అహ్మద్)

ఇస్లాం, తన అనుయాయులను– తమలో సైద్ధాంతికంగా, ధార్మికంగా వ్యతిరేకులైన వారిపట్ల ఎలాంటి చెడువర్తనకూడదని, వారితో సవ్యంగా, సమన్యాయంగా వ్యవహరించమని తాకీదు చేస్తుందనే విషయం పై ఆదేశాల, బోధనల ద్వారా స్పష్టమైంది. ప్రవక్త(స) ప్రత్యక్ష నేతృత్వంలో శిక్షణ పొందిన ఇబ్నె ఉమర్(రజి) తన ఇంటిలో ఎప్పుడు మేకను కోసినా, తన పొరుగువాడైన యూదునికి అందులో భాగం వెళ్ళిందా లేదా? అని అడిగి తెలుసుకునేవారు.

'పొరుగువాని హక్కుల నెరవేర్పు గురించి ప్రవక్త(స) ఇలా నుడివారు : 'దైవదూత జిబ్రయీల్(అలై) నాకు పొరుగువాని హక్కుల గురించి గట్టిగా తాకీదు

చేయసాగారు. చివరికి, వారసత్వపు సంపదలో కూడా పొరుగువానికి హక్కుదారునిగా చేస్తారా? అని నాకు అనిపించింది.' (బుఖారి)

ఒక ముస్లిం, తన బంధువులు ఇస్లాం వ్యతిరేకులైనప్పటికీ వారి బంధుత్వపు హక్కులు నెరవేర్చడంలో– వారితో ఉత్తమ రీతిలో వ్యవహరించడం పట్ల అలక్ష్యం ప్రదర్శించకూడదు. సత్యధర్మం ఇస్లాంను ఆచరించడమంటే, పొరుగువారు, బంధువుల హక్కును కొల్లగొట్టడం కాదు. తత్‌వ్యతిరేకంగా వారి హక్కులను నెరవేర్చాలి. దైవ ఆదేశం ఇలా వుంది :

**"ప్రపంచంలో వారిపట్ల సద్భావంతో మెలుగుతూ వుండు; కాని నా వైపునకు మరలిన వ్యక్తి మార్గాన్నే అనుసరించు. తర్వాత మీరందరూ నా వైపునకే మరల వలసి వుంది. అప్పుడు నేను మీకు తెలుపుతాను. మీరు ఎలాంటి పనులు చేస్తూ వుండేవారో"** ***(ఖుర్‌ఆన్, 31: 15)***

## జాతికి, దేశానికి నైతికత అవసరం

ఇప్పటివరకు వ్యక్తిగత శీల నిర్మాణంలో నైతిక విలువల పాత్ర గురించి, దాని ప్రాముఖ్యతల గురించి చర్చించడం జరిగింది. ఇప్పుడు, నైతిక విలువలు, సామూహిక నిర్మాణాలకు, జాతుల ఉత్థాన పతనాలకు, మనుగడలకు సభ్యతా, సంస్కృతులకు, నాగరికతల పురోభివృద్ధికి ఎలా దోహదపడతాయో– పటిష్టపరుస్తాయో తెలుసుకుందాం. ఒక సమాజంలోని పౌరులు అత్యుత్తమ నైతిక విలువలు కలిగివున్నట్లయితే– వాటి తాలూకు విశిష్టతలు, ప్రత్యేకతలు, గౌరవ మర్యాదలు ఆ జాతి మొత్తాన్ని ఉన్నత శిఖరాలకు చేరుస్తాయి. అలాకాక వారి నైతికత పతనమైతే దానితోపాటు వారి రాజ్యం, ప్రభుత్వం, అధికారాలు అన్నీ క్రమంగా అంతరించిపోతాయి. ఈ విషయంగా ఇస్లామీయ నానుడి ఇలా వుంటుంది.

'నైతిక విలువలు సజీవంగా వున్నంతవరకు జాతులు సజీవంగా ఉంటాయి. నైతిక విలువలు పతనమైతే ఆ జాతులూ నశించిపోతాయి.'

నైతిక విలువల ప్రాధాన్యతను విశదపరుస్తూ ప్రవక్త మహోపాధ్యాయుల(స) ఈ ప్రవచనం తేటతెల్లం చేస్తుంది. ప్రవక్త(స) తన జాతి ప్రజలను సంబోధిస్తూ : 'మీకు అరబ్బులపై నాయకత్వ వ్యవహారాలపై అదుపు (అనగా పాలనాపర అధికారం)

సమకూరి వున్నప్పటికీ, మీ నిజమైన అధికారం కేవలం మీ నైతిక పునాదులపై మాత్రమే నిలిచివుంటుంది' అని హెచ్చరించారు.

అనస్ బిన్ మాలిక్(రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త(శ్రీ- అన్సార్లు (మదీనా వాసులు), ముహాజిర్లు (మక్కావాసులు) ఇరువురినీ సంబోధిస్తూ ఇలా అన్నారు : 'ఖురేష్ తెగ నుంచి నాయకులు ఉద్భవిస్తారు. నేను మీపై అత్యధిక హక్కును కలిగివున్నట్లుగానే, వారు కూడా మీపై హక్కును కలిగివుంటారు. వారు తమ వ్యవహారాలలో కనికరం చూపమని వేడుకున్నప్పుడు, వారు కారుణ్యం చూపుతారు. తీర్పు చెప్పినప్పుడు న్యాయవంతంగా వ్యవహరిస్తారు. ఒప్పందాలు కుదుర్చుకున్నప్పుడు వాటిని నెరవేరుస్తారు. ఇలా చేయని వారిపై అల్లాహ్, ఆయన దూతలు, మానవులందరి శాపాలు విరుచుకుపడతాయి.' (తిబ్రాని)

ప్రపంచంలోని ఏ జాతి అయినా, దేశమైనా, ప్రభుత్వమైనా తెగ లేక వంశమైనా అది ఎంత ఉత్తమరీతిలో నైతిక విలువలను పాటిస్తుందో- తదనుగుణమైన ఆచరణను కలిగివుండి, ఉన్నత లక్ష్యాల సాధనకు కృషిచేస్తుందో- అదే స్థాయిలో గౌరవమర్యాదలను, ప్రాతినిధ్యాన్ని పొందుతుందని పై హదీసు స్పష్టం చేస్తుంది.

భూగోళంపైని ఏదైనా ప్రభుత్వం తన నొసటన ఇస్లాం, ఖుర్ఆన్‌ల లేబుల్ తగిలించుకొని వుండి- ఈ ప్రభుత్వం పట్ల దాని ప్రజలు సంతుష్టులు కానట్లయితే- ఆ ప్రభుత్వం, ప్రజల వ్యవహారాలను సమన్యాయ వ్యవస్థ ద్వారా పరిష్కరించనట్లయితే- అర్థించేవారిని కరుణించనట్లయితే- ఒప్పందాలను గౌరవించనట్లయితే- ఆ ప్రభుత్వం కేవలం నామమాత్రపు ఇస్లామీయ ప్రభుత్వంగా భావించవలసి వుంటుంది. ఇస్లామీయ మౌలిక విలువలకు అది ఎప్పుడో తిలోదకాలు ఇచ్చేసినట్లుగా తెలుసుకోవాలి. ఈ ప్రభుత్వంపై భూమి నలుమూలల నుండి, ఆకాశ బురుజుల నుండీ శాపనార్థాలు విరుచుకుపడుతున్నట్లుగా గ్రహించాలి.

హజ్రత్ హుసేన్(రజి) ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త(స) ఇలా నడివారు. 'అల్లాహ్ ఏదైనా జాతిపట్ల అనుగ్రహం చూపాలని తీర్మానించినట్లయితే, దానిని అదుపు చేసే కళ్ళాలను (పాలనా పగ్గాలను) వివేకవంతుల చేతికి అప్పగిస్తాడు. అలాగే సంపదను దాతృత్వ గుణం కలవారికి ప్రసాదిస్తాడు- అదేవిధంగా, అల్లాహ్ ఏదైనా

జాతిని పతనం చేయదలిస్తే దాని పాలనా పగ్గాలను ఆ జాతిలోని మూర్ఖులకు అప్ప గిస్తాడు. సంపదను పిసినారులకు ప్రసాదిస్తాడు' (అబూదావూద్)

ప్రసిద్ధ ఇస్లామీయ ఉద్యమకారులు, పండితులు ఇమామ్ ఇబ్నె తైమియా(రహ్మా) ఉల్లేఖనం ప్రకారం 'అల్లాహ్– న్యాయవంతమైన ప్రభుత్వం, అది ముస్లింలు కాని వారిదైనా దానిని నిలిపివుంచుతాడు. అదేవిధంగా దుర్మార్గపర ప్రభుత్వం, అది ముస్లింలది అయినా దానిని కూల్చివేస్తాడు.'

చివరి దైవగ్రంథం ఖుర్ఆన్, చివరి దైవప్రవక్త ముహమ్మద్(స) బోధనల వెలుగులో పరిశీలిస్తే; నైతిక విలువల స్థాపన, ఆచరణలే అసలైన సంపూర్ణ ధర్మంగా అర్థమవుతుంది. అంతేకాక ఈ నైతిక ఆచరణలే ఐహిక పురోగతికి కూడా సోపానాలని కూడా అర్థమవుతుంది. అంటే– సృష్టికర్త అల్లాహ్ దృష్టిలో ఏదైనా ఒక జాతి యొక్క గౌరవ మర్యాదలు క్షీణించినట్లయితే దాని ఫలితంగా ప్రజా బాహుళ్యపు హృదయాలలో జాతి గౌరవం అంతరించినట్లయితే–దానికి కారణం కేవలం, ఆ జాతి నైతిక విలువ లకు తిలోదకాలు ఇచ్చిన ఫలితంగానే ఇలా జరిగిందని గ్రహించాలి. ఉత్తమ గుణ గణాలను వదిలివేసిన దాని అనివార్య ఫలితంగానే ఈ పతనం సంభవించిందని గుర్తించాలి.



# 7 వ భాగం

# సత్యత

- సత్య ఉపదేశం
- అబద్ధం ఒక అభిశాపం
- పిల్లలను సత్య ప్రేమికులుగా మలచండి
- హాస్యానికైనా అబద్ధమాడరాదు
- పొగడ్తలో అతిశయోక్తికి పాల్పడరాదు
- వ్యాపారంలో- అబద్ధం, మోసాలకు పాల్పడకండి!
- అబద్ధపు సాక్ష్యం నుండి పరిరక్షించబడాలి
- వాగ్దాన భంగానికి దూరం కండి
- సత్యవాక్కు, సత్యమార్గంపై నడిపిస్తుంది

# సత్య ఉపదేశం

సృష్టికర్త అల్లాహ్, సమస్త విశ్వాన్ని 'ప్రేమ' పునాదిగా సృజించాడు. ఈ కారణం గానే ఆయన తన దాసులైన మానవులను సత్యం పునాదులపై తమ జీవన సౌధాలను నిర్మించుకోవలసిందిగా ఆదేశించాడు. తమ రోజువారీ వ్యవహారాలలో స్థైర్యం, సత్యం– సత్యసంధతలను తమ జీవితాలకు గుర్తులుగా చేసుకొమ్మని ఆదేశించాడు. మాట, ఆచరణల్లో కేవలం సత్యమైన విషయానికి మాత్రమే చోటు కల్పించమని తాకీదు చేశాడు.

ఎప్పుడైతే ప్రజల మనోమస్తిష్కాల నుండి పైన ఉదహరించిన మహోన్నత మైన, స్పష్టమైన భావన చెదిరిపోతుందో లేక మసకబారిపోతుందో అప్పుడు ప్రజల జీవితాలలో అనివార్యంగా అసత్యవిషయాలు, అభూత కల్పనలు, మూఢనమ్మకాలు, దురాచారాలు చోటుచేసుకుంటాయి. ప్రజల భావజాలాలపై ఆధిపత్యం చలాయించడం మొదలెడతాయి. ఫలితంగా ప్రజలు అత్యంత కఠిన మనస్కులుగా మారి పోతారు. రుజుమార్గం నుండి దూరంగా జరిగిపోతారు. ఏ సత్యతలు, వాస్తవాలు తమకు అవసరమో వాటినుండి దూరమైపోతారు.

ఈ కారణంగానే ఒక దైవ విధేయుని(ముస్లిం) సత్యత, సదాచరణలే అతని నైతికతకు మూలస్తంభంగా వుంటుంది. ప్రతి విషయంలోనూ సత్యానికి కట్టుబడి వుంటాడు. జీవిత సమస్యలన్నింటినీ వ్యవహారాలన్నింటిని సత్యపు కళ్ళజోడుతో గమనించేవానిగా మలచబడతాడు. ఇది ఒక ముస్లింకుతప్పనిసరి. సత్యం పునాదుల మీదనే ఒక ముస్లిం సమస్త వ్యవహారాలు పోతపోయబడాలి. ఇస్లామీయ సమాజ నిర్మాణం కూడా దురాచారాలు, మూఢవిశ్వాసాలకు వ్యతిరేకంగా యుద్ధం చేయడం ద్వారానే సాధ్యమవుతుందని గుర్తించాలి. ఆధార రహితమైన, కల్పితవిషయాలను నిర్ద్వంద్వంగా గంగలో విసిరివేయాలి. సమాజంలో సందేహాలకు, అనుమానాలకు ఏ మాత్రం అవకాశం ఇవ్వకూడదు. ఎందుకంటే; దృఢమైన, పటిష్టమైన సత్యాలు మాత్రమే వెలుగులోకి వచ్చేందుకు, సమాజంపై తమదైన ముద్రలు వేసేందుకు అర్హమైనవి. వివిధ విషయాల మధ్య అనుసంధానం కుదర్చడానికి ఈ సత్యతల సహకారమే అత్యంత అవసరమై ఉంటుంది.

దైవప్రవక్త(స) ఈ విషయంగా: 'ప్రజలారా! అనుమానం, సందేహాలకు దూరంగా

వుండండి. ఎందుకంటే అనుమానం అన్నింటికంటే పెద్ద అసత్యం' అని సెలవిచ్చారు. (బుఖారి)

మరో ప్రవచనంలో సందేహాస్పదమైన విషయాలను విడనాడండి. సందేహానికి ఏమాత్రం అవకాశం లేని విషయాలను స్వీకరించండి. సత్యం, సంతృప్తికి మార్గం వేస్తే- అబద్ధం సందేహాలకు దారితీస్తుంది' అని పలికారు. (తిర్మిజి)

తమ ఆలోచనలను కేవలం అనుమానాలు, సందేహాలు,మూఢ విశ్వాసాలు, దురాచారాలు, కల్పిత విషయాలతో నింపుకొని తద్వారా సమాజంలో కల్లోలాలకు కారకులైన జాతుల గురించి దివ్యఖుర్ఆన్ ఈక్రింది విధంగా నిరసన తెలిపింది.

**"యదార్థం ఏమిటంటే- వారు కేవలం ఊహలనూ, అనుమానాలనూ అనుసరిస్తున్నారు, మనోవాంఛలకు దాసులైపోయారు. వాస్తవానికి వారి ప్రభువు తరఫు నుండి వారి వద్దకు సన్మార్గం వచ్చేసింది.'** ***(ఖుర్ఆన్, 53: 23)***

**ఇంకా ... 'వాస్తవానికి ఈ విషయంలో వారివద్ద ఏటువంటి జ్ఞానమూ లేదు. వారు కేవలం అనుమానాలను అనుసరిస్తూ వున్నారు. సత్యం స్థానంలో అనుమానం ఏమాత్రం ఉపయోగపడదు కదా!** ***(ఖుర్ఆన్, 53: 28)***

ఇస్లాం కేవలం సత్యాన్ని మాత్రమే గౌరవిస్తుంది... ఆహ్వానిస్తుంది. ఈ కారణంగా అది అసత్యాన్ని తీవ్రంగా ఖండిస్తుంది. అసత్య ప్రచారాలను కఠినంగా వ్యతిరేకిస్తుంది. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయెషా (రజి) ఇలా ఉల్లేఖించారు:

'దైవ ప్రవక్త(స)కు అబద్ధం పట్ల ఉన్నంత అసహ్యం, మరే దురలవాటు పట్ల ఉండేది కాదు. ఏ వ్యక్తి అయినా అబద్ధమాడినట్లు తెలిస్తే, ఆ వ్యక్తి పశ్చాత్తాపపడి, దైవం వైపుకు, సత్యంవైపుకు తిరిగాడనే సమాచారం అందనంతవరకు అతడి పట్ల గౌరవభావనను ఆయన తన హృదయం నుండి తొలగించివేసేవారు కాదు. (అహ్మద్)

మరో ఉల్లేఖనం ఇలా తెలుపుతుంది : 'దైవప్రవక్త(స) అబద్ధం పట్ల ద్వేషం ప్రకటించేవారు. ఎవరైనా ఆయన వద్ద అబద్ధం పలికితే, ఆ అబద్ధం ఆయన హృదయాన్ని అమితంగా గాయపర్చేది. ఆ వ్యక్తి పశ్చాత్తాపం చెంది, అబద్ధాలను వదిలి వేయనంతవరకు, ఆ హృదయ గాయం ఆయనను కలవరపరుస్తూనే వుండేది'

(ఇబ్నె హిబ్బాన్)

మానవ మహోపకారి (స) ఈ అలవాటు ఆశ్చర్యకరమైనది కాదు. ప్రవక్త(స)కు పూర్వపు ప్రవక్తలు, ధార్మికవేత్తలు ఈ సదాచరణనే కొనసాగించారు. వారు తమ పరస్పర సంబంధాలతో, గుర్తింపులో, నైతికత– ఉత్తమ గుణాలనే ప్రాతిపదికగా స్వీకరించేవారు. ఒకవేళ ఏ వ్యక్తి శీలమైనా కళంకితమయినట్లు తెలిస్తే, అతడు ఆ సమాజం నుండి మానసికంగా వెలివేయబడేవాడు. తిరిగి పశ్చాత్తాపపడి శీలాన్ని సంస్కరించుకొని, అనైతికతకు దూరం కానంత వరకు అతడు గౌరవాభి మానాలకు, మర్యాదలకు యోగ్యుడయ్యేవాడు కాడు.

దైవప్రవక్త(స) నేతృత్వంలోని ముస్లిం సమాజ ప్రారంభ యుగంలో ముస్లిం సమాజం, తన సత్యసంధత, సహనశీలతల శక్తి, మనోవాంఛలపై అదుపు సంభాషణలో జాగరూకతల ద్వారా ప్రత్యేకంగా గుర్తించబడింది. అసత్యం, వాగ్దాన భంగం, అపనింద మోపడం, నిరాధార– అనవసర విషయాలపై వాదోపవాదాలు జరపడం లాంటి నికృష్ట చేష్టలు కాపట్యానికి (మునాఫిఖత్) నిదర్శనాలుగా, ధర్మం నుండి సంబంధం తెగిపోవడానికి గుర్తులుగా భావించబడేవి. అలాకాకుండా పై దుష్కార్యాలన్నీ అమలవుతూ ఉండీ తమను తాము ముస్లిం, ఇస్లాం లాంటి పదాలతో ముడి వేసుకొని వుంటే, వారిని ధార్మిక వ్యాపారులుగా అసత్యవాగ్దాన భంగ ధార్మికులుగా పేర్కొన వలసివుంటుంది.

## అబద్ధం ఒక అభిశాపం

'అబద్ధం' అనేది ఒక అబద్ధాలకోరుని అంతర్గత భ్రష్టత్వానికి వక్రతకు నిదర్శనంగా వుంటుంది. అబద్ధం కేవలం ఒక 'చెడు'కు మాత్రమే గుర్తుగా వుండదగిన దుర్గుణం. అబద్ధం ఒక వ్యక్తిని ప్రాణాంతక అవసరంలేకున్నా, బలవంతపెట్టే పరిస్థితులు లేకున్నా ఆ వ్యక్తిని పాపకార్యాల వైపుకు గుంజుకొని వెళుతుంది.

కొన్ని నైతిక చెడుగులు ఎటువంటివి అంటే; వాటికిలోనైన వ్యక్తికి ఒక సుదీర్ఘ కాలం చికిత్స అవసరమవుతుంది. ఉదాహరణకు 'భయం' అనే నైతిక వ్యాధికి గురైన వ్యక్తి ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేని పిరికితనానికి గురవుతాడు. అదే విధంగా 'దురాశ' అనే మరోనైతిక వ్యాధికి గురైన వ్యక్తి, అనివార్యంగా పిసినారి తనానికి గురైపోతాడు. ధర్మయుద్ధానికి బయలుదేరిన సైనికుల్లో కూడా కొంతమంది శరీరాలు భయంతో కంపిస్తూ, పాదాలు వణుకుతుంటాయి. మరికొందరు తమ

ప్రాణాలను తృణప్రాయంగా ఎంచి మృత్యుముఖంలోకి నవ్వుతూ ప్రవేశించే ధీరుల్లా వుంటారు. వీరిద్దరి మధ్య పోలిక సాధ్యంకాదు కదా! అదే సమయంలో పిసినారులు జకాత్ సొమ్మును చెల్లించే సమయంలో కలవరపడుతూ చేతులు వణుకుతూ చెల్లిస్తారు. కాని, దైవమార్గంలో లెక్కలేకుండా సంపదను ఖర్చుచేసేవారితో వీరిని ఏ స్థాయిలోనూ పోల్చలేము.

పిరికితనం, పిసినారితనం వల్ల ఎవరైనా త్యాగాలు చేయడం నుండి ప్రాణాల బలిదానం నుండి తమ్ముతాము రక్షించుకునే ప్రయత్నంచేస్తే- వారిని అవసరం మేరకు, వారి నైజం మేరకు క్షమించే అవకాశం వుంది. కాని, అబద్ధం పునాదుల పై జీవితాంతం ఇతరులను మోసపుచ్చుతూ తిరిగే వ్యక్తులు ఎలాంటి క్షమకు పాత్రులు కారు. దైవసందేశహరులు (స) ఈ విషయంగా :

'అవినీతి- అబద్ధం తప్ప మిగిలిన అన్నిరకాల చెడులూ (ఒక విశ్వాసిలో) వుండేందుకు అవకాశం వుంది' అని సెలవిచ్చారు. (అహ్మద్)

ప్రవక్త(స)తో ఒకరు ఇలా అడిగారు: 'ఓ ప్రవక్తా! ఏ విశ్వాసి అయినా పిరికి వాడయ్యేందుకు అవకాశం వుందా? అందుకు ప్రవక్త(స) 'అవును, వుంది' అని బదు లిచ్చారు. ఆ తర్వాత 'ఒక విశ్వాసి పిసినారి కాగలడా?' అని ప్రశ్నించగా అందుకు ప్రవక్త(స) 'అవును, కాగలడు' అని బదులిచ్చారు. ఆ తర్వాత 'ఒక విశ్వాసి అబద్ధీకుడు కాగలడా?' అని ప్రశ్నించగా దానికి మానవ మహోపకారి (స) 'లేదు- కాలేడు' అని బదులిచ్చారు. (మాలిక్)

పై ప్రవచనం వల్ల కొన్నిబలహీనతలు, కొంతమంది వ్యక్తుల్లో నిబిడీకృతమై వుండి, అవి క్రమంగా అభివృద్ధి చెందుతాయనీ- ఆ వ్యక్తులు కొంతకాలం తరువాత విధి అయిన ఆరాధనల నెరవేర్పులో లేదా తమ సంపదల నుండి అల్లాహ్ హక్కు- దైవదాసుల హక్కును తీయవలసి వచ్చినప్పుడు, అవి ఆ వ్యక్తిని వెనుకకు గుంజుతూ వుంటాయి అని స్పష్టమవుతుంది. అయితే, ఈ మాటల వల్ల పిసినారితనం, పిరికితనం పాపం ఎక్కువనీ, లేక క్షమకు అర్హమైనవనీ తలంచరాదు. ఎందుకంటే; ఈ బలహీనతలను పెరగనిస్తే అవి మనిషిని జకాత్‌ను చెల్లించనివానిగా చివరకు అతనిని అవిశ్వాసపు విల్లు వరకు చేరుస్తాయని తెలుసుకోవాలి.

ఒక అబద్ధాలకోరు ఎంతగా అసత్యాన్ని ప్రచారం చేస్తాడో తద్వారా సమాజంలో జరిగే నష్టాల పరిధి ఎంత విస్తృతంగా వుంటుందో – అదే లెక్కన అల్లాహ్ వద్ద అతడి పాపపు మోతాదు కూడా పెరిగిపోతూ వుంటుంది. ఒక అసత్యవాది అయిన పాత్రికేయుడు లేక రచయిత తన అసత్య ప్రమాణాలతో, వాదనలతో వేలాది మందిని మార్గభ్రష్టులుగా చేస్తాడు. ఒక అసత్యవాది అయిన రాజకీయ నాయకుడు ప్రజల ముందు అసత్య వాగ్దానాలను కుమ్మరించి తిమ్మిని బమ్మిగా నిరూపిస్తాడు. కొందరు తమ స్వార్థ ప్రయోజనాల కోసం గౌరవనీయులైన వ్యక్తులపై, శీలవంతులైన స్త్రీలపై అపనిందలు వేస్తూ దుష్ప్రచారాలు చేస్తూ తిరుగుతారు. చూడటానికి ఇవి చాలా సాధారణమైన తప్పులుగా కనిపించవచ్చు. కాని, ఇస్లాంలో ఇవి తీవ్రమైన నేరాలుగా పరిగణించబడతాయి. ఈ భయానకమైన నేరాలకు ఇస్లాం విధించేశిక్ష చాలా కఠినంగా వుంటుంది. ఒక వ్యక్తి వ్యక్తిత్వాన్ని హత్య చేయడం (Charector assasination) సాధారణ నేరం కాదు గదా!

ఒక అసత్యవాది, అసత్య ప్రచారకుని గురించి ప్రవక్త మహెూపాధ్యాయులు(స) ఈ విధంగా ఒక ఉదాహరణ తెలిపారు: 'నేను రాత్రి ఇరువురు వ్యక్తులను చూశాను. (దైవదూతలు) వారు నావద్దకు వచ్చి ఇలా పలికారు: 'తన నోటిని పెద్దగా తెరుస్తూ దవడలు కనిపించేలా మాట్లాడే వ్యక్తిని మీరుచూసినట్లయితే అతడిని అసత్యవాదిగా గ్రహించండి. అతడు ఒక అసత్యాన్ని సృష్టిస్తాడు. దానిని ప్రచారం చేస్తాడు. చివరకు అది ప్రపంచమంతా చర్చనీయాంశమవుతుంది. ఇతడు ప్రళయదినం వరకు ఇలా చేస్తూనే ఉంటాడు.' (ఫత్‌హుల్ బారి)

దేశ పాలకులు లేక ప్రజా నాయకులు తమ ప్రజలకు చేసే అసత్య వాగ్దానాలన్నీ ఈ కోవకు చెందినవే. పాలకుని అబద్ధం ప్రపంచపు నలుదిశలా ప్రకటించబడుతుంది కదా! ప్రవక్త(స) ఒక ఉల్లేఖనం ప్రకారం: 'ముగ్గురు వ్యక్తులు స్వర్గపు దరిదాపులకు కూడా ఎన్నటికీ చేరుకోలేరు. మొదటివాడు వ్యభిచారి అయిన వృద్ధుడు. రెండవవాడు అబద్ధమాడే కార్యనిర్వాహకుడు, ఇక మూడవవాడు అహంభావి, గర్విష్టి అయిన పేదవాడు.' (అల్ బజార్)

అల్లాహ్ ధర్మానికి వ్యతిరేకంగా అబద్ధాలు కల్పించి ప్రచారం చేయడం అత్యంత నీచమైన పాపంగా పరిగణించబడుతుంది. అల్లాహ్ ప్రవక్త(స)తో ఏమాత్రం సంబంధం కలిగివున్న వ్యక్తి అయినా, ఇటువంటి దుష్ట కార్యానికి పాల్పడడు. అబద్ధాలను

పలికేవారు, అపనిందలను ఇతరులపై మోపేవారి పర్యవసానంగా అత్యంత భయానకంగా వుంటుంది.

'ఒక సాధారణ వ్యక్తిపై అబద్ధాన్ని కల్పించినందుకు లభించే శిక్షకంటే నాపై (అనగా ప్రవక్త(స)పై) అబద్ధాన్ని కల్పించినందుకు వున్న శిక్ష చాలా చెడ్డదిగా అత్యంత అధికంగా వుంటుంది. ఏ వ్యక్తి అయితే ఉద్దేశపూర్వకంగా నాపై అబద్ధాన్ని కల్పించాడో- అతడు తన నివాసాన్ని నరకంలో ఏర్పర్చుకున్నాడు' అని ప్రవక్త (హెచ్చరించారు).

అబద్ధం, అపనిందల ఈ జీవితాలలో, అల్లాహ్ ధర్మానికి వ్యతిరేకంగా అజ్ఞానుల కల్పిత దురాచారాలు, మూఢాచారాలు అన్నీ చేరివుంటాయి. నిజానికి ఈ అజ్ఞానులు కల్పించిన అభూత కల్పనలకు (బిద్అత్‌లకు) ధర్మంలో ఎటువంటి స్థానమూ లేదు. వాటి స్థాయి కేవలం వినోదించదగినది మాత్రమే.

దైవప్రవక్త(స) తన అనుచర సమాజాన్ని ఇటువంటి అజ్ఞానపూరిత, కల్పిత దురాచారాల పట్ల స్వయంకల్పిత, పనికిరాని వ్యర్థ కార్యాల పట్ల అప్రమత్తంగా వుండమని హెచ్చరించారు. ఖుర్ఆన్, సున్నత్‌ను వదిలి ఇతర విధానాలను స్వీకరించడం గురించి తీవ్రంగా హెచ్చరించారు. 'నా అనుచర సమాజపు ఆఖరి దశలో మోస కారులు, అసత్యవాదులూ బయలుదేరుతారు. వారు, మీకు- మీరు మీ పూర్వీకులు ఎన్నడూ ఎరుగని విషయాలను తెలుపుతారు. వారిపట్ల మీరు అప్రమత్తులై వుండండి. వారు మిమ్మల్ని భ్రష్టత్వానికి గురిచేయడం గురించి జాగ్రత్త వహించండి. వారు మిమ్మల్ని ఉపద్రవంలో చిక్కుకునేలా చేయకూడదుగాక (ఆమీన్)" (ముస్లిం)

## పిల్లలను సత్య ప్రేమికులుగా మలచండి

పిల్లల హృదయాలలో సత్యం- దాని తాలూకు శుభలాభాలు, ప్రాముఖ్యతలు నాటుకుపోయేలా చేయాలని ఇస్లాం ఆజ్ఞాపిస్తుంది. ఫలితంగా ఈ పిల్లల ఎదుగుదల, వారి భవిష్యత్తు మొత్తంగా సత్యం ఒడిలో కొనసాగి యవ్వనదశకు చేరగలుగుతుంది. వారి సంభాషణలో, భావ వ్యక్తీకరణలో సత్యం మాత్రమే జాలువారాలని అభిలషిస్తుంది. ఈ విషయంగా అబ్దుల్లా బిన్ ఆమిర్(రజి) ఉల్లేఖనం ఈ క్రింది విధంగా వుంది:

'ఒకరోజున మా తల్లి గారు నన్ను పిలిచారు. ఆ సమయంలో ప్రవక్త(స) మా గృహంలో వున్నారు. అప్పుడు మా అమ్మగారు 'కుమారా! ఇటురా!! నేను నీకు ఒక

పదార్థం ఇస్తాను' అని అన్నారు. దానికి ప్రవక్త మహోపాధ్యాయులు 'మీరు, మీ అబ్బాయికి ఏమి ఇవ్వాలనుకుంటున్నారు?' అని ప్రశ్నించారు. అందుకు మా తల్లి గారు 'నేను ఖర్జూరం ఇవ్వాలని పిలిచాను' అని బదులిచ్చారు. అందుకు 'మీరు మీ అబ్బాయికి ఏమీ ఇవ్వక కేవలం మాటవరుసకు మాత్రమే చెప్పి వున్నట్లయితే మీ ఆచరణల పుస్తకంలో ఒక అబద్ధం లిఖించబడివుండేది' అని హెచ్చరించారు. (అబూదావూద్)

అబూ హురైరా(రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు. 'ఎవరైనా తమ పిల్లలను ఇలా రండి! మీకు ఏదైనా ఇస్తాను' అని పిలిచి ఏమీ ఇవ్వక పోతే అది ఒక అబద్ధంగా పరిగణించబడుతుంది.' (అహ్మద్)

మానవ మహోపకారి (స) తల్లిదండ్రులకు, తమ పిల్లల గురించి ఎటువంటి శిక్షణ ఇచ్చారో పై హదీసుల వల్ల తేటతెల్లం అవుతుంది. తమ సంతానానికి చిన్నప్పటి నుంచే సత్యం పట్ల ప్రేమ, అభిమానాలు కలిగేలా శిక్షణ ఇవ్వబడింది. తద్వారా, పిల్ల ల మనసులో సత్యానికి,సత్యసంధతకు, సత్యవచనానికి ప్రాధాన్యత కలిగేలా జాగ్రత్త తీసుకోబడింది. అబద్ధాన్ని అసహ్యించుకునేవారిలా తర్ఫీదు ఇవ్వబడింది. ఈ శిక్షణ ఇవ్వకపోతే అబద్ధాన్ని పాపకార్యంగా భావించే అవకాశం వుండదు. గృహస్థ జీవితం లోని ప్రతి చిన్న విషయంలోనూ సత్యమే పలకాలని తాకీదు చేయబడింది :

అస్మా బిన్తె యజీద్(రజి) ఉల్లేఖనం ప్రకారం :'ఒకసారి నేను ప్రవక్త(స)ను ఇలా ప్రశ్నించాను : 'ఓ దైవప్రవక్తా! ఒకవేళ ఏ మహిళ అయినా తన మనసులో ఒక వస్తువు పట్ల మక్కువ కలిగివుండీ, అక్కరలేదని బయటికి చెప్పినట్లయితే– అది కూడా అబద్ధంగా పరిగణించబడుతుందా?' అందుకు 'అబద్ధాన్ని అబద్ధంగానే వ్రాయడం జరుగుతుంది. చిన్న అబద్ధాన్ని చిన్న అబద్ధంగానే లిఖించబడుతుంది' అని విశద పర్చారు. అబద్ధం అబద్ధమే! హాస్యానికి అయినా అబద్ధమాడరాదని ఇస్లాం శిక్షణ ఇస్తుంది.

## హాస్యానికైనా అబద్ధమాడరాదు

ఇస్లామీయ ధర్మశాస్త్ర మహోపాధ్యాయులు (స) అబద్ధానికి సంబంధించిన అన్ని అంశాలను, అవకాశాలను స్పష్టపర్చడంతోపాటుగా దాన్ని చిన్న పెద్ద పర్యవ సానాలను కూడా తేటతెల్లం చేశారు.

మనిషి అప్పుడప్పుడూ ఎలాంటి అవసరం లేకున్నా, హాస్యానికి అబద్ధాలాడుతూ వుంటాడు. వినోదం కోసం నిరాధార విషయాలను, వార్తలను, సంఘటనలను, కొంత

తన స్వంత కల్పనలు జోడించి ప్రచారం చేయడం పెద్ద తప్పుగా భావించడు. కాని హృదయాలకు సంతృప్తి, సాంత్వన చేకూర్చడమే ప్రధాన విషయంగా భావించే ఇస్లాం ప్రతి విషయం ధర్మశాస్త్ర హద్దుల్లోనే వుండాలని కాంక్షిస్తుంది. ధర్మబద్ధ విషయపు పరిధి ఎప్పుడు కూడా, అధర్మ పరిధి కంటే ఎంతో విశాలంగా ఉన్నతంగా వుంటుంది. సత్య, అసత్యాల విషయానికి కూడా ఈ సూత్రమే వర్తిస్తుంది. దైవసందేశహరులు(స) హాస్యానికి కూడా అబద్ధమాడరాదని హెచ్చరిస్తూ 'ఒక వ్యక్తి ఇతర వ్యవహారాలన్నిం టిలో సత్యం పలుకుతూ వుండి సంవాదంలో హాస్యమాడేందుకు అబద్ధపు సహకారాన్ని తీసుకున్నట్లయితే అతనికి వినాశనం తప్పదు' (తిర్మిజి) అని హెచ్చరించారు. మరో ఉల్లేఖనంలో 'ఎవరైతే హాస్యానికి కూడా అబద్ధం పలకడో- ఆ వ్యక్తికి స్వర్గపు వనాలలోని మధ్యభాగంలో ఉత్తమ స్థాయి గృహం నిర్మించే హామిని నేను ఇస్తున్నాను' (బైహఖి). పై హదీసును పోలిన మరో హదీసును మస్నద్ అహ్మద్ గ్రంథంలోనూ పొందు పర్చబడింది. ఈ హదీసులు అబద్ధపు పాపతనం యొక్క తీవ్రతను తెలియపరు స్తున్నాయి.

ప్రజలు తమ రోజువారీ జీవితంలో ఇతరులను నవ్వించేందుకు తాము నవ్వు కునేందుకు అబద్ధాలు పలకడం, తమ నాలుకను స్వేచ్ఛగా ఉపయోగించడం నేడు జరుగుతున్నదే. కేవలం తమ మానసిక ఉల్లాసానికై మిత్రులు, శత్రువులు అందించిన సమాచారాన్ని ఎగతాళిగా, వినోదంగా ప్రచారం చేయడం తప్పని, పాపమని చాలా మందికి తెలియదు. కాని, ఈ వినోద అబద్ధ ప్రచారాలే మనుషుల మధ్య క్రోధానికి, కుట్రలకు అపార్థాలకు శతృత్వాలకు కారకాలవుతాయని తెలుసుకోవాలి. వాటి నుండి పరిరక్షించబడాలి.

## పొగడ్తలో అతిశయోక్తికి పాల్పడరాదు

ఏ వ్యక్తినైనా ఒక ముస్లిం ప్రశంసించాలని భావిస్తే అతిశయోక్తికి లోను కాకుండా కేవలం తనకు తెలిసిన మేరకు మాత్రమే అతనిని ప్రశంసించాలి. ఆ వ్యక్తిలోని సామర్థ్యాలను విశేషంగా పొగడకూడదు. నిజానికి ఆ వ్యక్తిలో ఆ సామర్థ్యాలు వుండవచ్చు కూడా. ఎందుకంటే అతిగా ప్రశంసించడం, ప్రశంస హద్దులను అతిక్రమించడం ఇస్లాంలో 'అబద్ధం' మరోరూపంగా భావించబడుతుంది. ఈ కారణంగానే ఇస్లాం అతి పొగడ్త కూడదని వారించింది.

ఒక సందర్భంలో తనను స్తుతిస్తూ వున్న వ్యక్తిని వారిస్తూ దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: "క్రైస్తవులు ప్రవక్త ఈసా(అలై) విషయంలో అతిశయోక్తికి పాల్పడి నట్లుగా, మీరు నా విషయంలో అతిశయోక్తికి పాల్పడకండి. నేను కేవలం అల్లాహ్ దాసుడిని మాత్రమే. నా గురించి ఈయన అల్లాహ్ దాసుడు, ఈయన అల్లాహ్ సందేశ హరుడు' అని మాత్రమే పలకండి. (రజీన్ గ్రంథం)

నాయకుల అడుగులకు మడుగులు ఒత్తుతూ, వారిని పొగడ్తలతో పరవశింప జేస్తూ వారి దయాభిక్షను ఆశిస్తూ తిరిగే కాకారాయుళ్ళ బృందాలను మనం రోజూ చూస్తూనేవుంటాం. ప్రకటనల్లో తమ నాయకులను పొగుడ్తూ పెద్దపెద్ద కవితా గానా లను లిఖిస్తూ వుంటారు. ఇదే జీవిత ఏకైక లక్ష్యంగా జీవిస్తూ వుంటారు. వీరు తమ పొగడ్తలలో రాతిని పర్వతంగా చిత్రీకరిస్తారు. అనామకులను, దుష్టులను సుప్రసి ద్ధులుగా కీర్తిస్తూ వుంటారు. దుర్మార్గ పాలకుడిని న్యాయ పరిరక్షకునిగా, పిరికివాడిని ధైర్యశాలిగా భట్రాజు పొగడ్తలు చేస్తారు. తద్వారా తమ ప్రాపంచిక ప్రయోజనాలను నెరవేర్చుకుంటూ పరాన్న భుక్కుల్లా జీవిస్తారు.

అతిశయపు పొగడ్త, కీర్తనలు 'అబద్ధం' నీచమైన స్వరూపాలని దైవప్రవక్త(స) సెలవిచ్చారు. ఇటువంటి అబద్ధాల వందిమాగదులను తమ దుష్ట వైఖరిని విడనాడనంతవరకు వీరిని నిరసిస్తూ వుండమని, వారి అబద్ధాలను బట్టబయలు చేస్తూ వుండమని ప్రవక్త(స) తాకీదు చేశారు.

'అబూ హురైరా(రజి) ఉల్లేఖనం ప్రకారం 'ప్రశంసించే విషయంలో అతిశ యోక్తికి పాల్పడేవారి ముఖంపై పిడికెడు మట్టి విసిరికొట్టమని' దైవప్రవక్త(స) ఆదేశించారు.' (తిర్మిజి)

పొగడ్తల ద్వారా తమ స్వార్థ ప్రయోజనాలను నెరవేర్చుకోవడానికి అలవాటు పడిన కాకారాయుళ్ళ గురించి పై హదీసు హెచ్చరించింది. అయితే ఎవరైనా, ఏదైనా ఒక మంచి పనిని కేవలం అల్లాహ్ అభీష్టం కోసం చేస్తే దాని పట్ల ప్రజల్లో ఉత్సాహాన్ని, ఆసక్తిని పెంచడానికి హద్దులకు లోబడి ఆ వ్యక్తిని ప్రశంసిస్తే అది తప్పుకాదు. పై హదీసు ఈ విషయానికి వర్తించదు.

ప్రశంస వ్యక్తిలో అహంకారం, గర్వం కలుగజేయకూడని విధంగా వుండాలి. ఏ హద్దులను అతిక్రమిస్తే ప్రశంస కాస్తా అతిశయోక్తిగా మారిపోతుందో – ఆ హద్దుల

వద్ద ప్రశంసను ఆపివేయాలి. ఈ విషయంగా మానవాళికి ప్రవక్త మహోపాధ్యాయులు ఈ క్రింది విధంగా మార్గదర్శకత్వం అందించారు. ఈ హదీసును హజ్రత్ అబూబక్ర్(రజి) ఉల్లేఖించారు :

(ఒక సందర్భంలో) ఒక వ్యక్తి, దైవప్రవక్త సమక్షంలో మరో వ్యక్తిని అతిగా పొగిడాడు. అప్పుడు దైవప్రవక్త(స) 'నీ ప్రశంస పాడుగాను, నీవు, నీ సహచరుడిని వాస్తవానికి కించపర్చావు' అని నిరసించారు. ఆ తరువాత ఇలా పలికారు 'ఏ వ్యక్తి అయినా తన తోటి సోదరుడిని తప్పనిసరిగా ప్రశంసించే సందర్భంలో - ఆ ప్రశంసించే విషయంలో పూర్తి అవగాహన కలిగివుండాలి. నేను ఫలానా వ్యక్తి విషయంగా... ఈ విధంగా భావిస్తున్నాను. అల్లాహ్ ఆ వ్యక్తికి నిజమైన పర్యవేక్షకుడు. ఏ వ్యక్తీ స్వచ్ఛమైనవాడు, పాపరహితుడు కాజాలడు. అల్లాహ్ మాత్రమే పరమ పవిత్రుడు. నేను ఈ వ్యక్తిని ఫలానా ప్రత్యేకత, నిష్టతలు కలిగిన వ్యక్తిగా భావిస్తున్నాను.' (బుఖారి)

## వ్యాపారంలో- అబద్ధం మోసాలకు పాల్పడకండి

సాధారణంగా వ్యాపారులైన మహాశయులు తమ వస్తువుల ధరల విషయంలో, నాణ్యత విషయంలో, కొనుగోలుదార్లతో అబద్ధాలు వల్లెవేస్తూ వుంటారు. నేటి మన సమాజం ఈ దురాచారంపై ఆధారపడే వ్యాపారం చేస్తుంది. దుకాణదారుడు తన సరుకును అధిక ధరకు అమ్మాలని కోరుకుంటాడు. అదే సమయంలో కొనుగోలుదారుడు దానిని వీలైతే ఉచితంగా పొందాలని ఆశపడుతూ వుంటాడు. ఈ ఇచ్చిపుచ్చుకునే వ్యాపార వ్యవస్థను మొత్తంగా పెట్టుబడి లేక సంపద నియంత్రిస్తూ వుంటుంది. ఇస్లాం మోసంపై, అబద్ధంపై ఆధారపడిన వ్యాపార, వాణిజ్య విధానాన్ని నిరసిస్తుంది.. ద్వేషిస్తుంది... కడకు నిషేధించి వేస్తుంది. మానవ మహోపాధ్యాయులు ముహమ్మద్(స) ఇటువంటి మోసపూరిత లావాదేవీల వ్యాపారాన్ని నిరసిస్తూ ఇలా పేర్కొన్నారు :

'అమ్మకం దారుడూ, కొనుగోలుదారుడు ఉభయులూ సత్యంపై నిలకగా వుండాలి. వారు పరస్పరం తమ వస్తువులలోని లోపాలను ఒకరికొకరు తెలుపుకోవాలి. ఈ విధమైన వ్యాపారంలో అల్లాహ్ శుభాలను కురిపిస్తాడు. అలాకాక వారు అబద్ధంతో వస్తువులలోని దోషాలను దాచివేసి వ్యాపారం చేస్తే అప్పటికప్పుడు వారికి కొంత లాభం చేకూరవచ్చు. కాని, వ్యాపారం నుండి శుభం తొలగించివేయబడుతుంది.'

మరోచోట ప్రవక్త(స) 'అబద్ధాలపై మోసాలపై ఆధారపడి జరిపే వ్యాపారం

నుండి శుభాలు తొలగించివేయబడుతాయి. అబద్ధంపై ఆధారపడిన ప్రమాణాలతో వస్తువు అయితే అమ్మబడుతుంది, కాని, అందునుంచి శుభం తొలగించివేయబడు తుంది' అని సెలవిచ్చారు. (అహ్మద్)

సాధారణంగా కొనుగోలుదారునికి, తాను కొనుగోలు చేస్తున్న వస్తువు వాస్తవ విలువ గురించి పెద్దగా పరిజ్ఞానం వుండదు. అతను అమ్మకం దారుని మాట మీదనే ఆధారపడతాడు. కనుక కేవలం కొన్ని డబ్బుల కోసం లేక రెట్టింపు లాభం కోసం, వస్తువులోని లోపాలను కప్పిపుచ్చడం, తద్వారా వినియోగదారుడిని మోసపుచ్చడం క్షంతవ్యం కాదు.

ప్రవక్త మహనీయులు(స) ఇలా సెలవిచ్చారు : 'వాస్తవానికి మీరు ఒక వ్యక్తితో అబద్ధమాడుతూ, అతనిని మోసపుచ్చుతూ అతడు ఆ అబద్ధాన్ని నిజమని నమ్మేలా చేస్తూ వున్నట్లయితే అంతకంటే మించిన అవినీతి మరొకటి వుండదు.' (బుఖారి)

మరో ఉల్లేఖనంలో 'ఒక వస్తువులోని లోపాన్ని దాచిపెట్టి దానిని అమ్మడం ఒక ముస్లిం వ్యాపారికి ధర్మసమ్మతంకాదు. అతనిపై ఈ వ్యాపారం నిషేధించబడింది' అని ప్రవక్త(స) సెలవిచ్చారు. (బుఖారి)

ఇబ్నె అబీఅద్ని(రజి) ఉల్లేఖనం ప్రకారం ఒక వ్యక్తి బజారులో తన దుకాణాన్ని తెరిచి ముస్లింలను ఆకట్టుకునేందుకు 'నేను ఎవరూ అందించలేని ఉత్తమ సరుకును అందజేస్తున్నానని ప్రమాణం చేస్తున్నాను' అని ప్రకటించాడు. ఆ సందర్భంలో ఈ క్రింది ఖుర్ఆన్ వాక్యాలు అవతరించాయి.

> **'ఇక ఎవరు అల్లాహ్‌కు చేసిన వాగ్దానాన్ని, తమ ప్రమాణాలను స్వల్పమైన వెలకు విక్రయిస్తారో– వారికి పరలోకంలో ఏ భాగమూ లేదు. ప్రళయం రోజున అల్లాహ్ వారిని పలకరించడు. వారివైపు చూడడు. వారిని పరిశుద్ధులుగానూ చేయడు. పైగా వారికి అత్యంత బాధాకరమైన శిక్ష పడుతుంది.'** ***(ఖుర్ఆన్, 3: 77)***

సాక్ష్యంలో సత్యత లేకపోవడం ఇస్లాంలో తీవ్రమైన అబద్ధంగా పరిగణించ బడుతుంది. ఒక ముస్లిం సాక్షిగా నిలిచినప్పుడు ఏ మాత్రం సంకోచించకుండా సత్యాన్నే పలకాలి. దానిద్వారా తనకు అత్యంత ప్రియమైన వ్యక్తికి నష్టం కలుగుతున్నా సరే. ఏ విధమైన రక్తసంబంధం కూడా అతనిని తన సత్యమార్గం నుంచి మరల్చజాలదు. ఏ విధమైన భయం, దురాశలు అతని సత్య స్థిరత్వపు కాళ్ళను వణికించజాలవు.

చట్టసభల అభ్యర్థులను, ఇతర పాలనాపర హోదాలు అభ్యర్థుల ఎంపిక కూడా ఒకవిధమైన సాక్ష్యంగానే భావించబడుతుంది. అవినీతిపరుడు, బాధ్యతారహితుడు అయిన వ్యక్తిని ఎన్నుకోవడం కూడా అబద్ధపు సాక్ష్యంగా పరిగణించబడుతుంది. ఈ విధంగా ఎన్నికైన వ్యక్తి సమన్యాయ వ్యవస్థకు, సామాజిక న్యాయానికి తూట్లు పొడిచివేస్తాడు. ఈ విషయంగా విశ్వప్రభువు అల్లాహ్ ఆదేశం ఇలా వుంది :

**'విశ్వసించిన ప్రజలారా! న్యాయధ్వజవాహకులుగా నిలబడండి, అల్లాహ్ కొరకు సాక్షులుగా ఉండండి. మీ న్యాయం, మీ సాక్ష్యం, మీకూ, మీ తల్లిదండ్రులకూ, మీ బంధువులకూ ఎంత హాని కలిగించినా సరే. కక్షిదారులు భాగ్యవంతులైనా, నిరుపేదలయినా, అల్లాహ్‌వారి శ్రేయస్సును మీకంటే ఎక్కువగా కాంక్షిస్తాడు. కనుక మీ మనో వాంఛలను అనుసరిస్తూ, న్యాయం నుండి వైదొలగకండి. మీరుగనక సాక్ష్యాన్ని వక్రీకరిస్తే, న్యాయాన్ని దాటవేస్తే, బాగా తెలుసుకోండి, మీరు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు.'** ***(ఖుర్‌ఆన్, 4: 135)***

మొదటి ఖలీఫా అబూబక్ర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త ముహమ్మద్(స) ఇలా సెలవిచ్చారు : నేను మీకు అతిపెద్ద పాపాల గురించి తెలుపనా? అని ప్రవక్త(స) మూడుసార్లు ప్రశ్నించారు. మేము దానికి తప్పనిసరిగా సెలవివ్వండి ప్రవక్తా! అని బదులు పలికాము. అప్పుడు ప్రవక్త(స) వారు... "అల్లాహ్‌కు సాటి కల్పించడం, తల్లిదండ్రుల పట్ల అవిధేయత చూపడం, అన్యాయంగా హత్య చేయడం, అంటూ... ఆసరాగా తన వీపును ఆనించివున్న వారు ఒక్కసారిగా నిటారుగా కూర్చొని 'అబద్ధం చెప్పడం, అబద్ధపు సాక్ష్యం పలకడం' అని చెప్పి ఈ విషయాన్నే మాటిమాటికీ పలక సాగారు. ప్రవక్త(స) ఇక మౌనం వహిస్తే బాగుండు' అని మేము లోలోన భావిం చాము.'

మోసం, ద్రోహంల లాగానే అబద్ధం కూడా అదే జాబితాకు చెందినదే. మనిషిని అంధకారపు లోతుల్లోకి ఈడ్చుకొని వెళ్ళేది. సత్యాన్ని మరుగుపర్చడం, అసత్యాన్ని నిరూపించడమే వీటి లక్ష్యంగా వుంటుంది. ఈ అలవాటు ప్రత్యేక పరిస్థితుల్లో కొందరు వ్యక్తులను నష్టపర్చడంతోపాటు మొత్తం సమాజాన్ని జాతిని కడకు దేశం మొత్తాన్ని నష్టపు ప్రమాదాల అంచులకు చేర్చుతుంది.

ఈ కారణంగానే మానవ మహోపకారి ముహమ్మద్(స) ఈ చెడు నుండి దూరంగా ఉండాలనీ, తమ్ముతాము ఈ చెడు నుండి రక్షించుకునేందుకు తీవ్ర కృషి

చేయాలని కఠినంగా హెచ్చరించారు. అనుచరుల హృదయాలలో ఈ కఠిన హెచ్చరిక ద్వారా అబద్ధం పట్ల అసత్యాన్ని జనింపజేసే ప్రయత్నం చేశారు.

## వాగ్దాన భంగానికి దూరం కండి!

వస్తు ఉత్పత్తిదారులు, వ్యాపారులు, తమ వాగ్దానాల పట్ల శ్రద్ధ వహించాలి. వాగ్దాన పాలన పట్ల నిష్ఠాగరిష్టమైన నిలకడ కలిగివుండాలి. నేటి కాలంలో ముస్లింలలోని మెజారిటీ వాగ్దాన భంగానికి, హద్దుల అతిక్రమణకు పాల్పడుతూ వుండటం కడు బాధాకర విషయం. నిజానికి ఇస్లాం వాగ్దాన భంగ గుణాన్ని అబద్ధపు సాక్ష్యాన్ని– కపటత్వం, ద్వంద్వ స్వభావానికి నిదర్శనంగా పేర్కొంది.

చివరి దైవప్రవక్త(స) పలికేమాట పవిత్రంగా వుండాలనీ, వినేమాట గౌరవనీయమైనదై వుండాలని సెలవిచ్చేవారు. ప్రవక్త(స)వారు ప్రవక్త పదవిపై అధిరోహించక మునుపు నుండే మంచితనానికి మారుపేరుగా, నైతికవిలువలకు కాణాచిగా, ధైర్యానికి మగధీరునిగా, సుగుణాల రాశిగా వుండేవారు.

అబ్దుల్లా బిన్ అబీహమా (రజి) ఈవిధంగా ఉల్లేఖించారు: 'నేను ప్రవక్త(స) వారితో దైవదౌత్యానికి ముందు ఒక వ్యాపార ఒప్పందం చేసుకొని వున్నాను. ఆ వ్యాపార సరుకు కొంత అమ్ముడుపోక మిగిలివుండింది. నేను ఆ వస్తువును ఫలానా చోట అందిస్తానని చెప్పి దానిని మరిచిపోయాను. మూడురోజుల తరువాత ఆ విషయం నాకు గుర్తుకువచ్చి నిర్దేశిత స్థలానికి చేరుకున్నాను. అక్కడ దైవప్రవక్త(స) విచ్చేసి వుండటాన్ని చూశాను. ఆయన(స) నాతో కేవలం ఈ మాటలు పలికారు 'ఓ యువకుడా! నీవు నన్ను చాలా ఇబ్బందికి గురిచేశావు సుమా! నేను మూడు రోజులుగా నీ కొరకు వేచిచూస్తూ వున్నాను.' (అబూదావూద్)

జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) ఉల్లేఖనం ప్రకారం : ప్రవక్త(స) బహ్రైన్ నుండి వచ్చిన కానుకల నుండి నాకు కొంత భాగం అందజేస్తానని వాగ్దానం చేశారు. కానీ, ఆ వాగ్దానాన్ని పూర్తి చేయకమునుపే ఆయన పరమపదించారు. ఆ సంబంధిత సంపద మొదటి ఖలీఫా అబూబక్ర్(రజి) వద్దకు చేరింది. ఆయన(రజి) 'దైవప్రవక్త(స) ఎవరికైతే వాగ్దానం చేసివున్నారో లేదా ఎవరికైతే ప్రవక్త(స) రుణపడి వున్నారో వారు నా వద్దకు వచ్చి వారి వాగ్దానపు సొమ్మును వసూలు చేసుకోగలరు' అని ప్రజల్లో దండోరా వేయించారు.

వాగ్దాన పాలనకు ఎంతటి ప్రాముఖ్యత, విలువ ఉన్నదో పై సంఘటన రుజువు చేస్తుంది. వాగ్దాన భంగం వల్ల, అబద్ధపు వాగ్దానాల వల్ల- కష్టం, నష్టం, సమయం వృధా అవుతాయి. ప్రజాప్రయోజనాలు తీవ్రంగా నష్టపడుతాయి. ఇస్లాం వాగ్దాన పాలనను అత్యంత ప్రశంసనీయమైన ఆచరణగా కొనియాడింది. ఈ సదాచరణను దైవదాత్యపు ఘనతల్లో ఒకటిగా పేర్కొనబడింది.

**'ఈ గ్రంథంలో ఇస్మాయిల్‌ను గురించి ప్రస్తావించు. అతను వాగ్దాన పాలకుడు. సందేశహరుడైన ప్రవక్త. అతను తన ఇంటివారిని నమాజ్, జకాత్‌లను పాటించమని ఆజ్ఞాపించేవాడు. తన ప్రభువుకు ప్రీతిపాత్రుడు.'**

***(ఖుర్ఆన్, 19: 54,55)***

పై వాక్యంలో వాగ్దాన పాలనలోని సుగుణం, దాని ఉత్తమత్వం వెల్లివిరుస్తుంది. ప్రవక్త ఇస్మాయిల్(అ)తో ఆయన తండ్రి ప్రవక్త ఇబ్రాహీం(అలై) 'బాబూ నేను నిన్ను జిబహ్ చేస్తున్నట్లుగా కలగన్నాను. మరి నీ అభిప్రాయం ఏమిటి?' అని ప్రశ్నించారు. అందుకు ఇస్మాయిల్(అలై) 'ఇన్షాఅల్లాహ్ మీరు నన్ను సహనశీలునిగా చూస్తారు' అని చేసిన వాగ్దానాన్ని నిజం చేస్తూ తన ప్రాణాలను బలిఇవ్వడానికి సిద్ధపడ్డారు.

మనిషి, తన వల్ల తప్పు జరిగినప్పుడు, దానిద్వారా నష్టం జరుగుతుందని భావించినప్పుడు, అబద్ధాల ఆసరాను పొందడం ద్వారా ఆ నష్టంనుండి తప్పించుకోవాలని అనుకుంటాడు. ఇది కేవలం అమాయకత్వం మాత్రమే. ఒక తప్పు నుండి తప్పించుకోవడానికి మరో తప్పు చేయడం ద్వారా అప్రతిష్టపాలు కావడం తప్ప మరేమీ కాదు. నిజాయితీగా మనిషి ఆ తప్పును అంగీకరించాలి. ఆ తప్పు పట్ల పశ్చాత్తాపం ప్రకటించాలి. ఈ చర్య ద్వారా మాత్రమే మనిషి తప్పుల పర్యవసానాల నుండి రక్షించబడటంతోపాటు క్షమించబడేందుకు అర్హుడు అవుతాడు.

సత్యాన్ని పలికేందుకు ఒక ముస్లిం ఎన్నడూ భయపడకూడదు. ధైర్యం సత్యం పలికేందుకే ప్రయత్నించాలి. అబద్ధపు వల నుండి తప్పింపబడేందుకు కృషి చేయాలని దైవప్రవక్త(స) ఇలా నుడివారు :

'సత్యసంధతను స్వీకరించండి' అందులో మీకు నష్టం గోచరిస్తున్నా సరే. ఎందుకంటే ఈ నష్టంలోనే మీ విముక్తి (సాఫల్యం) దాగివుంది.' (అబీ అద్దున్‌యా)

మరో ప్రవచనంలో ఇలా చెప్పబడింది. 'దాసుడు అబద్ధమాడినప్పుడు అతని

నోటి నుండి వెలువడే దుర్గంధపు తీవ్రత నుండి దైవదూతలు దూరంగా వెళ్ళిపోతారు.' (తిర్మిజి)

## సత్యవాక్కు- సత్యమార్గంలో నడిపిస్తుంది

మనిషి తన మాటల్లో సత్యసంధుడైతే– దాని తప్పనిసరి పర్యవసానంగా అతడి ఆచరణల్లో సత్యం, పవిత్రత, పరిస్థితుల్లో సానుకూలతలు, సాఫల్యాలు జనిస్తాయి. సత్యమార్గాన్ని స్వీకరించిన దాని సహజ ఫలితంగా ఈ సత్యకాంతి అతడి మనోమస్తిష్కాలను విశేషంగా ప్రభావితం చేస్తుంది. అతనిలోని అజ్ఞానపు అంధకారాన్ని క్రమంగా తొలగించివేస్తుంది.

**"విశ్వాసులారా! అల్లాహ్‌కు భయపడండి, రుజువాక్కును పలకండి. అప్పుడు అల్లాహ్ మీ కర్మలను చక్కబరుస్తాడు. మీ తప్పులను మన్నిస్తాడు. అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయత చూపేవాడు గొప్ప సాఫల్యం పొందుతాడు."**

***(ఖుర్ఆన్,33: 70, 71)***

సత్యం ఒక్కటే సందేహాలకు తావు లేనిదై వుంటుంది. దోషానికి చోటు కల్పించదు. సత్ సంకల్పం, సదాచరణలు జతగా వుండి వక్రతలేని ఆచరణకు మార్గాలు తెరుస్తుంది. ఏ విషయానికి మూలం 'సత్యం' అయివుంటుందో అది దోషరహితంగా వుంటుంది. ప్రవక్త(స) సహచరుల సందేశవ్యాప్తి, దానికై వారు చేసిన కృషి అంతా సత్యం పునాదులపైనే జరిగింది. వారు సత్య ధ్వజవాహకులై సత్యంపై దృఢంగా నిలిచారు. సత్యసంధత అనే ఖజానాను భద్రపర్చుకున్నారు. తమ లక్ష్యసాధనలో ముందుకు, మునుముందుకే దూసుకుపోయారు. విజయ శిఖరాలకు చేరుకున్నారు. అలా లేనివారు మార్గమధ్యంలోనే చతికిలబడిపోయారు. లేదా లక్ష్యానికి దూరమైపోయారు. ఎంతటి అందమైన, విప్లవకరమైన నినాదాలైనా సత్యసంధత లేనట్లయితే అవి కేవలం వ్యర్థ ప్రేలాపనల్లా మిగిలిపోతాయి. వాటివల్ల ఎటువంటి ప్రయోజనమూ వుండదు.

దైవ సందేశహరులు(స) ఇలా సెలవిచ్చారు : 'సత్యాన్ని స్వీకరించండి. సత్యం పుణ్యప్రదమైన మార్గాన్ని చూపుతుంది. పుణ్యం స్వర్గలోకపు దారిచూపుతుంది. ఒక వ్యక్తి నిత్యం సత్యం పలుకుతూ వుండి, సత్యాన్ని స్వీకరిస్తూ వుంటాడు. అతడు అల్లాహ్ వద్ద 'సత్యసంధుడు' అని రాయబడతాడు. అబద్ధం నుండి దూరంగా తొలగిపొండి. అబద్ధం

పాపం వైపుకు దారిచూపుతుంది. పాపం నరక కూపంలో పడవేస్తుంది. అల్లాహ్ వద్ద అతడు 'అబద్ధీకుడు' (కజ్జాబ్) అని వ్రాయబడతాడు.' (ఫత్హుల్‌బారి)

అబద్ధమాడే అలవాటు మనిషిని పాపం వైపుకు ఈడ్చుకువెళుతుంది. అది వ్యక్తి యొక్క ఆత్మ వినాశనం, విశ్వాస పతనానికి చివరి మెట్టుగా వుంటుంది.

ఇమామ్ మాలిక్(రహ్మ), ఇబ్నె మసూద్(రజి) ద్వారా ఈ విధంగా ఉల్లేఖించారు. 'ఒక దాసుడు నిత్యం అబద్ధమాడుతూ వుంటాడు. అబద్ధం పునాదులపైనే తన జీవిత సౌధం నిర్మించుకుంటాడు. చివరికి అతని హృదయంలో నల్లటి చుక్క ఏర్పడి పెద్ద దవుతూ వుంటుంది. చివరికి అతని హృదయం మొత్తాన్ని నల్లబార్చి వేస్తుంది. ఆ సమయంలో ఆ దాసుని పేరు అల్లాహ్ వద్ద అబద్ధీకులు, అసత్యవాదుల జాబితాలో చేర్చబడుతుంది.'

సర్వోన్నతుడు అయిన విశ్వప్రభువు అల్లాహ్ ఇలా ఉపదేశించాడు.

**"అల్లాహ్ ఆయత్‌లను విశ్వసించనివారే అబద్ధాలను కల్పిస్తున్నారు. అసలు వారే అసత్యవాదులు."** ***(ఖుర్ఆన్,16: 105)***

సత్యం– సత్యసంధతలు మనిషిని పుణ్యమార్గం వైపునకు మార్గదర్శనం చేస్తాయి. సత్యం–మంచి యొక్క శిఖరాగ్రంగా వుంటుంది. ఆ శిఖరం వరకు కేవలం దృఢ చిత్తులు మాత్రమే చేరగలరు. ఈ విషయాన్ని దివ్యగ్రంథం విస్పష్టంగా ప్రకటించింది.

**"సత్కార్యం అంటే, మీరు మీ ముఖాలను తూర్పుకో పడమరకో తిప్పటం కాదు. సత్కార్యం అంటే మనిషి అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని, దూతలను, అల్లాహ్ అవతరింపజేసిన గ్రంథాన్ని, ఆయన ప్రవక్తలను, హృదయపూర్వకంగా విశ్వసించటం. ఇంకా, అల్లాహ్ పట్ల ప్రేమతో తాము ఎక్కువగా ఇష్టపడే ధనాన్ని బంధువుల కొరకు, అనాథుల కొరకు, నిరుపేదల కొరకు, బాటసారుల కొరకు, సహాయం చెయ్యండి అని అర్థించేవారి కొరకు, ఖైదీలను విడుదల చేయటానికి వ్యయపర్చటం. ఇంకా నమాజును స్థాపించటం, జకాత్ ఇవ్వటం, వాగ్దానం చేస్తే దానిని పాలించేవారు, కష్టకాలంలో, లేమిలో సత్యానికి, అసత్యానికి జరిగే పోరాటంలో స్థైర్యం చూపేవారూ సత్పురుషులు. వాస్తవంగా సత్యసంధులు, అల్లాహ్ ఎడల భయభక్తులు కలవారు వీరే.'** ***(ఖుర్ఆన్, 2 : 177)***



# 8వ భాగం

# నిజాయితీ, అమానతుదారీతనం

- అమానతుదారీతనపు విస్తృతార్థం
- అధికారుల నియామకం- అమానతుదారీతనం
- విధుల నిర్వర్తింపులో అమానతుదారీతనం
- పదవుల దుర్వినియోగం- ఒక ద్రోహం
- అల్లాహ్ ప్రసాదించిన సంపద- నైపుణ్యాలూ అమానతులే
- ఇతరుల రహస్యాలూ అమానతులే!



# అమానతుదారీతనం- దాని విస్తృతార్థం

ఇస్లాం, తన అనుయాయుల హృదయాలు జీవంతో తొణికిసలాడుతూ, నిత్య చైతన్యవంతమై వుండాలని అభిలషిస్తుంది. తద్వారా దైవహక్కులు, మానవ హక్కులు రెండూ పరిరక్షించబడగలవు. ఈ స్థితిలో మాత్రమే భావావేశాల హెచ్చుతగ్గుల నుంచి ఆచరణలు సంరక్షించబడతాయి. ఈ కారణంగా ప్రతి ముస్లిం, నిజాయితీపరునిగా, అమానతుదారునిగా వుండటం తప్పనిసరి అయ్యింది.

ఇస్లామీయ ధర్మశాస్త్రం దృష్టిలో నిజాయితీ లేక అమానతుదారీతనం అనేది ఒక విశాలమైన అర్థం కలిగివుంది. ఈ పదంలో ఒక మహా భావ సముద్రం ఉవ్వెత్తున ఎగిసిపడుతూ వుంటుంది. ఈ ఉవ్వెత్తు కెరటం వెనుక ఒక బాధ్యతా భావన, అల్లాహ్ ముందు జవాబుదారీతనపు భావనలు కేంద్ర బిందువుగా పనిచేస్తూ వుంటాయి. ఈ విషయాన్ని ప్రవక్త(స)వారు ఈ క్రింది విధంగా నుడివారు:

'మీలో ప్రతి వ్యక్తీ అమానతుదారుడే. (పాలకుడిని) నాయకుడిని అతడి ప్రజల విషయంగా ప్రశ్నించటం జరుగుతుంది. పురుషుడు తన ఇంటి వారి విషయంలో జవాబుదారీ అయివున్నాడు. అతడు ప్రశ్నించబడతాడు. స్త్రీ తన ఇంటి నిర్వహణ గురించి ప్రశ్నించబడుతుంది. పనివాడు తన యజమాని సంపద పరిరక్షణ విషయంగా జవాబు చెప్పవలసి వుంటుంది.' (బుఖారి)

పై హదీసును ఉల్లేఖించిన ఇబ్నె ఉమర్(రజి) ఈ క్రింది పలుకులు కూడా దైవప్రవక్త నోటి నుంచి వెలువడినట్లుగా తెలిపారు: 'కుమారుడు తన తండ్రి సంపదకు అమానతుదారుడు. అతడు దాని విషయంగా ప్రశ్నించబడతాడు.'

సాధారణంగా ప్రజలు అమానతుదారీతనాన్ని చాలా పరిమితమైన అర్థంలో స్వీకరిస్తారు. దాని చివరిస్థాయిని మాత్రమే గ్రహిస్తారు. అనగా; దాచవలసిందిగా ఇచ్చిన వస్తువుల విషయాలకు మాత్రమే అమానతుదారీతనాన్ని పరిమితం చేస్తారు. కానీ, అల్లాహ్ ధర్మమైన ఇస్లాంలో ఈ పదం చాలా విస్తృతమైన, లోతైన అర్థం కలిగివుంటుంది.

అమానతుదారీతనం ఒక తప్పనిసరి విధి. ముస్లింలు దీనిని ఈ అమానతు దారీతనపు పరిరక్షణ గురించి ఒకరికొకరు ఒప్పందం చేసుకొని వుంటారు. ఈ విధి పరిరక్షణ కొరకు నిరంతరం అల్లాహ్ సహాయాన్ని కూడా అర్థిస్తూ వుంటారు. చివరకు

ఒక ముస్లిం ప్రయాణానికి సిద్ధమవుతున్నప్పుడు అతడికొరకు తోటి ముస్లిం సోదరుడు ఈ క్రింది విధంగా ప్రార్థిస్తాడు.

'మీ ధర్మం విషయంగా, మీ అమానతుల విషయంగా, కార్య సఫలత విషయంగా నేను అల్లాహ్ వద్ద వేడుకుంటున్నాను.'

అనస్(రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త(స) మా ముందు ప్రసంగించి నప్పుడల్లా ఈ పదాలను తప్పనిసరిగా పలికేవారు 'అమానతుదారీతనం లేని వ్యక్తిలో విశ్వాసం లేదు. వాగ్దాన భంగానికి పాల్పడిన వ్యక్తిలో ధర్మమే లేదు.'

మనిషి ఈ ప్రాపంచిక కష్టాల నుండి, పరలోకపు శిక్ష నుండి కాపాడబడటమే నిజమైన సాఫల్యం. ఈ కారణంగానే ప్రవక్త మహోపాధ్యాయులు ఈ క్రింది ప్రార్థనను ఉభయకుశలోపరిగా, తరచుగా చేసేవారు.

'ఓ అల్లాహ్! నేను ఆకలి విపత్తు నుంచి శరణు కోరుతున్నాను. ఎందుకంటే అది బహు చెడ్డ సహచరి. అవినీతి, ద్రోహబుద్ధి నుండి శరణు కోరుతున్నాను. అది ఎంతో నీచమైన సహచరి' (అబూదావూద్)

ఆకలి, దారిద్ర్యానికి మారుపేరుగా వాడబడుతుంది. అవినీతి, ద్రోహబుద్ధి ధర్మ వినాశనానికి దోహదపడుతుంది. ఈ కారణంగానే ప్రవక్త(స) వారు ఈ రెండింటి నుంచి శరణు కోరారు. ప్రవక్త మహోపాధ్యాయుల వారు దైవ సందేశ సత్యపు కిరీటధారణకు ముందు నుండే 'అమీన్' (అమానతుదారుడు) అని ప్రజలచే బిరుదాంకితులయ్యారు.

ఇదేవిధంగా ప్రవక్త మూసా (అలై) అమానతుదారీతనపు ప్రస్తావన కూడా సుప్రసిద్ధిమైనదే. ఆయన ఒక నిజాయితీపరుడు. ప్రవక్త షుఐబ్ (అలై) గారి ఇరువురు కుమార్తెల గొర్రెల మందకు బావి నుండి నీరుతోడి, త్రాగించి వారికి సహాయపడ్డారు. స్త్రీలను గౌరవించేవారుగా, వారి మానమర్యాదలను గౌరవించే పవిత్ర శీలం కలవారిగా వ్యవహరించారు. ఈ సంఘటనను దివ్యఖుర్ఆన్ ఈ క్రింది పదచిత్రాలలో చిత్రీకరించింది.

**"…. ఇది విని మూసా వారి పశువులకు నీరు త్రాపాడు. తరువాత నీడవున్న ఒక స్థలంలోకి పోయి కూర్చున్నాడు, ఇలా అన్నాడు "స్వామీ! నీవు నాపై ఏ మేలును అవతరింపజేసినా నేను దాని అవసరం కలవాడనే! (ఎంతోసేపు**

**కాలేదు) ఆ ఇద్దరు స్త్రీలలోని ఒకామె సిగ్గుపడుతూ, బిడియపడుతూ అతని వద్దకు నడిచి వచ్చి ఇలా చెప్పసాగింది, 'నాతండ్రి గారు మిమ్మల్ని పిలుస్తున్నారు: మీరు మా పశువులకు నీరు త్రాపించిన దానికిగాను మీకు ప్రతిఫలం ఇవ్వడానికి.' మూసా ఆయన వద్దకు వెళ్ళి తన వృత్తాంతం వినిపించినప్పుడు, ఆయన ఇలా అన్నారు, 'ఏమాత్రం భయపడకు. ఇప్పుడు నీవు దుర్మార్గపు ప్రజల బారి నుండి బయటపడ్డావు.' ఆ ఇద్దరు స్త్రీలలో ఒకామె తన తండ్రితో ఇలా అంది : 'నాన్నా! ఈ వ్యక్తిని నౌకరుగా పెట్టుకొనండి. బలవంతుడూ, నమ్మకస్తుడూ అయినవాడే మీరు నౌకరుగా పెట్టుకోవడానికి అన్నివిధాలా ఉత్తముడు.' (28: 24-26)**

ఈ సంఘటన జరిగే సమయానికి మూసా(అలై) ప్రవక్తగా అభిషేకించబడనే లేదు. ఫిరౌన్ దర్బారుకు ఇంకా పంపబడనే లేదు అనేది గమనార్హం. అల్లాహ్, ప్రవక్త పదవి కొరకు అప్పటి ప్రజల్లో అందరికంటే ఉత్తమ గుణాలు, ధర్మపరాయణత కలవారినే ఎంచుకుంటాడు. వారు కఠిన దారిద్ర్యంలోనూ, అపరిచిత, అనామక ప్రదేశాల్లోనూ, కష్టనష్టాల కాలంలోనూ ఉత్తమ నైతిక విలువలకే కట్టుబడి వుంటారు.

నిస్సందేహంగా ఇటువంటి వ్యక్తిత్వం గలవాడు మహా శక్తిమంతునిగా అత్యంత అమానతుదారునిగా (నమ్మకస్తుడు, నిజాయితీపరుడు) వుంటాడు. దేవుని హక్కులు, ఆయన దాసుల హక్కుల (ప్రజల హక్కులు) పరిరక్షణ కొరకు ఎటువంటి పరిస్థితిల్లోనూ మార్పుకు లోను కాని దృఢమైన నైతికత నిష్ఠ కలిగివుంటాడు. నిజానికి ఈ నైతిక దృఢ వ్యక్తిత్వమే అమానతుదారీతనానికి ఆత్మగా వుంటుంది.

## అధికారుల నియామకం- అమానతుదారీతనం

అమానతుదారీతనపు విస్తృతార్థంలో- 'ప్రతి వస్తువునూ దాని యోగ్యతలను బట్టి, దానిని సముచిత స్థానంలో వుంచడం' అనే అర్థం కూడా వుంది. ఏదైనా అధికారపు పదవిని కూడా, దానికి యోగ్యుడైన వ్యక్తికి అప్పగించాలి. అలాగే ఏదైనా బాధ్యతను సైతం దానిని చక్కగా నిర్వర్తించగల సామర్థ్యం గల వ్యక్తికి అప్పగించాలి.

ఒక వ్యక్తిపై నమ్మకంతో అతనికి కట్టబెట్టే అధికారాలు, పదవులు జాతీయ, దేశీయ, వర్గపర బాధ్యతలుకూడా ఇస్లామీయ దృక్పథంలో అమానతులుగానే పరిగణించబడతాయి. ఈ పదవులు, బాధ్యతలు, హోదాలకు సంబంధించిన వ్యక్తులు

వాటికి జవాబుదారులు అవుతారు. ఈ విషయంగా అనేక సాక్ష్యాలు, రుజువులు ఇస్లామీయ చరిత్ర నుండి పేర్కొనవచ్చు.

'అబూజర్ (రజి) ఈవిధంగా ఉల్లేఖించారు 'నేను ఒకసారి ప్రవక్త(స)ను 'మీరు నన్ను గవర్నరుగా నియమించరా?' అని ప్రశ్నించాను. అప్పుడు ప్రవక్త(స) తన చేతితో నా భుజాన్ని తట్టి ఈవిధంగా సెలవిచ్చారు : 'ఓ అబూజర్! నీవు (ఇంకా) చాలా బలహీనుడివి. బాధ్యత అనేది ఒక అమానతుగా పరిరక్షించవలసిన వస్తువు. ఇది ప్రళయదినాన కష్టనష్టాలకు, అప్రతిష్టకు కారణం కావచ్చు. అయితే,ఎవరు ఈ బాధ్యతను దాని హక్కులన్నింటితో సక్రమంగా నెరవేరుస్తారో– వారు ప్రళయదినాన రక్షించబడతారు.' (ముస్లిం)

విషయ పరిజ్ఞానం గల ప్రతి వ్యక్తీ, అన్ని పనులూ చేయగల సమర్థుడని భావించడం సరికాదు. ఒక వ్యక్తి ఉత్తమ నైతికత కలిగి వుండవచ్చు. దృఢమైన నిష్ఠ గలవాడు కూడా కావచ్చు. కాని, అతడిలో కార్యదక్షత, సామర్థ్యం, చతురతలు కొరవడి వుండటానికి అవకాశం వుంటుంది.

యూసుఫ్ (అలై) ఒక ప్రవక్త. ఆయన ధర్మనిష్టకు, ఉత్తమ నైతికతకు సజీవ సాక్ష్యంగా వుండేవారు. ఆయన సత్యప్రేమికుడు కూడాను. అయితే, పైన పేర్కొన్న ఉత్తమ నడవడికల, నైతికతల పునాదిపై ఆయన అధికారపు బాధ్యతలను స్వీకరించలేదు. తనలోని బాధ్యతా నిర్వహణా నిపుణతల, సామర్థ్యాల పునాదులపైనే ఈ బాధ్యతను స్వీకరించారు.

'యూసుఫ్ ఇలా అన్నాడు 'దేశంలోని ఖజానాలను నాకు అప్పగించండి. వాటిని నేను రక్షించగలను. అందుకు తగిన జ్ఞానం నాకు వున్నది.'(12 :55) ఈ కారణంగానే అబూజర్ విజ్ఞప్తిని ప్రవక్త(స) నిరాకరించారు.

అమానతుదారీతనం మన నుండి కోరేదేమిటంటే, మనం బాధ్యతలను, అధికారాలను, పదవులను, వాటిని సక్రమంగా నిర్వర్తించగల వ్యక్తులకు మాత్రమే అప్పగించాలి. అలాకాక బంధుత్వం, లంచం, స్వార్థం, ఇతర ఆశల పునాదులపై ఒక అయోగ్యుడిని బాధ్యతల నిర్వహణ కోసం ఎంపిక చేసినట్లయితే ఒక యోగ్యుడికి అన్యాయం చేసినవారవుతాము. అంతేకాదు, ఒక అయోగ్యుడికీ– అనర్హుడికి బాధ్యతలు అప్పగించిన కారణంగా అమానతుదారీ ధిక్కారులుగా, అవినీతిపరులుగా, ద్రోహులుగా పరిగణింపబడతాము.

దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు :'ఎవరైతే కేవలం బంధుత్వం కారణంగా ఒక అనర్హుడిని, అర్హుడిగా భావించి అధికారిగా నియమిస్తాడో– నిజానికి అప్పటి ప్రజల్లో అల్లాహ్‌కు అతడికంటే ప్రియమైన వ్యక్తి వున్నట్లయితే అతడు అల్లాహ్‌పట్ల, దైవప్రవక్త పట్ల ముస్లింలందరి పట్ల నమ్మకద్రోహానికి పాల్పడ్డాడు.' (హాకిమ్)

యజీద్ బిన్ సుఫియాన్(రజి) ఉల్లేఖనంలో ఇలావుంది :'అబూబక్ర్(రజి) నన్ను సిరియా పంపేటప్పుడు ఇలా హితవు పలికారు. 'ఓ యజీద్! మీకు చాలా బంధుత్వ సంబంధాలున్నాయి. పదవులను అప్పగించే విషయంలో బంధుప్రీతికి లోనయ్యే అవకాశముంది. దైవప్రవక్త(స) 'ఒక వ్యక్తిని, ముస్లింలకు బాధ్యునిగా చేసినప్పుడు అతడు బంధుత్వ కారణంగా, అస్మదీయులకు పదవులు కట్టబెట్టినట్లయితే అల్లాహ్ శాపం అతడిపై విరుచుకుపడుతుంది. అతడి ఏ పుణ్యకార్యమూ, ఏ న్యాయమూ అల్లాహ్ సన్నిధిలో ఆమోదించబడదు. చివరకు అతడిని నరకంలోపడవేయడం జరుగుతుంది' అని సెలవిచ్చారు. అప్పటి నుండి నాకు మీ విషయంలో చాలా భయం పట్టుకుంది.' (హాకిమ్)

ఏ సమాజంలో 'అమానతుదారీతనం' అంతరించిపోతుందో– ఆ సమాజపు గుర్తు ఏమంటే, అందులో పదవుల పంపకం, అధికారాల అప్పగింతలన్నీ బంధుత్వాల స్వార్థపర క్రీడగా మారిపోతాయి. సామర్థ్యం గలవారి విలువలు గుర్తించబడవు. అయోగ్యులు, నీచులు పదవుల కుర్చీల్లో ప్రతిష్ఠించబడతారు. ఇది ప్రళయ కాలానికి సమీపంలో ఉనికిలోకి వచ్చే ఉపద్రవంగా దైవప్రవక్త(స) స్పష్టంగా పేర్కొన్నారు.

ఒక వ్యక్తి ప్రవక్త(స)ను, 'ఓ దైవప్రవక్తా! ప్రళయం ఎప్పుడు సంభవిస్తుంది' అని ప్రశ్నించాడు. అందుకు ప్రవక్త(స) వారు 'అమానతులు వినాశనం కాబడే కాలంలో ప్రళయం కొరకు ఎదురుచూడు' అని పలికారు. ఆ వ్యక్తి తిరిగి 'అమానతుల వినాశనం అంటే ఏమిటి?' అని ప్రశ్నించాడు. అందుకు ప్రవక్త 'బాధ్యతలను అయోగ్యులకు అప్పగించటం జరిగినప్పుడు ప్రళయం కొరకు వేచి చూడు' అని బదులిచ్చారు. (బుఖారి)

## విధుల నిర్వర్తింపులో అమానతుదారీతనం

ఒక వ్యక్తి తనకు అప్పగించబడిన పనిని ఉత్తమ రీతిలో, అత్యంత సమర్థవంతంగా నిర్వర్తించడం కూడా అమానతుదారీతనంలో భాగమై వుంటుంది. ఈ పనిని నిర్వహిం చడంలో తనలోని ప్రతిభ, సహజ నైపుణ్యాలను పూర్తి దీక్షతో వినియోగించవలసి

వుంటుంది. ఈ ఆచరణను నిస్సందేహంగా అమానతుదారీ తనంగా అంగీకరించడం జరుగుతుంది. లోపరహితమైన, నిజాయితీతో కూడిన బాధ్యతల నిర్వహణకు, ఇతరుల హక్కుల నెరవేర్పుకు ఇస్లామీయ జీవన విధానంలో అమిత గౌరవనీయమైన విషయాలుగా, నైతిక నియమాలుగా పరిగణించబడతాయి. తక్కువ స్థాయి గల బాధ్యతల నిర్వహణలో కూడా ఆలస్యం, అలక్ష్యం, నిర్లక్ష్యాలు సామూహిక ప్రజా జీవితాన్ని విశేషంగా ప్రభావితపరుస్తాయి. ఇస్లామీయ సమాజంలో 'చెడుకు' బీజమేయడానికి కారకాలవుతాయి. బాధ్యతారహితమైన ఈ నమ్మక ద్రోహం– మొత్తం ధర్మాన్ని, ముస్లిం సమాజాన్ని, దేశాన్ని కష్టాలపాలు చేసివేస్తుంది. దాని ఫలితాలు రకరకాల చెడుగులుగా, పాపాలుగా, శిక్షలుగా సమాజంలో బహిర్గత మవుతాయి.

'దైవప్రవక్త(స) ఇలా నుడివారు: ప్రళయదినాన అల్లాహ్, గతం– వర్తమానా లకు చెందిన ప్రజలందరిని సమావేశపరిచినప్పుడు, ప్రతి మోసకారికి, నమ్మకద్రోహికి ఒక జండా ఇవ్వబడుతుంది. ఆ జండా ద్వారా ఆ నమ్మకద్రోహి గుర్తింపబడతాడు. అప్పుడు 'ఇది నమ్మకద్రోహులకు చెందిన వర్గం'గా వారిని పిలవడం జరుగుతుంది.' (బుఖారి)

మరో హదీసులో ఇలా వుంది 'ప్రతి నమ్మకద్రోహి వద్ద ఒక జెండా వుంటుంది. అతడి నమ్మకద్రోహ స్థాయిని బట్టి జండా యొక్క హెచ్చుతగ్గులు వుంటాయి. వినండి! తన ప్రజల పట్ల నమ్మకద్రోహం చేసిన నాయకుడికి మించిన నమ్మకద్రోహి మరెవరూ వుండరు.' (ముస్లిం)

చివరగా తెలిసిన విషయమేమిటంటే, ప్రజలకు సంబంధించిన అధికారపు హోదా లేక బాధ్యతలు అప్పగించబడిన వ్యక్తి, తన బాధ్యతల పట్ల బద్ధకించినా, నిర్లక్ష్యం ప్రదర్శించినా దాని ఫలితంగా ప్రజలు ఇబ్బందికి, తప్పుడు చేష్టలకు గురవుతారు. అందుకు ఆ అధికారి జవాబుదారుడవుతాడు. నమ్మకద్రోహిగా భావించబడతాడు.

## పదవుల దుర్వినియోగం– ఒక ద్రోహం

'అమానతుదారీతనం' అంటే, మనిషి తనకు అప్పగించిన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించడం– బాధ్యతల నిర్వహణలో స్వలాభం, బంధుప్రీతి లాంటి స్వార్థపర ఆచరణను త్యజించడం– ప్రజల సొమ్ముతో విలాసాలను అనుభవించడం మహా నేరంగా భావించడం.

ప్రభుత్వాలు, కంపెనీలు, తమ ఉద్యోగులకు వారి విధినిర్వహణ కొరకు నిర్దేశిత జీతాన్ని ప్రతిఫలంగా ఇస్తాయి. అయితే తమ ఉద్యోగాల ఆధారంగా లంచం రూపంలో అధికంగా సంపాదించడాన్ని ఇస్లాం వ్యతిరేకిస్తుంది. స్వయంగా ఈ చర్య ఆ ఉద్యోగిని అప్రతిష్టపాలు చేస్తుంది. ఈ విషయంగా దైవప్రవక్త(స) ఇలా ఉపదేశించారు :

"మనం ఏ వ్యక్తికైనా, బాధ్యతలను అప్పగించినట్లయితే ఆ సేవలకుగాను ఆ వ్యక్తి యొక్క జీవితావసరాలను తీర్చడం మన బాధ్యతగా వుంటుంది. అంతకంటే అతడు ఎక్కువ తీసుకున్నట్లయితే అతడు అమానతుదారుడు కాకుండా పోయినట్లే (అతడు నమ్మకద్రోహి అయినట్లే)" (అబూదావూద్)

జీతం కంటే ఎక్కువ తీసుకోవటం నమ్మకద్రోహంగా ఎందుకు చెప్పబడిం దంటే, అతడు సమాజం యొక్క సంపదను తన కోసం ఉపయోగించుకున్నాడు. నిజానికి ఈ సంపద, బలహీనవర్గాల, వితంతువుల,అనాధల, కటిక పేదల హక్కుగా వుండింది. వారి సంక్షేమం కొరకు ఉపయోగించవలసినదిగా వుండింది.

**'నమ్మకద్రోహం చేసినవాడు ప్రళయం నాడు తన నమ్మకద్రోహంతోపాటు హాజరవుతాడు. అప్పుడు ప్రతి ప్రాణికి తన సంపాదనకు పూర్తి ప్రతిఫలం లభిస్తుంది.' (ఖుర్ఆన్, 3: 161)**

అదే సమయంలో ఏ వ్యక్తి అయితే, తన బాధ్యతల నెరవేర్పులో అల్లాహ్ విధించిన హద్దులను పూర్తిగా పరిరక్షిస్తాడో- తనకు అప్పగించిన బాధ్యతల విషయంగా నమ్మకద్రోహానికి పాల్పడటాన్ని అసహ్యించుకుంటాడో- అతడు అల్లాహ్‌దృష్టిలో- ధర్మస్థాపన కొరకు, అల్లాహ్ కలిమను ఉన్నతపర్చడం కొరకు అవిరళ కృషి చేసేవాడిగా పరిగణించబడతాడు. ఈ విషయంగా దైవప్రవక్త(స) బోధన ఈవిధంగా వుంది :

'ఒక అధికారికి ఏదైనా బాధ్యతలు అప్పగించినప్పుడు, అతడు తన హక్కును తాను వసూలు చేసుకొని ఇతరుల హక్కును సక్రమంగా నెరవేర్చినట్లయితే అతడు ఆ బాధ్యతను ముగించుకొని ఇంటికి చేరేంతవరకు అల్లాహ్ మార్గంలో అవిరళ కృషి (జిహాద్) చేసేవానిగా పరిగణించబడతాడు.' (తిబ్రాని)

ఒక వ్యక్తి తన పదవిని దుర్వినియోగపరుస్తూ అక్రమార్జనకు పాల్పడటాన్ని, స్వార్థ ప్రయోజనాలను పొందటాన్ని ఇస్లాం నిషేధించింది. అక్రమార్జనకు దారితీసే అన్ని మార్గాలను మూసివేసే విషయంలో అత్యంత కఠినంగానూ వ్యవహరిస్తుంది.

అదీ బిన్ అమీరి(రజి) తాను దైవప్రవక్త(స) ఈవిధంగా పేర్కొంటూ వుండగా తాను విన్నట్లుగా ఇలా ఉల్లేఖించారు:

'మేము ఏ వ్యక్తికైనా ఒక హెూదాను, బాధ్యతను అప్పగించినట్లయితే అతడు దాని ఆధారంగా ఒక సూదిని, అంతకంటే చిన్న వస్తువునైనా దాచినట్లయితే అది నమ్మకద్రోహం అవుతుంది. ఆ దాచిన వస్తువుతో ఆ వ్యక్తి ప్రళయదినాన హాజరవు తాడు.' ఇంతలో ఒక నల్లని రంగు గల అన్సారీ లేచి నిల్చొని 'ఓ దైవప్రవక్తా! నా గవర్నర్ పదవిని మీరు వాపసు తీసుకోండి' అన్నాడు. దానికి దైవప్రవక్త(స) 'విషయ మేమిటి?' అని ప్రశ్నించగా– దానికి ఆ అన్సారీ 'నేను ఇప్పుడే మీరు పలికిన మాట లన్నింటిని విన్నాను' అన్నాడు. అప్పుడు దైవప్రవక్త(స) 'అవును! నేను ఇప్పటికీ చెబుతున్నాను. ఎవరినైతే మేము అధికారిగా నియమించామో, అతడు దాదాపు అన్నింటినీ మా ముందు సమర్పించాలి. అతడి హక్కును అతడు తీసుకోవాలి. దేని నుండి అతడిని నిరోధించడం జరిగిందో– దాని నుండి అతడు దూరంగా తొలగి పోవాలి' అని చెప్పారు. (ముస్లిం)

మహా బోధకులు ముహమ్మద్(స) ఒకసారి 'అజద్' తెగకు చెందిన 'ఇబ్నుల్ లబ్తీయ' అని పిలవబడే వ్యక్తికి సద్ఖా (జకాత్) వసూలు చేసే బాధ్యతను అప్పగిం చారు. అతడు సదరు సొమ్మును వసూలు చేసుకొని తిరిగివచ్చి ప్రవక్త(స) వారికి అప్పగిస్తూ 'ఇది మీ (ఖజానాకుచెందిన) సొమ్ము, ఇది నాకు కానుకలుగా ఇవ్వబడిన సొమ్ము' అని పలికాడు. ఈ పలుకులు విన్నపిదప ప్రవక్త(స) వారు లేచి నిలబడి ముందుగా అల్లాహ్‌ను స్తుతించారు. ఆ తర్వాత ఇలా ఉపన్యసించారు.

'అమ్మాబాద్! నేను, మీలోని ఒక వ్యక్తిని, అల్లాహ్ నాకు అప్పగించిన బాధ్యతల నెరవేర్పులో భాగంగా, అతడిని అధికారిగా నియమించాను. అతడు 'ఇది మీ సొమ్ము. ఇది నాకు కానుకగా ఇవ్వబడింది' అని పలుకుతున్నాడు. ఇది నిజమే అయితే, అతడు తన ఇంటిలోకూర్చుని వుండవచ్చు కదా! అప్పుడు అతనికి కానుకలు ఎక్కడి నుంచి లభించేవో తెలిసివచ్చేది. జాగ్రత్త! ఒకవేళ మీలో ఏ వ్యక్తి అయినా అన్యాయంగా ఒక చిన్న వస్తువునైనా ప్రజలనుంచి వసూలు చేసినట్లయితే ప్రళయదినాన ఆ వ్యక్తి ఆ వస్తువును మోసుకొని అల్లాహ్ ముందు హాజరవుతాడు. నేను, మీలో ఎవరినీ తన తలపై ఒంటెను మోస్తూ లేదా ఆవును మోస్తూ వున్న స్థితిలో లేదా అరుస్తూ వున్న మేకను మోస్తూవున్న స్థితిలో అల్లాహ్‌ను కలుసుకోవడాన్ని చూడాలని కోరుకోవడం లేదు' ఆ

తర్వాత ప్రవక్త(స) తన రెండు చేతులను, చంకల తెల్లదనం కనిపించే రీతిలో పైకెత్తి 'ఓ అల్లాహ్! నీ మాటను నేను చేరవేశాను' అని పలికారు. (ముస్లిం)

## అల్లాహ్ ప్రసాదించిన సంపద, నైపుణ్యాలూ అమానతులే

అల్లాహ్ ప్రసాదించిన శక్తియుక్తులూ, నైపుణ్యాలూ, సామర్థ్యాలు, సంపద, సంతానాలన్నీ కూడా అమానతులుగానే పరిగణించబడతాయి. అలా పరిగణించటం వల్ల, దాని సహజ ఫలితం ఏమిటంటే; ఆయా ప్రసాదాలను,అమానతులను అల్లాహ్ మార్గంలో వినియోగించాలి. అల్లాహ్ ప్రీతికోసం ఆయా సామర్థ్యాలను సద్వినియోగ పర్చాలి. ఈ వినియోగంలో ఏదైనా నష్టం జరిగితే దానికై గుండెలు బాదుకుంటూ రోదించవలసిన అవసరమే లేదు. వాటిని మీ స్వంత ఆస్తులుగా భావించవలసిన అవసరం అసలే లేదు. ఎందుకంటే, ఈ ప్రత్యేకతలు అన్నీ ప్రసాదించిన ప్రసాదాలే. వాటిపై మీకంటే అల్లాహ్‌యే ఎక్కువ హక్కుదారుడు. కలిగిఉన్నవానికంటే– ప్రసాదించినవానికే ఎక్కువ హక్కు వుంటుంది. దైవప్రసాదిత నైపుణ్యాలు ఎంతటి హెచ్చుస్థాయిలో వుంటే వాటిని అంత ఎక్కువగా అల్లాహ్ మార్గంలో ఉపయోగించ వలసివుంటుంది. ఇందులో పిసినారితనం పనికిరాదు. అదే సమయంలో ఆయా నైపుణ్యాల ప్రసాదం పట్ల విధేయత ప్రకటించటం విస్మరించకూడదు. ఈ ప్రత్యేకతల కారణంగా గర్వం, మదం, అహంకారం లాంటి పాపగుణాలు క్షంతవ్యం కావు.

**'ఓ విశ్వాసులారా! బుద్ధిపూర్వకంగా అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ నమ్మకద్రోహం చేయకండి. మీ అమానతుల విషయంలో ద్రోహానికి పాల్పడ కండి. మీ సంపద, మీ సంతానమూ వాస్తవంగా పరీక్షా సాధనాలని, అల్లాహ్ వద్ద ప్రతిఫలంగా ఇవ్వటానికి కావలసినంత ఉందనే విషయాన్ని తెలుసు కోండి.' (8: 27,28)**

## ఇతరుల రహస్యాలూ అమానతులే

సభలు, సమావేశాల్లో పాల్గొనడం ద్వారా వాటి హక్కులను నెరవేర్చటం కూడా అమానతుదారీతనంలో భాగంగా వుంటుంది. సభలు, సమావేశాల్లో తీసుకోబడిన నిర్ణయాలు, రహస్యాలను ఎక్కడా బహిరంగ పర్చకూడదు. సమావేశాల్లో తీసుకొనే కొన్ని కఠిన నిర్ణయాలు బహిర్గతమయిన కారణంగా అనేక సంబంధాలు తెగిపోయే

ప్రమాదముంది. ప్రజా ప్రయోజనాలు మంటకలిసిపోయే ప్రమాదమూ లేకపోలేదు. పథకాలు, నియమ నిబద్ధతలు, చట్టాలు చట్టుబండలైపోవడం మనకు తెలిసినదే. ఈ విషయంగా దైవప్రవక్త(స) ఇలా తెలిపారు:

"ఒక వ్యక్తి, మరో వ్యక్తితో మాట్లాడి ఆ తర్వాత ఆ మాట్లాడిన విషయాన్ని బహిర్గతపర్చకుండా వుండటం 'అమానతుదారీతనం' అవుతుంది." (అబూదావూద్)

సమావేశాల్లో నైతిక నియమావళి, ధార్మిక షరతుల నిబద్ధతలు పరిరక్షించ బడాలి. సమావేశపు పవిత్రత మంటకలవకుండా కాపాడబడాలి. ఒక ముస్లిం, ఒక సమావేశంలో పాల్గొనప్పుడు–ఆ సమావేశంలో ఇతరులకు నష్టం కలిగించే నిర్ణయాలు తీసుకుంటూ వుంటే–తమ వాదనల ద్వారా తిమ్మిని బమ్మిగా మార్చే ప్రయత్నం జరుగుతూ వుంటే, ఆ పన్నాగాల, దౌర్జన్యాల ఉపద్రవాన్ని ఆ ముస్లిం తన శక్తిమేరకు నిరోధించే, అడ్డుకునే ప్రయత్నం చేయాలి. దైవ సందేశహరులు(స) ఈవిధంగా వివరించారు:

"సమావేశాలలో చర్చించబడే రహస్య విషయాలు అమానతులు అవుతాయి. అయితే మూడు రకాల సమావేశాలు ఇందులో మినహాయించబడ్డాయి. 1) హత్యకు పథకం వేసే సమావేశాలు 2) నిషిద్ధ పద్ధతిలో లైంగికవాంఛలు తీర్చుకోబడే విషయ సమావేశాలు 3) అక్రమంగా ఇతరుల సొత్తును దోచుకునే పథకపు సమావేశాలు" (అబూదావూద్)

భార్యాభర్తల సంబంధానికి ఇస్లాంలో అత్యంత ప్రాధాన్యత, పవిత్రతలు వున్నాయి. భార్యాభర్తల మధ్య గల గృహ సంబంధ, లైంగిక విషయాలు బయటికి పొక్కకుండా పరిరక్షించబడాలి. అంతరంగికుని ముందు సైతం ఈ విషయాలు చర్చించకూడదు. (ఆరోగ్య సంబంధ, గృహ సంబంధ సమస్యలు తప్ప) అయితే కొందరు మూర్ఖంగా, అజ్ఞానంగా గృహ విషయాలను బయట ప్రచారం చేసుకుంటూ తిరుగుతారు. ఇది చాలా చెడ్డ అలవాటు. ఈ అలవాటును అల్లాహ్ నిషేధించాడు.

'అస్మా బిన్తె యజీద్(రజి) ఇలా తెలిపారు: 'నేను దైవప్రవక్త(స) చెంత వున్నాను. స్త్రీ, పురుషులు ఆయన వద్ద కూర్చొనివున్నారు. అప్పుడు దైవప్రవక్త(స) 'తన భార్యతో లైంగిక సంబంధ కార్యాలను బహిర్గతం చేసే పురుషుడు ఎవడైనా వున్నాడా? తన భర్తతో తనకు గల లైంగిక సంబంధాలను ప్రచారంచేస్తూ తిరిగే స్త్రీ ఎవరైనా

ఉన్నారా?' అని ప్రశ్నించారు. ప్రజలు భయంతో మౌనంగా వుండిపోయారు. అప్పుడు నేను 'దైవసాక్షి! ఓ ప్రవక్తా! కొందరు స్త్రీ పురుషులు అటువంటి వారు ఉన్నారు' అని చెప్పాను. అందుకు ప్రవక్త(స) 'అలా చెప్పుకోకండి. ఇది ఒక దుష్టుడైన పురుషుడు, మరో దుష్టురాలైన స్త్రీతో బహిరంగ లైంగిక చేష్టకు పాల్పడటం వంటిది' అని హెచ్చరించారు. (అబూదావూద్)

మరోచోట ప్రవక్త(స) 'ప్రళయదినాన అల్లాహ్ సమక్షంలో నమ్మకద్రోహమైన చర్య ఏమిటంటే, భార్యాభర్తలు జరుపుకునే కామకలాపాలను బహిర్గతపర్చడం.' (ముస్లిం)

నిర్ణీత సమయం వరకు ఏదైనా దాచిపెట్టి అడిగినప్పుడు ఇవ్వమని దాచిపెట్టిన 'అమానతు'ల పట్ల కూడా మనం జవాబుదారులమై వుంటాం. మక్కాలోని ఇస్లాం శత్రువులు తన వద్ద దాచిపెట్టిన వస్తువులను వారికి తిరిగి అప్పగించే పనిని తన పినతండ్రి కుమారుడైన అలీ(రజి)ను మక్కాలోనే విడిచిపెట్టి వెళ్ళారు దైవప్రవక్త(స). వాస్తవానికి ఇస్లాం శత్రువులైన బహుదైవారాధకులు ప్రవక్త(స) వారిని మక్కా భూభాగం నుండి వెళ్ళగొట్టారు. విశ్వాస మార్గంలో జన్మభూమిని విడిచిపెట్టేలా వివశులు గావించారు. శత్రువులతో సైతం నిజాయితీగా, నమ్మకంగా, అమానతుదారీతనంగా వ్యవహరించడం ఉత్తమ నైతికతకు నిదర్శనమని ప్రవక్త(స) వారు రుజువు చేశారు.

మైమూన్ బిన్ మహ్రాన్ ఇలా తెలిపారు : 'అమానతుదారీతనం, వాగ్దాన పాలన, ఉత్తమ వ్యవహారసరళి అనే మూడు విషయాలను మంచివారితో పాటు చెడ్డవారితోనూ పాటించాలి.'

భద్రపర్చమని అమానతుగా ఇచ్చిన వస్తువును అయాచితంగా లభించిన సొత్తుగా భావించడం దొంగతనంతో సమానంగా పరిగణించబడుతుంది.

అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్(రజి) ఇలా ఉల్లేఖించారు :'అల్లాహ్ మార్గంలో చేసే ధర్మయుద్ధంలో పాల్గొనడం ద్వారా సర్వపాపాలు క్షమించి వేయబడతాయి. అయితే నమ్మకద్రోహం క్షమించబడదు. తీర్పుదినాన దైవమార్గంలో ధర్మయుద్ధం చేసిన ఒక దాసుడు ప్రవేశపెట్టబెడతాడు. అతడిని 'నీ వద్ద వుంచబడిన అమానతులను చెల్లించు!' అని గద్దించడం జరుగుతుంది. అప్పుడు ఆ దాసుడు 'ఓ ప్రభూ! అదెలా సాధ్యం? ప్రపంచం అంతరించిపోయింది కదా?' అంటాడు. అప్పుడు 'ఇతడిని నరకంలో పడవేయండి!' అని ఆజ్ఞాపించడం జరుగుతుంది. నరకంలో అతని ముందు,

ప్రపంచంలో అప్పగించబడిన అమానతులన్ని ప్రదర్శించడం జరుగుతుంది. ఆ వ్యక్తి వాటిని గుర్తిస్తాడు. వాటి వెంట పరుగెడతాడు. వాటిని పట్టుకొని భుజాలపై మోస్తాడు. అవి అతడి భుజాల నుండి జారిపోతాయి. మరలా వాటి వెంట పరుగెడతాడు. ఈ క్రమం నిరంతరంగా జరుగుతూనేవుంటుంది. ఆ తరువాత ఆయన ఇలా పలికారు 'నమాజ్ ఒక అమానతు- వజూ ఒక అమానతు, (సరిగా) తూచడం అమానతు, సరిగా కొలవడం ఒక అమానతు అంటూ అనేక విషయాలను అమానతులుగా పేర్కొన్నారు. అయితే నమ్మకంతోదాచమని ఇచ్చిన వస్తువు లేదా సంపద అన్నిటికంటే పెద్ద అమానతు' అని పలికారు.

పై హదీసు ఉల్లేఖకులు ఈ విషయంగా 'బరాబిన్ అజీజ్(రజి)ను కలుసుకొని ఇబ్నె మస్వూద్ (రజి) చెప్పిన ఈ హదీసుపై ఆయన అభిప్రాయాన్ని అడిగారు. దానికి ఆయన 'ఆయన సత్యం పలికారు' మీరు అల్లాహ్ యొక్క ఆదేశాన్ని వినలేదా? అంటూ ఈ క్రింది ఖుర్ఆన్ వాక్యాన్ని పఠించారు.

**'అమానతులను యోగ్యులైన వారికి అప్పగించండి. ప్రజల మధ్య తీర్పు చేసే టప్పుడు న్యాయంగా చేయండి' అని అల్లాహ్ మిమ్మల్ని ఆజ్ఞాపిస్తున్నాడు.'**

**(ఖుర్ఆన్, 4: 58)**

మనిషిని దుర్గుణాల నుండి, నీచత్వం నుండి, అప్రతిష్ట నుండి కాపాడే సాధనం ఏమిటంటే; అతడు మానవ హక్కులను, అల్లాహ్ హక్కులను నిరంతరం నెరవేర్చే అమానతును పరిరక్షించాలి. అమానతుదారీతనం అనే ఉత్తమ గుణం మనిషిలో చైతన్యవంతంగా సంలీనమైనప్పుడు-అతడి హృదయంలో బలంగా నాటుకొనిపోయి నప్పుడు మాత్రమే మనిషి ఉత్తమ నైతిక స్థాయికి చేరుకుంటాడు. అప్పుడు మాత్రమే అతడు భావావేశాల బంధనాల నుండి రక్షించబడతాడు. హుజైఫా బిన్ యమాన్(రజి) పేర్కొన్న ఈ క్రింది హదీసులో పై వాస్తవం ప్రస్ఫుటమవుతుంది.

'అమానతుదారీతనం మానవ హృదయాంతరాళాలలో సహజంగా నిబిడీకృతమై వుంటుంది. అయితే ఖుర్ఆన్ అవతరించినప్పుడు, ప్రజలు దానిని ఖుర్ఆన్ ద్వారా, ప్రవక్త సదాచరణ ద్వారా దానిని వెలికితీసి నేర్చుకున్నారు.' (ముస్లిం)

అమానతుదారీతనం ఖుర్ఆన్, ప్రవక్త సాంప్రదాయపు నిజమైన అవగాహన, హృదయ స్పందనగా, జాగృతిగా వుంటుంది. ధర్మశాస్త్రం సదాచరణకు అతీతంగా

ఎప్పుడూ వుండజాలదు. మనిషి హృదయం మృతప్రాయమైతే అమానతుదారీతనం అందు నుండి గుంజివేయబడుతుంది. ఈ స్థితిలో ఖుర్‌ఆన్ పఠనం, హదీసుల వల్లేవేతలు అతడికి ఏమాత్రం లాభించవు. తమ్ముతాము ఇస్లాం అనుయాయులమని ప్రకటించుకునేవారు– తమ్ముతాము నీతిమంతులుగా భావిస్తూ వుంటారు. కాని, సత్యాన్ని తిరస్కరించే హృదయంలో అమానతు దారీతనం ఎలా నిలబడుతుంది? ఈ కారణంగానే హజ్రత్ హుజైఫా (రజి) ఈ క్రింది విధంగా పేర్కొన్నారు:

"ఏ హృదయంలో విశ్వాసం వుండదో– ఆ హృదయంలో అమానతుదారీతనం వెళ్ళిపోతుంది' దైవసందేశహరుల ద్వారా ఆయన ఇలా ఉల్లేఖించారు. 'మేము అమానతుదారీతనం, నమ్మకద్రోహం గురించి చర్చిస్తూ వుండగా ప్రవక్త(స) వారు ఇలా నుడివారు : 'మనిషి విశ్వాసం పట్ల నిర్లక్ష్యం వహిస్తే అతని అమానతుదారీతనం సమీకరించబడి అతడి హృదయంపై దాని ప్రభావం ఒక చిన్న చుక్కలా మిగిలి పోతుంది. మరొక నిర్లక్ష్యపు నిద్రకు అతడు ఉపక్రమిస్తే ఆ అమానతుదారీతనం ఎండిపోయి ఒక చిన్న గుర్తులా మిగిలిపోతుంది' అన్నారు. ఆ తర్వాత ప్రజలు పరస్పరం క్రయ విక్రయాలలో అమానతుదారీతనాన్ని పరిరక్షించలేకపోతారు. చివరకు ఫలానా కుటుంబంలోని ఫలానా వ్యక్తి చాలా నిజాయితీపరుడనీ, బహు గుణ వంతుడనీ, సహనశీలియని, బుద్ధిమంతుడనీ ప్రశంసించబడతాడు. కాని వాస్తవానికి అతడి హృదయంలో రవ్వంత విశ్వాసమూ వుండదు.'

పై హదీసు, నమ్మకద్రోహానికి పాల్పడే వ్యక్తుల హృదయాల నుండి అమానతు దారీతనం గుంజివేయబడే భయానక దృశ్యాన్ని మనకు చూపుతుంది. దుర్మార్గులు సైతం అప్పుడప్పుడూ కొన్ని మంచి పనులు చేస్తుంటారు. అయితే, వాటి ప్రభావం వారి జీవితాలపై ఏమాత్రం వుండదు. వారి ద్వారా ఆచరింపబడే మంచి జీవరహితమైన హృదయాన్ని ఎంతమాత్రమూ చైతన్యపర్చజాలదు. మృత హృదయం గల వ్యక్తి, తన స్థాయిలోనే ఇతరులనూ తూచుతూ, అంచనా వేస్తూ వుంటాడు. ప్రజలలోని విశ్వాస, అవిశ్వాసాల మధ్య ఎటువంటి వ్యత్యాసాన్ని అతడు గుర్తించడు.

అమానతుదారీతనం అనేది ఒక గొప్ప సుగుణం. ఈ సుగుణాన్ని బలహీన విశ్వాస హృదయులు భరించలేరు. అల్లాహ్ స్వయంగా దాని హామికి సంబంధించిన ఒక ఉదాహరణను పేర్కొన్నాడు. అమానతుదారీతనం, మానవుడి అస్తిత్వాన్ని అత్యంత శక్తిమంతంగా మలుస్తుంది. కనుక దాని హక్కుల నెరవేర్పులో అలసత్వం– లోపం

ప్రదర్శించకూడదని అల్లాహ్ హెచ్చరించాడు.

**'మేము ఈ అమానతును ఆకాశాల ముందూ, భూమి ముందు, పర్వతాల ముందు పెట్టాము. అవి దానిని మోయడానికి సిద్ధపడలేదు. దానికి భయ పడ్డాయి. కాని మానవుడు దాన్ని తనపై మోపుకున్నాడు. నిస్సందేహంగా అతడు అన్యాయం చేసుకున్నాడు. (ఖుర్ఆన్, 33: 72)**

అజ్ఞానం, దౌర్జన్యాలతో మనిషి నిత్యం పోరాడుతూ వుండాలి. మనిషి తన విశ్వాసాన్ని దౌర్జన్య అజ్ఞానాల నుండి పరిశుద్ధం కావించుకోనంతవరకు అతని విశ్వాసం పరిశుద్ధం కాబడదు.

**'వాస్తవానికి విశ్వసించినవారికే, తమ విశ్వాసాన్ని దుర్మార్గంతో కలుషితం చేయనివారికే శాంతి, వారు మాత్రమే రుజుమార్గంపై వున్నారు.'(6: 82)**

దైవదాసుడు అజ్ఞానం నుండి బహుదూరంగా వుండనంతవరకు అతని ఆరాధనల్లో సంకల్పశుద్ధి ఏర్పడజాలదు.

**యదార్థమేమిటంటే, అల్లాహ్ దాసులలో జ్ఞానులు మాత్రమే ఆయనకు భయపడతారు. నిస్సందేహంగా అల్లాహ్ శక్తిమంతుడు, మన్నించే వాడునూ' (ఖుర్ఆన్, 35: 28)**

పై కారణంగానే 'మానవుని అమానతు స్వీకరణ'ను ప్రస్తావించిన తర్వాత అల్లాహ్ 'అహ్‌జాబ్' సూరాలో దౌర్జన్యం, అజ్ఞానంలో మునిగివున్న వ్యక్తులు నమ్మక ద్రోహానికి పాల్పడతారని, కపటులుగా వ్యవహరిస్తారని, వారిపై అల్లాహ్ శిక్ష తప్పని సరిగా విరుచుకుపడుతుందని హెచ్చరించడం జరిగింది. అంటే; శుభశ్రేయస్సులు అన్నీ కేవలం విశ్వాసం, అమానతుదారీతనం కలిగివున్న వారికే ప్రత్యేకించబడ్డాయని సెలవివ్వబడింది.

**"(ఈ అమానతు భారాన్ని పైన వేసుకున్న దాని అనివార్య ఫలితం ఏమిటంటే) కపటులైన స్త్రీ, పురుషులను, ముష్రిక్కులైన స్త్రీ పురుషులనూ అల్లాహ్ శిక్షించటం, విశ్వాసులైన స్త్రీపురుషుల పశ్చాత్తాపాన్ని అంగీకరించటం, అల్లాహ్‌మన్నించేవాడు, కరుణించేవాడూను.' (ఖుర్ఆన్, 33: 73)**



# 9 వ భాగం

# వాగ్దాన పాలన

- వాగ్దాన పాలన ముస్లిం నైతికతలో తప్పనిసరి భాగం
- మరుపులేనితనం- దృఢత్వం- వాగ్దాన పాలనకు ఆవశ్యం
- అతిపెద్ద కొలమానం
- అన్సారుల ఆదర్శవంత ప్రమాణం
- గతాన్ని మర్చిపోవడమూ వాగ్దాన భంగమే
- వాగ్దానపాలనకు సర్వ మానవులూ హక్కుదారులే
- రుణ చెల్లింపు తప్పనిసరి

## వాగ్దాన పాలన ముస్లిం నైతికతలో తప్పనిసరి విభాగం

ఎప్పుడైనా, ఏదైనా ఒక వ్యవహారంలో, ఒక ముస్లిం భాగస్వామి అయినప్పుడు- ఆ వ్యవహారంపట్ల ఆ ముస్లిం గౌరవభావం కలిగివుండాలి. ఆ వ్యవహారంలో ఏదైనా వాగ్దానం చేసినట్లయితే దానిపట్ల చివరి నిమిషం వరకు నిబద్ధతతో, బాధ్యతాయుతంగా వ్యవహరించాలి. తన సంభాషణలో ఆ వ్యవహారానికి పూర్తి న్యాయం చేకూర్చాలి. ఈ నిబద్ధత నీరు పల్లం వైపుకు పారేంత సహజంగా వుండాలి. విశ్వాసం- ఒక విశ్వాసి నుండి ఇటువంటి ఆచరణను, వ్యవహారశైలిని కోరుతుంది. విశ్వాసి వాగ్దాన పాలకునిగా, సమాజంలో ప్రసిద్ధుడు కావాలి. అతడి మాటల్లో వాగ్దాన భంగం, అవిధేయత, మాయదారితనం మచ్చుకు కూడా కానరాకూడదు.

చేసిన వాగ్దానాన్ని తప్పనిసరిగా నెరవేర్చితీరాలి. అదేవిధంగా చేసిన ప్రమాణాన్ని పూర్తి చేయడమూ తప్పనిసరి. అయితే వాగ్దాన పాలన, ప్రమాణ నెరవేర్పులు, సత్యంతో కూడుకున్న వ్యవహారాలకు మాత్రమే వర్తిస్తాయి. పాప కార్యాలకు దుష్టచేష్టలకు వాగ్దాన పాలన వర్తించదు. ఈ విషయంగా దైవసందేశ హరులు(స) ఇలా సెలవిచ్చారు.

'ఒక వ్యక్తి ఏదైనా ఒక విషయంగా ప్రమాణం చేశాడు. అయితే రెండవ విషయంలో అతనికి మరింత శుభశ్రేయాలు గోచరిస్తున్నాయి. అప్పుడు మొదటి విషయపు ప్రమాణాన్ని భంగం చేసి రెండవ దానిని స్వీకరించాలి. అయితే ప్రమాణ భంగానికి పరిహారం చెల్లించవలసి వుంటుంది. ఏ పనిలో మంచివుందో శుభశ్రేయాలు ఉన్నాయో దానిని పూర్తి చేయాలి.' (ముస్లిం)

ప్రమాణ పరిపూర్తి విషయంలో మనిషి పిడివాదిగా వుండకూడదు. తాహతుకు మించిన విషయాన్ని ప్రమాణం చేసినట్లయితే దానికి పరిహారం చెల్లించి ప్రమాణ భంగం చేసేయడమే ఉత్తమం. ప్రవక్త(స) వారు ఈ విషయంగా ఇలా మార్గదర్శకత్వం చేశారు:

'మీలో ఏ వ్యక్తి అయినా తాహతుకు మించి వాగ్దానం, ప్రమాణం చేసి దానిని నెరవేర్చలేని స్థితిలో పడిపోయి, ఆ సంఘర్షణలో తన భార్య వద్దకువెళ్ళడం పాపకార్యమవుతుంది. వాగ్దానాన్ని భంగపర్చి, దానికి పరిహారం చెల్లించి వేయడం ఎంతో ఉత్తమం.' (బుఖారి)

మంచి విషయానికి తప్ప, మరే విషయం సంబంధంగాను, వాగ్దాన భంగం వాంఛనీయం కాదు. ఒక మంచి విషయానికి సంబంధించి చేసిన వాగ్దానం కొరకు తన పూర్తి స్థాయి శక్తియుక్తులు వెచ్చించడం ఎంతో అభిలషనీయం. ఒక విషయం మంచిదిగా వుండి, తను నెరవేర్చగలిగినదిగా వుండి, విశ్వాసం, సన్మార్గం పై స్థిరంగా వుండేదిలా వుంటే– అందులో వాగ్దాన భంగానికి, సంకోచానికి ఎంతమాత్రమూ ఆస్కారం వుండకూడదు.

అనస్ బిన్ మాలిక్(రజి) ఈ విధంగా పేర్కొన్నారు : 'నా బాబాయి అనస్ బిన్ నజర్ (రజి) బదర్ సంగ్రామంలో పాల్గొనలేకపోయారు. ఈ విషయంగా ఆయన, ప్రవక్త(స)తో 'ఓ దైవప్రవక్తా! మీరు సత్యతిరస్కారులతో చేసిన మొదటి యుద్ధంలో నేను పాల్గొనలేకపోయాను. అల్లాహ్ నన్ను నిరంతరం మీతో ఉంచినట్లయితే తదుపరి జరిగే ధర్మయుద్ధంలో సత్యతిరస్కారులతో పోరాడే క్రమంలో మీరు నా వీరత్వాన్ని తప్పనిసరిగా తిలకిస్తారు' అని చెప్పారు.

ఉహుద్ యుద్ధం భీకరంగా జరుగుతున్న సమయంలో ముస్లిం సైన్యం తన స్వతప్పిదం వల్ల వెనుకంజ వేస్తూ వున్న విపత్కర పరిస్థితిలో అనస్ బిన్ నజర్(రజి) ఇలా ప్రార్థిస్తూ కదనరంగంలో కత్తి ఝుళిపిస్తూ ముందుకు ఉరికారు. 'ఓ అల్లాహ్! కొంతమంది ముస్లిం సైనికులు చేసిన తప్పుకుగాను నేను నిన్ను క్షమాపణ వేడుకుంటు న్నాను.' యుద్ధరంగంలో ఆయన సఅద్‌బిన్ ముఆజ్(రజి)ను కలుసుకున్నారు. ఆయనతో గొంతెత్తి 'ఓ ముఆజ్ (రజి)! నజర్ ప్రభువు సాక్షి! (అల్లాహ్ సాక్షి!) స్వర్గం వైపుకు కదలవా! నేను ఈ ఉహుద్ మైదానపు ఒడిలో స్వర్గ సుగంధాన్ని ఆస్వాదిస్తు న్నాను' అన్నారు.

సఅద్(రజి) ఈ సంఘటనను దైవప్రవక్త(స)తో వివరిస్తూ 'ఓ దైవప్రవక్తా! ఆయన అమరత్వంపట్ల చూపిన ఆ శక్తి వర్ణనాతీతం' అని అన్నారు.

హజ్రత్ అనస్(రజి) తన బాబాయి వీర మరణాన్ని ఈ క్రింది మాటల్లో వివరించారు. 'మేము ఆయన శరీరంపై 80 కంటే ఎక్కువ గాయాలను చూశాము. ఖడ్గధారలు, ఈటెల గాయాలు, బాణాల గుర్తులు ఆయన శరీరాన్ని కప్పివేశాయి. సత్య తిరస్కార ముష్కరులు ఆయన ముక్కుచెవులను కోసివేశారు. ఆయునను గుర్తుపట్టలేని విధంగా చేశారు. చివరకు పుట్టుమచ్చలు, చేతివేళ్ళ ఆధారంగా ఆయన సోదరి ఆయన మృతదేహాన్ని గుర్తించింది.' ఈ సంఘటన వివరించిన తర్వాత

అనస్(రజి) ఇలా పలికారు 'పేర్కొన్న ఖుర్ఆన్ వాక్యం ఆయన గురించి లేక ఆయనవంటి వీరుల గురించే అవతరించిందని మేము భావిస్తున్నాము' అంటూ ఈ క్రింది గ్రంథ వాక్యాన్ని పఠించారు.

**'విశ్వాసులలో అల్లాహ్‌కు తాము చేసిన వాగ్దానాన్ని నిజం చేసి చూపినవారూ వున్నారు. వారిలో కొందరు తమ మొక్కుబడిని తీర్చుకున్నారు, మరికొందరు సమయం కోసం నిరీక్షి వున్నారు. వారు తమవైఖరిని ఏమాత్రం మార్చుకోలేదు.**

**(ఖుర్ఆన్, 33: 23)**

## మరుపులేనితనం- దృఢత్వం- వాగ్దాన పాలనకు ఆవశ్యం

వాగ్దాన పాలనకు రెండు అంశాలు అవసరమవుతాయి. మరుపుకు గురి కాకుండా వుండటం, నిలకడతో కూడిన దృఢచిత్తం కలిగివుండటం వాగ్దానపాలనకు అత్యవసరాలు. పై రెండు అంశాలు కలిగివున్న వ్యక్తికి వాగ్దాన పాలన, ఒప్పందాల నెరవేర్పు సులభతరమవుతుంది. ప్రవక్త ఆదం(అలై) నుండి, అల్లాహ్ నిషిద్ధ వృక్షం వద్దకు వెళ్ళకూడదని వాగ్దానం తీసుకున్నాడు. కాని ఆదం(అలై) కొన్ని దినాల్లోనే ఈ వాగ్దానాన్ని మరిచిపోయారు. బలహీనతకు లోనయ్యారు. వాగ్దానాన్ని భంగపర్చారు. ఈ విషయాన్ని దివ్యఖుర్ఆన్ ఈక్రింది విధంగా విశదీకరించింది.

**"దీనికి పూర్వం మేము ఆదమ్‌కు ఒక ఆజ్ఞ ఇచ్చాము. కాని అతను దానిని మరిచిపోయాడు. మేము అతనిలో నిలకడను చూడలేదు.' (20: 115)**

మరుపుకు గురికావడం, నిలకడ లోపించడం, దృఢచిత్తం లేకపోవడం, విధుల నిర్వహణకు, వాగ్దాన పాలనకు ఆటంకాలు అవుతాయి. కాని అత్యంత సహజమైన విచిత్రమేమిటంటే, మనిషి పలు హఠాత్ పరిణామాల కారణంగా వివిధ జీవిత సమస్యల మూలకంగా అనేక భౌతికాంశాలను మర్చిపోతూ వుంటాడు. స్పష్టమైన మార్గదర్శక అడుగుజాడలు సైతం మసకబారి పోతాయి. సూర్యుని వెలుగు వంటి ప్రస్ఫుటాలు కూడా దృష్టి నుంచి కనుమరుగవుతాయి. కనుక మరుపురానితనాన్ని-మనిషి అలవర్చుకోవాలి. జ్ఞాపకశక్తిని పరిరక్షించుకుంటూ వుండటం చాలా ఆవశ్యం. ఈ విషయంగా దివ్యఖుర్ఆన్ అనేక విషయాలు తెలిపింది.

**"ప్రజలారా! మీ ప్రభువునుండి మీపై అవతరింపజేయబడిన దానిని**

**అనుసరించండి. మీ ప్రభువును త్రోసిరాజని ఇతర సంరక్షకులను అనుసరించకండి– కాని మీరు హితబోధను స్వీకరించడం అరుదు.' (7: 3)**

**'ఈ మార్గం నీ ప్రభువు యొక్క రుజుమార్గం. దాని చిహ్నాలు హితబోధను స్వీకరించేవారి కొరకు స్పష్టం చేయబడ్డాయి.' *(ఖుర్ఆన్, 6: 126)***

**'భయభక్తులు అనే దుస్తులే మంచి దుస్తులు. ఇది అల్లాహ్ సూచనలలోని ఒక సూచన. బహుశా ప్రజలు దీనిద్వారా గుణపాఠం నేర్చుకుంటారేమో'(7: 26)**

**'ఈ విధంగా మేము మృతులను నిర్జీవ స్థితినుండి ఉద్భవింపజేస్తాము. బహుశా మీరు దానిని చూసి అయినా గుణపాఠం నేర్చుకుంటారేమో అని' (7: 57)**

పై దైవవాక్యాల వెలుగులో– సజీవ జ్ఞాపకశక్తి, చైతన్యవంతమైన మరుపులేనితనాలు వాగ్దానాలకు అత్యంత ఆవశ్యకాలని అర్థమవుతుంది. చేసిన వాగ్దానాన్ని మరిచిపోయిన వ్యక్తి దాని నెరవేర్పుకు ఎలా పూనుకోగలడు? ఈ కారణంగానే క్రింద పేర్కొనబడిన ఖుర్ఆన్ వాక్యంలో, అల్లాహ్ వాగ్దాన పాలనకు సంబంధించిన ఆజ్ఞను జారీచేస్తూ చివరగా అల్లాహ్ స్మరణ గురించి తెలిపాడు:

**"అల్లాహ్‌తో చేసుకున్న ఒడంబడికను నెరవేర్చండి. ఈ మాటలను అల్లాహ్ మీకు ఉపదేశిస్తున్నాడు. బహుశా మీరు హితబోధను స్వీకరిస్తారేమో అని.' (6: 152)**

మనిషిలో వాగ్దాన పాలనకు సంబంధించిన చైతన్యం సజీవంగా వేళ్ళూనుకుంటే జ్ఞాపకశక్తికి దృఢనిశ్చయం తోడు అవుతుంది. అప్పుడు వాగ్దాన పాలనలో మరుపుకు అవకాశం వుండదు. వ్యతిరేకాంశాలు, నకారాత్మకాలు పటా పంచలయి పోతాయి. వాగ్దాన పాలనా క్రమంలో ఎదురయ్యే కష్టాల తీవ్రతను, అన్నిరకాల ఇబ్బందులను అధిగమించే నిలకడ లభ్యమవుతుంది. త్యాగనిరతికి సంబంధించి గొప్ప ఉదాహరణగా నిలిచిపోతుంది.

వాగ్దాన పాలనా విషయంగా ప్రజలు రకరకాల ప్రమాణాలు, కొలబద్ధలు కలిగివుంటారు. కాని ఇవేవి సరికావు. వాగ్దాన పాలన కొరకు ఎంతో ఖర్చు చేయవలసి వుంటుంది. ధన సంపత్తిని, ప్రియమైన వస్తుసామగ్రిని, సమయాన్ని చివరకు జీవితాన్ని సైతం పణంగా పెట్టవలసి వుంటుంది. ఈ వాగ్దాన పాలన కొరకు ఎదుర్కొనే ఇబ్బందులు, కష్టాలు, నష్టాలు ఖచ్చితంగా ఇహపరలోకాల్లో సాఫల్యానికి మార్గాలుగా, గౌరవోన్నత స్థాయికి రహదారులుగా వుంటాయి. సౌఖ్యాల నీడల్లో

తేలియాడుతూ ఔన్నత్యాన్ని పొందాలనే అత్యాశాపరులను, స్వల్పంగా కష్టపడి అధికంగా పొందాలనే స్వార్థపరులను అల్లాహ్ తీవ్రంగా నిరసించాడు.

**'స్వర్గ ప్రవేశం ఊరకే లభిస్తుందని మీరు అపోహపడుతున్నారా? మీకు పూర్వం విశ్వాసులకు సంభవించినవన్నీ ఇంకా మీకు సంభవించనేలేదే! వారిపై ఆపదలు, ఎనలేని వ్యధలు విరుచుకుపడ్డాయి. వారు కుదిపి వేయబడ్డారు. చివరకు అప్పటి ప్రవక్త, విశ్వాసులైన అతని అనుచరులు 'అల్లాహ్ సహాయం ఇంకా ఎప్పుడొస్తుంది?' అని ఆక్రోశించారు. అప్పుడు, 'అదిగో, అల్లాహ్ సహాయం సమీపంలోనే వుంది' (అని వారిని ఓదార్చటం జరిగింది). (2: 214)**

కాబట్టి ఎప్పుడైతే మనిషి చైతన్యభరితమైన, మరుపుకు గురికాని మస్తిష్కం, దృఢచిత్తం గల హృదయం కలిగివుంటాడో అప్పుడు అతడు విశ్వసనీయులలో ఒకడిగా వుంటాడని గ్రహించాలి.

## అతిపెద్ద కొలమానం

ఒక ముస్లిం దృష్టిలో అన్నింటికంటే గొప్పదైన, పవిత్రమైన కొలమానం తాను తన ప్రభువు అల్లాహ్‌తో చేసిన వాగ్దానమే. ఎందుకంటే, అల్లాహ్ తన శక్తితో మనిషిని సృష్టించాడు. తన అనుగ్రహాల వరాలతో అతడిని పోషించాడు. ఈ కారణంగానే విశ్వ ప్రభువు, సృష్టికర్త, పోషకుడు అయిన అల్లాహ్, మనిషిని ఈ వాస్తవాన్ని గ్రహించమని, అంగీకరించమని కోరుతున్నాడు. ఈ ప్రపంచంలోని రంగురంగుల వక్రమార్గాలు అతడిని రుజుమార్గం నుంచి తప్పించకూడదు. మనిషి అల్లాహ్‌ను గుర్తించలేని వాడిగా రూపొందకూడదు. అల్లాహ్ అభీష్టం ఇదే.

**'ఆదం సంతానమా! నేను మీకు ఉపదేశించలేదా, షైతానుకు దాస్యం చేయవద్దని, వాడు మీకు బహిరంగ శత్రువు అనీ, నా దాస్యమే చేయండి అనీ, ఇదే సరైన మార్గమనీ?' *(ఖుర్‌ఆన్,* 36: 60,61)**

ప్రజలు దైవప్రవక్తల బోధనలపై దృష్టిని సారించినప్పటికీ, వారి బోధనల ద్వారా ప్రయోజనం పొందనప్పటికీ, ప్రజల నైజంలోనే ఒక సహజమైన చైతన్యం, వారిని నిరంతరం సత్య విషయంపై మళ్ళిస్తూ– హెచ్చరిస్తూ ముల్లులా గుచ్చుతూ వుంటుంది. వారిని తమ నిజప్రభువు యొక్క మార్గాన్ని చూపుతూ వుంటుంది. తన సృష్టికర్త శక్తి ఔన్నత్యాల పట్ల స్పృహను కల్గిస్తూ వుంటుంది. తనచుట్టూ వున్న

సమాజంలో వేళ్ళూనుకొని వున్న దుష్టత్వాలను, దురాచారాలను, భ్రష్ట ఉపద్రవాలను కాదని, అతని మనస్సు మంచిని గుర్తిస్తుంది. దానిపట్ల మొగ్గు చూపుతుంది. సరిగ్గా మానవాళి నుండి అల్లాహ్ తీసుకున్న వాగ్దానం ఇదే.

**'ప్రవక్తా! ప్రజలకు ఆ సమయాన్ని జ్ఞాపకం చెయ్యి. అప్పుడు నీ ప్రభువు ఆదం సంతతి యొక్క వీపుల నుండి వారి సంతానాన్ని తీసి ఇంకా స్వయంగా వారిని వారికే సాక్షులుగా నిలబెట్టి అడిగాడు : "నేను మీ ప్రభువును కాదా?" అని. వారు ఇలా అన్నారు: 'నిశ్చయంగా మీరే మా ప్రభువు. మేము దీనికి సాక్ష్య మిస్తున్నాము. మేము ఇలా ఎందుకు చేశామంటే; ప్రళయదినం నాడు మీరు, 'మాకు ఈ విషయం తెలియదు' అని అనకుండా వుండేందుకు. లేదా 'షిర్క్‌ను మా తాతముత్తాతలు మాకంటేముందే ప్రారంభించారు. తరువాత మేం వారి సంతతికి జన్మించాము. దుర్జనులు చేసిన నేరానికి మీరు మమ్మల్ని పట్టుకుం టారా?' అని అనకుండా వుండేందుకు. చూడండి, ఇలా మేము సూచనలను స్పష్టంగా వివరిస్తాము. వారు మరలి రావాలని ఇలా చేస్తాము.'**

***(ఖుర్ఆన్, 7: 172 - 174)***

పై వాక్యాల భావం, బాహ్యార్థం ద్వారా స్పష్టమయ్యే విషయం, సవ్యమైన నైజాన్ని కలిగివున్న వ్యక్తులు అల్లాహ్ వైపునకు మొగ్గుతారు. అల్లాహ్‌ను గ్రహిస్తారు. విశ్వంలోనూ, తన చుట్టూ ఆవరించివున్న ప్రకృతిలోనూ వ్యాపించి వున్న నిదర్శనాల ద్వారా అల్లాహ్ ఏకత్వాన్ని ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. తమ ప్రభువు నుండి దూరం చేసే దుష్ట అంధాను సరణ నుండి దూరమవుతారు. పై వాక్యాలు ఈ విషయాలకే అద్దం పడుతున్నాయి. అరబ్బీ సాహితీశైలిలో ఈ విషయాలే చెప్పబడ్డాయి. పేర్కొన్న వాగ్దాన పాలన ద్వారా మనిషి యొక్క విశ్వసనీయత నమ్మకాలు గుర్తింపబడి ప్రపంచంలో గౌరవోన్నతులకు, పరలోకపు సాఫల్యానికి కారణభూతాలవుతాయి. అల్లాహ్‌కు చేసిన వాగ్దానాన్ని నెరవేరుస్తూ వుండి కూడా అల్లాహ్ తరపు నుండి చెడు జరుగుతుందని భావించనే కూడదు. అది అల్లాహ్ ఔన్నత్యం పట్ల అపనమ్మకానికి గుర్తు అవుతుంది.

**"...నేను మీకు ప్రసాదించిన కానుకను గురించి ఆలోచించండి. మీరు నాతో చేసిన వాగ్దానం నెరవేర్చండి. నేను మీతో చేసిన వాగ్దానం నెరవేరుస్తాను. నాకు మాత్రమే మీరు భయపడండి.'** ***(ఖుర్ఆన్, 2: 40)***

దైవసందేశహరులు (స) ప్రజలకు ఇస్లామీయ సందేశం అందించే సందర్భంలో తన వద్దకు వచ్చే వివిధ తెగల ప్రజలను ఇస్లామీయ విశ్వాసాలను విలువలను విశదీకరించేవారు. అయితే ఆయా వ్యక్తుల బుద్ధి వికాసన, జ్ఞానపరిధి ఆధ్యాత్మిక స్థాయి, పునాదులపై వారికి ధర్మోపదేశం చేసేవారు. ధర్మాదేశాలను ఏకంగా వారిపై కుమ్మరించేవారు కారు.

ఔఫ్ బిన్ మాలిక్(రజి) ఉల్లేఖనం ప్రకారం, 'మేము ఏడు, ఎనిమిది లేక తొమ్మిది మందిమి ప్రవక్త(స)తోపాటు వున్నాము. ఆయన(స) మమ్మల్ని ఇలా ప్రశ్నించారు 'మీరు దైవప్రవక్త చేతిపై ప్రమాణం చేయరా?' అప్పుడు మేము మా చేతులను చాపి 'ఓ దైవప్రవక్తా! మేము మీ చేతిపై ప్రమాణం చేస్తున్నాము' అని పలికాము.

అప్పుడు ప్రవక్త(స) వారు 'మీరు అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించండి. ఆయనకు సహవర్తులుగా ఎవరినీ నిలబెట్టకండి. ఐదుపూటలా నమాజ్‌ను స్థాపించండి. వినండి...! విధేయత పాటించండి!' ఆ తర్వాత మెల్లగా 'ప్రజలనుండి ఏమీ ఆశించ కండి' అని ప్రమాణం చేయించారు.

పై ప్రమాణం చేసినవారిలో చాలామందిని నేను చూశాను. వారు తమ కొరడా క్రింద పడితే దానిని తీసిఇవ్వమని ఎవరినీ కోరేవారు కారు. (స్వయంగా వారే తీసుకునేవారు- అను) (ముస్లిం)

ప్రవక్త(స)వారి అనుచరుల ఆచరణను గమనించారా! వారు ఒక ఒడంబడికకు ప్రమాణానికి, వాగ్దానానికి ఎంతటి విలువనిస్తున్నారో, విలువ స్థాపన ఎంతటి కఠినంగా జరుగుతుందో. శిక్షణ, పర్యవేక్షణల ద్వారా ఎలా అమలవుతుందో గమనించారా! ప్రతి వర్గానికి దాని దాని నైజం, పరిస్థితుల రీత్యా దైవప్రవక్త(స) బోధిం చారు. పరిపాలకు డిని లేక అధికారిని, దౌర్జన్యానికి,అన్యాయానికి పాల్పడకూడదని ఉపదేశించడం జరిగింది. వ్యాపారిని-తన వ్యాపారంలో మోసానికి హెచ్చుతగ్గుల తూకానికి పాల్పడకూడదని హెచ్చరించడం జరిగింది. ఉద్యోగిని- లంచగొండితనం నుండి బాధ్యతా రాహిత్యం గురించి హెచ్చరించడం జరిగింది. అయితే ఒక ముస్లింని మాత్రం సమస్త ధర్మానికి బాధ్యునిగా చేయడం జరిగింది. తీర్పుదినాన అతడిని పూర్తి ఇస్లామీయ ధర్మశాస్త్రంపై అమలు గురించి ప్రశ్నించడం జరుగుతుంది. కాలక్రమంలో ఇస్లామీయ ప్రపంచంలో దురదృష్టవశాత్తు కొన్నివర్గాలు వునికిలోకి వచ్చాయి. అవి తమ తమ ప్రమాణాలను తమ తమ అనుయాయులకు అందించాయి. కాని ఒక నిజ

విశ్వాసి అటువంటి వర్గాల వైపుకుగాని, అవి అందించిన ప్రమాణాల వైపుకుగాని దృష్టిసారించనేకూడదు. ఇస్లాంలో పై వర్గ ప్రబుద్ధుల స్థానం ఎటువంటిది అంటే; వారు నకిలీ వైద్యులై వుండీ తాము సంపూర్ణ వైద్యులమని ప్రకటించుకుంటారు. నకిలీ మందులను అందించి వ్యాధులను మరింత ముదిరిపోయేలా చేస్తారు.

ఇస్లామీయ బోధనలను కొన్ని ప్రత్యేక భాగాలుగా విడగొట్టి అందునుంచి కొన్ని భాగాలను మాత్రమే ఆచరించడం సరైన పద్ధతికాదు. ధర్మశాస్త్రం ప్రకారం విధికావించబడిన అంశాలన్నీ ఆచరించి తీరవలసిందే. స్థలకాలాలకు అతీతంగా ధర్మం మొత్తాన్ని, జీవితపు రంగాలన్నింటిలోనూ స్థాపించవలసిందే.

## అన్సారుల ఆదర్శవంత ప్రమాణం

ప్రవక్త(స) తన సహచరులతో కలిసి అల్లాహ్ ఆదేశంతో మక్కా నుండి మదీనాపురికి వలస (హిజ్రత్) వెళ్ళారు. వలస వచ్చిన ముస్లింలను అన్నివిధాలుగా సహాయపడిన మదీనావాసులను 'అన్సార్లు' అంటారు. 'అన్సార్' అనగా సహాయపడిన వారు అని అర్థం. ఈ సందర్భంగా దైవప్రవక్త(స) అన్సారులతో, ఇస్లామీయ ఉద్యమానికి అన్నివిధాలా సహకరిస్తామని వాగ్దానం (బయ్యత్) తీసుకున్నారు. ధన ప్రాణాలను పణంగాపెట్టి దైవదౌత్య పరిరక్షణ కొరకు కృషిచేసేలా వారి నుండి ప్రమాణం (బయ్యత్) తీసుకున్నారు. ఇంకా ఇస్లామీయ సందేశాన్ని అరబ్బు, అరబ్బేతర ప్రపంచానికి అందించేందుకు ప్రాణాలకు తెగించి కృషిచేసేలా వారి నుండి ప్రమాణం తీసుకున్నారు.

ఈ నేపథ్యంలో అన్సారులు దైవప్రవక్త(స) చేతి మీద చేసిన ప్రమాణం (బయ్యత్) విశ్వాసాల చరిత్రలోనే అత్యంత కాంతిమంతమైన, సువర్ణాక్షరాలతో లిఖించదగిన ప్రమాణంగా నిలిచిపోయింది. సత్ సంకల్పం, అల్లాహ్ పట్ల అంకిత భావం, సత్యమార్గంలో ప్రాణాలను తృణప్రాయంగా అర్పించే విషయాలలో ఈ ప్రమాణాన్ని పోలిన ఉదాహరణ మరొకటి చరిత్రలో కానరాదు.

ఈ ప్రమాణం హజ్‌కాలంలో ఒక మరుపురాని రాత్రి సమయంలో తీసుకోబడింది. ఈ ప్రమాణం తర్వాత సాధారణ ప్రజలు తమ తమ దైనందిన కార్యకలాపాలలో నిమగ్నులయ్యారు. కాని, అన్సారులు మాత్రం తమ ప్రమాణాల నెరవేర్పు కృషిలో బాధ్యతల నిర్వహణలో లీనమయి పోయారు. ఈ ప్రమాణం అత్యంత సహజంగా విసిరే సవాళ్ళను ఎదుర్కొనేందుకు హృదయపూర్వకంగా వీరు సంసిద్ధులయ్యారు.

మొదటి ధర్మయుద్ధం బద్ర్ సంగ్రామంలోనూ, ఇస్లాంకు, అవిశ్వాసులకు మధ్య జరిగిన ఇతర ఆత్మరక్షక యుద్ధాలలోనూ అన్సారులు తమ రక్తాన్ని నీరులా పారించారు. ప్రవక్త(స) ధర్మసంకట స్థితిలోనూ, కష్టకాలంలోనూ, అల్లాహ్ కలిమను వ్యాపింపజేయటంలోనూ అన్సారులతో చేయించిన ప్రమాణానికి అత్యున్నత స్థానం ఇచ్చేవారు. హునైన్ యుద్ధరంగంలో ముస్లిం సైన్యం వెనుకంజ వేస్తూ వున్న సమయంలో, పరిస్థితులను అదుపులో వుంచేందుకు ప్రవక్త(స)వారు, ఇతర సైనిక బృందాలపై ఆధారపడకుండా హజ్ సమయాన లోయలో ప్రమాణంచేసిన అన్సారుల పటాలంపైనే ఆధారపడ్డారు. వారికి బాధ్యతలను అప్పగించారు. హునైన్ యుద్ధరంగం దృశ్యాన్ని అనస్(రజి) ఈవిధంగా వివరించారు.

'హునైన్ యుద్ధరంగంలో ఇస్లాంకు వ్యతిరేకంగా హవాజన్, గత్ఫాన్ తెగలు, ఇతర తెగలతో కలిసి యుద్ధ వనరులు పుష్కలంగా తీసుకొని తమ పుత్రులు, యుద్ధ నిపుణులతో కలిసి కదనరంగంలో దిగారు. ప్రవక్త(స) వద్ద పదివేల సైన్యం వున్నప్పటికీ వారిలో మక్కా విజయం రోజున విశ్వసించిన నవ ముస్లింలే అధికంగా వున్నారు. భీకర యుద్ధరంగంలో వీరందరూ విశ్వాస బలహీనత కారణంగా ప్రవక్త(స) వారికి సహకరించక మిన్నకుండిపోయారు. దైవప్రవక్త(స) ఒంటరిగా మిగిలి పోయారు.

ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లో దైవప్రవక్త(స) తన కుడివైపునకు తిరిగి ఓ అన్సారుల బృందమా! అని ఎలుగెత్తి పిలిచారు. అందుకు అన్సార్లు 'ప్రవక్తా (స)! మేము హాజరయ్యాము, మేము మీతోపాటు వున్నాము. మీరు సంతోషించండి!' అని అన్నారు. తర్వాత ప్రవక్త(స) తన ఎడమ వైపుకు తిరిగి 'ఓ అన్సారుల బృందమా!'అని ఎలుగెత్తి పిలిచారు. అందుకు బదులుగా అన్సార్లు 'ఓ దైవప్రవక్తా(స)! మేము హాజరయ్యాము. మేము మీతోపాటు వున్నాము. మీరు సంతోషించండి!' అని బదులు పలికారు. అప్పుడు దైవప్రవక్త ఒక తెల్లని సాధారణ గుర్రంపై అధిరోహించి వున్నారు. దాని నుండి క్రిందికి దిగి ఈవిధంగా పలికారు. 'నేను అల్లాహ్ దాసుడిని! ఆయన సందేశహరుడిని.'

ఇస్లాం శత్రువులైన బహుదైవారాధకులు ఈ యుద్ధంలో ఓటమిపాలయ్యారు. యుద్ధ సొత్తు పెద్దమొత్తంలో ముస్లింల వశమయింది. ఈ సొత్తు మొత్తంగా మక్కా నుండి వలస వచ్చిన 'ముహాజిర్ల'కు, మక్కా విజయ సందర్భంగా ఇస్లాం స్వీకరించిన నవ ముస్లింలకు పంచివేశారు. అందులో మదీనా అన్సారులకు ఏమీ ఇవ్వలేదు. ఈ విషయంగా అన్సారుల్లో గుసగుసలు మొదలయ్యాయి. 'కష్టకాలంలో మాకు పిలుపు

ఇవ్వబడేది- యుద్ధ సొత్తు పంపకంలో ఇతరులు గుర్తుకొస్తున్నారు' అని చెవులు కొరుక్కోసాగారు. విషయం ప్రవక్త(స) వరకు చేరింది. అప్పుడు దైవప్రవక్త(స) అన్సారులందరిని సమావేశపర్చారు. వారితో ఇలా సంభాషించారు.

'ఓ అన్సారుల వర్గమా! మీనుండి నాకు, నేను ఊహించని వార్తలు వస్తున్నాయి ఏమిటి?' ఈ ప్రశ్నకు అన్సారులు మౌనం వహించారు. దైవప్రవక్త(స) సంభాషణ కొనసాగిస్తూ 'ఓ అన్సారుల సమూహమా! ప్రజలు ప్రాపంచిక సామగ్రిని తీసుకెళ్ళారు. మీరు ముహమ్మద్‌ను తీసుకొని తిరిగి మీ ఇళ్ళకు వెళ్ళడానికి ఇష్టపడరా?' అని ప్రశ్నించారు. ఈ ప్రశ్నతో సంతోషం పట్టలేని అన్సారులు 'ఓ దైవప్రవక్తా! ఎందుకు ఇష్టపడం. ఈ విషయంలో మాకంటే అదృష్టవంతులు ఎవరు?' అని బదులు పలికారు. అప్పుడు ప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: 'ప్రజలందరూ ఒక లోయ గుండాప్రయాణిస్తే- అన్సారులు మరో లోయ నుండి ప్రయాణిస్తూ వుంటే నేను అన్సారులతో కలిసి ఆ లోయలోనే నడుస్తాను.' (బుఖారి)

నిజం ఏమిటంటే ఇస్లామీయ మహోద్యమ విజయానికి అన్సారుల కర వాలాలు విశేషంగా ఉపయోగపడ్డాయి. వారు చేసిన వాగ్దానాన్ని నెరవేర్చుకోవడానికి తమ ధన, ప్రాణ సర్వస్వాలను ధారపోశారు. వారు కేవలం కొన్ని దినాలకు ఉ పయోగపడే ప్రాపంచిక సుఖాన్ని తృణప్రాయంగా ఎంచారు. అందుకే దైవప్రవక్త ముహమ్మద్ (స) అన్సారులతో శాశ్వతంగా మదీనాపురిలోనే వుండిపోయారు. (అన్సారుల గౌరవాన్ని ఈ విధంగా ప్రవక్త(స) ద్విగుణీకృతం చేశారు. వారి ప్రాముఖ్యతను తెలియపర్చారు- అను)

యుద్ధ సొత్తు పంపకంలో దైవప్రవక్త(స) ప్రజల విశ్వాస స్థాయిని పరిగణలోనికి తీసుకున్నారు. నూతనంగా ఇస్లాంలో ప్రవేశించినవారు, జీవితంలో నిలదొక్కుకోవ డానికి, ఆర్థిక ఒడిదుడుకుల నుండి బయటపడి సాఫీగా జీవితం సాగించడానికి ఈ యుద్ధ సొత్తును వినియోగించారు. వీరిలో విశ్వాసం ఇంకా దృఢతరం కాలేదు. పేదరికం, దారిద్ర్యం వీరిని తిరిగి అవిశ్వాసం వైపుకు మళ్ళించే ప్రమాదం వుంది. అందుకే ప్రవక్త(స) వివేకంతో హృదయాలను గెలుచుకునేలా ప్రవర్తించారు. ఇక అన్సారుల హృదయాలు విశ్వాసపు దృఢత్వంతో మిసమిసలాడుతూ వున్నాయి. వారి హృదయాలు అపారమైన విశ్వాసపు సంపదకు స్థానాలై వున్నాయి. వారికి పేదరికం, కష్టనష్టాలు ఏమాత్రం భయపెట్టజాలవు. ఈ కారణంగానే యుద్ధసొత్తులో వారిని

భాగస్వాములుగా చేయలేదు. పేదరికం, దారిద్ర్యాల గురించి ప్రవక్త(స) ఈవిధంగా పేర్కొన్నారు.

'నేను ఒక వ్యక్తికి సంపదను అందజేస్తున్నాను. ఎందుకంటే, ఆ వ్యక్తి పేదరికం కారణంగా అల్లాహ్‌చే నరకంలో పడవేయబడకూడదు. (అనగా పేదరికం కారణంగా ఆ వ్యక్తి అధర్మం వైపుకు, అధర్మ సంపాదన వైపుకు, దైవతిరస్కారం వైపుకు మరలకూడదు) వాస్తవానికి నాకు ఇతర ప్రజలు ఎంతో ప్రియతములు' (బుఖారి)

## గతాన్ని మరిచిపోవడమూ వాగ్దాన భంగమే

ఉత్తమమైన వాగ్దాన పాలన, మనిషి గతాన్ని నిరంతరం గుర్తుచేసుకోవాలని ఆశిస్తుంది. తద్వారా వర్తమానం, భవిష్యత్తులలో లోపరహిత ఆచరణ చేయగలగాలి. గతంలో ఒక వ్యక్తి పేదవాడిగానో లేక వ్యాధిగ్రస్తునిగానో వుండి ప్రస్తుతం అల్లాహ్‌చే ధనికునిగా లేక ఆరోగ్యవంతునిగా మారి వుండవచ్చు. గతం మర్చిపోయిన వ్యక్తి తాను ఎన్నడూ గతంలో అవసరార్థునిగా– సహాయం పొందినవానిగా లేనట్లు ప్రవర్తిస్తాడు. 'మర్చిపోవడాన్ని' గతానికి, వర్తమానానికి మధ్య ఒక అడ్డులాగా నిర్మించుకుంటాడు. ఇది ఎంతమాత్రం వాంఛనీయం కాదు. ఇటువంటి వ్యక్తిత్వాన్ని స్పష్టమైన ధిక్కారంగా దుర్మార్గంగా తీర్మానించవలసి వుంటుంది.

ఈ విధమైన 'మరపు నటన' కూడా వాగ్దాన భంగమే అవుతుంది. ఇది మానవుడిని ఒక కపటిగా మార్చివేస్తుంది. ఈ కపట వర్తనుడు అల్లాహ్ కారుణ్యానికి దూరమయిపోతాడు. ఇతనికి అల్లాహ్ శరణు వేడుకునే సత్‌బుద్ధి ప్రాప్తం కాదు. ఈ విషయంగా మదీనాలో జరిగిన ఒక సంఘటన ఇక్కడ ఉటంకించడం చాలా అవసరం.

'సల్‌బా' అనబడే ఒక మదీనా వాసి ఒకరోజు అన్సారుల సమూహం వద్దకు వచ్చి 'ఒకవేళ అల్లాహ్ నన్ను తన అనుగ్రహంతో సంపన్నునిగా చేస్తే నేను ప్రతి ఒక్క హక్కుదారినికీ అతని హక్కును అందజేస్తాను. దానధర్మాలు చేస్తాను. ప్రజలతో ఉత్తమ రీతిలో వ్యవహరిస్తాను' అని పలికాడు. యాదృచ్ఛికంగా అతని పినతండ్రి కుమారుడు మరణించి 'సల్‌బా' ఒక్కడే ఆస్తి మొత్తానికి వారసుడయ్యాడు. కాని, అతడు తన వాగ్దానాన్ని నెరవేర్చలేదు. తాను చేసిన ప్రమాణాన్ని గుర్తుపెట్టుకోనూ లేదు. ఈ సంఘటనపై అల్లాహ్ తన వాక్కును ఇలా అవతరింపజేశాడు.

**"ఆయన (అల్లాహ్) గనక తన అనుగ్రహం నుండి మాకు ప్రసాదిస్తే మేము దానం చేస్తాము, సజ్జనులమై వుంటాము అని అల్లాహ్‌కు ప్రమాణం చేసినవారు కూడా కొందరు వారిలో వున్నారు. కానీ, అల్లాహ్ తన అనుగ్రహం వల్ల వారిని సంపన్నులుగా చేసినప్పుడు, వారు పిసినారితనానికి దిగారు. తమ ప్రమాణం నుండి మరలిపోయారు. దానిని ఏమాత్రం లెక్కచేయటంలేదు. ఫలితం ఏమయిందంటే, వారు అల్లాహ్ ఎడల చేసిన ఈ ప్రమాణ భంగం కారణంగా వారు చెబుతూ వచ్చిన అబద్ధం కారణంగా, అల్లాహ్ వారి హృదయాలలో కాపట్యాన్ని నాటాడు. అది, ఆయన సమక్షంలో హాజరయ్యే రోజు వరకు వారిని వెంటాడటం మానదు. వారికి తెలియదా? అల్లాహ్‌కు వారి గుప్త రహస్యాలూ, వారి రహస్య సమాలోచనలూ సయితం తెలుసని' (ఖుర్‌ఆన్, 9: 75-78)**

బనీ ఇస్రాయియాల్ సంతతిలో వేళ్లూనుకొని వున్న వాగ్దాన భంగం, కృతఘ్నత, విశ్వాస ఘాతుకానికి సంబంధించిన ఒక ఉదాహరణను అబూహురైరా(రజి) దైవ ప్రవక్త(స) ద్వారా ఈ క్రింది విధంగా ఉల్లేఖించారు.

'ఇస్రాయియాల్ సంతతిలో ముగ్గురు వ్యక్తులు-ఒకడు కుష్టు రోగి, ఒకడు వికారి అయిన బట్టతలవాడు, మరొకడు గుడ్డివాడు వుండేవారు. అల్లాహ్ వారిని పరీక్షించదలిచి వారి వద్దకు తన దూతను పంపాడు. దైవదూత కుష్టు రోగిని 'నీకు ఏం కావాలో కోరుకో, నీవు అత్యంత ఇష్టపడేది ఏది?' అని ప్రశ్నించాడు. దానికి అతడు, ఏ వ్యాధి కారణంగా ప్రజలు నన్ను అసహ్యించుకుంటున్నారో- ఆ వ్యాధి తొలగిపోయి నాకు అందమైన రంగు, సుందరమైన చర్మం కావాలి' అన్నాడు. అప్పుడు ఆ దైవదూత, అతడి శరీరాన్ని నిమిరి, అతడిని అందమైన వ్యక్తిగా మార్చాడు. ఆ తర్వాత 'నీకు ఎటువంటి సంపద కావాలి?' అని ప్రశ్నించాడు. అందుకు ఆ వ్యక్తి 'ఒంటెలు నాకు అత్యంత ప్రియమైనవి' అన్నాడు. దైవదూత ఒక గర్భం ధరించిన ఒంటెను అతనికి అందచేసి 'అల్లాహ్ నీ సంపదలో వృద్ధి కలిగించుగాక! అని ప్రార్థించాడు.

తదుపరి దైవదూత అంధుని వద్దకు వెళ్ళి 'నీకు అత్యంత ఇష్టమయిన దానిని కోరుకో' అన్నాడు. అందుకు అతడు 'నాకు చూపు కావాలి' అన్నాడు. దైవదూత తన చేతితో అతని కళ్ళను నిమరగా అతనికి కంటిచూపు ప్రాప్తమయింది. దైవదూత అతడిని 'నీకు ఏ సంపద అంటే ఎక్కువ ఇష్టం?' అని ప్రశ్నించాడు. అందుకు ఆ వ్యక్తి 'నాకు మేకలంటే ఇష్టం' అన్నాడు. అప్పుడు అతనికి గర్భం ధరించిన మేకను

బహుకరించి 'అల్లాహ్ నీ సంపదలో వృద్ధి కలిగించుగాక!' అని ప్రార్థించాడు.

ఆ తర్వాత బట్టతల గల వికారి వ్యక్తిని దైవదూత కలిసి పైవిధంగానే ప్రశ్నించాడు. అందుకు ఆ వికారి 'అందమైన రూపం– అందమైన జుట్టు' కోరుకున్నాడు. దైవదూత అతనికి సుందరరూపం, నిగనిగలాడే జుట్టును కలుగజేశాడు. ఆ తర్వాత సంపదలో 'ఆవు'లంటే ఎంతో ఇష్టమని కోరుకోగా అతనికి సూడి ఆవును అందించి, 'నీ సంపదలో అల్లాహ్ శుభం ప్రసాదించుగాక! అని ప్రార్థించాడు.

కొంత కాలానికి ఆ ముగ్గురి వద్దనున్న పశు సంపద ఎంతోవృద్ధి చెంది లోయ అంతా నిండిపోయింది. అప్పుడు దైవదూత మానవరూపంలో ముందుగా ఒంటెల మంద కలిగివున్న పూర్వ కుష్టు రోగి వద్దకు వచ్చి ఇలా అన్నాడు : 'నేను పేదవాడిని, నాకు అల్లాహ్ ద్వారా మీరే దిక్కు. మీకు సుందర రూపాన్ని, అందమైన చర్మాన్ని ప్రసాదించిన అల్లాహ్ పేరుతో ఒక ఒంటెను దానం ఇవ్వవలసిందిగా అభ్యర్థిస్తున్నాను. ఈ ప్రయాణంలో మీరు నాకు సహకరించండి'అని అన్నాడు. దానికి ఆ వ్యక్తి 'నాపై ఎన్నో బాధ్యతలు వున్నాయి. కనుక ఒంటెను ఇవ్వలేను' అన్నాడు. అప్పుడు మానవ రూపి అయిన దైవదూత 'నేను మిమ్మల్ని గుర్తించగలను. మీరు ఒకప్పుడు కుష్టువ్యాధికి గురై వుండలేదా? ప్రజలు మిమ్మల్ని అసహ్యించుకునేవారు కారా? అప్పుడు మీరు అవసరార్థులై వుండేవారు కాదా? మీకు అల్లాహ్ సంపదను ప్రసాదించి సంపన్నునిగా చేయలేదా?' అని పలికాడు.

అందుకు ఆ వ్యక్తి 'లేదు' ఈ సంపద నాకు నా తాత ముత్తాతల నుండి వారసత్వంగా లభించింది అని బొంకాడు. అందుకు ఆ దైవదూత 'ఒకవేళ మీరు అసత్యం పలుకుతూ వుంటే అల్లాహ్ తిరిగి మిమ్మల్ని పూర్వ స్థితికి చేర్చుగాక!' అని పలికి రెండవ వ్యక్తి వైపునకు సాగిపోయాడు.

అదే రూపంలో దైవదూత అనాకారి అయిన బట్టతల వ్యక్తిని కలిసి ఆవును దానంగా అభ్యర్థించాడు. ఆ వ్యక్తి కూడా మొదటి వ్యక్తిలాగానే అబద్ధం పలికాడు. అతడిని కూడా దైవదూత 'ఒకవేళ మీరు అబద్ధమాడుతూ వుంటే అల్లాహ్ మిమ్మల్ని పూర్వ స్థితికి చేర్చుగాక!' అని శపించి మూడవ వ్యక్తి వైపుకు పయనమయ్యాడు.

ఒకప్పుడు అంధునిగా వున్న వ్యక్తిని దైవదూత మేకను ఇవ్వవలసిందిగా అభ్యర్థించాడు. అందుకు అతను 'అయ్యా! నేను ఒకప్పుడు గుడ్డివాడినే. అల్లాహ్ నాకు చూపును, మేకల సంపదనూ ప్రసాదించాడు. మీ ఇష్టప్రకారం మీరుకోరిన మేకను

తీసుకోండి. అల్లాహ్ సాక్షిగా నేను అల్లాహ్ ద్వారా పొందిన ఏ వస్తువు విషయంలోనూ మిమ్మల్ని నిరోధించను' అని పలికాడు. అప్పుడు దైవదూత 'మీ సంపదను మీ వద్దే వుంచుకోండి! వాస్తవానికి మిమ్మల్ని పరీక్షించడానికి ఈవిధంగా చేయవలసి వచ్చింది. అల్లాహ్ మీ పట్ల సంతుష్టుడయ్యాడు. మీ సహచరులు ఇద్దరూ కూడా అల్లాహ్ ఆగ్రహానికి గురయ్యారు' అని పలికి అదృశ్యమయ్యాడు. (బుఖారి)

ఇస్లామీయ షరీఅత్‌లో వాగ్దాన పాలన, ఒప్పందాల అమలుకు అత్యంత ప్రాధాన్యత వుంది. సంపద విషయంలో గాని, వ్రాతపూర్వక ఒడంబడికల విషయంగా గాని, అత్యంత బాధ్యతాయుతంగా వుండమని ఇస్లాం ఆదేశిస్తుంది. ఒక హదీసులో ఇలా సెలవివ్వడం జరిగింది.

'ముస్లింలు తమ ఒప్పందాలు- వాగ్దానాలు- ప్రమాణాలు- ఒడంబడికలపై నిలకడగా వుంటారు' (బుఖారి)

వ్రాతపూర్వక షరతులు ఇస్లామీయ ధర్మశాస్త్ర పరిధికి లోబడి వుంటేనే అవి ఆదరణీయాలవుతాయి. అలా లేని ఒడంబడికలకు ఒక ముస్లిం కట్టుబడి వుండ వలసిన అవసరం లేదు. ధర్మబద్ధ విషయాలలో మాత్రమే వాగ్దానపాలన అమలు జరగాలి. అప్పుడు మాత్రమే విశ్వాసం మూడుపువ్వులు, ఆరు కాయలుగా వుండే వాతావరణం ఏర్పడుతుంది.

వైవాహిక (నికాహ్) ఒప్పందానికి ఇస్లాం అత్యంత ప్రాధాన్యతనిచ్చింది. ప్రవక్త(స) 'మీరు పరస్పరం చేసుకునే ఒడంబడికలలో అన్నింటికంటే ఎక్కువగా, తప్పనిసరిగా నెరవేర్చవలసిన ఒడంబడిక, మీరు మీ లైంగిక అవయవాలను ధర్మబద్ధం చేసుకుంటూ చేసుకునే (నికాహ్) ఒడంబడికే' అని వివాహ ఒడంబడిక విశిష్టతను విడమర్చారు.

ఈ కారణంగానే ఏ భర్తా తన భార్య హక్కును కొల్లగొట్టకూడదు. ఒక రూపాయి విషయంలోనూ నమ్మకద్రోహానికి, అవినీతికి పాల్పడకూడదు. వైవాహిక జీవితాన్ని ప్రాముఖ్యతలేని తేలికపాటి విషయంగా భావించకూడదు.

ఒక హదీసులో ఇలా చెప్పబడింది: 'ఏ వ్యక్తి అయినా తక్కువ లేక ఎక్కువ మహర్ నిర్ణయించి వివాహం చేసుకుని, ఆ మహర్‌ను చెల్లించే ఉద్దేశం లేకుంటే అతడు ఆమెను మోసగించినట్లే అవుతుంది. ఒకవేళ అతను ఇదే ఉద్దేశ్యంతో మరణిస్తే -ఆమె హక్కును

నెరవేర్చకపోతే అల్లాహ్ ముందు ఒక వ్యభిచారిగా హాజరుపర్చ బడతాడు. ఒక వ్యక్తి మరొకని వద్ద రుణం తీసుకొని దానిని చెల్లించే ఉద్దేశం లేకుంటే అతడు రుణదాతను మోసంతో అతని సంపదను కొల్లగొట్టినవాడవుతాడు. అదే ఉద్దేశ్యంతో రుణగ్రహీత మరణిస్తే అతను ఒక దొంగగా అల్లాహ్ ముందు నిలబెట్టబడతాడు' (తిబ్రాని)

వాగ్దాన పాలనకు సంబంధించిన ఆదేశాలు దివ్యఖుర్‌ఆన్‌లో అనేకం వున్నాయి. అత్యంత తీవ్రమైన హెచ్చరికలు చేసేవి కూడా ఉన్నాయి. ఉదాహరణకు కొన్ని:

**'వాగ్దానాన్ని నెరవేర్చండి. నిస్సందేహంగా వాగ్దాన విషయంలో మీరు సమాధానం చెప్పవలసి వుంటుంది.' *(ఖుర్‌ఆన్, 17: 34)***

**"మీరు అల్లాహ్‌తో ఏదైనా వాగ్దానం చేసివుంటే ఆ వాగ్దానాన్ని నెరవేర్చండి. అల్లాహ్ సాక్షిగా చేసిన ప్రమాణాలను దృఢపర్చిన తర్వాత భంగపర్చకండి. అల్లాహ్ మీ పనులన్నింటినీ ఎరుగును." *(ఖుర్‌ఆన్, 16 : 91)***

నమ్మకద్రోహం- వాగ్దాన భంగాలు విశ్వాసాన్ని అంతమొందిస్తాయనీ, అలజడికి- చట్టధిక్కారానికి కారణభూతాలవుతాయని, బంధుత్వాలను తెంచివేస్తాయనీ, శక్తిమంతులను సైతం బలహీనులుగా, నీచులుగా మార్చివేస్తుందని అల్లాహ్ స్పష్టంగా సెలవిచ్చివున్నాడు.

**"స్వయంగా తాను శ్రమతో నూలు వడకి, తరువాత తానే దానిని ముక్కలు ముక్కలుగా చేసిన స్త్రీ వంటి స్థితి మీది కాకూడదు. మీరు, మీ ప్రమాణాలను మీ వ్యవహారాలలో పరస్పరం మోసగించుకోవటానికి పనిముట్లుగా చేసుకుంటారు. ఒకజాతి రెండో జాతికంటే ఎక్కువగా లాభాలను పొందడానికి. వాస్తవానికి అల్లాహ్ ఈ ప్రమాణాల ద్వారా మిమ్మల్ని పరీక్షకు గురిచేస్తున్నాడు. తప్పకుండా ఆయన ప్రళయంనాడు మీ సమస్త అభిప్రాయ భేదాల తత్వాన్ని మీకు విశదం చేస్తాడు.' *(ఖుర్‌ఆన్, 16: 92)***

కొన్ని సందర్భాలలో ఒక వ్యక్తి ఒక ఒప్పందంలోకి వెళతాడు. అయితే ఈ ఒప్పందంకంటే లాభసాటి మరో ఒప్పందం కోసం మొదటి ఒప్పందాన్ని భంగపరుస్తాడు. ఒక జాతి మరో జాతితో సంధి ఒడంబడిక చేసుకొని దురాశ, స్వార్థ ప్రయోజనాల కోసం ఆ ఒప్పందాన్ని భంగపరుస్తుంది. తాత్కాలిక ప్రయోజనాల కోసం ఉత్తమ నైతిక వర్తనకు తిలోదకాలు ఇస్తుంది. ఇస్లాం ఈ ఉల్లంఘనలన్నింటిని

వ్యతిరేకిస్తుంది. ప్రజావసరాల విషయంగానైనా, వ్యక్తి అయినా, జాతి అయినా, వర్గమైనా తన గౌరవాన్ని ఔన్నత్యాన్ని కాపాడుకునేలా వ్యవహరించాలని ఇస్లాం శిక్షణ గరుపుతుంది. కలిమిలోనూ, లేమిలోనూ, జయాపజయాలలోనూ, ఒప్పందాలు గౌరవించబడాలనీ, అవి పరిరక్షింపబడాలని ఇస్లాం అభిలషిస్తుంది. ఈ విషయంగా ఖుర్ఆన్ ఉపదేశం ఇలా వుంది :

**"(ముస్లిములారా!) మీరు మీ ప్రమాణాలను ఒకరినొకరు మోసగించుకోవడానికి సాధనాలుగా చేసుకోకండి. ఇలా చేస్తే స్థిరపడి పోయిన పాదాలు తరువాత చలిస్తాయేమో. మీరు అల్లాహ్ మార్గం నుండి ప్రజలను నిరోధించిన అపరాధానికి దుష్ఫలితాన్ని చూస్తారేమో, శిక్షను అనుభవిస్తారేమో. మీరు అల్లాహ్‌కు చేసిన వాగ్దానాన్ని స్వల్ప లాభానికి అమ్మి వేయకండి. అల్లాహ్ వద్ద ఉన్నది మీకు ఎక్కువ మేలు కలిగిస్తుంది, మీరు గనక తెలుసుకుంటే. మీ దగ్గరున్నదంతా ఖర్చు అయిపోయేదే. అల్లాహ్ వద్ద వున్నదే అసలు మిగిలి వుండేది.'(16: 94,95)**

## వాగ్దాన పాలనకు సర్వ మానవులూ హక్కుదారులే!

విశ్వాసి- తిరస్కారి అనే తేడా లేకుండా ప్రతి వ్యక్తితోనూ వాగ్దానపాలన పట్ల కట్టుబడి వుండటం తప్పనిసరి. నైతిక విలువల ద్వారా లభించే ప్రయోజనాలను వ్యక్తుల మధ్య విభజించడం సాధ్యంకాదు. కొంతమందితో గౌరవనీయంగానూ, మరికొంత మందితో నీచంగానూ ప్రవర్తించడం ధార్మికత అనిపించుకోదు. వాగ్దాన పాలన సత్యసంధతపై ఆధారపడి, ప్రతి సమయం- ప్రతి వ్యక్తితోనూ అనుసంధానింపబడి వుంటుంది.

దైవప్రవక్త(స) 'హిల్ ఫుల్ ఫుజూల్' ఒడంబడిక గురించి ఇలా వివరించారు: 'ఇస్లామీయ యుగంలో ఇటువంటి (శాంతి స్థాపన) ఒడంబడికలు కుదుర్చుకోవడానికి నేను ఎప్పుడూ సిద్ధంగా వుంటాను'

ఉమ్ర్ బిన్ అల్‌హమఖ్ (రజి) ప్రవక్త(స) ద్వారా ఈ క్రింది వచనాన్ని ఇలా వివరించారు. 'ప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు :'ఒక వ్యక్తి మరో వ్యక్తి ప్రాణానికి శరణు ఇచ్చి నమ్మకద్రోహంతో ఆ శరణార్థిని హత్య చేస్తే ఆ హతుడు అవిశ్వాసి అయినప్పటికీ నేను హతుని వైపునే నిలుస్తాను' (ఇబ్నె హిబ్బాన్)

పై హదీసు ద్వారా అవిశ్వాసులతో సైతం ఇస్లాం అత్యంత న్యాయసమ్మతంగా వ్యవహరిస్తుందని తేటతెల్లమవుతుంది. ఆనాటి యూదులు వాగ్దాన పాలనకు పట్టుబడే వారు కారు. ఇతరులను గౌరవించడం వారు ఎరుగరు. స్వయంగా తమకు తాము అల్లాహ్ సుపుత్రులుగా, ప్రియతములుగా భావిస్తారు. అల్లాహ్ తన కారుణ్యాన్ని, వరప్రసాదాలను కేవలం ఇస్రాయీల్ సంతతికి మాత్రమే ప్రత్యేకించుకున్నాడని తలుస్తారు. కాని సత్యదైవ ధర్మం ఇస్లాం– తాను ఎవరి పట్ల బాధ్యతను స్వీకరించిందో, ఎవరితో ఒప్పందం చేసుకుందో, ఎవరి పరిరక్షణకు వాగ్దానం చేసిందో దానిపట్ల సంపూర్ణ నిబద్ధత కలిగివుంటుంది. ఇస్లామీయ చరిత్రను అధ్యయనం చేసినవారెవరైనా ఈ విషయాన్ని ఇట్టే తెలుసుకోగలరు. ఈ విషయంగా అల్లాహ్ ముస్లింలను సంబోధిస్తూ ఇలా సెలవిచ్చాడు.

**"విశ్వసించిన ప్రజలారా! దైవభక్తి చిహ్నాలను అగౌరవపరచకండి. ...... ఆయన సంతోషాన్ని అన్వేషిస్తూ పవిత్ర మందిరం (కాబా) వైపునకు పోయేవారి జోలికి పోకండి.... చూడండీ! మస్జిదె హరమ్‌కు పోనియ్యకుండా ఓ వర్గం వారు నిరోధించారని వారిపై ఆగ్రహించి ఆవేశంలో మీరూ వారిపై అనుచిత మైన దౌర్జన్యానికి పాల్పడకండి. కాని, మంచికి, దైవభక్తికి సంబంధించిన పనులలో అందరితోనూ సహకరించండి. పాపకార్యాలలో, అత్యాచారాలలో ఎవరితోనూ సహకరించకండి.' *(ఖుర్ఆన్, 5: 2)***

పై ఖుర్ఆన్ వాక్యంలో తన తిరస్కారుల ఆలోచనలు, అభిప్రాయాలు తెలియ పరుస్తూ విశ్వాసుల ప్రతిస్పందన ఎలా వుండాలో స్పష్టంగా వివరించడం జరిగింది. నిజానికి వారు విగ్రహారాధకులు. అయినప్పటికీ వారిని అల్లాహ్ అనుగ్రహం, ప్రీతిని అన్వేషించే వారుగా పేర్కొనడం జరిగింది. అదేసమయంలో ముస్లింలు ఎంత శక్తిమంతులైనప్పటికీ మంచికి, నిష్ఠకు, దైవభీతికి సంబంధించిన కార్యకలాపాలలో మాత్రమే పరస్పరం సహకరించుకోవాలి. చెడు, పాపకార్యాలు, అత్యాచారాలలో సహకరించుకోకూడదని, అందులో పాల్గొనరాదనికూడా హెచ్చరించడం జరిగింది. (ముస్లింలు– ముస్లిమేతరుల మధ్య ఒప్పంద ఒడంబడికల విషయంగా అల్లాహ్ ఆదేశాలు, ఇస్లామీయ ఆదర్శవంత బోధనల వివరాలను ఈ గ్రంథ రచయిత 'సయ్యద్ ఖుతుబ్ షహీద్ (రహ్మ) చే రచించబడిన 'తామిలాతి ఫిద్దీని వల్ హయాతి వత్త అసబివత్త సామహ్' అనే గ్రంథంలో చూడవచ్చు)

# రుణ చెల్లింపు తప్పనిసరి

ఇస్లాం ఏ విషయాల గురించి ప్రత్యేకంగా తాకీదుచేసిందో, ఏఏ విషయాల నెరవేర్పుకు అత్యంత ప్రాధాన్యత ఇచ్చిందో అందులో 'రుణ చెల్లింపు' కూడా వుంది. రుణచెల్లింపు విషయంలో నిష్ఠ, నిబద్ధతలు పాటించడం అల్లాహ్‌దృష్టిలో అన్ని హక్కుల నెరవేర్పుకంటే ఎక్కువ ప్రధానమైనది. రుణగ్రహీత దురాశకు లోనై ఎగనామం పెట్టడం గురించి ఆలోచించడాన్ని, రుణ చెల్లింపులో తాత్సారం చేయడాన్ని ఇస్లాం తీవ్రంగా విమర్శించింది.

రుణం విషయంగా ఇస్లాం తాకీదు ఏమిటంటే, మనిషి అత్యవసరమైన స్థితిలోనే రుణం తీసుకోవాలి. రుణం తీసుకోకుండానే పరిస్థితులు చక్కబడే పక్షంలో రుణం వైపు కన్నెత్తికూడా చూడకూడదు. అనవసరంగా చీటికిమాటికి అప్పు తీసుకోవడాన్ని పరిహారం చెల్లించదగిన పాపకార్యంగా ఒక ఉల్లేఖనంలో చెప్పబడింది.

'రుణగ్రస్తుడు మరణిస్తే ప్రళయదినాన అతని నుండి దాని బదులు వసూలు చేయడం జరుగుతుంది. రుణం మూడు పరిస్థితుల్లో తీసుకోవడమే సముచితం. 1) అల్లాహ్ మార్గంలోపోరాడుతూ వున్న కారణంగా శక్తి సన్నగిల్లి తిరిగి శత్రువుతో పోరాడటానికి సన్నద్ధుడు కావడానికి అప్పు తీసుకోవచ్చు. 2) ఒక ముస్లిం సమక్షంలో మరోముస్లిం మరణించి అతని అంతిమ సంస్కారం చేయడానికి తన వద్ద డబ్బు లేనట్లయితే ఆ సమయంలో అప్పు చేయవచ్చు. 3) ఒక వ్యక్తి తాను అవివాహితునిగానే ఉండిపోతానేమో అనే సందేహం ఏర్పడినప్పుడు వివాహం చేసుకొని తద్వారా ధర్మాన్ని (ప్రవక్త సున్నత్‌ని) ఆచరించే ఉద్దేశంతో అప్పు చేయవచ్చు. ఇటువంటివారిని అల్లాహ్ ప్రళయదినాన మన్నిస్తాడు.'(ఇబ్నెమాజా)

మరో హదీసు ఉల్లేఖనంలో ఇలా వుంది : 'అల్లాహ్ ప్రళయదినాన రుణగ్రస్తుడిని తన ముందు నిలబెడతాడు. అతనితో 'ఓ ఆదం పుత్రుడా! నీవు ఏ లక్ష్యం కొరకు అప్పు తీసుకున్నావు? నీవుఎందుకు మరో మనిషి హక్కును కొల్లగొట్టావు?' అని ప్రశ్నిస్తాడు. ఆ వ్యక్తి దానికి 'ఓ ప్రభూ! నేను అప్పు చేసిన విషయం నీకు తెలుసు. కాని, దానితో నేను తినలేదు, తాగనూ లేదు. దుస్తులు తొడగనూలేదు. దుబారా చేయలేదు. ఒకానొక సమయాన అగ్నిప్రమాదంలో లేక ఒకానొక సమయాన దొంగతనం జరిగి అది నానుండి దోచుకోబడింది' అని బదులు పలుకుతాడు. అప్పుడు అల్లాహ్ 'నా దాసుడు సత్యం

పలికాడు. నీ అప్పు చెల్లించడానికి నేనే ఎక్కువగా హక్కుదారుడను అయివున్నాను' అంటాడు. పిమ్మట కొన్ని పుణ్యఫలాలను తెప్పించి ఆచరణ త్రాసులో ఉంచుతాడు. ఆ పుణ్యఫలాలు అతని పాపాల కంటే ఎంతో అధికంగా బరువు తూగుతాయి. ఆవిధంగా ఆ వ్యక్తి అల్లాహ్ కారుణ్యంతో స్వర్గంలోకి ప్రవేశి స్తాడు.' (ముస్నద్ అహ్మద్)

పై ఉల్లేఖనాల ద్వారా కేవలం అత్యవసర, ధర్మం నిర్దేశించిన అంశాల నెరవేర్పు కొరకు మాత్రమే అప్పు చేయాలని తేటతెల్లమవుతుంది. ఈ స్థితిలో రుణం తీసుకున్న వారిని మాత్రమే అల్లాహ్ క్షమిస్తాడని కూడా విశదమవుతుంది. అయితే కేవలం దుబారా ఖర్చుతో సుఖభోగాలు అనుభవించేందుకు అప్పు చేయడం, దాని చెల్లింపులో శ్రద్ధ, తపనలు చూపకపోవడం, రుణవిముక్తికై పరితపించకపోవడం ఇస్లాం దృష్టిలో దొంగతనంగా, ఆ వ్యక్తిని దొంగగా పరిగణించబడుతుంది.

మానవ మహోపకారి ముహమ్మద్(స) ఈ విధంగా పేర్కొన్నారు. 'ఏ వ్యక్తి ప్రజల సొమ్మును అప్పుగా తిరిగి చెల్లించే ఉద్దేశ్యంతో తీసుకుంటాడో (ఆ తర్వాత చెల్లించలేని స్థితిలో మరణిస్తే) అల్లాహ్ అతడి అప్పును చెల్లిస్తాడు. అలాకాక ఆ వ్యక్తి ఎగవేసే ఉద్దేశ్యంతో అప్పు తీసుకుంటే అతడిని అల్లాహ్ నాశనం చేస్తాడు.' (బుఖారి)

ఇస్లాం అప్పుకు జామీను(హామీ) ఉండాలని ఆదేశిస్తుంది. డబ్బును సజీవ సంపదగా భావిస్తుంది. రుణచెల్లింపు నూరుశాతం జరగాలని, అందుకు దస్తావేజు కూడా రాయబడాలని ఆదేశిస్తుంది. రుణం చెల్లించడాన్ని హక్కుగా భావించాలనీ, అప్పు ఎగవేతకు ఎంతమాత్రం అవకాశం వుండకూడదని కోరుతుంది.

'అబూ ఖతాదా(రజి) ఈవిధంగా పేర్కొన్నారు : 'నేను ఒకసారి దైవప్రవక్త (స)ను 'ఓ దైవప్రవక్తా(స)! నేను ఒకవేళ దైవమార్గంలో హతమార్చబడితే నా పాపాలు క్షమించివేయబడతాయా?' అని ప్రశ్నించాను. అందుకు ప్రవక్త(స) 'అవును, మీరు సహనంతో, కృతజ్ఞతతో, దైవప్రీతిని పొందే తపనతో నిమగ్నమై ముందరి వరుసల్లోకి దూసుకునిపోతూ దాడులుచేస్తూ వెనుకంజ వేయక హతమార్చబడితే' అన్నారు. తిరిగి ప్రవక్త(స) 'మీరు ఏమడిగారు?' అనిప్రశ్నించగా ఖతాదా(రజి) తన ప్రశ్నను పునరుద్ఘాటించారు. అప్పుడు దైవప్రవక్త(స) 'మీ పాపాలు క్షమించివేయబడతాయి అయితే ఇలా అప్పులు మాత్రం క్షమించి వేయబడవు. ఇప్పుడే జిబ్రయీల్(అలై) ఈ విషయానికి సంబంధించిన ఆజ్ఞను నాకు అందజేశారు' అని స్పష్టపర్చారు' (ముస్లిం)

ఒక ముస్లిం యొక్క 'పరలోక సాఫల్యం'పై అప్పు పిడుగుపాటులా పడుతుంది. ఆలోచనాపరులను ఈకారణంగానే రుణవిముక్తులు కావలసిందిగా ఇస్లాం తాకీదు చేసింది. అలాకాని పక్షంలో మీ జీవితం ప్రమాదంలోకి నెట్టివేయబడుతుందని హెచ్చరించింది. అబూదర్దా(రజి) గురించి ఈ క్రింది సంఘటనను చరిత్ర రికార్డు చేసివుంచింది. ఆయన ధర్మయుద్ధంలో పాల్గొనడానికి వచ్చిన సైనికులున్నచోటికి వెళ్ళి ఇలా ప్రకటించారు: 'సైనికులారా! మీలో ఎవరైతే రుణగ్రస్తులుగా వున్నారో- వారు ఒకవేళ ఈ యుద్ధంలో వీర మరణం పొందితే వారిరుణం చెల్లించబడదనే అనుమానం వుంటే వెంటనే వారు వెనుతిరిగి వెళ్ళిపొండి. వారు, నా వెంట రావలసిన అవసరంలేదు. రుణగ్రస్తునిగా వారి మరణం, నరకంనుండి రక్షించేందుకు సరిపోదు' (రజీన్)

నేడు ప్రజలు మరీ ప్రత్యేకించి ముస్లింలు అప్పును ఒక క్రీడగా భావిస్తున్నారు. సుఖసంతోషాల కొనుగోలుకు, లైంగికవాంఛల తీర్పుకు సైతం రుణం తీసుకుంటున్నారు. అల్లాహ్ నిషేధించిన వడ్డీ వ్యాపారాన్ని యూదులతో, క్రైస్తవులతో నిర్వహించ డానికి సైతం భయపడటంలేదు. ఈ కారణంగానే ఆయా ప్రాంతాలలోని ముస్లింలు ప్రపంచానికి అపరిచితులైపోయారు. పాలకులు నిందలపాలయ్యారు. ప్రజలు తమ సంపదలను పోగొట్టుకొని ఎదురుదెబ్బలు తింటూ వున్నారు. అప్పు తీసుకోవడం చాలా సులభం. కాని, దానిని చెల్లించడం చాలా కష్టం. చట్టం, కోర్టుల భయం లేకుండా వుండివుంటే ఎంతమంది హక్కులు కొల్లగొట్టబడి వుండేవో కదా!

అల్లాహ్, వాగ్దాన పాలకులైన తన దాసులను ఎంతగానో ఇష్టపడతాడు. వాగ్దాన పాలనపట్ల గౌరవంలేని ప్రజలను, వారి అనేక పట్టణాలను, నగరాలను అల్లాహ్ నాశనం చేసివేశాడు. ఆ తర్వాత ఇలా పేర్కొన్నాడు :

**"మేము వారిలో చాలా మందిని తమ వాగ్దానం పట్ల గౌరవం కలవారుగా చూడలేదు. చాలామందిని దుర్మార్గులుగానే చూశాము.' (ఖుర్ఆన్, 7: 102)**



# 10వ భాగం

# సత్ సంకల్పం

- ఆచరణలన్నీ సంకల్పంపై ఆధారపడివుంటాయి
- సంకల్పశుద్ధియే ప్రధానమైనది
- సత్ సంకల్పం వుండాలి
- సైనికులు పవిత్ర సంకల్పంకై పోరాడాలి
- ఉద్యోగులు అల్లాహ్ మార్గంలో కృషి చేయాలి
- విద్యార్థులు దైవప్రీతికై కృషి చేయాలి



## ఆచరణలన్నీ సంకల్పంపై ఆధారపడి వుంటాయి

మానవుడిని కార్యశీలిలా, అత్యుత్తమ రీతిలో కార్యాన్ని నిర్వర్తించేలా, పనిచేసేందుకు పరుగులెత్తేలా, ఈ మార్గంలో ఎదురయ్యే కష్టనస్టాలను, ఇబ్బందులను ఎదుర్కొనేలా, ధనప్రాణాలను అర్పించేలా ప్రోత్సహించే, ప్రేమించే కారణాలు అనేకం వున్నాయి. అవి వేర్వేరుగానూ వుంటాయి.

మనిషిని కార్యాచరణ వైపు ప్రేరేపించే కారణాల్లో ఒక కారణం మనిషి పనిలో నిమగ్నమవడం ద్వారా, పని పట్ల ఆసక్తిచూపటం ద్వారా వ్యక్తమవుతుంది. మరొకటి బయటికి కనిపించకుండా మనిషి ఆలోచనాపొరల్లో, హృదయపు లోతుల్లో దాగివుంటుంది. కొన్ని సందర్భాలలో పని చేసే మనిషి సైతం తనలో దాగివున్న సంకల్పాన్ని గుర్తించలేకపోతాడు. అయినా ఈ సంకల్పం ద్వారా ప్రభావితుడు అవుతూ వుంటాడు. ఒక పనిచేయడానికీ లేక చేయకపోవడానికి సంబంధించిన రహస్యం ఈ కానరాని సంకల్పం (సబ్‌కాన్షస్)లోనే ఇమిడి వుంటుంది.

మనిషిలోని సకారాత్మక సహజ నైజమే అతని సాధారణ వ్యవహారసరళికి సంబంధించిన సూత్రాలను తయారు చేస్తుంది. మనిషి ఆచరణలను పరిశీలించడం ద్వారా ఆ వ్యక్తి యొక్క ఈ ఆచరణల వెనుకనున్న ఉద్దేశ్యాన్ని, పనిచేస్తున్న సంకల్పాన్ని సులభంగా అర్థం చేసుకోవచ్చు. ఈ పరిశీలనలో ఒక వ్యక్తి తన సంకల్పంలో ఆత్మను ప్రేమించేవానిగా– దాని శ్రేయస్సును కాంక్షించే వానిగా కనిపిస్తాడు. మరో వ్యక్తి డబ్బు పట్ల వ్యామోహంలో నిమగ్నుడైనవానిగా కనిపిస్తాడు. మరొకడు అహంభావిగా, ప్రదర్శనాబుద్ధి గల వానిగా కీర్తికండూతి గలవానిగా కనబడుతూ సుఖనిద్ర నుండి దూరమైన వానిగా కనిపిస్తాడు.

వ్యక్తుల సంభాషణలు, వారి దైనందిన కార్యక్రమాలను సమీక్షించి చూస్తే– వారు సంతోషం లేక విద్వేషం, అహంకారం లేదా వినయంల వంటి భావనలు వారిని నడిపిస్తున్నట్లు సులభంగా గుర్తించవచ్చు. ఇస్లాం అత్యంత శాస్త్రీయంగా మనిషిలోని మానసికతను విశ్లేషిస్తుంది. మనిషి ఆచరణల వెనుక పనిచేస్తున్న కారణాలను– సంకల్పాలను బట్టి ఆ ఆచరణలకు విలువను ఆపాదిస్తుంది. పరీక్షించి... సమీక్షించి... ఫలితాలను నిర్ధారిస్తుంది. ఇస్లాంలో ఆచరణలకు గౌరవం వాటి సంకల్పాన్ని బట్టి ఇవ్వడం జరుగుతుంది.

మన రోజువారీ జీవితంలో గమనిస్తే- మనిషి కొన్ని సందర్భాల్లో ప్రజలకు విలువైన బహుమతులు అందజేస్తాడు. మరికొన్ని సందర్భాల్లో తన పట్ల మంచిగా ప్రవర్తించిన, తనకు మేలు చేసినవారికి కానుకలు అందజేస్తాడు. తద్వారా ప్రజలు తన వైపుకు ఆకర్షితులై తన దాతృత్వాన్ని కొనియాడాలని భావిస్తాడు. పై రెండు ఆచరణల్లోనూ 'దాతృత్వం' ఇమిడివుంది.

అయితే 'దాతృత్వం' - ప్రదర్శనాబుద్ధి, కీర్తి కండూతిలాంటి భావాత్మక రోగాల నుండి పవిత్రం కానంతవరకు,కేవలం సృష్టికర్త అల్లాహ్ ప్రీతి కోసం ప్రత్యేకించ బడనంతవరకు ఇస్లామీయ దృష్టిలో అవి ఎంతమాత్రమూ విలువ కలిగివుండవు. ఈ విషయంగా ఖుర్ఆన్ బోధనలు ఇలా వున్నాయి.

**"మేము కేవలం అల్లాహ్ కోసమే మీకు అన్నం పెడుతున్నాము. మేము మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని గాని, కృతజ్ఞతలను గాని ఆశించటంలేదు." (76: 9)**

ఇంకా...

**'పరిశుద్ధుడు కావటానికి తన సంపదను ఖర్చుచేసే పరమ దైవభీతిపరుడు.... కేవలం మహోన్నతుడైన తన ప్రభువు ప్రసన్నత కోసం మాత్రమే ఈ పని చేస్తున్నాడు. ఆయన తప్పకుండా (అతడంటే) సంతోషిస్తాడు.'(92: 18-21)**

హృదయ కల్మషాన్ని కడిగివేసేందుకు, నీచమైన కోరికల నుండి హృదయాన్ని పవిత్రపర్చేందుకు దైవప్రవక్త(స) ఈ క్రింది చికిత్సను ప్రతిపాదించారు:

"ఆచరణలన్నీ సంకల్పంపై ఆధారపడివుంటాయి. మనిషి దేనిని సంకల్పిస్తాడో అతడికి అదే లభిస్తుంది. ఏ వ్యక్తి హిజ్రత్ అల్లాహ్, ఆయన ప్రవక్త కొరకు చేయబడు తుందో- అతడి హిజ్రత్ అల్లాహ్, ఆయన ప్రవక్త కొరకుగా పరిగణించబడుతుంది. మరి, ఏ వ్యక్తి హిజ్రత్ ప్రాపంచిక సంపాదన కొరకు లేదా ఏ వనితనైనా వివాహ మాడేందుకు సంకల్పించి చేయబడితే- అతడి హిజ్రత్ ఏ లక్ష్యంకై చేయబడిందో- ఇల్లు వాకిలి ఏ లక్ష్యంకై విడిచిపెట్టడం జరిగిందో దానికొరకు గానే పరిగణించ బడుతుంది." (బుఖారి)

మక్కా, మదీనాల మధ్య గల దూరాన్ని వేలాది యాత్రికులు విభిన్న లక్ష్యాలతో, సంకల్పాలతో అధిగమిస్తూ వుంటారు. అయితే ధర్మస్థాపన కోసం ధార్మిక జీవిత పరిరక్షణ కోసం సంకల్పించి చేసే ప్రయాణమే (హిజ్రత్ మాత్రమే) ఇతరుల ప్రయాణం నుండి వేరు చేయబడి ఉన్నత స్థాయికి చేరుస్తుంది. నిజానికి రెండు ప్రయాణాల బాహ్యా స్వరూపం ఒక్కలాగానే వుంటుంది.

ఏ వ్యక్తి అయితే ఉపద్రవాలనుండి ధర్మాన్ని రక్షించే ఉద్దేశ్యంతో కొత్త నగరంలో ధర్మబద్ధ ప్రభుత్వానికి బీజాలు వేసే సంకల్పంతో మక్కాను విడిచి మదీనాకు హిజ్రత్ చేస్తాడో– అతడు 'ముహాజిర్'గా గౌరవించబడతాడు. ఇతర లక్ష్యాల సంక ల్పంతో అదేమార్గంలో ప్రయాణించిన మరో వ్యక్తికి ముహాజిర్ గౌరవం లభించదు. అతడు ముహాజిర్గా పరిగణింపబడడు.

## సంకల్పశుద్ధియే ప్రధానమైనది

భావాల్లో స్వచ్ఛత, సంకల్పంలో పవిత్రతలు మానవుడి ధార్మిక ఆచరణను ఎంతో ఉన్నతమైనదిగా, పవిత్రమైనదిగా తీర్చిదిద్దుతాయి. ఈ ఆచరణలు అల్లాహ్చే ఆమోదింపబడే ఆరాధనలుగా మారిపోతాయి.

ఒకవేళ హృదయంలో నీచత్వం, ద్వేషపూరిత భావనలు, చెడు సంకల్పాలు మనిషి కలిగివున్నట్లయితే– అతడు ఎన్ని ఆరాధనలు చేసినా అవి అల్లాహ్ సన్నిధికి చేరజాలవు. సంకల్పశుద్ధి లేని ఆరాధనలు ఎంత శ్రమతో నిర్వహించినప్పటికీ ఆ మనిషికి వైఫల్యపు నష్టాలే ప్రాప్తమవుతాయి.

ఒక మనిషి ఉన్నతమైన భవనాలను నిర్మింపజేస్తాడు. విశాలమైన భవంతులను కట్టిస్తాడు. ఫలవంతమైన ఉద్యానవనాలను ఏర్పాటుచేస్తాడు. స్వర్గతుల్యమైన గృహాలలో నివాసముంటాడు. ప్రపంచం అతడిని రాజుగా కీర్తిస్తుంది. అయినప్పటికీ ఆ వ్యక్తిపై నిర్మాణాన్నింటిని మానవాళికి ప్రయోజనం కల్పించే సంకల్పంతో నిర్మింపచేసివుంటే ఆ నిర్మాణాలు, దాని తాలూకు ఆచరణలు అతనికి అంతరించని పుణ్యఫలాలను అందిస్తూనేవుంటాయి.

దైవప్రవక్త ముహమ్మద్(స) ఈవిధంగా సెలవిచ్చారు : 'ఏవ్యక్తి అయినా ఇతరులపై దౌర్జన్యం చేయకుండా ఉన్నతమైన భవంతిని నిర్మింపజేసుకుంటాడో– దౌర్జన్యం, శత్రుత్వం లేకుండా మొక్కలను నాటిస్తాడో– అతడి ఈ ఆచరణల వల్ల అల్లాహ్ సృష్టించిన జీవరాశులు ప్రయోజనం పొందుతూ వున్నంతకాలం, అతనికి పుణ్యఫలాలు లభిస్తూనే వుంటాయి.' (అహ్మద్)

మరో ప్రవచనంలో, 'ఏ ముస్లిం అయినా తోటలను పెంచి లేక పంటలను పండించగా అందునుండి పక్షులు లేక మనుషులు తింటే ఆ నష్టానికి బదులుగా

అల్లాహ్ అతనికి పుణ్యఫలాలను ప్రసాదిస్తాడు' అని దైవప్రవక్త(స) సెలవిచ్చారు. (ముస్లిం)

ధర్మబద్ధమైన లైంగిక వాంఛలు కూడా ఇస్లాంలో ఆరాధనలుగా పరిగణించబడతాయి. ఒక వ్యక్తి తన శీలాన్ని పరిరక్షించుకునేందుకు లేక ధర్మాన్ని సంరక్షించుకునేందుకు తన భార్యతో సంభోగం జరిపితే అల్లాహ్ అతని ఈ చర్యకు బదులుగా పుణ్యఫలాలు అందిస్తాడు. మనిషి సత్‌సంకల్పంతో తన శరీర అవసరాలు తీర్చుకునేందుకు భుజించినా, తన ఆలుబిడ్డలను పోషించినా అతను పుణ్యఫలాలకు అర్హుడవుతాడు.

సఆద్ బిన్ అబీవఖ్ఖాస్ (రజి) ఉల్లేఖనంప్రకారం దైవప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు: 'మీరు ఒక సాధారణ వస్తువునైనా అల్లాహ్‌ప్రీతికోసం సత్ సంకల్పంతో వ్యయపరిస్తే మీకు పుణ్యఫలం లభిస్తుంది. చివరకు మీ భార్య నోటికి ప్రేమతో అన్నం ముద్ద అందించడం కూడా పుణ్యఫలాన్ని చేకూరుస్తుంది.'

మరొక హదీసులో 'సత్ సంకల్పంతో ఏదైతే మీరు, మీరు తినిపించుకుంటారో అది మీకొరకు దానంగా పరిగణించబడుతుంది. ఏదైతే మీరు మీ ఆలుబిడ్డలకు తినిపిస్తారో అందులోనూ మీకు పుణ్యఫలాలు లభిస్తాయి. ఏదైతే మీరు మీ సేవకునికి తినిపిస్తారో అది కూడా మీకు దానంగా పరిగణించబడుతుంది.' (అహ్మద్)

అసలు రహస్యమేమంటే, మానవుడు తనను అల్లాహ్‌కు విధేయునిగా వుంచినంత వరకు, అతడి సంకల్పం పవిత్రంగా వున్నంతవరకు, అతడి ఆచరణలు అన్నీ అనగా అతని నిద్ర మేల్కొనడాలు అన్నీ ఆరాధనలుగా పరిగణించబడతాయి. పేదరికం, లేక పరిస్థితుల అననుకూలతల కారణంగా ఒక మనిషి మనసులో మంచి చేయాలని సత్ సంకల్పం కలిగివుండీ ఆ మంచిని చేయలేకపోతాడు. మానవుడి హృదయాలను చూడగలిగే అల్లాహ్ అతడి సత్‌సంకల్పం కారణంగా ఆ మనిషికి ధర్మాచరణలో నిరంతరం కృషి చేసిన ధర్మయోధునికి సమాన స్థాయిని ప్రసాదిస్తాడు. అల్లాహ్ దృష్టిలో బాహ్యాచరణకంటే అంతర్గత సంకల్పం, దృఢమైన చిత్తమే ప్రధానమైనవి.

ఒకసారి ధర్మయుద్ధంలో పాల్గొనేందుకు కొందరు పేదవారు దైవప్రవక్త (స) వద్దకు వచ్చారు. వారివద్ద యుద్ధ పరికరాలు లేని కారణంగా దైవప్రవక్త(స) వారిని యుద్ధంలో పాల్గొనే అనుమతినివ్వలేదు. స్వయంగా ప్రవక్త(స) వద్ద కూడా వారికి యుద్ధోపకరణాలు అందించే శక్తి లేకుండింది. ఈ కారణంగా ఆ పేదవారు ఎంతో

నిరాశతో వెనుదిరిగారు. ధర్మయుద్ధంలో ప్రవక్తకు సహకరించలేకపోయినందుకు వారు లోలోన కుమిలిపోయారు. వారి హృదయ స్థితిని ప్రస్తావిస్తూ దివ్యఖుర్‌ఆన్‌లో ఈ క్రింది వాక్యాలు అవతరించాయి:

**"స్వయంగా వచ్చి 'మా కొరకు వాహనాలు సమకూర్చండి' అని నీకు విజ్ఞప్తి చేసినవారి పట్ల కూడా ఇదేవిధంగా ఏ ఆక్షేపణకూ అవకాశంలేదు. నీవు, 'నేను మీ కొరకు వాహనాలు ఏర్పాటు చేయలేను' అని అన్నప్పుడే, గత్యంతరంలేక వారు మరలి పోయారు. వారి కళ్ళ నుండి అశ్రువులు ప్రవహించాయి. వారు తమ ఖర్చు లతో పోరాటంలోపాల్గొనే శక్తి తమకు లేనందుకు చాలా బాధపడ్డారు.'**

**(ఖుర్‌ఆన్, 9: 92)**

పటిష్టమైన విశ్వాసం, ప్రాణాలను తృణప్రాయంగా అర్పించుకునే తపనలు ఎన్నటికీ వృధాకావు. ఈ కారణంగానే ప్రవక్త(స) ఖుర్‌ఆన్‌లో ప్రస్తావించిన వారి విశ్వాసానికి, సత్ సంకల్పానికి మద్దతు పలికారు. ఆయన తనవెంట నడిచే సైనిక పటాలాన్ని ఉద్దేశించి 'కొంతమందిని మనం (విధి లేని పరిస్థితుల్లో) మదీనాలోనే విడిచివచ్చాము. అయితే వారు మనతోనే ఉన్నారు. మనం పయనించే ప్రతిలోయ లోనూ వారు మనతోపాటు వుంటారు. వారి కొరకు వారి నిస్సహాయతల హేతువు చాలు.' (బుఖారి) అని సెలవిచ్చారు. వారి సంకల్పంలో సత్యత నిండివుండింది. ఈకారణంగానే వారికి ధర్మయోధులతో సమానమైన పుణ్యఫలాలు ప్రసాదించ బడ్డాయి. వారు మదీనాలో అత్యంత అసహనంతో బాధాతప్త హృదయాలతో వుండిపోయారు.

సత్ సంకల్పం మనిషిని ఉన్నత శిఖరాలకు ఉత్తమ పుణ్యఫలాల మూటలకు హక్కుదారుని చేస్తుంది. మరోవైపున దుష్ట సంకల్పంతో చేసే ఆచరణలు అవి పైకి ఎంత గొప్పవిగా, పుణ్యకార్యాలుగా కన్పిస్తూ వున్నప్పటికీ పాపకార్యాలుగా పరిగణించబడతాయి. అటువంటి దుష్ట సంకల్పులను ఖురాన్ శపించింది.

**"తమ నమాజుల పట్ల అశ్రద్ధ వహించేవారూ, ప్రదర్శనాబుద్ధితో వ్యవహరించేవారు, వాడుకునే మామూలు వస్తువులను (ప్రజలకు) ఇవ్వటానికి వెనుకాడేవారు సర్వనాశనమవుతారు.' (ఖుర్‌ఆన్, 107: 4-7)**

ప్రదర్శనాబుద్ధితో చేసే నమాజ్ లాంటి ఆరాధన కూడా నేరంగా పరిణమి

స్తుంది. సత్ సంకల్పం లేని కారణంగా మహోన్నతమైన ఆరాధన నమాజ్ కూడా మృతప్రాయమైపోతుంది. కనుక ఇటువంటి నమాజ్‌ల వల్ల ఎటువంటి ప్రయోజనమూ చేకూరదు. అల్లాహ్ ప్రీతికోసం, ఆయన నుండి ప్రతిఫలాన్ని పొందేఉద్దేశ్యంతో చెల్లించే జకాత్ మాత్రమే అల్లాహ్ సన్నిధిలో స్వీకరించబడుతుంది. లేకుంటే అది ఒక వ్యర్థకార్యంగా మిగిలిపోతుంది.

**"ఓ ప్రజలారా! కేవలం పరుల మెప్పును పొందటానికే తమ ధనం ఖర్చు చేసే వాని మాదిరిగా అల్లాహ్‌నూ అంతిమ దినాన్ని విశ్వసించని వాని మాదిరిగా, మీరు దెప్పిపొడిచి గ్రహీత మనసును గాయపర్చి మీ దానధర్మాలను మట్టిలో కలపకండి... ఇలాంటి వారు తాము దానం చేస్తున్నామని భావించి చేసే పుణ్య కార్యం వల్ల వారికి ఏ ప్రయోజనమూ కలగదు." (ఖుర్‌ఆన్, 2: 264)**

ఏ హృదయంలో సంకల్పశుద్ధి ఉండదో– ఆ వ్యక్తి ఆచరణ అంగీకరించబడదు. బండరాతిపై పడివున్న మట్టిపై పంట పండించడం సాధ్యంకాదు కదా! అదేవిధంగా గుజ్జులోనే లోపం వుండగా ఒక ఫలం యొక్క పై తోలు ఎంత అందంగా వున్నా ప్రయోజనం శూన్యం.

ఒకవేళ హృదయం సత్‌సంకల్పంతో నిండినదైతే– ఆ వ్యక్తి యొక్క చిరు ఆచరణ సైతం కొండంత బరువైనదిగా, అత్యంత విలువైనదిగా మారిపోతుంది. సంకల్పశుద్ధి లేని, డొల్లతనానికి అల్లాహ్ వద్ద ఎటువంటి విలువా ఉండదు.

ఈ కారణంగానే దైవసందేశహరులు (స) 'మీ ధర్మాన్ని కేవలం అల్లాహ్‌కు మాత్రమే ప్రత్యేకించుకోండి! ఈ స్థితిలోని చిన్న ఆచరణ కూడా నరకం నుండి రక్షిం చేందుకు కారణం కాగులుతుంది' అని సెలవిచ్చారు. (అల్ హకీం)

పుణ్యకార్యాల ప్రతిఫలం పదినుండి వంద రెట్లు అధికంగా లభించగలదని హదీసు బోధనల ద్వారా తెలుస్తున్న విషయమే. అయితే ఈ పుణ్యఫలాలు హృదయంలో గుప్తంగా వుండే సంకల్పంపై ఆధారపడి మాత్రమే ప్రసాదించబడతాయి. హృదయంలోని సంకల్పాన్ని హృదయ రహస్యాలు ఎరిగిన అల్లాహ్ మాత్రమే తెలుసుకోగలుగుతాడు. కేవలం పవిత్ర సంకల్పం, అల్లాహ్ ప్రీతి కొరకు ఉద్దేశించబడిన ఆచరణలు మాత్రమే మనిషికి పుణ్యఫలాలను అందిస్తాయి.

కేవలం మనిషి బాహ్య ఆచరణలు అల్లాహ్ ప్రీతిని బడయజాలవు. ప్రాపంచిక

పటాటోపాలు, ఆడంబరాలు అల్లాహ్ ప్రీతిని సాధించిపెట్టలేవు. సంకల్పశుద్ధి గల దాసులవైపుకు మాత్రమే అల్లాహ్ అభిముఖుడవుతాడు. పవిత్ర సంకల్పం గల ఆచరణ లను మాత్రమే ఆయన స్వీకరిస్తాడు. సంకల్పశుద్ధి లేని ఆచరణలకు అల్లాహ్ వద్ద ఏ విలువా వుండదు.

దైవప్రవక్త(స) ఇలా పేర్కొన్నారు :'అల్లాహ్ మీ బాహ్యాన్ని, మీ రూపురేఖలను చూడడు. ఆయన కేవలం మీ హృదయాలను మాత్రమే చూస్తాడు.' (ముస్లిం)

మరో హదీసులో ఇలా చెప్పబడింది : ప్రళయదినాన మనిషి ఆచరణలు అన్నీ అల్లాహ్ సమక్షంలో సమర్పించబడతాయి. అందులో కేవలం అల్లాహ్ కొరకు నిర్వహించిన కార్యాలు మాత్రమే ప్రత్యేకించి వేరు చేయబడతాయి. ఇతర కోరికలతో నిర్వహించిన ఆచరణలన్ని నరకాగ్నిలో విసిరివేయబడతాయి.' (బైహఖీ)

ఏ వ్యక్తి తన ఆచరణలకు సంబంధించి, పై సత్యాలను తెలుసుకుంటాడో– జీవితంలో వర్తింపచేసుకుంటాడో– అతడు ఇహపరలోకాలలో సుఖశాంతులు, శాశ్వత ఆనందాన్ని పొందుతాడు. జీవితంలో పోగొట్టుకున్నది ఏదీకూడా అతనికి నష్టం కలిగించజాలదు. తన సదాచరణల విషయంగా ఎటువంటి దుఃఖాన్ని చవిచూడడు.

దైవప్రవక్త(స) ఇలా తెలిపారు : 'ఏ వ్యక్తికి కేవలం భాగస్వామి లేని అల్లాహ్‌ను ఏకైక దేవునిగా అంగీకరించి, ఆయన కొరకే ఆచరించి నమాజ్ స్థాపించి, జకాత్ చెల్లిస్తూవున్న స్థితిలో మరణిస్తే అల్లాహ్ అతడి పట్ల సంతుష్టుడు అవుతాడు.' (ఇబ్నెమాజా)

పై హదీసు ఈక్రింది అల్లాహ్ వాక్కుకు వివరణగా వుండటం మనం గమనిస్తాం.

> **"వారు అల్లాహ్‌కు దాస్యం చెయ్యాలని, పూర్తి ఏకాగ్రతతో తమ ధర్మాన్ని ఆయన కొరకే ప్రత్యేకించుకోవాలని, నమాజ్‌ను స్థాపించాలని, జకాత్ ఇస్తూ వుండాలని మాత్రమే ఆదేశించటం జరిగింది. ఇదే ఎంతో సరియైన, సవ్యమైన ధర్మం.'**
>
> **(ఖుర్‌ఆన్, 98: 5)**

## సత్ సంకల్పం వుండాలి

కష్టకాలంలోనైనా, పేదరికపు కఠినత్వంలోనైనా సత్ సంకల్పపు ఉజ్వల కిరణాలు ప్రత్యేకంగా తన పూర్తి శక్తితో కాంతిని ప్రసరిస్తూ వుంటాయి. ఈ

సమయంలో మనిషి తన కోరికల మనోవాంఛల నుంచి వేరైపోతాడు. పొరపాట్లకు తప్పులకు దూరమై పశ్చాత్తాప హృదయంతో అల్లాహ్‌ను వేడుకుంటూ వుంటాడు. ఆయన వైపునకు మరలుతూ వుంటాడు. ఆయన కారుణ్యాన్ని కోరుకుంటూ, ఆయన శిక్ష పట్ల భయకంపితుడవుతూ వుంటాడు.

కష్టాల కడలిలో చిక్కుకొని కేవలం అల్లాహ్‌పై సంపూర్ణ విశ్వాసంతో తనను రక్షించవలసిందిగా ఆదుకోవలసిందిగా వేడుకునే వ్యక్తి రూపురేఖలను ఖుర్‌ఆన్ ఈ క్రింది పదబంధాలలో చిత్రీకరించింది.

**"ప్రవక్తా! వారిని ఇలా అడుగు 'భూ సముద్రాల చీకట్లలోని ప్రమాదాలనుండి మిమ్మల్ని కాపాడేది ఎవరు? మీరు ఆపద సమయాల్లో కడుదీనంగా విలపిస్తూ అతిగోప్యంగా వేడుకునేది ఎవరిని? ఈ ఉపద్రవం నుండి ఆయన గనక మిమ్మల్ని రక్షిస్తే మేము తప్పకుండా కృతజ్ఞులం అవుతాము, అని మీరు అనేది ఎవరితో?'**

**(ఖుర్‌ఆన్, 6: 63, 64)**

పైవిధమైన నిష్ఠాత్మక సంకల్పం శాశ్వతంగా వుండదు. మనిషిపై ఆపత్ సమయాలు దాపురించినప్పుడు కష్టాల ఊబిలో కూరుకొని ఉన్నప్పుడు మాత్రమే అతడు అల్లాహ్ వైపునకు మరలడం, ఆయనను వేడుకోవడం చేస్తాడు. ఈ చర్య సత్ సంకల్పానికి నిదర్శనం కాజాలదు. వాస్తవానికి మానవజాతి మొత్తంగా తనను సరైన రీతిలో గుర్తించాలని, ఆరాధించాలని సృష్టికర్త అల్లాహ్ కోరుకుంటున్నాడు. కలిమిలోనూ, లేమిలోనూ, సుఖ- దుఃఖాలలోనూ, జీవితంలోని ప్రతి సందర్భంలోనూ తన దాసులు తనవైపుకే మరలి వుండాలని, సత్ సంకల్పంతో అత్యుత్తమ ఆచరణను, తన నైజంలో భాగం చేసుకోవాలని, ఈ విలువలతో తన సంబంధం ఎప్పటికీ బలహీనపడరాదని, తెగిపోకూడదని తమ ఆచరణలను అల్లాహ్‌కు తప్ప మరెవరికీ ప్రత్యేక పర్చకూడదని అల్లాహ్ అభిలషిస్తున్నాడు.

సత్ సంకల్పపు ఈ చైతన్యం ప్రపంచ ప్రవాహంలో క్రమక్రమంగా సన్నగిల్లుతూ, మబ్బుపడుతూ వుంటుంది. సిరిసంపదల పట్ల వ్యామోహం, అహంకారం, పదవీ వ్యామోహం, కీర్తికాంక్షలు, ప్రదర్శనాబుద్ధి, కీర్తి కండూతిలు మనిషి సత్ సంకల్పాన్ని మసకబార్చి వేస్తాయి. అల్లాహ్, పై మాలిన్యాల నుండి వేరుపడిన సత్ సంకల్ప ఆచరణను కోరుతున్నాడు.

**'జాగ్రత్త! ధర్మం ప్రత్యేకంగా అల్లాహ్‌కు చెందిన హక్కుమాత్రమే' (39: 3)**

సత్ సంకల్పం నుండి ఉద్భవించిన ఉత్తమ నైజం, పండి సువాసనలు వెదజల్లుతూ వున్న మధుర ఫలం వంటిది. ఈ ఫలాన్ని పరిరక్షించాలి. పరిశుభ్రంగా వుంచాలి. రుచిని నిలిపివుంచాలి. ప్రమాదాలనుంచి రక్షించడమేకాక అది కుళ్ళిపోకుండా జాగ్రత్తపడాలి.

ఈ కారణంగానే ఇస్లాం ప్రదర్శనాబుద్ధిని నిరసించింది. షిర్క్‌తో సమానమైన నేరంగా హెచ్చరించింది. ప్రదర్శనాబుద్ధి మనిషి యొక్క సదాచారణను చెదలు పురుగులా తినివేస్తుంది. ప్రదర్శనాబుద్ధి హృదయంలో నాటుకుంటే అదే స్వయంగా ఒక విగ్రహమై పోతుంది. విగ్రహారాధనకు ప్రతిఫలం నరకాగ్ని తప్ప మరేదీ వుండదు.

ఈ విషయంగా మానవ మహోపాధ్యాయులు ముహమ్మద్(స) ఇలా తెలిపారు: 'చిన్నపాటి ప్రదర్శనాబుద్ధి కూడా అల్లాహ్‌కు సాటి కల్పించడం షిర్క్‌గానే పరిగణించ బడుతుంది. అల్లాహ్, తను స్నేహితులుగా స్వీకరించినవారితో శత్రుత్వం వహించేవాడు బహిరంగంగా అల్లాహ్‌తో యుద్ధం చేసేవానిగా భావించబడతాడు. అల్లాహ్, తనను నిష్ఠతో గుప్తంగా ఆరాధించే సజ్జనులను ఇష్టపడతాడు. వారి గుప్త ఆరాధనల గురించి అల్లాహ్‌కు తప్ప మరెవ్వరికీ తెలియదు. వారు ప్రపంచంలో ప్రత్యేకంగా గుర్తించనూ బడరు. వారి హృదయాలు సత్యమార్గపు జ్యోతులై వుంటాయి. వారు భూమిలోని ప్రతి భాగం నుండి అంధకారాన్ని పారద్రోలుతారు.'(హాకిమ్)

ఇబ్నె అబ్బాస్ ఉల్లేఖనం ప్రకారం, 'ఒక వ్యక్తి అల్లాహ్ ప్రవక్త(స)తో 'ఓ దైవప్రవక్తా! నేను ఒక సంకల్పాన్ని కలిగివున్నాను. దానిద్వారా కేవలం అల్లాహ్ ప్రీతిపొందడమే నా లక్ష్యం అయివుంది. అయితే నా ప్రాంత ప్రజలు దానిని చూడా లనేది నా కోరిక. మరి ఈ విషయంగా మీ అభిప్రాయమేమిటి?' అని ప్రశ్నించాడు. ఈ సందర్భంలోనే ఈ క్రింది ఖుర్ఆన్ వాక్యాలు అవతరించాయి.

**"కనుక తన ప్రభువును కలుసుకోవాలని ఆశించేవ్యక్తి సత్కార్యాలు చేయాలి. ఆరాధనల్లో తన ప్రభువుతోపాటు మరెవ్వరినీ చేర్చకూడదు.' (18: 110)**

సంకల్ప శుద్ధిలేనితనం, ప్రదర్శనాబుద్ధి అనే ఈ రెండు నైజాలు– అధర్మ కోరికలను, మనోవాంఛలను గుప్తంగా ఉంచే ఉపద్రవాలుగా పనిచేస్తాయి. ఈ కారణంగానే ఇస్లాం ఈ రెండు చెడుగులను అత్యంత కఠిన పదజాలంతో ఖండించింది. అంతర్గతంగా ఉన్న పై చెడులు, ఇతర చెడులకు కారకాలవుతాయి. తద్వారా

సమాజంలో చెడు ప్రబలడానికి కారణభూతాలవుతాయి. ఈ చెడుగులకు లోనైన వ్యక్తి వీలైనంత త్వరగా ఆత్మపరిశీలన చేసుకోవాలి. ప్రక్షాళనకు పూనుకోవాలి. ఈ చెడుల నుండి బయటపడే ప్రయత్నాలు ముమ్మరం చేయాలి.

ఇదే సమయంలో విధేయతా ముసుగులో వుండే చెడులు, పాపకార్యాలు స్వయంగా ఆ వ్యక్తిద్వారా కూడా గుర్తింపబడవు. సమాజం చేతనూ అవి గుర్తింపబడవు. ఈ మానసికతకు లోనైన వ్యక్తి తాను చేస్తున్న ప్రతి షిర్క్‌ను అల్లాహ్ ప్రీతి కోసమే చేస్తున్నానని భావిస్తాడు. ఈ కారణంగా అతని నేరం, పాపం అతనికి కనపడనే కనపడదు. ఈ కారణంగా ఈ చెడుల నుండి పశ్చాత్తాపం పొందడం, మరలడం (తౌబా) జరగనే జరగదు.

ఇక సమాజానికి పేదరికం వల్ల నేరాలకు పాల్పడేవారి కంటే కూడా పై మానసికతకు, కపటత్వానికిలోనైన పండితుల వల్లే ఎక్కువ హాని జరుగుతుంది. సమర్థులైన వ్యక్తుల్లో సత్ సంకల్పం లేనికారణంగా వారి సామర్థ్యాలు దేశానికి, సమాజానికి శాపాలుగా పరిణమిస్తాయి. వారి సామర్థ్యాలు దేశ సమాజ పురోగతికి కాక తిరోగమనానికి కారణభూతాలవుతాయి.

ఒక మనిషి సామర్థ్యం అతని దుష్ట సంకల్పంతో సమ్మిళతమైతే, అది ఉద్దేశపూర్వక దుర్మార్గంగా భావించవలసి వుంటుంది. ఆ సామర్థ్యపు విలువను దిగజార్చడంగా పరిగణించబడుతుంది. సత్ సంకల్పం లేని కారణంగా ఒక మనిషి పొగడ్తలను కోరుకుంటాడు. తద్వారా తన ప్రభువు యొక్క అనుగ్రహం నుండి దూరమైపోతాడు. తన బుద్ధిహీనత కారణంగా తాను ఎంతటి ఘోర పాపానికి ఒడిగడుతున్నాడో గ్రహించనేలేడు. అతను మహాశక్తిమంతుడైన అల్లాహ్‌ను వదిలి శక్తిహీనులు, గ్రహీతలు, బలహీనుల దీనుల వైపుకు అడుగులు వేస్తున్నాడు. ఈ విషయాన్నే మానవ మహోపకారి (స) ఇలా స్పష్టపర్చారు.

'నిశ్చయంగా సంభవించే ప్రళయదినాన అల్లాహ్ సమస్త మానవాళిని సమావేశ పరుస్తాడు. అప్పుడు అల్లాహ్ వైపునుండి ఒక దూత ఈవిధంగా ప్రకటిస్తాడు: ఎవడైతే తన ఆచరణల్లో అల్లాహ్‌కు, ఎవరినైనా భాగస్వామిగా నిలబెట్టాడో– అతడు ఆ పుణ్యఫలం కొరకు ఆ భాగస్వామినే అడగాలి. ఎందుకంటే షిర్క్ విషయంలో అల్లాహ్ నిరపేక్షాపరుడు.' (తిర్మిజి)

## సైనికులు పవిత్ర సంకల్పంకై పోరాడాలి

ఇస్లామీయ సైన్యంలోని సాధారణ సిపాయినుండి సైన్యాధ్యక్షుని వరకు అందరూ తమ జీవన్మరణాలను ఒక పవిత్ర ఆశయం కొరకు, తప్పనిసరి విధి కొరకు అంకితం చేసివుంటారు. ఈ కారణంగా వీరు తమ ధర్మయుద్ధంను అన్నిరకాల డాంబికాల నుండి ప్రాపంచిక అధికార దర్పాలనుండి వేరుపర్చుకోవాలి. ఈ పవిత్రత కారణంగా వీరి పవిత్ర లక్ష్యం ముందు బిరుదులు, హోదాలు, వేతన, పతకాలు ఏమాత్రం విలువ లేనివిగా వుంటాయి.

అల్లాహ్ వద్ద ఉన్నదానికి మాత్రమే వీరు ప్రాధాన్యతనివ్వాలి. తమ కోరికలను కాంక్షలను పై సత్‌సంకల్పానికి, సమర్పణలకు బలివ్వవలసి వుంటుంది.

అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్(రజి) ఉల్లేఖనం ప్రకారం, 'నేను ఒకసారి– ఓ దైవప్రవక్తా! ధర్మయుద్ధానికి, సాధారణ యుద్ధానికి మధ్య తేడాను నాకు విశద పర్చండి' అని విన్నవించుకున్నాను. అందుకు దైవప్రవక్త(స) 'ఓ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ ఒకవేళ మీరు సహనంతో అల్లాహ్ ప్రీతిని పొందే కాంక్షతో యుద్ధం చేస్తే– అల్లాహ్ మిమ్మల్ని అదే స్థితిలో లేపుతాడు. అలాకాక అపార సైనిక బలగం పట్ల గర్విస్తూ ప్రజల ముందు అహంభావంతో, ప్రదర్శనాబుద్ధితో యుద్ధం చేసినట్లయితే అల్లాహ్ మిమ్మల్ని అదే స్థితిలోలేపుతాడు. మీరు ఏ స్థితిలో యుద్ధం చేస్తారో– లేదా హతమార్చబడతారో– అల్లాహ్ మిమ్మల్ని అదే స్థితిలో లేపుతాడు' అని వివరించారు. (అబూదావూద్)

## ఉద్యోగులు అల్లాహ్ మార్గంలో కృషి చేయాలి

ఉద్యోగులు తమ కార్యాలయాల్లో, విధి నిర్వహణల్లో ఏదైతే వ్రాస్తారో– లెక్కిస్తారో– తమ బుద్ధి జ్ఞానాన్ని వినియోగిస్తారో తీవ్రంగా, శ్రమిస్తారో వాటన్నింటిని వారు తమ దేశ ప్రయోజనం కొరకు, అల్లాహ్ ప్రీతి ఆర్జించే సత్ సంకల్పంతో నిర్వహించాలి. ఒక జంతువు తన మేత కొరకు దినమంతా శ్రమిస్తుంది. ఒక సత్ సంకల్పం లేని సాధారణ ఉద్యోగి కూడా పై జంతువునే పోలి వుంటాడు. అతడు చేసే పనులన్నీ అతని వేతనపు విలువకు సమానంగా వుంటాయి. అతడి ఉద్దేశ్యం, సంకల్పం, లక్ష్యాలు అన్నీ నెలసరి జీతమే అవుతుంది. అంతకుమించిన ఉత్తమత్వం అతని సంకల్పంలో వుండదు.

అయితే ఒక సత్ సంకల్పం గల మేధావి తన కార్యనిర్వాహక విలువను మేధో పర చింతన విలువను ఒక మహోన్నత లక్ష్యంకొరకు వెచ్చిస్తాడు. ఒక సాధారణ ఉద్యోగి కేవలం డబ్బు, హోదా, అభివృద్ధి అనే విషయాలను తప్ప మరే విషయాన్ని పట్టించుకోడు. తన ప్రపంచాన్ని, ధర్మాన్ని కేవలం ఉద్యోగ పరిధికి కుదించుకొని జీవిస్తూ వుంటాడు. తన సుఖ దుఃఖాలకు, లాభనష్టాలకు ఉద్యోగమే మూలంగా భావించి దానికే అంటిపెట్టుకొని వుండిపోతాడు.

పై విషయమై దైవప్రవక్త(స) శిక్షణాత్మక బోధన ఇలావుంది 'ఆఖరి యుగంలో నా ఉమ్మత్ (అనుచర సమాజం) మూడువర్గాలుగా చీలిపోతుంది. మొదటి వర్గానికి చెందినవారు కేవలం అల్లాహ్‌నే ఆరాధిస్తారు. అల్లాహ్ ప్రీతి కొరకు మాత్రమే జీవిస్తారు,ధర్మాన్ని ఆచరిస్తారు. రెండవ వర్గానికి చెందినవారు ప్రదర్శనాబుద్ధితో ఆరాధిస్తారు. ఇక మూడవ వర్గం వారు తమ ఆరాధనల ద్వారా ప్రజల సొమ్మును మింగేసే ప్రయత్నం చేస్తారు. అల్లాహ్ ప్రళయదినాన వారందరినీ సమావేశపరుస్తాడు. వారిలోని మూడవ వర్గాన్ని సంబోధిస్తూ... 'నా గౌరవోన్నతుల సాక్షి! నీవు నా ఆరాధనలద్వారా ఏమీ ఆశించావో తెలుపు' అంటాడు. అందుకు మొదటి వర్గం, 'నీ గౌరవోన్నతుల సాక్షిగా! నేను దాని ద్వారాప్రజల సొమ్మును తిన్నాను' అంటుంది. అప్పుడు అల్లాహ్ 'నీవు దేనిని సమీకరించుకున్నావో– అది నీకు ఏప్రయోజనమూ చేకూర్చలేకపోయింది. ఈ వర్గాన్ని నరకంలో పడవేయండి' అంటాడు. ఆ తర్వాత అల్లాహ్ రెండవ వర్గాన్ని సంబోధిస్తూ... 'నా గౌరవోన్నతుల సాక్షి! నా ఆరాధనల ద్వారా నీవు ఏమి ఆశించావు?' అని ప్రశ్నిస్తాడు. అందుకు రెండవ వర్గం 'నీ గౌరవోన్నతుల సాక్షి!ప్రజల ముందు ప్రదర్శించడమే నా సంకల్పంగా వుండింది అంటుంది. అప్పుడు అల్లాహ్ 'ఈ కారణంగా నా వద్దకు నీ ఆచరణ ఏదీ చేరలేదు. ఈ వర్గాన్ని నరకంలో పడవేయండి' అని ఆజ్ఞాపిస్తాడు. చివరగా సత్ సంకల్పంతో అల్లాహ్‌ను ఆరాధించిన మొదటి వర్గాన్ని సంబోధిస్తూ అల్లాహ్... 'నా గౌరవోన్నతుల సాక్షి!నీవు నా ఆరాధనల ద్వారా ఏమి ఆశించావో తెలుపు?' అని ప్రశ్నిస్తాడు. అందుకు ఆ సత్ సంకల్ప వర్గం 'నీ గౌరవోన్నతుల సాక్షి! నీ ధ్యానం, స్మరణలతో నీ ప్రీతిని కాంక్షిస్తూ వుండిన వారి గురించి నీకే బాగా తెలుసు' అంటుంది. అప్పుడు అల్లాహ్ 'నా దాసులు సత్యం పలికారు. వీరిని స్వర్గంలో ప్రవేశింపజేయండి' అని ఆదేశిస్తాడు. (తిబ్రాని)

# విద్యార్థులు దైవప్రీతికై కృషిచేయాలి

శాస్త్ర సాంకేతిక, వైజ్ఞానిక రంగాలలో సత్ సంకల్పం కలిగివుండటం అత్యంత అవసరమైన విషయం. సమస్త జీవకోటిపై శ్రేష్టత్వం మనిషికి, కేవలం జ్ఞానం పునాదుల మీదనే అల్లాహ్ ప్రసాదించాడు. కనుక శ్రేష్టమైన జ్ఞానాన్ని నీచమైన కార్యాలకు, తుచ్ఛ మనోవాంఛల నెరవేర్పుకు వినియోగించడం కూడదు. ఈ దుష్ట చర్యల ఫలితంగా సమాజం అలజడులకు, కల్లోలాలకు, ఉపద్రవాలకు నిలయంగా మారుతుంది. ఈ చర్యలను జ్ఞానం దుర్వినియోగపర్చడంగా ఇస్లాం భావిస్తుంది. ఉత్తమ నైతిక విలువలకు తిలోదకాలుఇచ్చి సత్ సంకల్పానికి హృదయంలో చోటివ్వని శాస్త్రవేత్తలు, పండితుల మూలంగానే ప్రపంచం అత్యంత ప్రమాదాలకు లోనైంది. రక్తపాతాలతో భయానక దృశ్యాలతో అతలాకుతలమయింది.

ఉపాధ్యాయుడు, విద్యార్థి ఇరువురు కూడా జ్ఞానసంబంధంగా సత్ సంకల్పం కలిగివుండాలి. జ్ఞానసముపార్జనలో ఉత్తమ నైతికతకు, సమాజ శ్రేయస్సుకు పెద్దపీట వేయాలని ఇస్లాం ఆదేశిస్తుంది. బోధనా- అభ్యాసాల లక్ష్యం కేవలం ధనార్జనగా వుండకూడదు. స్వార్థంతో కేవలం ధనార్జన కోసం సాగే విద్యావిధానం, జ్ఞానపు విలువను దిగజార్చి వేస్తుంది. జ్ఞానం యొక్క మహోన్నత లక్ష్యాన్ని ధ్వంసం చేసి వేస్తుంది. సమాజానికి గుదిబండలాగా మారిపోతుంది.

మహోపాధ్యాయులు ముహమ్మద్(స) జ్ఞాన సముపార్జన విషయంగా ఇలా బోధించారు : 'ఒక వ్యక్తి అల్లాహ్ ప్రీతిని పొందే జ్ఞానాన్ని ఆర్జించినప్పటికీ, అతడు తద్వారా నీచ ప్రాపంచిక ప్రయోజనాలను పొందడాన్నే సంకల్పంగా కలిగివుంటే ప్రళయదినాన అతడు స్వర్గపు సువాసనను కూడా పొందజాలడు.'(అబూదావూద్)

జ్ఞానవంతుడైన ఒక వ్యక్తి, తన స్వార్థం పునాదులపై ప్రజలపై ఆధిపత్యం వహించే ప్రయత్నం చేసినా, తన గొప్పతనాన్ని దర్పంగా ప్రదర్శించినా ప్రజలతో వాదోపవాదాలకు దిగినా ఇస్లాం అతనిని తీవ్రంగా ఖండిస్తుంది.

ప్రవక్త(స) వారి ఒక హితోక్తిలో ఇలా వుంది : 'గర్వాన్ని ప్రదర్శించే ఉద్దేశ్యంతో, మూర్ఖ -సాధారణ ప్రజలతో వాదోపవాదాలు చేసే ఉద్దేశ్యంతో, సమావేశాల్లో తర్కం ద్వారా ప్రాబల్యం వహించే ఉద్దేశ్యంతో జ్ఞానాన్ని ఆర్జించకండి. ఏ వ్యక్తి పైఉద్దేశ్యంతో

జ్ఞానార్జన చేస్తాడో- అతడి నివాసం నరకం తప్ప మరేదీకాదు.' (ఇబ్నెమాజా)

నేడు ప్రపంచంలో జండాలు ఎగురవేస్తున్న ప్రాపంచిక, ధార్మికజ్ఞానాలు కేవలం సత్య జిజ్ఞాస, సత్ సంకల్పాల సుగుణాల ద్వారానే గౌరవోన్నతులు పొందగల్గు తాయి. జ్ఞాన బోధన, అభ్యాసాలు సాగించేవారు సత్ సంకల్పం కలిగివుండటం వల్ల వారు అనేక కష్టాలకు, కఠిన పరీక్షలకు గురవుతారని భావించడం సరికాదు. సత్ సంకల్పం కలిగివున్న ప్రతి వ్యక్తి తప్పనిసరిగా కష్టాల కడలిని ఈదవలసి వుంటుందనే షరతు ఏమీ లేదు. అదే సమయంలో సత్ సంకల్పం లేని కారణంగా ఉనికిలోకి వచ్చే సామాజిక రుగ్మతల జాబితా చాలా సుదీర్ఘంగానే వుంటుంది. ఈ రుగ్మతలు తీవ్రస్థాయికి చేరినప్పుడు విశ్వాసం కృశించిపోయి హృదయాలు డొల్లలుగా బలహీన పడిపోతాయి. ఈ బలహీన హృదయాలపై అనగా సత్ సంకల్పం లేని హృదయాలపై షైతాన్ సులభంగా దాడిచేయగలడు.

మహోన్నతుడైన అల్లాహ్ ధనికుల పట్ల,పెట్టుబడిదారుల పట్ల నిరసన భావం ఎందుకు కలిగివుంటాడంటే; వారు తమ స్వార్థ ప్రయోజనాలను, కోరికలను, సంబంధ బాంధవ్యాలను జీవిత లక్ష్యాలను అల్లాహ్ అభీష్టం మేరకు అల్లాహ్ మార్గంలో త్యాగం చేయరు. స్వార్థ ప్రయోజనాలలో నిమగ్నమై తమ ప్రభువు ప్రీతిని ఆర్జించే విషయాన్ని వారు విస్మరించారు.

ఫిరౌను దర్బారులోని మాంత్రికులు, ఫిరౌను హెచ్చరికలను, బెదిరింపులన్నింటిని ధిక్కరించి, సిరిసంపదలు, కీర్తి కండూతులను తిరస్కరించి, సకల వ్యామోహాలను త్యజించి తమ సంకల్పశుద్ధిని స్పష్టంగా ప్రదర్శించారు. వారు మహాశక్తిమంతుడైన చక్రవర్తి ఫిరౌన్‌ను ఈ క్రింది మాటల ద్వారా సవాలు విసిరారు. ఈ మాటలను దైవ గ్రంథం ఖుర్ఆన్ ఇలా రికార్డు చేసింది.

**"మమ్మల్ని సృష్టించిన శక్తి సాక్షిగా! స్పష్టమైన సూచనలు ముందుకు వచ్చిన తరువాత కూడా (సత్యంపై) నీకు ప్రాధాన్యత ఇవ్వటం అనేది జరగని పని. (ఓ ఫిరౌన్) నీవు చేయదలచుకున్నది చేసుకో. మహా అయితే నీవు ఈ ప్రపంచ జీవితం గురించి మాత్రమే నిర్ణయం చేయగలవు. మేము మా ప్రభువును విశ్వసించాము. మా తప్పులను ఆయన క్షమించాలని, నీవు బలవంతంగా మా**

**చేత చేయించిన మంత్రతంత్రాలకు మమ్మల్ని మన్నించాలని. అల్లాహ్‌యే మంచివాడు, కలకాలం వుండేవాడు.” (ఖుర్ఆన్, 20 : 72 - 73)**

ఫిరౌన్ వర్గానికి, విశ్వసించిన మాంత్రికుల వర్గానికి మధ్య ఎంతటి వ్యత్యాస మున్నదో గమనించండి. ఒక వర్గం అల్లాహ్ మార్గంలో ప్రాపంచిక ప్రయోజనాలను తృణప్రాయంగా భావిస్తుంది. మరో వర్గం చక్రవర్తి ప్రాబల్యం పొందేందుకు, తమ నీచ ప్రాపంచిక ప్రయోజనాలను పొందేందుకు, ధర్మాన్ని, విశ్వాన్ని, చివరకు దైవాన్ని హేళన చేస్తుంది. ఉత్తమ విలువలను తమ నీచ ప్రయోజనాలకు బలిపెడుతుంది.



# 11 వ భాగం

# సంభాషణా మర్యాదలు

- సంభాషణా నియమాలు
- ఆత్మపరిశీలన అవసరం
- మౌనం ఉత్తమ భూషణం
- సమయాన్ని వ్యర్థపర్చనివాడే విజయుడు
- సందేశకునికి విశాల హృదయం తప్పనిసరి
- అజ్ఞానపు సమాధానం కంటె- జ్ఞానవంతమైన మౌనం మేలైనది
- వాదోపవాదాలను విసర్జించండి!

# సంభాషణా నియమాలు

సంభాషణ, భావ వ్యక్తీకరణలను దేవుడు అనుగ్రహించిన గొప్పవ[...] భావిస్తుంది. ఈ ప్రత్యేక కారణంగానే అల్లాహ్, మనిషి ఇతర సృష్టితాలపై ఆ[...] గౌరవాన్ని ప్రసాదించాడు.

**"పరమ కృపాశీలుడు (అయిన దేవుడు) ఈ ఖుర్‌ఆన్ బోధించాడు. ఆయ[...] మానవుడిని సృష్టించి, అతనికి మాట్లాడటం నేర్పాడు" (ఖుర్‌ఆన్, 55 : 1-4)**

అనుగ్రహం ఎంత గొప్పగా వుంటుందో – దాని నిర్వహణ పట్ల బాధ్యత కూడా అంతే ప్రధానమైనదిగా వుంటుంది. ఈ అనుగ్రహం పట్ల నిత్యం కృతజ్ఞత తెల్పడం కూడా తప్పనిసరి అవుతుంది. అదే సమయంలో కృతఘ్నత (తిరుగుబాటు) ఎంతమాత్రమూ ఆమోదయోగ్యం కానిదిగా భావించబడుతుంది.

'మాట్లాడటం' – 'భావవ్యక్తీకరణ' అనే ఈ గొప్ప అనుగ్రహం ద్వారా మనిషి ఎలా లబ్ధి పొందాలి? నోటి ద్వారా వెలువడే ప్రతిమాటను మంచి కొరకు సత్యం కొరకు ఎలా ఉపయోగించాలి? అనే విషయాన్ని ఇస్లాం చాలా స్పష్టంగా విశదపరిచింది. తమ మాటల ప్రవాహంతో ఎదుటివారిని బెంబేలెత్తించేవారూ, మౌనంగా వుండలేని వాగుడుకాయలకు నేటి సమాజంలో కొదువలేదుకదా!

ఈ మాటల వీరుల సంభాషణలో, అత్యధిక శాతం వ్యక్తమైన, పనికిరాని మాటలే కనబడతాయి. అల్లాహ్ నోటిని ఇచ్చింది, మాటను నేర్పింది వ్యర్థ ప్రేలానల కొరకు కాదు గదా!

**"ప్రజలు జరిపే రహస్య సమాలోచనలలో సాధారణంగా ఏ మేలూ ఉండదు. కాని ఎవరైనా రహస్యంగా దానధర్మాలు చెయ్యండి అని బోధిస్తే లేక ఏదైనా సత్కార్యం కొరకు లేదా ప్రజల వ్యవహారాలను చక్కబరిచే ఉద్దేశ్యంతో ఎవరితో నైనా ఏదైనా రహస్యం చెబితే అది మంచి విషయమే. ఎవరైనా అల్లాహ్ సంతోషం కొరకు ఈ విధంగా చేస్తే వారికి మేము గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాది స్తాము." (ఖుర్‌ఆన్ 4 : 114)**

ఇస్లాం సంభాషణా నియమాల గురించి, పద్ధతుల గురించి, వాటి మర్యాదల గురించి ప్రత్యేకంగా ప్రస్తావించింది. మనిషి నోటి నుండి వెలువడే మాట, పలుకు

...స్తుంది. ఈ కారణంగానే మన సభల ప్రామాణికత, ...మాలు, మర్యాదలపై ఆధారపడి వుంటాయి. సంస్థ యొక్క ...సంస్థలో అమలయ్యే సభామర్యాదల ద్వారా నిర్ధారించుకోవచ్చు.

## ఆత్మపరిశీలన అవసరం

ఇతరులను ఉద్దేశించి మాట్లాడే ముందు, ఈ మాట సందర్భోచితమా? కాదా? ...ప్రశ్నించుకోవాలి. సమాధానం 'అవును' అని వస్తే సంభాషణ మొదలెట్టాలి. అలా కాక, సమాధానం 'కాదు' అనిపిస్తే మౌనమే ఉత్తమమని భావించాలి. మౌనం కూడా గొప్ప ఆరాధనగా పరిగణించబడుతుంది.

అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) యిలా తెలిపారు: 'ఆరాధనకు అర్హుడైన అల్లాహ్ సాక్షి! ఈ భూమిపై అత్యధికంగా తాళం వేయదగ్గ అర్హత కేవలం మన నోటికి మాత్రమే వుంది." (తిబ్రాని)

అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) యిలా తెలిపారు : "ఐదు విషయాలున్నాయి. అవి మేలురకం జాతి గుర్రాల కన్నా ఎంతో మేలైనవి. 1) అనవసరంగా మాట్లాడకండి. అనవసర మాటల వల్ల పాపాల్లో చిక్కుకునే ప్రమాదముంది. 2) అవసరమైన మంచి విషయాలు కూడా సందర్భానుసారంగానే మాట్లాడండి. అసందర్భంలో మంచి విషయం కూడా ఒక సంభాషణాలోపం అయిపోతుంది. 3) మేధావితోనైనా, మూర్ఖునితోనైనా వాదానికి దిగకండి. మేధావి మీ వాదాల ద్వారా మీ పట్ల అయిష్టత పెంచుకుంటాడు. మూర్ఖుడు మీ పట్ల ద్వేషం పెంచుకుంటాడు. మీకు అపకారం తలపెట్టే ప్రమాదమూ ఉంది. 4) మీరు మీ గురించి ఎటువంటి ప్రస్తావన వినాలని కోరుకుంటారో– మీ సోదరుని గైరుహాజరీలో అతని పట్ల అదే విధంగా ప్రస్తావించండి. ఇతరులు మిమ్మల్ని మన్నించాలని కోరినట్లుగానే మీరు కూడా మీ సోదరుని మన్నించండి. 5) ఉపకారానికి బహుమతి కోరకండి. నేరస్తుడిని తప్పకుండా శిక్షించాలనే కఠిన మనస్కులు కాకండి. (అనగా క్షమాగుణం కలిగి వుండండి)"

(ఇబ్నె అబీద్దునియా)

పైన పేర్కొన్న ఉత్తమ సంభాషణా సుగుణాలన్ని ప్రతి ముస్లిం కలిగి వుండాలి. మౌనంగా వుంటూ నోటిని అదుపులో వుంచుకోగలిగిన వ్యక్తి మాత్రమే సాఫల్యం పొందుతాడు. ఎక్కడ మౌనం అవసరమో, అక్కడ నోటికి తాళం వేయాలి. ఎక్కడ

మాట్లాడే అవసరం వుందో అక్కడ తప్పనిసరిగా మాట్లాడాలి. (మాట్లాడవలసిన సమయంలో మాట్లాడకపోవడం ఇస్లాంలో నేరంగా పరిగణించబడుతుంది – అనువాదకుడు). తమ నోటి దురుసుతనానికి లోబడి పోయిన వారు వెనుకకు నెట్టివేయబడతారు. జీవన రంగంలో వారు అవమానాలకు, పరాభవాలకు తప్పక గురి అవుతారు.

## మౌనం ఉత్తమ భూషణం

నోటి దురుసుతనం, అనవసర వాగుడులు మనిషియొక్క బుద్ధిహీనతకు నిదర్శనంగా వుంటాయి. సభల్లో, సమావేశాల్లో నోటికి విరామం యివ్వకుండా మాట్లాడేవారు మనకు ఎదురుపడుతూ వుంటారు. వీరి మాటల్లో ప్రభావం ఏ మాత్రమూ వుండదు. వారి మాటల ప్రవాహం వల్ల యితరులు ఇబ్బందిపడటంతో పాటుగా అనేక అపార్థాలు చోటు చేసుకునే ప్రమాదమూ లేకపోలేదు. వీరు తమ వాగ్ధాటి ద్వారా యితరులపై ఆధిక్యం వహించాలనీ, తమ మాట నెగ్గించుకోవాలనీ చూస్తారు. వీరి మాటల్లో లోతైన అర్థంకాని, గంభీరమైన విషయం కాని వుండదు.

ఒక వ్యక్తి తన నిజ స్థానాన్ని గుర్తిస్తే, ధర్మవిధి బాధ్యతలను తెలుసుకుంటే, అతడు అనవసరమైన కేకలు వేయడు... బాతాఖానీలూ చేయడు. నిష్కల్మష హృదయంతో, ప్రశాంత చిత్తంతో నిశ్శబ్దంగా వుంటాడు. ఈ కారణంగానే ఇస్లాం, అనవసర విషయాల్లో మౌనం అభిలషణీయమని చెబుతుంది. తనకు తానుగా ఈ అవాటును అలవర్చుకోమని ఉపదేశిస్తుంది.

ఈ విషయంగా ప్రవక్తశ్రీవారు అబూజర్ (రజి)ను ఉద్దేశించి ఇలా ఉపదేశించారు : "మౌనాన్ని అలవర్చుకోండి! మౌనం షైతానును తరిమికొట్టే సాధనం, మీ ధర్మం విషయంలో మీకు సహాయకారిగా పని చేస్తుంది." (అహ్మద్)

నిస్సందేహంగా నోరు షైతాన్ చేతిలో వున్న త్రాడులాంటిది. దానిని షైతాన్ తాను కోరినప్పుడు, కోరినచోట మెలిపెట్టగలడు. మానవుడు షైతాన్ విషయంలో ఏమరుపాటును ప్రదర్శిస్తే, అతని నోటి ద్వారా జరగకూడని అనర్థాలన్నింటిని జరిపిస్తాడు. నోటిని ఆలోచనల అదుపు నుండి తప్పించివేస్తాడు.

ఈ విషయంగా ప్రవక్త మహోపాధ్యాయులు "ఒక వ్యక్తి హృదయం సరికానంత వరకు అతని విశ్వాసం సవ్యంగా వుండజాలదు. ఒక వ్యక్తి నోరు సరికానంత వరకు అతని హృదయం సరికాదు" అని నోటికి, హృదయానికి విశ్వాసానికి

మధ్యనున్న సబంధాన్ని స్పష్టపరిచారు." (అహ్మద్)

నోటి సంస్కరణకు మొదటి మెట్టుగా ప్రజలు తమకు సంబంధంలేని అనవసర విషయాలనుండి దూరంగా వుండాలి. ఇతరుల విషయాల్లో అనవసర జోక్యం మానాలి. తనకు బాధ్యతలేని విషయాల జోలికి వెళ్ళకూడదు. ఈ లక్షణాలు స్వచ్ఛమైన విశ్వాసానికి నిదర్శనాలుగా వుంటాయి.

## సమయాన్ని వ్యర్థపర్చనివాడే విజయుడు

సమయాన్ని వ్యర్థపర్చకుండా, దానిని సద్వినియోగం చేసుకునేవాడు విజయాన్ని పొందుతాడని ఖుర్ఆన్ స్పష్టపరిచింది.

**"నిశ్చయంగా సాఫల్యం పొందే విశ్వాసులు తమ నమాజుల్లో వినమ్రతను పాటిస్తారు. వ్యర్థ విషయాల జోలికి పోరు. జకాత్ విధానాన్ని ఆచరిస్తారు." (ఖుర్ఆన్ , 23 : 1-4)**

విజయానికి సమయ సద్వినియోగం షరతుగా వుంటుంది. ప్రజలు అనవసర విషయాల్లో కాలాన్ని వృధా చేస్తూ వుండటం మనకు తెలిసిందే. కథలు, గాధలు, నవలలు, సాహిత్య ప్రసంగాలు, గానాబజానాలు అన్ని అనవసర విషయాలకు సంబంధించినవే అయి వున్నాయి. వీటివల్ల తాత్కాలిక ఊరట తప్ప ఏ మాత్రం లాభం వుండదు.

అనవసర వ్యర్థ ప్రేలాపనలకు ఇస్లాం ఎలాంటి విలువానివ్వదు. సమయాన్ని వ్యర్థపరిచే వారి పట్ల ఇస్లాం అసహ్యం వ్యక్తపరుస్తుంది. మనిషి చేయవలసిన అత్యవసర పనులను వదిలిపెట్టి అనవసర విషయాల్లో కాలాన్ని వెళ్ళబుచ్చడాన్ని ఇస్లాం గర్హిస్తుంది. సమయాన్ని వ్యర్థపర్చని వానికి అల్లాహ్ వద్ద ఉన్నత స్థానం లభిస్తుంది.

అనస్ బిన్ మాలిక్ ఉల్లేఖనం ప్రకారం, "ఒక వ్యక్తి మరణించాడు. మరో వ్యక్తి అతని మరణవార్తను ప్రస్తావిస్తూ, 'అతడు స్వర్గంలో ప్రవేశిస్తాడు' అని అన్నాడు. దానికి దైవప్రవక్త (స) "అతడు స్వర్గంలో ప్రవేశిస్తాడని నీకు తెలుసా? అతడు అనవసర వ్యర్థ వ్యవహారాల్లో పాల్గొనేవాడేమో...? ... ధనం దైవమార్గంలో ఖర్చుచేయడంలో పిసినారి తనం చూపేవాడేమో?" అని ప్రశ్నించారు. (తిర్మిజి)

సమయాన్ని వ్యర్థపర్చడం అలవాటైన వ్యక్తి తన ఆలోచనలు, మాటల మధ్యగల

వైరుధ్యం వల్ల నోటికొచ్చింది వాగుతూ వుంటాడు. ఒక్కోసారి ఈ ప్రేలాపనల మూలంగా ప్రమాదాలూ కొని తెచ్చుకుంటాడు. ఇతరులకు ప్రమాదాలూ చేకూరుస్తాడు. ఒక అరబ్బీ సామెత భావం ఇలా వుంది.

"గాయంతో మరణించని యువకుడు – నోటి దురుసుతనంతో మరణిస్తాడు."

ఒక ప్రవక్త ప్రవచనంలో ఇలా వుంది, "ఒక దాసుడు సభను రంజింపజేయడానికి వ్యర్థప్రేలాపనలు అనేకం చేస్తాడు. ఫలితంగా భూమ్యాకాశాల మధ్య విలువలేని ఏదో ఒక మూలకు అతడు అల్లాహ్ ద్వారా విసిరివేయబడతాడు. నోటివల్ల కలిగే గాయం కంటే మనిషి శరీరానికి ఇతర కారణాల వల్ల కలిగే గాయం చాలా చిన్నదిగా వుంటుంది." (బైహఖి)

## సందేశకునికి విశాల హృదయం తప్పనిసరి

మనిషి మాట్లాడితే, మంచి – శుభకరమైన మాటలే మాట్లాడాలి. మధురంగా తేనెలొలికేలా మాట్లాడాలి. మాటలు పొందికగా చక్కగా పదాలు పలికేలా అలవాటు చేసుకోవాలి. మన భావాలను శ్రోత హృదయంలో నాటుకునేలా ఉత్తమ రీతిలో సంభాషించాలి. అల్లాహ్ తన దాసులను ఈ శిక్షణనే అందించాడు.

**"ఆ వాగ్దానాన్ని జ్ఞాపకం తెచ్చుకోండి. అల్లాహ్‌ను తప్ప మరెవ్వరినీ ఆరాధించకూడదు. తల్లిదండ్రులను, బంధువులను, అనాథులను, నిరుపేదలను ఆదరించాలి. ప్రజలను సహృదయంతో పలకరించాలి. నమాజ్‌ను స్థాపించాలి. జకాత్‌ను యివ్వాలి." (ఖుర్‌ఆన్, 2 : 83)**

ఉత్తమమైన సంభాషణ మిత్రులనే కాదు, శత్రువులను సైతం ప్రభావితం చేస్తుంది. దాని తీపి ఫలాలు ఫలితాలుగా మనకు అందుతాయి. మిత్రులతో గౌరవనీయమైన సంబంధాలు మరింతగా బలపడతాయి. షైతాన్ చేష్టల మార్గాలన్నీ మూసివేయబడతాయి. వారి మధ్య పొరపొచ్చాలకు చోటు లేకుండాపోతుంది.

**"ప్రవక్తా! నా దాసుల (అంటే విశ్వాసులైన నా దాసుల)కు, వారు తమ నోట అత్యుత్తమ మాటనే పలుకుతూ వుండాలి అని చెప్పు. అసలు మానవుల మధ్య కలహాన్ని సృష్టిం చడానికి ప్రయత్నం చేసేవాడు షైతానే. నిజానికి షైతాన్ మానవుడికి బహిరంగ శత్రువు." (ఖుర్‌ఆన్, 17 : 53)**

మనుషుల మధ్య శత్రుత్వం పెంచడానికి, ఈర్ష్యా ద్వేషాలు వ్యాపింపజేయ డానికి నిత్యం షైతాన్ కాచుకొని వుంటాడు. సాధారణ అభిప్రాయభేదాన్ని కూడా తీవ్రమైన కల్మషంగా, ఉపద్రవంగా మార్చే ప్రయత్నం చేస్తాడు. వీలైనంత వరకు మనుషులు ఐక్యంగా వుండకుండా కుట్ర చేస్తూ ఉంటాడు. శత్రువునైనా సరే మంచిగా ప్రేమగా మాట్లాడాలి. అతనితో ఉత్తమ రీతిలో వ్యవహరించాలి. ఫలితంగా శతృత్వం నశించే అవకాశం వుంటుంది. లేదా కనీసం దాని తీవ్రత తగ్గుతుంది. ఈ విషయంగా అల్లాహ్ మార్గదర్శకత్వం ఈ క్రింది విధంగా వుంది:

**"ప్రవక్తా! మంచీ చెడూ ఒకటి కావు. నీవు చెడును శ్రేష్ఠమైన మంచి ద్వారా తొలగించు. అప్పుడు నీ పట్ల శత్రుభావం కలవాడు నీకు ప్రాణ స్నేహితుడై పోవడాన్ని నీవు గమనిస్తావు." (ఖుర్ఆన్, 41 : 34)**

ఈ విషయంగా మహోపాధ్యాయులు (స) శిక్షణ యిలా వుంది, 'మీరు మీ ధన సంపత్తుల ఆధారంగా ప్రజలపై ఆధిక్యం సాధించలేరు. కాని, సత్ప్రవర్తన, హృదయ వైశాల్యం, మంచి మాట ద్వారా వారి హృదయాలను జయించగలరు" (అల్ బజ్జార్)

ఇస్లామీయ జీవన విధానంలో, మనసును కష్టపెట్టే, ఎత్తిపొడిచి అవమానించే దానం – సహాయానికి ఏమాత్రం విలువవుండదు. వినయ విధేయతల ప్రవర్తనకు ఎంతో విలువ ఉంటుంది. ఈ విషయంగా అల్లాహ్ మార్గదర్శకత్వం ఇలా ఉంది.

**"మనసును గాయపర్చే దానం కంటే, మృదుభాషణం, క్షమాగుణం ఎంతో మేలైనవి." (ఖుర్ఆన్, 2 :263)**

ఉత్తమ సంభాషణ, మృదుభాషణం పుణ్యకార్యంగానూ, అల్లాహ్ ప్రీతిని పొందే మార్గంగానూ, అల్లాహ్ వరప్రసాదంగానూ ఉంటుందని పై వాక్యం స్పష్టం చేస్తుంది.

అనస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, ఒక వ్యక్తి 'ఓ ప్రవక్తా! (స) నేను స్వర్గంలో ప్రవేశించేందుకై ఒక సత్కార్యాన్ని నాకు బోధించండి' అని అడిగాడు. అందుకు దైవ ప్రవక్త (స) "పేదలకు భోజన వసతి కల్పించు. సలాంను వ్యాపించేయి. ఇతరులు రాత్రి పూట నిద్రిస్తున్నప్పుడు నీవు నమాజ్‌కై నిలబడు. అప్పుడు నీవు ప్రశాంతంగా స్వర్గంలో ప్రవేశిస్తావు" అని సెలవిచ్చారు. (అల్ జబ్బార్)

ఇతర ధార్మిక ప్రజలతో సైతం ఉత్తమ రీతిలో సంభాషించమని, వారిని గౌరవంగా సంబోధించమని అల్లాహ్ ఆజ్ఞాపించాడు.

**"గ్రంథ ప్రజలతో వాదించకు, ఉత్తమమైన రీతిలో తప్ప- అయితే వారిలోని దుర్మార్గులతో మాత్రం కాదు" (ఖుర్‌ఆన్, 29:46)**

విశాల హృదయులైన పెద్ద మనుషులు అనవసర విషయాల జోలికెళ్ళరు. ఇతరుల హృదయాలను గాయపర్చరు. మనసును నొప్పించే మాటలను పలకరు. అజ్ఞానులుగా, బుద్ధిహీనులుగా, దుర్మార్గులుగా వారు ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రవర్తించరు.

హజ్రత్ ఈసా (అలై) జీవితం నుండి ఒక ఉదంతాన్ని మాలిక్ (రజి) యహ్యా బిన్ సయీద్ (రజి) ద్వారా ఇలా ఉల్లేఖించారు : "హజ్రత్ ఈసా (అలై) ఒక పర్యాయం ఒక పంది ప్రక్క నుండి వెళుతూ, ఆ పందితో 'క్షేమంగా వెళ్ళిపో' అని అన్నారు. అందుకు ఒకతను 'ఆ పందితో మీరు ఆ విధంగా ఎందుకు మాట్లాడారు?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్త ఈసా (అలై) 'నా నోరు చెడుమాటలకు అలవాటుపడలేదు" అని పలికారు.

## అజ్ఞానపు సమాధానం కంటే - జ్ఞానవంత మౌనం మేలైనది

కొందరు కఠిన మనస్కులై, అశ్లీల సంభాషణాచతురులై జీవితాలను గడిపేస్తూ ఉంటారు. వీరిలోని విశ్వాసం, పై చెడులను నిరోధించే స్థాయిలో ఉండదు. వారిలోని నైతికత ఈ చెడుకు వ్యతిరేకంగా కనీసం మూలిగే స్థితిలో కూడా ఉండి తమలోని జులాయితనం ప్రదర్శించుకునే అవకాశం చిక్కినప్పుడల్లా అత్యంత ఉత్సాహంగా మైదానంలో ఉరికే సైనికుల్లా ఉరుకుతారు. అడవి గుర్రాల్లాగా పరుగులెడతారు. విశ్వాసపు పోలికేకలుగాని, సందేశపు గొంతులుగాని అతనికి ఈ సందర్భంగా వినపడనే వినపడవు.

సజ్జనులు ఇటువంటి వ్యక్తుల మాటల వలలో పడకుండా జాగ్రత్త వహించాలి. ఈ వ్యక్తుల వలలో పడటం అంటేనే, ఉపద్రవంలో, కల్లోలంలో ఇరుక్కోవడంగా గుర్తించాలి. ఈ ఉపద్రవాలను నివారించడానికి తప్పకుండా ప్రయత్నించాలి. ఈ కారణంగానే అవివేకులు, బుద్ధిహీనులు, మూర్ఖుల పట్ల మౌనం వహించాలని ఇస్లాం ఆదేశించింది.

ఇటు పిడివాది ఒకడు ఒకసారి ప్రవక్త (స) వారి ఇంటి ముందు నిలబడి 'నేను కూడా మీతోపాటు ఇంటిలోకి వస్తా'నని పట్టుపట్టాడు. ప్రవక్త(స) ఎంతో సహనంతో, మంచిగా మాట్లాడి ఆ మూర్ఖుడిని సాగనంపారు. అవివేకుల, మూర్ఖుల నోరు

మాయించడానికి వివేకం, బుద్ధిబలం తప్ప మరో మార్గమే లేదు. అలాకాకుండా, ఆ మూర్ఖుడితో ప్రవక్తశ్రీ వాదనకు దిగివుంటే; ఆ వ్యక్తి పలికే దూషణ మొరటు పదాలన్నింటిని ప్రవక్త(స) వినవలసి వచ్చేది. దైవప్రవక్త (స) గారి వివేకవంతమైన ప్రవర్తన వల్ల వారి చెవులు ఆ మొరటు పదాలను వినకుండా సురక్షితంగా ఉండగలిగాయి.

ఇటువంటి మరో మూర్ఖుని ప్రవర్తనపై ప్రశ్నించిన హజ్రత్ ఆయెషా (రజి) గారి ప్రశ్నకు జవాబుగా ప్రవక్త(స) "ఓ ఆయిషా! నేను ఎప్పుడైనా, ఎవరి మనసునైనా కష్టపెట్టినట్లు ప్రవర్తించానా? ఎవరి మాటల దురుసుతనానికి భయపడి ప్రజలు అతనితో మాట్లాడటం మానివేస్తారో ఆ వ్యక్తి ప్రళయదినాన అల్లాహ్ సమక్షంలో అత్యంత చెడ్డవానిలా నిలుస్తాడు" అని చెప్పారు. (బుఖారి)

మూర్ఖ శిఖామణులు ఎదురుపడినపుడు ఎదురయ్యే విపత్కర పరిస్థితి కేవలం అనుభవించిన వారికే తెలుస్తుంది. ఈ స్థితిలో మనిషి అత్యంత జాగ్రత్తగా వివేకంగా వ్యవహరించాలి. మూర్ఖునితో అనవసర వాదనకు దిగకూడదు. తన నైతికతను, గౌరవాన్ని పణంగా పెట్టనూ కూడదు. మూర్ఖునికి వినయ విధేయతలు నేర్పే కృషి వికటించి ప్రాణాంతకంగా మారే ప్రమాదమూ ఉంది. ఈ కారణంగానే దివ్య ఖురాన్ కరుణామయుడైన అల్లాహ్ గుణవిశేషణాలను లెక్కేస్తూ ఈ క్రింది విధంగా మార్గదర్శకత్వం చేసింది :

> **"కరుణామయుని (అసలు) దాసులు ఎవరంటే; నేలపై అణకువతో నడిచే వారు. మూర్ఖులు వారిని పలకరించినప్పుడు 'మీకోసలామ్!' అని అనేవారూ ...."**
> ***(ఖుర్ఆన్, 25 : 63)***

మనిషి ఒకసారి, లేక మరోసారి కోపాన్ని దిగమింగగలడు. కాని, మూడవ సారి కోపం కట్టలు తెంచుకోకతప్పదు. కాని జ్ఞాని అయిన ఒక ముస్లింని, ఇస్లాం - కష్టాన్ని కోపాన్ని, సహనం ద్వారా కడ వరకు భరించమని కోరుతుంది. చివరకు కోపమనే చెడు తనకు తానుగా వెనుదిరిగి వెళ్ళిపోయే పరిస్థితి కల్పించబడాలి.

సయీద్ బిన్ ముసయ్యబ్ (రజి) కథనం ప్రకారం, దైవప్రవక్త సన్నిధిలో ఒక మూర్ఖుడు అబూబక్ర్ (రజి)ను దురుసుగా దూషించసాగాడు. అబూబక్ర్ అత్యంత సహనంతో పరిస్థితిని భరిస్తూ మౌనం వహించారు. ఎప్పుడైతే అబూబక్ర్ (రజి) సహనం

వదిలి సంభాషణకు ఉద్యుక్తులయ్యారో, వెంటనే దైవప్రవక్త (స) వెళ్ళిపోవడానికి లేచినిలబడ్డారు. అప్పుడు ఆ విశ్వాసవీరుడు అబూబక్ర్ (రజి) 'ఓ దైవప్రవక్తా! (స) నా వల్ల ఏదైనా అపరాధం జరిగిందా?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్త(స) "ఆకాశం నుండి ఒక దైవదూత అరుగుదెంచి నిన్ను దూషిస్తూ ఉండిన వ్యక్తిని ఖండిస్తూ ఉన్నాడు. కాని, నీవు ఎదురు సమాధానంకై ఉద్యుక్తుడవుకాగానే ఆ దైవదూత వెళ్ళిపోయాడు. షైతాన్ వచ్చి కూర్చున్నాడు. షైతాన్ ఉన్నచోట నేను కూర్చోలేనుకదా?'' అని బదులిచ్చారు. (అబూదావూద్)

పై వివరణ వల్ల – మూర్ఖుడిని, అతడి మూర్ఖత్వాన్ని మౌనంగా భరించమని సలహా ఇవ్వడంగా భావించకూడదు. మనిషి తనను తాను అదుపులో ఉంచుకోవడంగా భావించాలి. మనసును విచ్చలవిడిగా వదలడం ద్వారా మూర్ఖుడిపై ప్రతీకారం తీర్చుకునేలా అది మనిషిని ఉద్యుక్తపర్చవచ్చు.

మనసును, కోపానికి, అవమానానికి, ప్రతీకారానికి అప్పచెప్పేస్తే దాని వల్ల జరిగే దుష్పరిమాణాల నుండి తన్ను, తన గౌరవాన్ని పరిరక్షించుకునే సహనపూర్వక ఆచరణలో భాగంగా కొనసాగించాలి. దైవగ్రంథం దివ్య ఖురాన్ బుద్ధిహీనుల, మూర్ఖుల ప్రవర్తనలను ఈ క్రిందివిధంగా అసహ్యించుకుంది.

**"అన్యాయం జరిగితే తప్ప, మనిషి చెడు పలకడాన్ని అల్లాహ్ ఇష్టపడడు. అయినప్పటికీ, మీరు బహిరంగంగానూ, చాటుగానూ మేలే చేస్తూపోతే లేదా కనీసం చెడును క్షమతో ఉపేక్షిస్తే అల్లాహ్ క్షమించేవాడు, శక్తిగలవాడు కూడా."**

***(ఖుర్ఆన్, 4 : 148-149)***

## వాదోపవాదాలను విసర్జించండి

నిరాధార, వినాశకర, అనవసర విషయాల నుండి తమ నోటిని రక్షించుకోవలసినదిగా ఇస్లాం తన అనుయాయులను ఆదేశించింది. ముఖ్యంగా బహిరంగ పోటీ చర్చలను, వాదోపవాదాలను – అవి సత్యం పునాదులపై జరిగేవి అయినా – ఇటువంటి వాదోపవాదాలను (డిబేట్స్) ఇస్లాం నిషేధించింది. పోటాపోటీ చర్చల ద్వారాలను మూసివేసింది.

పై విధమైన వాదోపవాదాలు, చర్చలలో సాధారణంగా రోషాలు, కోపతాపాలు పెరిగిపోయే ప్రమాదముంది. ఒక వ్యక్తి తన మాటను నెగ్గించుకోవడానికి,

ఒప్పించడానికి, ఎదుటివారిపై ఆధిక్యత సాధించడానికి తీవ్రంగా ప్రయత్నిస్తాడు. ఈ ప్రయత్నంలో ఎటువంటి అడ్డదారిని త్రొక్కడానికి కూడా వెనుకాడడు. తనకు బలం చేకూర్చే ఎటువంటి విషయాన్ని అయినా ఆయుధంగా ఉపయోగిస్తాడు. ఎదుటి మనిషిలోని లోపాలను వీలైనంతగా బహిరంగపర్చే ప్రయత్నం చేస్తాడు. ఇటువంటి వాదోపవాద సభల్లో ప్రజలు సత్యం, న్యాయం, ధర్మం విషయాలనుకాక, వాదనాపటిమలోని నైపుణ్యాన్ని ఆసక్తిగా తిలకిస్తారు. ఆధిక్యత, ప్రాబల్యాలకు అధిక ప్రాముఖ్యత ఇవ్వబడిన కారణంగా ఆ సభలోనూ, ఆ తర్వాత సమాజంలోనూ కల్లోలాలు, ఉపద్రవాలు, కక్షలు కార్పణ్యాలు తలెత్తుతాయి. ఇటువంటి సభల్లో సంతృప్తి సత్యతల వివరణ అనే వాటికి ఎటువంటి స్థానమూ ఉండదు.

ఇస్లాం పైన పేర్కొన్న అనారోగ్యకర పరిస్థితులను అసహ్యించుకుంటుంది. ఈ చర్చలను ధర్మం నైతికతలకు ప్రమాదంగానూ నిర్ధారిస్తుంది. దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:

"ఎవరైతే అనవసర, అసత్య విషయాలపై వాదించే తన అలవాటును వదులు కుంటాడో – అతడి కొరకు అల్లాహ్ స్వర్గంలోని క్రింది స్థాయి అంతస్తులో ఒక భవంతిని ప్రసాదిస్తాడు. ఎవరైతే ధర్మబద్ధ విషయంలో కూడా వాదోపవాదాలను త్యజించాడో అతని కొరకు అల్లాహ్ స్వర్గలోకంలోని మధ్యస్థాయి అంతస్తులో ఒక భవంతిని నిర్మించి ఇస్తాడు. మరెవరైతే తన నైతికతను వ్యక్తిత్వాన్ని పరిరక్షించుకునే ప్రయత్నం చేస్తాడో, అల్లాహ్ అతనికి స్వర్గంలోని ఉత్తమ స్థాయి అంతస్తులో ఒక భవంతిని ప్రసాదిస్తాడు." (అబూదావూద్)

అల్లాహ్ కొంతమందికి వాక్చాతుర్యాన్ని అందులో ప్రభావశీలతను ప్రసాదించాడు. ఈ చతురత కారణంగా వారు మూర్ఖులు, విషయ పరిజ్ఞానం ఉన్నవారు ఇరువురితోనూ చర్చలకు, వాదాలకు ఉత్సాహం చూపుతారు. నిరంతరం ఇతరులతో వాదించడానికి వారు ఇష్టపడుతుంటారు. ఈ వాదోపవాదాల ఆనందంలో వారికి అలసట కలగనే కలగదు. ఇటువంటివారు తమ మాటల తూటాలతో ఇతరుల హృదయాలను గాయపరుస్తారు. ఇక ధార్మిక విషయాల గురించి వీరు మాట్లాడితే – దాని గొప్పతనం, హుందాతనం, దైవభీతి యొక్క పవిత్రతలు అంతమయిపోతాయి.

గొంతు చించుకొని తమ వాక్చాతుర్యాన్ని ప్రదర్శిస్తూ సామాజిక వాతావరణాన్ని

భ్రష్టుపట్టించే ఇటువంటి వారిని ఇస్లాం కఠినంగా హెచ్చరించింది. దైవప్రవక్త (స) ఇలా ఉటంకించారు :

"ఎప్పుడూ చర్చలకు దిగుతూవుండే కలహకారి, అల్లాహ్ దృష్టిలో పరమ నీచునిగా పరిగణించబడతాడు." (బుఖారి)

మరొక ప్రవక్త ప్రవచనంలో ఇలా సెలవివ్వబడింది : "ఒక జాతి మార్గదర్శకత్వం పొందిన తరువాత, అది మరలా మార్గభ్రష్టత్వానికి గురికాదు. అయితే, ఆ జాతి బహిరంగ చర్చలు, వాదోపవాదాల అలవాటు కలిగివున్నట్లయితే అది మార్గభ్రష్టత్వానికి గురౌతుంది." (తిర్మిజి)

ఈ వాదనాకోరులు తమ వాగ్ధాటి మూలకంగా సంభాషణా మర్యాదల హద్దులను సైతం చెరిపివేస్తారు. మాటపై మాటను కొనసాగిస్తూనే ఉంటారు. తమ వాక్పటిమపై గర్విస్తూ ఇతరులను హేళన చేస్తూ వుంటారు. మాట్లాడే పదాలకు అర్థాలు వెతుక్కునే ప్రయత్నమూ చేయరు. వీరి మాటల్లో మర్యాద, మృదుత్వం, నైతికత, పవిత్రతలకు ఏమాత్రం చోటు ఉండదు.

ప్రవక్త(స) ఒక ఉల్లేఖనంలో ఇలా ఉంది : "ఒక దుర్మార్గుడైన వ్యక్తి హుందాతనం ఉట్టిపడే దుస్తులు ధరించి ప్రవక్తశ్రీ వారి సన్నిధికి వచ్చాడు. ప్రవక్త(స)తో సంభాషిస్తూ క్రమంగా తన ఆధిపత్యాన్ని ప్రదర్శించే బుద్ధితో తన గొంతును పెంచుకుంటూపోయి చివరికి ప్రవక్త(స) గొంతు కంటే పెద్దగా మాట్లాడసాగాడు. ఆ వ్యక్తి వెళ్ళిపోయిన తరువాత ప్రవక్త(స)వారు ఇలా నుడివారు, 'అల్లాహ్ ఇటువంటి స్వభావం గల వారిని ఇష్టపడడు. వీరు పశువుల్లాగా గడ్డిమేసిన తర్వాత నెమరువేసుకునేలా సంభాషిస్తారు. వీరి నోటిని నాలుకను అల్లాహ్ ప్రళయదినాన నరకాగ్ని శిఖలలో పడవేస్తాడు." (తిబ్రాని)

గొంతు చించుకొని వాగాడంబరాన్ని ప్రదర్శించే వ్యక్తుల పట్ల ఇస్లాం నిరసన తెలియజేస్తుంది. హెచ్చరికను కూడా జారీచేస్తుంది. ప్రవక్త (స) ఇలా తెలిపారు : "అల్లాహ్ వద్ద అందరికంటే అయిష్టుడు అయిన వ్యక్తి ఎవరంటే వాదోపవాదాలకు దిగే జగడాలమారి అయిన వాచాలుడే." (బుఖారి గ్రంథం)

ధర్మం, రాజకీయం, జ్ఞానం, మర్యాదల విషయంలో ప్రగల్భాలకోరులైన ఇటువంటి వ్యక్తులు వాదానికి దిగితే ధర్మం యొక్క ఆత్మ వికృతమైపోతుంది. జ్ఞానవంత

విషయాల వాతావరణం మసకబారిపోతుంది. సభ్యత, సంస్కృతి, సామూహికతలు, వాటి సదాచార సాంప్రదాయాలు రోగగ్రస్థమైపోతాయి. నేటి ముస్లిం సమాజంలో అలుముకొనివున్న రుగ్మతలకు, బలహీనతలకు, అనైక్యతకు ఈ వాదోపవాదాలే కారణభూతాలై ఉన్నాయి.

అయితే ఆహ్లాదకరమైన, ఉత్తమమైన పద్ధతిలో చర్చలు జరపడాన్ని ఇస్లాం ఆహ్వానిస్తుంది. అదే సమయంలో వాదోపవాదాల అసభ్యతను తిరస్కరిస్తుంది. ఈ విషయంగా ప్రవక్త (స) వారి సహచరుల కథనం ఇలా ఉంది : "ఒకసారి మేము ధార్మిక విషయాల గురించి చర్చిస్తూ క్రమంగా వాదోపవాదాలకు దిగాము. ఆ స్థితిలో దైవప్రవక్త (స) అక్కడికి వచ్చారు. మా పరిస్థితిని చూచి కోపోద్రిక్తులైపోయారు. అంతకు మునుపు ఎన్నడూ అంతటి ఆగ్రహం ప్రదర్శించనేలేదు. ఆ తర్వాత మా చర్యలను వారిస్తూ "ఓ ముహమ్మద్ అనుచర సంఘమా! ఆపండి! మీకు ముందు జాతులను (మీ పూర్వీకులను) ఈ (వాదోపవాదాల) విషయమే వినాశనానికి గురిచేసింది. ఈ వాదోపవాదాలను విడనాడండి. ఇందులో లాభం లేశమాత్రమూ లేదు సుమా. ఈ పోటాపోటీ వాదనలను త్యజించండి. ఇవి విశ్వాసులకు అనువైన చేష్టలు కావు. ఈ వాదోపవాదాలలో పాల్గొనేవారు పాపాలలో మునిగిపోయే ప్రమాదం ఉంది. ఈ విధంగా వాదాలు చేసేవారిని తీర్పుదినం నాడు సిఫారసు చేసేవారు ఎవరూ వుండరు. ఈ అత్యంత అసహ్యకరమైన ఆచరణ నుండి మీ నైతికతను కాపాడుకోండి. నేను స్వర్గ లోకంలోని మూడు అంతస్తులకు మాత్రమే బాధ్యుడనై ఉంటాను. ఈ మూడు అంతస్తులు కూడా దైవభీతితో ఈ చెడ్డ అలవాటును వదలివేసిన వారికై ప్రత్యేకించబడివుంటాయి. నా ప్రభువు విగ్రహారాధన, బహుదైవారాధన, తర్వాత అన్నింటికంటె ముందు ఈ వాదోపవాదాలనే నిషేధించాడు" అని హెచ్చరించారు." (త్రిబాని)

ధనవంతులు తమ ఆహ్లాదం కొరకు, వినోదం కొరకు నిర్వహించే సభలు, సమావేశాలు, గోష్ఠులు, చర్చావేదికల వల్ల సమయం వ్యర్థమౌతుంది తప్ప, దానివల్ల ప్రయోజనం శూన్యం. తమలోని నైపుణ్యాలను, ప్రతిభలను ఇతరులను వేళాకోళం చేయడానికి వీరు వ్యర్థపరుస్తూ ఉంటారు. ఇటువంటి వారినే హెచ్చరిస్తూ దైవగ్రంథం దివ్య ఖురాన్ ఇలా ఆదేశం జారీచేసింది:

**"ప్రజలను దెప్పిపొడవటంలో, పరోక్షంగా వారి లోపాలను ఎంచటంలో ఆసక్తి కనబర్చేవాడూ, ధనాన్ని కూడబెట్టి దానిని మాటిమాటికీ లెక్కపెట్టి ఉంచేవాడూ**

**అయిన ప్రతి వ్యక్తి సర్వనాశనమవుతాడు. అతడు తన ధనం కలకాలం తన వద్ద వుంటుందని అనుకుంటున్నాడు. అలా ఎన్నటికీ జరగదు. అతను నుజ్జు నుజ్జు చేసే స్థలంలో విసిరివేయబడతాడు." (ఖుర్ఆన్, 104:1-4)**

నేటి సభ్య సమాజంలో సాహిత్య గోష్టులు, బాతాఖానీ, క్లబ్బుల్లో సర్వసాధారణ మయ్యాయి. వీటివల్ల సమాజానికిగాని, స్వయంగా ఆయా వ్యక్తులకు గాని వీసమెత్తు ప్రయోజనమూ వుండదు. కడుపు నిండినవారికి 'టైమ్‌పాస్' కొరకు మాత్రమే ఈ చర్చలు ఉపయోగపడతాయి. సమయాన్ని వ్యర్థపర్చే ఇటువంటి చర్యలన్నిటినీ ఇస్లాం వ్యతిరేకిస్తుంది.

దైవప్రవక్త (స) వారి ఒక ప్రచనంలో ఇలా వుంది : "వీధుల్లో, బజారుల్లో సమా వేశాలు నిర్వహించడం మానండి" అని ప్రవక్త(స) ఆదేశించారు. అందుకు సహచరులు 'ఓ ప్రవక్తా! ధర్మప్రచారం సభలు, సమావేశాల ద్వారానే కదా జరిగేది?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్త(స) "అయితే ఆ సభలు సమావేశాల హక్కును సరిగా నెరవేర్చండి" అని అన్నారు. అందుకు సహచరులు 'మరి ఆ హక్కు ఎలా నెరవేరు తుంది?' అని అన్నారు. అందుకు దైవప్రవక్త (స) "తమ చూపుల్లో, మాటల్లో వినమ్రత కనపర్చండి. ఇతరులను బాధించే అంశాలను తొలగించండి. సంక్షేమాన్ని కాంక్షిస్తూ పలకరించండి. సత్కార్యాలు చేసేలా ఉత్సాహపర్చండి. చెడు పనులను నిరోధించండి" అని బదులిచ్చారు." (ముస్లిం)



# 12వ భాగం

# అసూయ, ద్వేషం, కక్షలు కార్పణ్యాల నుండి హృదయాన్ని పవిత్రపర్చుకోండి!

- ప్రతిభలను గుర్తించండి!
- శత్రుత్వం – కక్షల నుండి దూరంగా ఉండండి!
- రక్త సంబంధాలను త్రెంచకండి!
- ఈర్ష్యాద్వేషాలు – చెడులకు మూలాలు
- పరోక్ష నిందలకు – చాడీలకు పాల్పడకండి!
- కుట్రలకు స్వస్తిపలకండి!
- అసూయ, అత్యాశలను దరిచేరనీయకండి!

# ప్రతిభలను గుర్తించండి

దుఃఖాలకు, విచారాలకు దూరంగా ఉండి, హృదయాలకు శాంతి, కంటికి చలువ ప్రసాదించబడే ఉత్తమమార్గం ఒక్కటే ఉంది. అది, మనిషి తన హృదయాన్ని నిర్మలంగా, ప్రశాంతంగా ఉంచుకోవడమే. మనసును ఈర్ష్య-ద్వేషాలకు, కక్షలు-కార్పణ్యాలకు, కుట్రలు-శత్రుత్వాలకు, ఆగ్రహ ఆవేశాలకు దూరంగా ఉంచాలి. ఏ వ్యక్తిలోనైన, ఏవైనా ప్రత్యేకతలు, సహజ ప్రతిభలు ఉన్నట్లయితే, వాటిని దైవానుగ్రహాలుగా భావించాలి. వాటిపట్ల గర్వం లేక అసూయలు ఉండకూడదు. ఆ ప్రతిభలకు, ప్రత్యేకతలకు ఆ వ్యక్తి తగినవాడనీ, లేక ఆయా ప్రతిభలను ఆ వ్యక్తికి అనుగ్రహించడం ద్వారా అల్లాహ్ అతడిని పరీక్షిస్తున్నాడని గుర్తించాలి. ఈ అనుగ్రహాలు, ధన సంపత్తులు కావచ్చు, జ్ఞాన- విజ్ఞాన వివేకాలు కావచ్చు. విషయపరిజ్ఞాన నిపుణత కావచ్చు. ఇవన్నీ దైవానుగ్రహాలుగా తెలుసుకోవాలి. ఇతరులలో ఈ ప్రత్యేకతలు చూసి సంతోషపడక, అసూయ చెందడం భావ్యం కాదు. ఈ విషయంగా అల్లాహ్‌ను ఈ క్రిందివిధంగా వేడుకోవలసిందిగా దైవప్రవక్త (స) సెలవిచ్చారు :

"ఓ అల్లాహ్! నీవు ఎవరికైనా, ఏదైనా అనుగ్రహం ప్రసాదిస్తే అది కేవలం నీ కారుణ్యమే. అందులో మరెవరి భాగస్వామ్యమూ లేదు. సమస్త స్తోత్రాలు, కృతజ్ఞతలు అన్నీ నీ కోసమే." (అబూదావూద్)

అదేవిధంగా ఎవరైనా ఆపదల్లో, కష్టాల్లో వుంటే వారిపట్ల ఆదరణతో మెలగాలి. వారి పట్ల సానుభూతి కలిగివుండాలి. అతని ఆపదను, కష్టాన్ని దూరం చేయమని అల్లాహ్‌ను వేడుకోవాలి. అతని తప్పులను, పాపాలను మన్నించమని విన్నవించుకోవాలి. ఆ సమయంలో చేయవలసిన దుఆను ప్రవక్తశ్రీ వారు ఇలా తెలియపర్చారు :

"ఓ అల్లాహ్! నీవు పరమ కృపాసాగరుడవు. అపర క్షమాశీలివి. నీ సృష్టితాలపై నీ కారుణ్యం కురిపించు. నీ దాసుల కష్టాలను తొలగించు ప్రభూ!"

ఈ విధంగా ఒక ముస్లిం జాలి, దయ, కరుణ, నైతికత, ఆత్మీయత మానవత్వంతో జీవితం గడపాలి. అల్లాహ్ పట్ల విధేయత, అల్లాహ్ అభీష్టం నెరవేర్పుపట్ల ఆనందం వ్యక్తం చేయాలి. అసూయ, ద్వేషాలను మనసు నుండి తొలగించివేయాలి. కక్షలు, కుట్రలు, అసూయల వల్ల విశ్వాసం బలహీనమైపోతుంది. రంధ్రం ఉన్న

కుండనుండి నీరు వేగంగా కారిపోయినట్లుగా హృదయం విశ్వాసంతో ఖాళీ అయిపోతుంది.

ఇస్లాం మానవ హృదయం, మనసు ఆలోచనల పట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తుంది. కల్మషమైన హృదయంలో సత్కార్యాలకు చోటు ఉండదు. ఉత్తమ ఆలోచనలకు, ఆచరణకు చోటు కల్పించదు. ఉత్తమ నైతికతల మెరుపులను మసకబార్చి వేస్తుంది.

కాని, హృదయం నిష్కల్మషంగా, నిర్మలంగా ఉండి చేసే చిన్న సదాచరణకైనా అల్లాహ్ ఉత్తమ ఫలితాలను, వరప్రసాదాలను ప్రసాదిస్తాడు. అతని వైపునకు సదాచరణలు వేగంగా ఆకర్షితులౌతాయి. అతని హృదయంలో అవి బలమైన స్థానాన్ని సంపాదించుకుంటాయి.

అబ్దుల్లాహ్ బిన్ ఉమ్ర్ (రజి) గారి కథనం ప్రకారం, "ప్రవక్త (స) వారిని 'ఉత్తములైన వ్యక్తులు ఎవరు?' అని ప్రశ్నించడం జరిగింది. అందుకు ప్రవక్త(స), "నిర్మల హృదయం కలిగివున్నవారు. సత్యాన్ని పలికే నోరున్నవారు" అని బదులు ఇచ్చారు. అందుకు సహచరులు 'సత్యం పలికే నోరు తెలుసు. కాని, నిర్మల హృదయం అంటే ఏమిటి?' అని ప్రశ్నించారు. దానికి దైవప్రవక్త (స) "దైవం పట్ల నిష్ఠ, చెడుల నుండి, పాపాల నుండి అవిధేయత నుండి, ఈర్ష్యా ద్వేషాల నుండి, దూరంగా ఉండే మనసు" అని సమాధానమిచ్చారు. (ఇబ్నెమాజా)

ఇస్లాం ఆశించే, స్థాపించగోరే సుందర సమాజంలో – ఆ సమాజ సభ్యుల పరస్పర సంబంధాలు ప్రేమ–గౌరవాలపై ఆధారపడి ఉంటాయి. స్నేహం సుహృద్భావం, సహోదరత్వం, పరస్పర సహకారపు నైజం ఉన్నతస్థాయికి చేరుకుంటుంది. సామూహికంగా అత్యంత సౌందర్యవంతమైన ఆరోగ్యకరమైన సమాజం కానవస్తుంది. కృతఘ్నత, అసూయ, శత్రుత్వం, కక్షల భావజాలాలకు చోటు దొరకని పరిస్థితి కల్పించబడుతుంది. మనిషిలోని సకారాత్మకత (Positiveness) ఉత్తమ స్థాయికి చేరుకొని మూడు పువ్వులు ఆరు కాయలుగా వికసించే పరిస్థితి కల్పించబడుతుంది. అనైతికత, నకారాత్మకతలు (Negativeness) పలాయనం చిత్తగించేలా ఆ సామాజిక వాతావరణం మలచబడుతుంది. ఆ సుందర సమాజంలోని మానవుల మానసిక స్థితి – పరిస్థితి ఈ క్రిందివిధంగా ఉంటుంది :

**"వారు ఇలా అంటారు : ఓ ప్రభూ! మమ్మల్నీ, మాకు పూర్వం విశ్వసించిన**

**మా సోదరులందరినీ క్షమించు, మా హృదయాలలో విశ్వాసుల పట్ల ఎలాంటి ద్వేషాన్నీ కలిగించకు. 'ప్రభూ! నీవు చాలా కనికరించేవాడవు, కరుణామయుడవూను." (ఖుర్ఆన్, 59:10)**

## శత్రుత్వం - కక్షల నుండి దూరంగా ఉండండి

చర్చలు వాదోపవాదాలుగా, వాదం వివాదంగా మారిపోయే ప్రమాదం ఎప్పుడూ ఉంటుంది. వివాదం తగవుగా మారి దాని వ్రేళ్ళు పుంజుకోనారంభిస్తాయి. తగవు శత్రుత్వంగా వృక్షరూపం పొంది, కక్ష ముళ్ళ రూపంలో దర్శనమిస్తుంది. ఫలితంగా ప్రఫుల్లమైన, తాజాదనంతో కూడిన విశ్వాసం మసకబారుతుంది. మృదుత్వం, సహనం, ప్రశాంతత సంతృప్తిలాంటి ఇస్లామీయ నైజాలు, బలహీన పడటం ప్రారంభిస్తాయి. ఈ స్థితిలో ఆరాధనల శుభాలు, సంక్షేమాలు, ప్రతిఫల వరప్రసాదాలు క్షీణించడం మొదలవుతుంది. మనిషి వ్యక్తిత్వానికి, ఆరాధనల ద్వారా లభించవలసిన ఫలితాలు దూరమవుతాయి.

సాధారణంగా, గొడవలు, తగవులు, శత్రుత్వాలు మనిషి యొక్క వివేకాన్ని నశింపచేస్తాయి. ఫలితంగా అనవసరంగా, అనంతమైన ఉపద్రవాలు కొనితెచ్చుకునే పరిస్థితులు సృష్టించబడతాయి. ప్రతి చిన్న మాట కూడా భరించలేనిదిగా మారిపోతుంది. ప్రత్యర్థి మాటల్లో ప్రతీదీ వ్యతిరేకంగానే కనిపిస్తుంది. మంచిగా ఉన్నప్పుడు ఏనుగంత తప్పును సైతం క్షమించిన మనసు శత్రుత్వంలో దోమంత పొరపాటును కూడా క్షమించనని మొరాయిస్తుంది. క్షమ, సహనం, మృదుత్వం మచ్చుకు కూడా కానరాకుండాపోతాయి. ఎదుటి మనిషిలోని గొప్పతనాలను మంచి అంశాలను గుర్తించలేని గ్రుడ్డితనం దాపురిస్తుంది. అదే సమయంలో ప్రత్యర్థిలోని రాగి గింజంత లోపం కూడా మహా పర్వతం లాగా కనపడుతుంది. ఈ శత్రుత్వంలో – అసూయ, ద్వేషం, కక్షలు కూడా కలిసిపోయి ఎదుటి మనిషిపై లేని అపనిందలను సైతం మోపే స్థాయికి దిగజారిపోవడం జరుగుతుంది. ఇస్లాం ఈ తరహా వైఖరిపట్ల కోపధారి అవుతుంది. కఠినంగా ఈ పద్ధతిని నిరోధిస్తుంది. తీవ్రంగా హెచ్చరిస్తుంది. ఈ హెచ్చరికలు, నిరోధాలను ఆరాధనల జాబితాలో చేరుస్తుంది.

దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : "నేను మీకు రోజా, నమాజ్, దానధర్మాల కన్నా ఉన్నతమైన విషయం తెలిపేదా?" అని ప్రవక్త(స) ప్రశ్నించారు. అందుకు ప్రజలు

"తప్పక తెలపండి ప్రవక్తా!" అని బదులు ఇచ్చారు. అందుకు ప్రవక్త(స) "పరస్పర సంబంధాలను సంస్కరించుకోండి. సంబంధాలలో వైషమ్యం మిమ్మల్ని బోడితలగా చేసి వేస్తుంది. నా ఉద్దేశ్యం బోడితల అంటే మీ తల మీది వెంట్రుకలు కావు. మీ ఆచరణలను, మీ ధర్మాన్ని తిరుక్షవరం చేసివేస్తుంది" అని హెచ్చరించారు. (తిర్మిజి)

కొన్ని సందర్భాలలో షైతాన్ ఒక జ్ఞానిని విగ్రహారాధన వైపుకు మరలించలేక పోవచ్చు. కాని, అదే జ్ఞానిని అల్లాహ్ నుండి దూరంగా జరిపివేసే అసూయ, ద్వేషాలను ఆ జ్ఞానిలో కలుగజేస్తాడు. ఫలితంగా అతడు ఒక విగ్రహారాధకుని కంటే కూడా తన సృష్టికర్త నుండి కడు దూరంగా వెళ్ళిపోతాడు. అసూయ కక్షలు మరింత పెరిగి శత్రుత్వపు అగ్ని మనసులో రాజుకున్నప్పుడు ఆ జ్ఞాని చేష్టలను షైతాన్ ఒక తమాషాగా వీక్షిస్తూ ఆనందిస్తాడు. ఈ అసూయాగ్ని ఆ జ్ఞాని ఆచరణలను, విశ్వాసాన్ని, దైవ సామీప్యాన్ని భస్మీపటలం చేసివేస్తుంది. వాటి ఫలితంగా ఆ జ్ఞాని వైపుకు అరుదెంచే వర ప్రసాదాలను నిరోధించివేస్తుంది.

చివరి దైవప్రవక్త (స) ఇలా నుడివారు : "అరబ్బు ప్రాంతంలో షైతాన్ ఆరాధన ఇకపై సాగదని షైతాన్ అర్థం చేసుకున్నాడు. అయితే ప్రజల మధ్య అసూయ ద్వేషం, శత్రుత్వాలను మండించడం లాంటి విషయాల్లో షైతాన్ నిరాశకు లోనుకాడు." (ముస్లిం)

పై ప్రవచనపు అర్థం – హృదయంలో అసూయ చోటు చేసుకున్నప్పుడు ప్రజల మధ్య శత్రుత్వం ప్రబలుతుంది. హృదయాలు కఠినశిలలై పోతాయి. ఫలితంగా మానవ సంబంధాలన్నీ తునాతునకలైపోతాయి. సుహృద్భావ వాతావరణం కలుషితమై పోతుంది. నిజానికి అల్లాహ్ మానవ సంబంధాలను పటిష్టం చేయవలసిందిగా తన దాసులను ఆదేశిస్తున్నాడు. సుందర, సంక్షేమ, సహకార వాతావరణాన్ని ఏర్పర్చ వలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాడు. భూమిపై కల్లోలాన్ని నివారించమని హితవు గరిపాడు.

## రక్త సంబంధాలను త్రెంచకండి

ఇస్లాం – దౌర్జన్యం, దుర్మార్గం లాంటి పతనాల గురించి పూర్తి చైతన్యం కలిగి వుంది. ఈ పతనాల చెడు ముందుకుసాగి శత్రుత్వాల రూపం సంతరించుకోక మునుపే ఈ రుగ్మతకు చికిత్స అందించాలని భావిస్తుంది. ప్రతి మనిషి అతని స్వభావాలు, నైజాల రీత్యా వేరు వేరు ప్రత్యేకతలు కలిగివుంటాడు. ఈ ప్రత్యేకతలు

ఒకదానికొకటి ఎదురుపడినప్పుడు వాటి మధ్య వైరుధ్యం లేక ఘర్షణ మొలకెత్తడం చాలా సహజం. అయితే ఈ వైరుధ్యాన్ని కనీస స్థాయికి తగ్గించివేసే అనేక వివేకవంత ఆచరణలను ఇస్లాం, వ్యక్తికి, సమాజానికి అందించింది. వ్యక్తుల మధ్య స్నేహం, సహ కారం, ప్రేమ, సుహృద్భావాలు సజీవంగా వుండేలా జాగ్రత్తలు సూచించింది.

మానవ జీవితంలో ఇరువురు వ్యక్తుల మధ్య సంబంధం ఏర్పడినప్పుడు ఏదో ఒక సమయంలో ఎవరో ఒకరివల్ల ఏదో ఒక రోజున పొరపాటు జరిగిపోతుంది. ఈ పొరపాటు వల్ల ఎదుటి మనిషి హృదయం గాయపడటమూ జరుగుతుంది. ఈ దురదృష్టకర చర్యవల్ల ఇరువురూ తమ సంబంధాలను తెంచుకొనే స్థితికి చేరిపోతారు.

అయితే ఇస్లాం ఇరువురు మనషులు ఈ విధంగా విడిపోవటాన్ని సుతారామూ అంగీకరించదు. దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : "సంబంధాలను త్రెంచుకోకండి! శత్రుత్వాలు పెంచుకోకండి! ఇతరుల పట్ల అసూయ ద్వేషం కలిగి వుండకండి! పరస్పరం సోదరులై సృష్టికర్త అల్లాహ్‌కు దాసులై జీవించండి. ఏ మనిషీ, తన తోటి సోదరునితో కోపతాపాల కారణంగా మూడు రోజుల కంటే ఎక్కువ కాలం మాట్లాడ కుండా ఉండటం కూడదు." (బుఖారి)

పై ప్రవక్త (స) బోధనలో మూడు రోజుల గడువుకు కారణం, ఈ మూడు రోజుల్లో కోపతాపాల తీవ్రత తగ్గిపోతుంది. రోష – ఉక్రోషాలు తగ్గుముఖం పడతాయి. ఒక గాలి తెమ్మెరకు చిత్తు కాగితాలు ఎగిరిపోయినట్లుగా – సమయపు గాలికి కోపతాపాల చిత్తు దూరమైపోతుంది.

ప్రతి తగవు లేక దౌర్జన్యంలో వ్యక్తి తప్పనిసరిగా అయితే బాధితుడు, లేకుంటే దౌర్జన్యపరుడు అయి ఉంటాడు. ఒకవేళ ఆ వ్యక్తి దౌర్జన్యపరుని స్థానంలో ఉంటే, అతడు మరో వ్యక్తి యొక్క హక్కును కాలరాస్తుంటే అతని సంస్కరణకు ఇస్లాం దారి చూపుతుంది. వెంటనే దౌర్జన్యాన్ని గుర్తించమని, దాని నుండి వైదొలగమని, బాధితుడిని క్షమాపణ కోరమని ఆ దౌర్జన్యపరుడిని ఆదేశిస్తుంది. ఫలితంగా బాధితుని మనసు కక్ష, క్రోధం, వైషమ్యం, శత్రుత్వం లాంటి నకారాత్మక నైజం నుండి వైదొలగిపోతుంది. ఫలితంగా ప్రస్తుత దౌర్జన్యపరుడికి భవిష్యత్తులో శాంతి సంతృప్తి లభించే అవకాశం లభిస్తుంది. అలాకాని పక్షంలో బాధితుని ద్వారా భవిష్యత్తులో ఏదో ఒక ప్రమాదం సంభవించే అవకాశం లేకపోలేదు కదా? ఈ విషయంగా దైవప్రవక్త (స) ఇలా శిక్షణ గరిపారు :

"ఎవరైతే తన సోదరుని హక్కును హరించాడో – ఎవరి మర్యాదను భంగ పర్చాడో – ఈ రోజే అతడు ఈ విషయంగా, ఆ సోదరునితో సయోధ్య సాధించుకోవాలి. తీర్పుదినం నాడు ఎవరివద్దా దీనార్ – దిర్హమ్‌లు ఉండవు. కేవలం కర్మ ఫలాలతో అల్లాహ్ సమక్షానికి చేరుతాడు. హక్కును హరించిన వ్యక్తి యొక్క కర్మల నుండి పుణ్యఫలాలను బాధితునికి అందించి వేయబడతాయి. బాధితుని పాపఫలాలను దౌర్జన్యపరునిపై పడవేయబడటం జరుగుతుంది." (బుఖారి)

దౌర్జన్యపరుడిని, ఒక వైపున ధర్మబోధ చేస్తూనే మరోవైపున బాధితునికి కూడా ఇస్లాం హితవు గరుపుతుంది. తన వద్దకు క్షమాపణ నిమిత్తం వచ్చిన దౌర్జన్యపరునితో మృదువుగా మసలుకోమనీ, అతనిని క్షమించమనీ హితవు గరుపుతుంది. ఇటువంటి స్థితిలో క్షమించకపోవడం పాపమని కూడా హెచ్చరిస్తుంది. దైవప్రవక్త ఒక ప్రవచనంలో ఇలా ఉంది :

"ఒక విశ్వాసిని, అతని సోదరుడైన మరో విశ్వాసి క్షమాపణ అర్థిస్తే – అతని క్షమాపణను అంగీకరించని వ్యక్తిపై కఠిన హృదయుడైన పన్ను వసూలు దారునికి లభించే పాపఫలం పడవేయబడుతుంది." (ఇబ్నెమాజ)

మరో ప్రవచనం ప్రకారం : "క్షమాపణ అర్థించిన వ్యక్తి యొక్క క్షమాపణను అంగీకరించని వ్యక్తికి తీర్పుదినాన అమృత సరోవరపు నీరు (ఆబె కౌసర్) లభించదు" అని సెలవివ్వబడింది. (తిబ్రాని)

సమాజానికి పై విధమైన సకారాత్మక ఆచరణాత్మక శిక్షణ అందించడం ద్వారా ఇస్లాం మనిషిలోని అసూయ, శత్రుత్వాలపై యుద్ధం ప్రకటిస్తుంది. మానవత్వానికి శత్రువులైన ఈ నైజాలను కూకటి వ్రేళ్ళతో సహా పెకలించివేయ పూనుకుంటుంది. విశ్వాసుల సమాజంలో శుభం, సమన్యాయం, సహకారం లాంటి విలువలను ప్రతిష్టింపజేసే, పాదుగొలిపే ప్రయత్నం ప్రారంభం నుండే మొదలెడుతుంది.

ఎవరి హృదయంలో అసూయ, శత్రుత్వం, కక్ష వ్రేళ్ళూనుకొని వుంటుందో వారు అవకాశాల కోసం ఎదురుచూస్తూ ఉంటారు. అవకాశం లభించిన వెంటనే తమ కసిని తీర్చుకుంటారు. గొడవలను కల్లోలాన్ని సృష్టించి ఉపద్రవాలకు కారకులు అవుతారు. ఈ కారణంగానే మనిషి హృదయంలో కసి, అసూయ, శత్రుత్వాలను పెంచి పోషించే అంశాలన్నింటినీ ఇస్లాం వ్యతిరేకిస్తుంది.

ఇబ్నె అబ్బాస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలిపారు : 'నేను మీకు చెడ్డవారిని గుర్తించే గుర్తులను తెలిపేదా?' అని ప్రశ్నించారు. అందుకు జనులు 'ఓ ప్రవక్తా! మీకు తెలపాలని వుంటే తప్పక తెలపండి' అని అన్నారు. అప్పుడు మానవ మహోపకారి (స) 'అందరి కంటే చెడ్డవ్యక్తి ఎప్పుడూ నలుగురితో పలకక, అందరినీ వ్యతిరేకిస్తూ ఒంటరిగా మసలుతూ ఉంటాడు. సేవకుని పట్ల అత్యంత కఠినుడై ఉంటాడు. ఎవరికీ బహుమతులు లాంటివి ఇవ్వనే ఇవ్వడు" అని చెప్పి 'ఈ వ్యక్తి కంటే కూడా ఇంకా చెడ్డవాని గుర్తులు తెలిపేదా?' అని ప్రశ్నించారు. అందుకు సహచరులు 'తెలపండి ప్రవక్తా!' అని విన్నవించుకున్నారు. అప్పుడు ప్రవక్త(స) 'ఇతరుల పట్ల ఈర్ష్య, అసూయ కలిగి వుండే వ్యక్తి' అని చెప్పి 'ఈ వ్యక్తి కంటె కూడా ఇంకా చెడ్డవాని గుర్తులు తెలిపేదా?' అని ప్రశ్నించారు. 'తప్పక తెలపండి ప్రవక్తా!' అని ప్రజలు బదులిచ్చారు. అప్పుడు ప్రవక్త(స) "ఎవరైతే ఇతరుల తప్పును క్షమించడో ఆ వ్యక్తి. క్షమాపణను గౌరవించని వ్యక్తి. తన పట్ల వారు చేసిన పాపాలకు మన్నింపు కోరగా మన్నించని వ్యక్తి అని చెప్పి ఈ వ్యక్తికంటే కూడా ఇంకా చెడ్డవాని గుర్తులను తెలపనా?' అని ప్రశ్నించారు. 'తప్పక సెలవివ్వండి ప్రవక్తా!' అని సహచరులు కోరగా అందుకు దైవప్రవక్త (స) "ఎవరైతే ఇతరుల క్షేమాన్ని కోరడో వాడు. ఎవరి దుశ్చేష్టల వల్ల ఇతరులు బాధింపబడతారో వాడు' అని వివరించారు. (తిబ్రాని)

పైన వివరించిన సుదీర్ఘ అవలక్షణాలన్నీ కూడా అసూయ, ద్వేషం, ఈర్ష్య, శత్రుత్వం, కక్షల వికృత రూపాలేనని మనకు ఇట్టే అర్థమౌతుంది. పై మానసికత గల వ్యక్తుల ద్వారా గతంలోనూ, వర్తమానంలోనూ ప్రపంచం, సమాజం అనుభవించిన కష్టాలు, నష్టాలు మనకు తెలిసినవే. విషపూరిత మనసుల నుండి ముళ్ళ ఫలాలే ఫలితంగా లభించడంలో ఆశ్చర్యమేముంది. అందుకే ఒక సంస్కరణాభిలాషి అయిన కవి ఇలా పలికాడు :

"ఉత్తమ వ్యక్తుల మనసులో అసూయకు చోటు లేదు
అసూయ గల మనసు ఉత్తమ స్థానాన్ని అందుకోలేదు"

## ఈర్ష్యాద్వేషాలు - చెడులకు మూలాలు

మానవ సంబంధాలను తునాతునకలు చేసివేసే అనేక రుగ్మతలు నేడు సమాజంలో కానవస్తాయి. ఈ చెడులన్నింటినుండి దూరంగా మెలగమని ఇస్లాం తన అనుయాయులను హెచ్చరిస్తుంది.

ఈ రుగ్మతల చెడుల బాహ్యరూపాలు విభిన్నంగా, వేరువేరుగా ఉన్నప్పటికీ వాటన్నింటి పునాది ఈర్ష్యాద్వేషాలే. అనేక సందర్భాలలో ఈ రుగ్మతల కారణంగా నిరపరాధులకు వ్యతిరేకంగా కుట్రలు పన్నడం మనకు తెలిసినదే. హక్కులను కాలరాచివేయడాన్ని, నిరపరాధులపై కక్ష తీర్చుకోవడాన్ని ఇస్లాం అత్యంత నీచమైన అబద్ధంగా పేర్కొంది.

హజ్రత్ ఆయిషా (రజి) ఉల్లేఖనం ప్రకారం : "దైవప్రవక్త (స) తన అనుచర సమాజాన్ని ఉద్దేశించి, 'అల్లాహ్ వద్ద అత్యంత తీవ్రమైన అతిక్రమణ ఏమిటో మీకు తెలుసా?' అని ప్రశ్నించారు. అందుకు అనుచరులు 'అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకే తెలుసు' అని బదులిచ్చారు. అప్పుడు ప్రవక్త(స) 'ఎవరైతే ఒక విశ్వాసి యొక్క మానమర్యాదలను మంటగలిపే ప్రయత్నం చేస్తాడో ఆ వ్యక్తి అల్లాహ్ న్యాయ స్థానంలో అతిక్రమణదారునిగా పరిగణించబడతాడు" అని అన్నారు.

తమ మాటనే నెగ్గించుకోవడానికి ఇతరులను బలవంతపెట్టడం లేదా వారిలోని బలహీనత ద్వారా వారిని అనుకూలురుగా మల్చుకునే ప్రయత్నం చేయడం నిత్యం సమాజంలో మనకు ఎదురౌతున్నదే. ఇస్లాం, ఈ చర్యలన్నింటికీ న్యాయ శాస్త్రరీత్యా శిక్షలు విధించింది. ఇక తీర్పుదినం నాడు ఈ నేరాలకు చెప్పబడిన శిక్షలు వింటే రోమాలు నిక్కబొడుచుకోక తప్పవు.

దైవప్రవక్త (స) ఇలా తెలిపారు : "ఎవరైతే తన తోటి సోదరునిలో లేని లోపాలను ఆపాదించి ప్రచారం చేస్తాడో, తీర్పుదినాన అల్లాహ్ నరకాగ్నిలోని అత్యంత లోతైన అగాధంలో పడవేస్తాడు." (తిబ్రాని)

మరో ఉల్లేఖనంలో ఇలా తెలియజేయబడింది : "ఎవరైతే తన తోటి సోదరునిలో లేని లోపాన్ని ప్రచారం చేస్తే - తద్వారా అతని మానమర్యాదలకు భంగం కలిగిస్తే తీర్పుదినాన ఆ వ్యక్తిని అగ్ని యొక్క పూర్తి రుచిని చూపించకుండా అల్లాహ్ వదలడు."

## పరోక్ష నిందలకు, చాడీలకు పాల్పడకండి

హృదయాన్ని పరిశుభ్రంగా, స్వచ్ఛంగా ఉంచుకోవడం అంటే మనిషి ఇతరుల పట్ల మంచిగా వ్యవహరించడం అని అర్థం. లేదా కనీసం ఇతరుల మంచిని కోరుకోవడం అని అర్థం. ఇతరులలో ఏ లోపం లేకపోయినా అతని పట్ల అబద్ధాన్ని ప్రచారం చేస్తూ అతనిని అభాండంలో బంధించడానికి ప్రయత్నం చేసే వ్యక్తిని

అబద్ధాలకోరుగా - దుశ్శీలునిగా - నిర్లజ్జాపరునిగా ఇస్లాం ముద్రవేస్తుంది. ఈ విషయంగా అల్లాహ్ ఆదేశం ఇలా ఉంది :

**"విశ్వాసుల వర్గంలో అశ్లీలత వ్యాపించాలని కోరేవారు, ప్రపంచంలోనూ, పరలోకంలోనూ వ్యథాభరితమైన శిక్షకు అర్హులు." (ఖుర్ఆన్, 24:19)**

తన సృష్టితాలలోని బలహీనతలను బహిరంగపర్చని వారిని అల్లాహ్ ఇష్టపడతాడు. తద్వారా మానవ జాతిపై అంతులేని కారుణ్యం కురిపించాడు. ఇతరులలోని నిజమైన లోపాలను అయినా, వాటిని బహిరంగపర్చడం ద్వారా సంతోషపడే మానసిక వికలాంగులను, క్రూర మనస్కులను అల్లాహ్ అభిశంసించాడు. ఇతరుల బాధను చూచి ఆనందించే పైశాచిక మనస్తత్వాన్ని ఇస్లాం తీవ్రంగా ఖండిస్తుంది. ఒక ముస్లిం పై మానసికతకు లోను కాకూడదని ఇస్లాం హితవు పలుకుతుంది.

ఈ కారణంగానే ఇస్లాం చాడీలు పలకడాన్ని నిషిద్ధం (హరామ్) చేసింది. చాడీలు చెప్పే అలవాటు వున్న వ్యక్తి మనసులో కక్ష, ఈర్ష్య, అసూయలు చోటు చేసుకుంటాయి. ఈ రుగ్మతలున్న వ్యక్తి అల్లాహ్ యొక్క కారుణ్యం, వరప్రసాదాల నుండి వేరుపడిపోతాడు.

అబూహురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) తన ప్రియ అనుచరులను ఉద్దేశించి ఇలా అడిగారు, "చాడీ (పరోక్షనింద) తనం అంటే, ఏమిటో మీకు తెలుసా?" అందుకు వారు 'అల్లాహ్, ఆయన ప్రవక్తకే తెలుసు' అన్నారు. అప్పుడు ప్రవక్త(స) "మీ సోదరుడు ఇష్టపడని విధంగా అతని గురించి ఇతరుల వద్ద ప్రస్తావించడం" అని వివరించారు. అందుకు జనులు 'ఒకవేళ ఆ సోదరునిలో నిజంగానే ఆ లోపడం వుంటే?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్త(స) 'నిజంగా ఆ లోపం మీ సోదరునిలో వుంటేనే మీరు అతని గురించి పరోక్ష నింద చేసినవారు అవుతారు. ఒకవేళ ఆ లోపం అతనిలో లేకుంటే మీరు నిందారోపణకు పాల్పడిన వారౌతారు' అని హెచ్చరించారు." (ముస్లిం)

ఇస్లాం ఆప్యాయతా అనురాగాలను, సోదరత్వ స్నేహాలను పరరక్షించడానికి అవసరమైన అనేక మర్యాదలను సిద్ధాంతీకరించింది. ఈ పరిరక్షణలో పరోక్ష నిందను వ్యతిరేకించడం అతి ప్రధానమైనది. పరోక్షనింద మనుషుల మధ్య స్నేహాన్ని, అనుబంధాన్ని ధ్వంసం చేసివేస్తుంది.

ప్రవక్త(స) వారు తన అనుచర సమాజాన్ని ఈ రుగ్మత గురించి తరచూ హెచ్చరించేవారు. "మీరు మీ సోదరుని గురించి నా మనస్సును కష్టపెట్టేవిధంగా ప్రస్తావన తేకండి. నేను మిమ్మల్ని ఎప్పుడు కలిసినా, మీ గురించి నా మనసు పరిశు ద్ధంగా వుండాలని నేను ఆశిస్తున్నాను." (అబూదావూద్)

చాడీలు చెప్పే అలవాటున్న వ్యక్తి చిన్న చిరుగులో ప్రేలుదూర్చి ఆ చిరుగును ఇంకా పెద్దది చేసేవిధంగా వుంటాడు. సాధారణంగా చాలా విషయాలు అక్కడికక్కడే సమసిపోతాయి. కానీ చాడీకోరుల నోటిలో పడ్డ విషయాలు తమ హద్దులు ఎల్లలు దాటి గొడవలకు హత్యలకు యుద్ధాలకు సైతం కారణభూతాలౌతాయి. చిన్న విషయాన్ని చిలువలు పలువలు చేసి, అడవిలో రాజుకునే నిప్పులా మార్చివేస్తారు. ఫలితంగా సమాజం అగ్నికి ఆహుతిఅయి వినాశనానికి గురౌతుంది.

ప్రవక్త(స) వారు "స్వర్గలోకంలో చాడీకోరు ప్రవేశించలేడు" అని హెచ్చరించారు. మరో ఉల్లేఖనంలో చాడీతనాన్ని 'ఖితాత్' మరియు 'నమామ్' అనే పేర్లతో సంబోధించడం జరిగింది. 'నమామ్' అంటే ఒక వ్యక్తి, లోకులు మాట్లాడుకుంటున్న విషయానికి నగిషీలు చెక్కి ప్రచారం చేయడంగా - 'ఖితాత్' అంటే ఒక వ్యక్తి దొంగచాటుగా ఇతరుల మాటలను విని వాటిని చిలువలు పలువలుచేసి ప్రచారం చేయడంగా ధార్మిక పండితులు వివరణ యిచ్చారు.

అసూయ - చాడీతనానికి మాతృకలాంటిది. ఈ రుగ్మతకు లోనైన వ్యక్తి నిత్య అనుమాని అయి మానసిక ప్రశాంతతను కోల్పోతాడు. ఇతరుల సౌఖ్యాన్ని, సుఖాన్ని సంతోషాన్ని చూచి నిరంతరం మనసులో కుళ్ళుతూ ఉంటాడు. ఇస్లాం ఈ కుళ్ళును అసహ్యించుకుంటుంది.

"అల్లాహ్ ప్రవక్త (స) ఇలా నుడివారు, 'ఎవరైనా ఒక వ్యక్తికి అతని సోదరుని యొక్క ఏదైనా బలహీనత తెలిసిపోతే, ఆ లోపాన్ని ఆ వ్యక్తి ప్రచారం చేయకుండా మరుగుపరిస్తే అల్లాహ్ ప్రళయదినాన ఆ వ్యక్తి యొక్క పాపాలను మరుగుపరుస్తాడు" (అనగా క్షమిస్తాడు)." (తిబ్రాని)

మరో ఉల్లేఖనంలో ఇలా ఉంది, "ఎవరైతే ఇతరుల లోపాన్ని మరుగుపర్చాడో - అతను తన సమాధి జీవితాన్ని సుఖమయం చేసుకున్నాడు." (తిబ్రాని)

ఇతరుల లోపాలను నిరంతరం వెతుకుతూ ఉండే మహాశయులు పాపాల

మూటలను మూటగట్టుకుంటున్నామని తెలుసుకోవాలి. నిజంగా పాపం చేసినవాని కంటే కూడా వీరు అధికంగా పాపం మూటగట్టుకుంటున్నారు. అల్లాహ్ కారుణ్య దృష్టి నుండి వీరు తొలగించి వేయబడతారు.

అల్లాహ్ ఇష్టపడుతున్న ఆచరణను స్వీకరించే చైతన్యం చాలా గొప్పది. అదే సమయంలో అల్లాహ్ అసహ్యించుకునే ఆచరణల వైపుకు పరుగులు ఎత్తడం అత్యంత హీనమైన చర్య అవుతుంది. మొదటి చైతన్యం మనిషిని మహోన్నత శిఖరాలకు చేరుస్తుంది. ఇక రెండవ ఆచరణ మనిషిని పతనపు అగాధంలో పడవేస్తుంది. ఇతరులను కష్టపెట్టడం ద్వారా సంతృప్తి మానసిక ఆనందం పొందే ఈ మానసిక అష్టావక్రులు భయానకమైన శిక్ష, అంతులేని వ్యధాభరితమైన జీవితాన్ని ఎదురుచూడవలసి ఉంటుంది.

## కుట్రలకు స్వస్తి పలకండి

హృదయాన్ని ప్రక్షాళించుకోవడం, ఆలోచనలను పరిశుభ్రంగా వుంచుకోవడం ఒక ముస్లింకు తప్పనిసరి. ఈ లక్షణాల ద్వారానే ఇతర ప్రజల నుండి ఒక ముస్లిం వేరుపర్చబడివుంటాడు. ఈ రంగంలో అందరికంటే ముందు ఉండటానికి, నైతిక విజయాలను పొందడానికి ఒక ముస్లిం మున్ముందుంటాడు.

అయితే వ్యక్తిపై 'స్వార్థం', 'స్వలాభం' అనే విషయాలు ఆధిపత్యం వహించినపుడు, వ్యక్తి పై ప్రత్యేకతలు కోల్పోతాడు. ఒక అజ్ఞానిగా ప్రవర్తిస్తాడు. ఇతనికంటే దురదృష్టవంతుడు మరొకడు వుండడు. ఈ స్థితిలో మనిషి తన ఎదుటివారు ఎప్పుడూ కష్టాలకు, నష్టాలకు లోనై ఉండాలని కోరుకుంటాడు. తద్వారా తనకు ఎలాంటి లాభం లేకున్నప్పటికీ ఇతరుల పట్ల ఇటువంటి వైఖరి కలిగివుంటాడు.

కాని, ఒక ముస్లిం విశాల హృదయుడై ఉండాలి. ఆలోచనల్లో, దృక్పథాల్లో విశాలత్వం కలిగి ఉండి అందరి క్షేమాన్ని కాంక్షించేవాడై ఉండాలి. విషయాలను, లాభనష్టాలను వ్యక్తిగతంగా కాక, జాతీయంగా, అంతర్జాతీయంగా, సమాజ హితాత్మక దృష్టితో చూడవలసి వుంటుంది.

సాధారణంగా ఒక మనిషి హృదయంలో ద్వేషం-కుట్రల నీళ్ళు మరగడానికి అనేక కారణాలున్నప్పటికీ – ప్రధానంగా తాను ఏ ఏ సౌలభ్యాలు సుఖాలు పొందడంలో విఫలమయ్యాడో, అవే సౌఖ్యాలు, సుఖాలు ఇతరులు పొందుతూ ఉండటం కారణంగా

వుంటుంది. తన కోరికలు, కాంక్షలు తీరడం లేదు, కాని ఇతరులు అవే కోరికలను కాంక్షలను తీర్చుకోగల్గుతున్నారు. ఈ అంశమే మనిషిని ఈర్ష్య, అసూయ, ద్వేషం తుదకు కుట్రల వైపుకు గుంజుకొని వెళుతుంది. మనసు అసహనానికి గురౌతుంది. తుదకు శాంతి సంతృప్తులు దూరమైపోతాయి.

ప్రారంభంలో షైతాన్ ఏ ఏ గౌరవోన్నతులు కోరుకున్నాడో – ఆ గౌరవోన్నతులు ప్రవక్త ఆదం (అలై)కు అందించబడ్డాయి. ఫలితంగా ఈర్ష్య, అసూయ, ద్వేషానికి గురయ్యాడు. ఇకపై ఏ ఆదం పుత్రుడికి కూడా స్వర్గసుఖాలు పొందే అవకాశం ఇవ్వకూడదని భావించడు. అందుకు నిరంతరం కుట్రలు పన్నుతూనే వున్నాడు. ఈ విషయంగా షైతాన్ అల్లాహ్‌ను ఇలా వేడుకున్నాడు :

**"అలాగే నీవు నన్ను మార్గభ్రష్టత్వానికి గురిచేసినట్లు నేను కూడా నీ రుజుమార్గంపై మానవుల కొరకు మాటువేసి కూర్చుంటాను. వెనుకా, ముందు – కుడి, ఎడమా అన్ని వైపుల నుండి వారిని చుట్టుముట్టుతాను. వారిలో అధిక సంఖ్యాకులను కృతజ్ఞులుగా చూడవు." *(ఖుర్‌ఆన్, 7:16-17)***

పై షైతానీ ఉత్సాహమే, ద్వేషం-ఈర్ష్యగల హృదయాన్ని మండిస్తూ మరగిస్తూ వుంటుంది. హృదయాన్ని ఆలోచనలను కలుషితపర్చి దానిని ధ్వంసం చేసివేస్తుంది. ఇస్లాం తన అనుయాయుని ఈర్ష్య-ద్వేషం లాంటి చెడుగుల నుండి సుదూరంగా వుండమని హెచ్చరించింది. తద్వారా జీవితంలో శాంతి ప్రశాంతత సంతృప్తులకు చోటు దొరుకుతుందని తెలిపింది.

అనస్ బిన్ మాలిక్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, "మేము ఒకసారి దైవప్రవక్త (స)తో కలిసి కూర్చునివున్నాము. అప్పుడు ప్రవక్త(స) 'మీ వద్దకు ఒక స్వర్గవాసి వస్తున్నాడు' అని చెప్పారు. మేము చూడగా ఒక అన్సార్ వ్యక్తి వస్తున్నాడు. అతని గడ్డం వుజూవల్ల తడితడిగా ఉంది. తన ఎడమ చేతిలో ఒక చెప్పుల జతను పట్టుకొని వున్నాడు. ప్రవక్త(స) వారు రెండవ రోజు, మూడవరోజు కూడా ఆ అన్సార్ గురించి ఇలాగే చెప్పారు. ఆ అన్సార్ ఇదే స్థితిలో రావడం జరిగింది. ఈ విషయంగా ఆ అన్సార్ యొక్క దినచర్య తెలుసుకునేందుకు అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజి) ఆయన వద్ద మూడు రాత్రులు గడిపే అనుమతి కోరారు. అందుకు ఆ అన్సారీ ఆమోదం తెలిపారు. ఈ మూడు రాత్రులలో అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) ఆ అన్సార్ నోటి నుండి ఇతరుల

క్షేమం – సంక్షేమం గురించి తప్ప మరోమాట విననేలేదు. రాత్రి తహజ్జుద్ నమాజ్ లోనూ, నిరంతర అల్లాహ్ స్తుతిలోనూ గడిపిన ఆ అన్సారీ ఫజ్ర్ నమాజ్ కొరకు సమయానికి లేచేవారు.

ఈ మూడు దినాలలో పై ఆచరణ తప్ప ఆయనలో మరే ప్రత్యేకతనూ నేను గమనించలేదు. మూడవ రోజున 'ఓ అల్లాహ్ దాసుడా! నీ గురించి ప్రవక్త (స) స్వర్గవాసి వస్తున్నాడని సెలవిచ్చారు. నేను మీలో గొప్పదైన ఏ ఆచరణనూ గమనించ లేదు. మరి ప్రవక్త(స) అలా సెలవివ్వడానికి కారణమేమిటి? అని ప్రశ్నించాను. అందుకు ఆ అన్సారీ "మీరు చూసిన ఆచరణ తప్ప నా వద్ద మరే ప్రత్యేక ఆచరణా లేదు' అని బదులిచ్చారు. అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) ఇక బయలుదేరబోతుండగా, ఆ అన్సారి ఆయనను ఆపి, 'నేను నా మనస్సులో ఏ సోదరుని పట్ల కూడా ఈర్ష్య, అసూయ, ద్వేషాలను కలిగివుండను. అల్లాహ్ ఎవరికైనా, ఏదైనా వరప్రసాదం ప్రసాదించివుంటే దానిపట్ల అసూయ చెందను' అని అన్నారు. అప్పుడు అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) 'బహుశా మీలోని ఈనైజమే ప్రవక్తశ్రీ వారికి తెలిసి వుంటుంది' అని అన్నారు. (అహ్మద్ మరియు బజ్జార్ గ్రంథాలు)

## అసూయ - అత్యాశలను దరిచేర్చకండి!

ఇస్లాం అసూయను నిషేధించింది. అసూయాపరుడి బారి నుండి రక్షణ కొరకు అల్లాహ్‌ను వేడుకోమని దైవప్రవక్త (స) ఆదేశించారు. అసూయ ఒక నిప్పు రవ్వలాంటిది. ఇతరులను నష్టపర్చడం దాని నైజం అవడమేకాక అది స్వయంగా అసూయాగ్రస్తుడిని కూడా దహించివేస్తుంది.

ఎవరైతే అల్లాహ్ వరప్రసాదాల పట్ల అసూయచెందుతాడో ఆ వ్యక్తి సమాజానికి నష్టదాయకుడు అవుతాడు. అసూయాపరుని హృదయం ఎప్పటికీ సంతృప్తికి నోచుకోదు. దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు.

"దైవదాసుని ఉదరంలో (లేక హృదయంలో) విశ్వాసం, అసూయలు కలసి ఉండటం సాధ్యం కాదు." (బైహఖీ) మరో ఉల్లేఖనంలో "అసూయనుండి మిమ్మల్ని మీరు కాపాడుకోండి. అసూయ మీ పుణ్యఫలాలను, నిప్పు కట్టెను కాల్చివేసినట్లుగా భస్మీపటలం చేసివేస్తుంది." (అబూదావూద్)

ఒక వ్యక్తి, దైవ వరప్రసాదాలు పొందిన మరోవ్యక్తి పట్ల అసూయు చెందుతున్నాడు అంటే – నిజానికి ఆ వ్యక్తి దైవ నిర్ణయాన్ని ధిక్కరిస్తున్నాడని అర్థం. ఇటువంటి వ్యక్తి సాంఘిక బహిష్కరణకు అర్హుడౌతాడు. అసూయాపరుడు నిరంతరం ప్రాపంచిక ప్రయోజనాలను, భౌతిక సంపదలను పోగు చేసుకోవడానికి తాపత్రయపడుతూ ఉంటాడు. ఇతరులను మించిపోవాలని నిరంతరం యోచిస్తూ ఉంటాడు. తనను మించిపోతున్న వారిపట్ల అత్యంత భయానకమైన ఆలోచనలు కలిగివుంటాడు.

ఇటువంటివాడు మరణానంతర జీవితాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేసివేస్తాడు. తీర్పుదినపు చైతన్యం ఏమాత్రం లేని గ్రుడ్డివానిగా మారిపోతాడు. ఇతని స్థితి పై సృష్టికర్త అల్లాహ్ ఈ క్రిందివిధంగా ప్రకటించాడు.

**"మానవులారా! మీ వద్దకు మీ ప్రభువు తరపు నుండి హితోపదేశం వచ్చేసింది. అది హృదయ వ్యాధులకు స్వస్థత. .... ప్రజలు కూడబెట్టే వాటన్నింటికంటే అది ఉత్తమమమైనది." (ఖుర్అన్, 10 : 57-58)**

అసూయాపరుడు బలహీన మనస్కునిగా, తన సృష్టికర్తను గుర్తించనివానిగా సృష్టి విధివిధానాలను, సూత్రాలను, దైవ సాంప్రదాయాలను అర్థం చేసుకోలేనివానిగా వుంటాడు. తాను కోరుకుంటున్న వస్తువు లేక హోదా తనకు దక్కకుండా ఇతరులకు లభిస్తే దానిపట్ల తీవ్రమైన ద్వేషానికి లోనవుతాడు.

వాస్తవానికి ఈ వ్యక్తికి ఇటువంటి పరిస్థితి ఏర్పడినప్పుడు తన నిజ సృష్టికర్త వైపుకు మరలివుండవలసింది. ఎదుటి వ్యక్తికి అనుగ్రహించిన వరం తనకూ అనుగ్రహించమని వేడుకొని వుండవలసింది. విశ్వప్రభువు ఖజానాలో వరప్రసాదాలకు కొరత లేదని తెలుసుకొని ఉండాలి. అటుపిమ్మట ఆ వరప్రసాదాల సాధనకు నడుం కట్టివుంటే, దైవచిత్తమైతే, ఆ వరప్రసాదాలు బహుమతుల రూపంలో లభ్యమై వుండేవి. ఇతరుల పట్ల అసూయ, ద్వేషాలను కలిగివుండటం కంటే ఈ పద్ధతి ఎంతో ఉత్తమమైనది.

అసూయ – దృఢ సంకల్పాల మధ్య, ఆశ–అత్యాశల మధ్య ఉండే వ్యత్యాసపు పొర చాలా పలుచగా ఉంటుంది. కాని, ఈ రెండు అంశాల మధ్య వున్న తేడా మాత్రం చాలా తీవ్రమైనది. అసూయ షైతానీ చేష్టకాగా – దృఢ సంకల్పం విశ్వాసి అయిన

అల్లాహ్ దాసునికి గుర్తు. ప్రవక్త సులైమాన్ (అలై) తన ప్రభువు వద్ద ఈ క్రింది విధంగా వేడుకున్నారు :

**"మా ప్రభూ! మాకు మా భార్యల ద్వారానూ, మా సంతానం ద్వారానూ కన్నుల చల్లదనాన్ని ప్రసాదించు. మమ్మల్ని భయభక్తులు కలవారికి ఇమాములుగా చేయి." (ఖుర్ఆన్, 25:74)**

అల్లాహ్ వరప్రసాదాలను ఆశించడం, అందుకు శ్రమించడం శ్లాఘనీయమైన విషయం. అదే సమయంలో ఒక వ్యక్తిపై అల్లాహ్ కారుణ్యం కురియడం చూసి మనసులో కుళ్ళుతూ అసూయ చెందడం క్షమించరాని నేరం. ఈ రెండు నైజాల మధ్య నక్కకూ నాగలోకానికీ మధ్య ఉన్నంత అంతరం ఉంది.

అల్లాహ్ ఒక వ్యక్తికి ప్రసాదించిన వరప్రసాదాన్ని చూసి అటువంటిదే తనకూ కావాలని కోరడం 'రష్క్' అని పిలువబడుతుంది. స్వభావరీత్యా రష్క్ చెడ్డది కాదు. కాని ఈ రష్క్ నుండి కోరిక మొలకెత్తుతుంది. తదుపరి అది ఆశగా పిదప తీవ్ర సంకల్పంగా పరిణామం చెంది, మనిషిని మానసికంగా నష్టానికి గురిచేసే ప్రమాదముంటుంది. ఏదైనా ఒక దానిని కోరుకోవడం సరైనదే. అయినప్పటికీ అందులో పోటీదారుడు ఉండటం సరైంది కాదు. ఇటువంటి పోటీని ఇస్లాం కేవలం రెండు అంశాలకు మాత్రమే ధర్మసమ్మతం చేసింది.

ప్రవక్త (స) ఇలా వివరించారు : "రెండు ప్రత్యేకతలు గల విషయాలలో తప్ప మిగిలిన విషయాలలో అసూయ–ఈర్ష్య చెందడం సరికాదు. అందులో మొదటిది ఒక వ్యక్తికి అల్లాహ్ అధిక ధన సంపత్తులు ప్రసాదించగా ఆ వ్యక్తి ఆ ధన సంపత్తులను అల్లాహ్ మార్గంలో విస్తారంగా ఖర్చుచేస్తూ ఉంటాడు. ఈ వ్యక్తిని చూసి అసూయచెందవచ్చు. ఇక రెండవది ఒక వ్యక్తికి అల్లాహ్ అత్యంత వివేకాన్ని ప్రసాదించగా ఆ వ్యక్తి ఆ జ్ఞానంతో ప్రజల మధ్య న్యాయవంతంగా సమస్యలను పరిష్కరిస్తాడు. ఇతరులకు శిక్షణ గరుపుతాడు. ఈ వ్యక్తిని చూసి అసూయచెందవచ్చు."

ప్రవక్త(స) వారి పై ప్రవచనంలో 'అసూయ' అనే పదానికి దైవప్రసాదం అంతమై పోవాలనే కోరిక లేదు అనేది గమనార్హం. ఆయా వ్యక్తులు పొందిన వరప్రసాదాలే తనకూ లభించాలనే సత్ కోరిక వుండటం ఇక్కడ గమనించాలి. ఇతరులకు ఉన్నది, నాకూ అల్లాహ్ ప్రసాదించాలనే కోరిక సరైనది కాగా, ఇతరులకు ఎందుకు ఇవ్వబడింది?

నాకెందుకు ఇవ్వబడలేదు? అని అసూయ చెందడం సరైనది కాదు. ఈ మానసికత ఇటు ప్రజలకూ, స్వయంగా ఆ వ్యక్తికీ క్షేమకరం కాదు. ఈ విషయంగా అల్లాహ్ మార్గదర్శకత్వం ఈ క్రింది విధంగా ఉంది :

**"అల్లాహ్ మీలో ఎవరికైనా ఇతరులకు ఇచ్చినదానికంటే ఎక్కువగా ప్రసాదించి వుంటే మీరు దానికి ఆశ పడకండి. పురుషులు సంపాదించినట్లుగా వారి భాగం వుంటుంది. స్త్రీలు సంపాదించిన దానికి తగినట్లుగా వారి భాగం వుంటుంది. అయితే అల్లాహ్‌ను ఆయన అనుగ్రహం కొరకు ప్రార్థిస్తూ వుండండి. నిశ్చయంగా అల్లాహ్ సకల విషయ పరిజ్ఞానం కలవాడు." (ఖుర్ఆన్, 4:32)**

పరిస్థితులు ఎటువంటివి అయినా అసూయ చెందడం వాంఛనీయం కాదు. ఎవరు చేసుకున్న ఆచరణలకు అనుగుణంగా వారు ఫలితం అనుభవిస్తారు. కనుక అసూయ చెందడంలో అర్థమే లేదు. ఎవరైనా కొద్దిపాటి శ్రమతో ఎక్కువ లాభం పొందుతూవున్నా - తన ప్రతిభ కారణంగా పెద్ద హోదా పొందినా వారిపట్ల కూడా అసూయ చెందుతూ వుంటాం. ఆలోచించిచూస్తే, ఇది అర్థంలేని చేష్టగా గుర్తిస్తాం.

ఇస్లాం మనిషి యొక్క మనసు - దాని సంకల్పాలను క్షణం క్షణం నిశితంగా పరిశీలిస్తూ వుంటుంది. అందులోని దోషాలను, మలినాలను శుభ్రపర్చే ప్రయత్నం నిరంతరం చేస్తూనే వుంటుంది. తద్వారా మానవ హృదయాన్ని నిర్మలంగావుంటే, దానిని మరింత అభివృద్ధిపర్చే ప్రయత్నం చేస్తుంది. ప్రతిదినం, ప్రతివారం ప్రతి సంవత్సరం మనసును ప్రక్షాళించే, ఉత్సాహాన్ని నింపే కార్యక్రమాలను అందిస్తూ వుంటుంది. ఫలితంగా శిశ్వాసుల హృదయం ఈర్ష్య, అసూయ, ద్వేషాల నుండి ప్రక్షాళింపబడుతూ వుంటుంది.

ప్రతిరోజు ఐదుపూటలు ఆచరించే తప్పనిసరి నమాజుల ద్వారా మనిషి మానసికంగా ప్రక్షాళింపబడుతూ వుండాలి. ఈ మానసిక పరిణామం సంభవించ నంతవరకు, ఆ వ్యక్తి నమాజ్‌లు ఆమోదింపబడవు. తనతోటి మనుషుల పట్ల ఎటువంటి ఈర్ష్యం, అసూయల్లాంటి మాలిన్యాలు లేకుండాపోవాలి. హృదయం నిర్మలమైపోవాలి.

దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : "ముగ్గురు వ్యక్తుల నమాజ్‌లు వారి శిరస్సులు దాటి ఎదగవు. (అనగా వారి నమాజ్‌లు ఆమోదింపబడవు). ప్రజలు

ద్వేషించినా వారి నాయకుడైనవాడు. భర్తను లైంగికంగా రాత్రిఅంతా ఇబ్బంది పెట్టిన స్త్రీ (భర్త కోరికను తీర్చని స్త్రీ) తమ సంబంధాలను తెంచుకున్న సోదరులు." (ఇబ్నెమాజ)

ప్రతివారం ఒక విశ్వాసి యొక్క ఆచరణలు లెక్కించబడతాయి. ప్రతి మనిషి తన మరణానంతర జీవితానికి అవసరమైన సరంజామా ఏ మేరకు సమకూర్చుకున్నాడో ప్రతివారం అల్లాహ్ లెక్కిస్తాడు. ఈ లెక్కల్లో ఆ వ్యక్తి హృదయ నిర్మలత్వం కూడా లెక్కించబడుతుంది. ఇతరుల పట్ల ఎవరి హృదయం అసూయ ద్వేషాలకు దూరంగా వుంటుందో వారు అల్లాహ్ లెక్క నుండి రక్షింపబడ తారు. అలాకాక, అతని హృదయం ఇతరుల పట్ల కోపం ఈర్ష్య ద్వేషం, అసూయలతో నిండివుంటే అతని ఆచరణ పట్ల అల్లాహ్ అత్యంత కఠినంగా వుంటాడు.

ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : "ప్రతి సోమవారం మరియు బేస్త (గురు)వారం మనిషి ఆచరణలు అల్లాహ్ ముందు హాజరుపర్చబడతాయి. బహుదైవారాధనకు పాల్పడిన వారిని తప్ప మిగిలిన వారందరి తప్పులు క్షమించబడతాయి. అయితే అసూయ కారణంగా తమ సంబంధాలను తెంచుకున్న ఇరువురు విశ్వాసులైన సోదరులు వారి మానాన వారిని వదలేయబడతారు. వారు తమ ఆచరణలను సంస్కరించుకోవలసి వుంది" అని అల్లాహ్ ఆదేశిస్తాడు. (ముస్లిం)

పైన వివరించిన ఆరాధనల దైవిక సహజసిద్ధ భట్టీలలో పుటంపెట్టబడిన తర్వాత కూడా ఎవరైనా తమ మనస్సుల్లో అసూయ, ద్వేషాలను పదిలపర్చుకొని ఇహం విడిచి పరం చేరుకున్న వ్యక్తి నరకాగ్నికి అర్హుడు కాకుండా ఎలా వుండగలడు. ధర్మశాస్త్రానికి అందకుండా వున్న ఈ మానసిక రోగం ద్వారా సమాజానికి హాని కలిగిస్తున్న ఈ వ్యక్తి యొక్క మనస్సు నరకాగ్నికి తప్ప మరెందుకూ అర్హత కలిగి ఉండదు.

అసూయ ఈర్ష్యాద్వేషాల ద్వారా ఉద్భవించే ఉత్పాతాలన్నింటిని ఇస్లాం వ్యతిరేకించింది. అసహ్యం కనపర్చింది. మనిషి మనసు తన అసూయ ద్వారా స్వార్థపరత్వానికి జన్మభూమిగా మారిపోతుంది. స్వార్థపూరిత కోరికలకు నిలయమై మనిషిని బానిసగా మార్చివేస్తుంది. ధర్మాధర్మ విచక్షణను నశింపజేస్తుంది. తనకు లాభం కలిగించే అన్ని రకాల దుష్టచేష్టలను ఆచరించడానికి ఉత్సాహవంతంగా

ముందుకు ఉరికేవానిగా వ్యక్తిని మార్చివేస్తుంది. ఈ ఉరుకులకు, దూకుళ్ళకు ముకుతాడు అత్యంత అవసరమని ఇస్లాం భావిస్తుంది.

ఒకవేళ అల్లాహ్ కోసం ఎవరితోనైనా ద్వేషం కొనితెచ్చుకుంటే, సత్యం కోసం కోపం ప్రదర్శిస్తే అది ఈర్ష్య అసూయల జాబితాలో చేరదు. సత్యధర్మాన్ని తిరస్కరించే సత్యవ్యతిరేకులతో – సత్యధర్మాన్ని నాశనం చేయాలని కుట్రలు పన్నేవారితో జీవితాంతం సంబంధాలను తెంచుకోవడం ఒక విశ్వాసికి పాపంగా పరిగణించబడదు. అల్లాహ్ హద్దులను అతిక్రమించే వారిని, హద్దులను చెరిపివేసేవారిని ద్వేషించడం పాపంగా భావించబడదు. వారితో శత్రుత్వపు బహిరంగ ప్రకటన కూడా ధర్మబద్ధమే అవుతుంది. ఈ చర్యలన్నీ ఆ విశ్వాసి విశ్వాస గాఢతకు సాక్షీభూతంగా వుంటుంది.

ఈ విషయంగా అల్లాహ్ తమకు అత్యంత సమీపులైన సత్యవిరోధులతో కూడా సంబంధాలను సమీక్షించుకోవలసిందిగా హెచ్చరించాడు.

**"విశ్వసించిన ప్రజలారా! మీ తండ్రులను, మీ సోదరులను కూడా మీ సహచరులుగా చేసుకోకండి, ఒకవేళ వారు విశ్వాసం కంటె అవిశ్వాసానికి ప్రాధాన్యం ఇస్తే. మీలో వారిని సహచరులుగా చేసుకునేవారే దుర్మార్గులు."**

**(ఖుర్‌ఆన్, 9 : 23)**

ఎవరి స్నేహం నష్టదాయకమో – ఎవరి సాన్నిహిత్యం సత్య ధర్మానికి క్షేమకరం కాదో – ఎవరు అసూయాద్వేషాలతో డాంబికాలు పలుకుతూ వుంటారో – వారిని గ్రక్కున విడిచిపెట్టడం అత్యంత అవసరం. అల్లాహ్ ధర్మం పట్ల ద్వేషులై, అసూయాగ్రస్తులైన వారిని నిర్దేశిత కాలం వరకు సాంఘిక బహిష్కరణ కూడా ధర్మబద్ధమే అవుతుంది. ప్రవక్త(శ్రీవారు కూడా చిన్నపాటి అసూయచూపిన తన శ్రీమతులతో సుదీర్ఘదినాలు మాటామంతిని నిలిపివేశారు. ప్రవక్త (స) సహచరులు అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) తన కుమారునితో జీవితాంతం తన సంబంధాలను తెంచేసుకున్నారు. ఇతను కేవలం ప్రవక్త(శ్రీవారి ఒక హదీసును వ్యతిరేకించాడు. ప్రవక్త(స) మహిళలకు మస్జిద్‌లో నమాజుచేసే అనుమతి ఇవ్వగా ఇబ్నె ఉమర్ (రజి) కుమారుడు దానిని ధిక్కరించాడు.



# 13వ భాగం

# శక్తి

- విశ్వాసం - ఒక విప్లవాత్మక శక్తి
- అల్లాహ్‌పై భారం-దృఢ సంకల్పం-శక్తికి పునాదులు
- ఇతరుల భిక్షపై (ఆధారపడి) జీవించడాన్నీ బానిస మనస్తత్వాన్ని ఇస్లాం అంగీకరించదు!

# విశ్వాసం ఒక విప్లవాత్మక శక్తి

సుదృఢమైన, చైతన్యవంతమైన విశ్వాసం ఎప్పటికీ ఎండిపోని జలాశయం వంటిది. కష్టాలను ఎదుర్కొని మునుముందుకు సాగే శక్తి నిరంతరంగా ఊటలా ఈ జలాశయం నుండి ఊరుతూ వుంటుంది. ఈ శక్తి మనిషిని తన ధ్యేయంపట్ల అకుంఠిత మైన దీక్షాతత్పరునిగా తీర్చిదిద్దుతుంది. ఈ లక్ష్యసాధనలో అవసరమైతే అమరత్వపు మధుర పానీయాన్ని సైతం అలవోకగా గ్రోలగలిగే నైజాన్ని ఆంతర్యంలో కలుగ చేస్తుంది. ఈ సందర్భంగా ఎటువంటి భయం, సందేహానికి తావులేని శక్తిని మనిషికి అందిస్తుంది.

విశ్వాసపు వ్రేళ్ళు ఎప్పుడైతే హృదయంలో బలంగా నాటుకుంటాయో, దాని ప్రభావం భౌతికంగా ప్రస్ఫుటమౌతుంది. మనిషి హృదయం, సృష్టిలో ఏ సృష్టితానికీ భయపడని నిర్భయత్వాన్ని పొందుతుంది. అతని మాటల్లో ధైర్యస్థైర్యస్థుని హుందాతనం, చేతల్లో సంపూర్ణ నిబద్ధతలు తొణికిసలాడుతూ వుంటాయి. లక్ష్యసాధనంలో సాధించ వలసిన లక్ష్యపు స్పష్టమైన చిత్రాన్ని ఆవిష్కరించుకునే తత్వాన్ని, సత్యాసత్యాలను వేరుపర్చి చూడగలిగే నిశితదృష్టిని కలుగచేస్తుంది. విశ్వాసం తొణికిసలాడే హృదయంలో విశ్వసౌభ్రాతృత్వపు ప్రపంచం ఆవిష్కరించబడుతుంది. ఈ లక్ష్య ప్రయాణంలో అతని కాళ్ళు తొణకవు, బెణకవు. దృఢమైన అడుగులతో ముందుకు మునుముందుకు సాగుతూ ఎదురుపడే ప్రతి సవాలును, అవరోధాన్ని అలవోకగా అధిగమించే శక్తిని విశ్వాసం ప్రసాదిస్తుంది. అంతేకాదు, తనచుట్టూ ఆవరించి వున్న సమాజాన్ని ఈ క్రిందివిధంగా సవాలు విసురుతుంది:

> **"నా జాతి ప్రజలారా! మీ ఇష్ట ప్రకారం మీ పనులు మీరు చేస్తూ వుండండి. నా పనేదో నేను చేస్తూ వుంటాను. త్వరలోనే మీకూ తెలిసిపోతుంది, ఎవరిమీదకు అవమానకరమైన శిక్ష వచ్చిపడుతుందో, ఇంకా ఎవరికి ఎన్నడూ తొలగిపోని శిక్ష లభిస్తుందో." (ఖుర్ఆన్, 39 : 39-40)**

పై విధంగా సత్యతిరస్కార ప్రజలపై నిర్భీతితో కూడిన సవాలు విసరడం సత్య ఆచరణపట్ల మహత్తర నిర్భయత్వ నైజాన్ని విశ్వాసపు శక్తి మాత్రమే అందించగలుగుతుంది. ఈ విశ్వాసపు శక్తి తన చుట్టూ వున్న సమాజాన్ని ఆధారాల, సాక్ష్యాల, రుజువుల పునాదులపై సంబోధిస్తుంది. ఈ సంబోధనకు స్పందించిన హృదయాలకు సహకారం అందించడానికి నిరంతరం తన హస్తాన్ని ముందుకు సాచుతుంది.

సమాజంలో వేళ్ళూనుకొనివున్న చెడు నుండి తన్నుతాను ప్రత్యేకించుకుంటుంది.

దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "ప్రజలతో అన్ని విషయాలలో కలిసి సాగడం నుండి పత్యం పాటించండి. ప్రజలు చేసే మంచిలోనూ, వారు చేసే చెడులోనూ కలిసి సాగుతానని చెప్పకండి. మీరు ప్రజలు చేసే మంచిలో వారికి సంపూర్ణ సహకారం అందించండి. అదే ప్రజలు చెడుచేస్తూ వుంటే (వీలైతే వారిని చెడు నుండి నిరోధించండి లేదా) మీరు వారి వద్ద నుండి తొలగిపొండి." (తిర్మిజి)

అయితే ఎవరి విశ్వాసం బలహీనంగా వుంటుందో– అతని మానసిక శక్తి కూడా బలహీనంగానే వుంటుంది. మూఢనమ్మకాలకు, అజ్ఞానపు అలవాట్లకు ఇట్టే బలిఅయిపోతుంది. సమాజంలోని దుష్ప్రభావాలు ఈ వ్యక్తిని నిరంతరం ప్రభావ పరుస్తూ ఉంటాయి. వాటి ఫలితంగా ఈ వ్యక్తి అంతులేని కష్టనష్టాలను, నిరంతరం మోసుకుంటూ తిరుగుతూ ఉంటాడు. సమాజంలో నిరంతరం ఇస్లామేతర సాంప్ర దాయాల (బిద్దత్‌ల) ప్రాబల్యానికి విశ్వాస బలహీనతగల వ్యక్తులే కారకులు అవుతూ ఉంటారు. కొత్తకొత్త బిద్దత్‌లకు ప్రారంభకులు అవుతారు.

ఒక దృఢ విశ్వాసి ఈ మూఢనమ్మకాలను బిద్దత్‌లను త్రోసిరాజని ముందుకు సాగుతాడు. ధర్మం ద్వారా తనకు రుజువులు దొరకని ప్రతిదానిని ప్రక్కకు త్రోసి వేస్తాడు. ఈ మార్గంలో ఎదురయ్యే అనేక వ్యతిరేకతలను ధైర్యంగా ఎదుర్కొంటాడు. అల్లాహ్, ఆయన ప్రవక్త(స)ల ధర్మం విషయంలో నికార్సైన, నిష్ఠాత్మక వ్యక్తిగా జీవితం కొనసాగిస్తాడు. విమర్శలకు, కువిమర్శలకు వాదోపవాదాలకు, వాచాలత్వాలకు ఏమాత్రం ప్రాముఖ్యతనివ్వక తన జీవిత లక్ష్యం, ధ్యేయాల వైపుకు నింపాదిగా ప్రశాం తంగా దృఢంగా అడుగులు వేస్తూ ముందుకు సాగుతాడు.

కొన్ని సందర్భాలలో అసత్యానికి ఆధిక్యత లభిస్తుంది. దానికి బలవంతుల సహకారం కూడా లభిస్తుంది. అప్పుడు అసత్యం తన పూర్తి వికృత విశ్వరూపంతో అధికారం చెలాయిస్తూ ఉంటుంది. అయితే ఈ పరిస్థితి కేవలం తాత్కాలికమైనదేనని గుర్తించాలి. అసత్యానికి సహకారులుగా ఉన్న బలవంతులలోని ఒక వర్గం తప్పని సరిగా సత్యాన్ని గుర్తిస్తుంది. ఆ సమయంలో వారు తమ శక్తిని సత్య ప్రచారానికి వినియోగిస్తారు. ఈ క్రమంలో ఇస్లామీయ నైతికత గురించి, వ్యక్తిత్వ వికాశం గురించి తెలుసుకుంటారు. నిన్నటివరకు వ్యతిరేకించిన సత్యధర్మ ఇస్లాంకు వారు ప్రతినిధులుగా, సహాయకులుగా నిలుస్తారు.

ఇబ్నె అబ్బాస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (స) ఇలా తెలిపారు : "ఎవరైతే ప్రజలను సంతోషపెట్టడానికి అల్లాహ్ అయిష్టాన్ని కొనిపెట్టుకున్నారో – వారిని అల్లాహ్, ప్రజల అయిష్టానికి గురిచేస్తాడు. ఎవరైతే అల్లాహ్ అభీష్టం నెరవేర్పుకోసం ప్రజల అయిష్టాన్ని కోరుకున్నారో – వారిని అల్లాహ్ ప్రజలకు అత్యంత ప్రియతములైన వారిగా మార్చివేస్తాడు." (తిబ్రాని)

ఒక విశ్వాసి తన ధర్మంపై దృఢంగా నిలవాలి. అజ్ఞాన వ్యవస్థ ద్వారా ఎదురయ్యే అన్ని వ్యతిరేకతలను, విమర్శలను, లక్ష్యపెట్టకూడదు. అల్లాహ్ అభీష్ట సిద్ధి కోసం వ్యక్తిగతంగా తనకు ఒక పాలసీని ఏర్పాటు చేసుకుంటాడు. ఈ ఆచరణలో బలవంతులైన సత్యవిరోధులు, విశ్వాసిని అవహేళనకు, ఎగతాళికి గురిచేస్తారు ... అవమానపరుస్తారు. దృఢవిశ్వాసి ఈ అననుకూల పరిస్థితులను లెక్కచేయక తన విశ్వాసపు శక్తి ద్వారా స్థిరంగా, దృఢంగా సత్యధర్మంపై నిలబడతాడు. ఈ స్థితిని దివ్య గ్రంథం ఖురాన్ ఈ క్రింది పద బంధాలలో వివరించింది :

**"వారు నిన్ను చూసినప్పుడు నిన్ను పరిహసనీయ వస్తువుగా చేసుకుంటారు. ఇలా అంటారు, 'ఈ వ్యక్తినేనా దేవుడు ప్రవక్తగా చేసి పంపినదీ?" (25:41)**

ఒక విశ్వాసి (ముస్లిం) నిస్సందేహంగా తన వ్యక్తిత్వం పట్ల, తన విశ్వాసపు శక్తిపట్ల పూర్తి నమ్మకం కలిగివుండాలి. తన చుట్టూవున్న పరిస్థితుల ప్రభావానికి లోనుకాని ఒక కొండరాయిలా నిలబడాలి. పెద్ద పెద్ద ప్రవాహాలైనా తమ దారి మార్చుకొని వెళ్ళాలే తప్ప ఈ కొండను ఒక్క అంగుళమైనా కదల్చలేనివిధంగా ఉండాలి. ఎవరైతే తన విశ్వాసపు శక్తిని నిరంతరం అనుభవిస్తూ ఉంటాడో– అతడు నిస్సందేహంగా ఆ కొండరాయిని పోలివుంటాడు. సత్య విరోధులు అన్ని వైపుల నుండి, అన్ని విధాలుగా దాడిచేసినప్పటికీ, వారి ఆయుధాలు తుత్తునియలై పోవాలే తప్ప ఆ కొండరాయికి కించిత్ గాయం కూడా కలగదు గదా!

ఇబ్నె అబ్బాస్ (రజి) ఇలా ఉల్లేఖించారు : "నేను ఒకసారి ప్రవక్తశ్రీ (స) వారి సవారిపై ఆయన వెనుక కూర్చొని ప్రయాణిస్తూ ఉన్నాను. ఆ సమయంలో ప్రవక్త(స) "బాబూ! నీవు నిరంతరం అల్లాహ్‌ను స్మరిస్తూ ఉండు. అల్లాహ్ నిన్ను రక్షిస్తూ ఉంటాడు. ప్రతిచోటా అల్లాహ్ ఉనికిని నీవు అనుభూతి చెందుతావు. సంతోష సమయంలో అల్లాహ్ హక్కులను నెరవేర్చు, కష్టకాలంలో అల్లాహ్ నిన్ను గుర్తించుకుంటాడు. అర్థింపు ఏదైనా అల్లాహ్‌నే అర్థించు. సహాయం కొరకు అల్లాహ్‌నే

వేడుకో. దైవదాసులందరూ కలసి నీకు నష్టం కలుగచేయాలని భావించినా - అల్లాహ్ అతనికి లాభం కలుగచేయాలని తలిస్తే వీరెవ్వరూ ఆ లాభాన్ని ఆపలేరు. అదేవిధంగా అల్లాహ్ నష్టాన్ని కలుగచేయాలని తలిస్తే ఈ దాసులందరూ కలిసి దానిని నిరోధించనూలేరు. దైవస్తుతిలో కలములలోని సిరా అంతం అయిపోతుంది. భూతలం కాగితంగా పూర్తి అయిపోతుంది" అని అన్నారు.

వాస్తవం ఏమంటే; ఒక వ్యక్తిలో శక్తి ఉద్భవానికి 'తౌహీద్' (ఏకోశ్వరోపాసన) పునాదిగా వుంటుంది. ఈ శక్తిమంతమైన తౌహీద్ భూమి నుండియే దృఢమైన విశ్వాసపు వృక్షం మొలకెత్తుతుంది. ఒక ముస్లిం తన విశ్వాసపు శక్తిద్వారా ఆకాశాలతో సంబంధం కలిగివుంటాడు. తన విశ్వాసపు పరిధిలో ఒక ముస్లిం, ఒక మొత్తం సంఘంగా జీవించడానికి అవసరమైన శక్తిని కలిగివుంటాడు. ఇటువంటి ముస్లిం నోటి నుండి ఈ క్రింది దృఢ వచనాలు వెలువడతాయి :

**"భూమ్యాకాశాల సృష్టికర్త, ఉపాధిప్రదాతేకాని, ఉపాధి గ్రహీత కానివాడు అయిన అల్లాహ్‌ను కాదని, నేను మరెవరినైనా నా సంరక్షకునిగా చేసుకో వాలా? ఇలా చెప్పు అందరికంటే ముందు నేను ఆయనకు విధేయుణ్ణి కావాలని నన్ను ఆదేశించడం జరిగింది. (ఇంకా ఇలా తాకీదు ఇవ్వబడింది. ఎవరైనా షిర్క్ చేసినా చేయని) నీవు మాత్రం బహుదైవారాధకుల (ముష్రిక్కుల)లో కలిసిపోవద్దు." (ఖుర్ఆన్, 6:14)**

## అల్లాహ్‌పై భారం - దృఢ సంకల్పం శక్తికి పునాదులు

ఒక ఉద్యమం విజయవంతమవడానికి శక్తి అవసరమౌతుంది. శక్తి, బలం, వగైరాలకు ఇస్లాం ఎంతో ప్రాధాన్యత ఇస్తుంది. ఈ శక్తి శారీరకమైనది అయినా, మానసికమైనది అయినా ఉద్యమానికి ఈ రెండింటి అవసరం ఎంతో వుంటుంది. తన చుట్టూవున్న వనరులను వినియోగించుకొని లక్ష్యాన్ని చేరుకోవడానికి శక్తి వినియోగం తప్పనిసరి. లక్ష్యసాధనలో ఏ కొరతలు లేని ఆచరణ, నిరంతర కృషి చేయడానికి కూడా శక్తి అవసరమే. తన భవిష్యత్తును కేవలం విధి రాతపై వదలి వేయకుండా తన కృషిని కొనసాగించడానికి శక్తి ప్రధాన వనరుగా ఉంటుంది. తను నిరాశా, నిస్పృహలను, నిర్లక్ష్యాలను, సోమరితనాన్ని 'దైవచిత్తం', 'విధిరాత'ల మాటున దాచుకునే ప్రయత్నిస్తే ఇస్లాం ఆమోదించదు.

ఔఫ్ బిన్ మాలిక్ (రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (స) ఇలా తెలిపారు : 'అల్లాహ్ నిరాశానిస్పృహలను అసహ్యించుకుంటాడు. మీరు పూర్తి చైతన్యవంతమైన ఆచరణ చేయండి. ఈ ఆచరణలో ఇబ్బందులు గురైతే అప్పుడు 'హస్బియల్లాహు వ నేమల్‌వకీల్' అని పలకండి అని చెప్పారు.' (అబూదావూద్)

అనగా ప్రతి మనిషి తన జీవితంలో ఎదురయ్యే కష్టాలను, బాధలను అడ్డంకులను ధైర్యంగా ఎదుర్కోవాలి. వాటిని తొలగించుకునే ప్రయత్నమూ పూర్తి శక్తినుపయోగించి చేయాలి. అలా చేయని పక్షంలో కష్టాలు, బాధలు, అడ్డంకులు మనిషిని లోబర్చుకుంటాయి. ఈ క్రమంలో మనిషి పరిస్థితుల అననుకూలతలను అనుకూలతలుగా మార్చుకునే క్రమంలో అతను దైవ సహాయం తప్పనిసరిగా అర్థించవలసి వుంటుంది. ఈ స్థితిలో దైవ సహాయసహకారం తప్ప మరే ఆధారమూ సహకారమూ వుండదు. తన శక్తి, ఆచరణలపై సంపూర్ణ నమ్మకం, సృష్టికర్త యొక్క శక్తి సహాయ సహకారాలపై పూర్తి విశ్వాసం, ఈ రెండు మాత్రమే మనిషిని నిరంతర కార్యశీలిగా మలుస్తాయి. పై రెండు విశ్వాస నమ్మకాల ద్వారానే మనిషి శక్తిమంతుడు అవుతాడు.

కొన్ని సమయాలల్లో మనిషి చేసే పని పట్ల స్పష్టమైన దృక్పథం లోపిస్తుంది. అనేక అంశాలు కలగాపులగంగా మనిషి మస్తిష్కంలో చోటు చేసుకుంటాయి. ఏది సరైనది? ఏది కాదు? అనే మీమాంశకు మనిషి లోనౌతాడు. ఈ గందరగోళం వల్ల సరైన నిర్ణయాలు తీసుకోలేకపోతాడు. కొన్ని సందర్భాలలో గందరగోళానికి దూరంగా పారిపోయి నిష్క్రియాపరుడైపోతాడు. ఈ విధమైన నిష్క్రియను ఇస్లాం హర్షించదు. అదే సమయంలో చేసిన ఆచరణల్లో ఇబ్బందులు ఎదురైనా, నష్టాలు వాటిల్లినా, 'ఈ పని ఇలా చేసివుంటే లాభమయ్యేది. అలా చేయకుండా ఉంటే ఫలితం ఇలా ఉండేది' అని విమర్శించుకుంటాడు. ఈ మానసిక స్థితి, అలవాటు మనిషిని 'నిత్య సంకోచి'గా మార్చివేస్తుంది.

దైవప్రవక్త (స) ఇలా నుడివారు: శక్తిశాలి అయిన విశ్వాసి, బలహీన విశ్వాసి కంటే అల్లాహ్‌కు ఎక్కువ ప్రీతిపాత్రుడు. ప్రతి ఒక్కరిలోనూ క్షేమకరమైన అంశాలు ఉంటాయి. మీరు సంక్షేమకర విషయాలను కోరుకోండి. వాటి సాధనలో అల్లాహ్ సహాయం అర్థించండి. ఈ కృషిలో ఎదురుదెబ్బలు తగిలితే 'నేను ఇలా చేసివుంటే ఇలాంటి ఫలితం దక్కేది కదా' అని అనకండి "అన్ని విషయాలలో అల్లాహ్ ఆజ్ఞయే

అమలు అవుతుంది" అనండి. 'అలా అయితే ఇలా అయితే' అనే మాటల వలయం షైతాన్ రాకడకు దారులు సుగమం చేస్తాయి." (ముస్లిం)

షైతాన్ మనిషిని గతంలో అతను అనుభవించిన కష్టనష్టాల జాబితే చూపి ఆచరణ నుండి తొలగించే ప్రయత్నం చేస్తాడు. భూతకాలాన్ని భూతంలా ప్రదర్శిస్తాడు. గతాన్ని తలచుకొని కన్నీరు కారుస్తూ కూలిపోవడం ఒక విశ్వాసికి నొప్పని లక్షణం. భవిష్యత్తును ఆశావహంగా ఊహించడం, దాని సాధన కోసం వర్తమానంలో కృషి చేయడం మనిషికి ఎంతో అవసరం. నిత్య సందేహిగా ఉండటం, గత కాలాన్ని తలుస్తూ వగుస్తూ భయభీతు కావడం- పనులను బేరీజు వేసుకుంటూ లాభనష్టాలను గణిస్తూ కూర్చోవడం సత్యతిరస్కారుల లక్షణంగా చెప్పబడింది.

**"విశ్వాసులారా! అవిశ్వాసుల మాదిరిగా ప్రవర్తించకండి. బంధుమిత్రులు ఎప్పుడైనా ప్రయాణంలో ఉంటే లేదా యుద్ధంలో ఉంటే (అక్కడ వారు ఏదైనా ప్రమాదానికి గురైతే) వారు ఇలా అంటారు : 'వారు మాతో పాటు వుండి వున్నట్లయితే చనిపోయే వారూ కాదు, చంపబడేవారూ కాదు.' ఈ విధమైన వారి మాటలను అల్లాహ్ వారి హృదయ శోకానికి, ఆవేదనకూ కారణాలుగా చేస్తాడు. వాస్తవానికి చంపేవాడు, బ్రతికించేవాడూ అల్లాహ్ మాత్రమే. మీరు చేసే అన్ని పనులనూ ఆయన కనిపెట్టే వున్నాడు." (ఖుర్ఆన్, 3:156)**

ఒక ప్రవచనంలో ప్రవక్త (స) వారు ఇలా సెలవిచ్చారు : "ఎవరైతే అందరికంటె శక్తిమంతుడు కావాలని కోరుకుంటాడో, వారు దైవంపై అత్యధికంగా ఆధారపడాలి."

అల్లాహ్‌పై ఆధారపడే తత్వం మనిషిని అత్యంత శక్తిశాలిగా మలుస్తుంది. ఈ విశ్వాస శక్తి మనిషిని ఏ సహాయమూ అందని – ఏ దారీ కానరాని కష్టాల కడలిలో సైతం మార్గదర్శకత్వాన్ని చేయూతను అందిస్తుంది. మార్గాలను సుగమం చేస్తుంది. మనిషి ఊహించని మార్గాల ద్వారా అతనికి సహకారం సమకూరుస్తుంది. శత్రుదాడికి ఎదురుగా ఒక కొండలా నిలిచే దృఢత్వాన్ని ప్రసాదిస్తుంది. యుద్ధ సొమ్ము లేకున్నా, సహచరుల సంఖ్య తక్కువగా ఉన్నా, విశ్వాసపు శక్తి , ఒక మహోన్నత శక్తి యొక్క సహాయసహకారాలు తనకు లభిస్తూ ఉందనే అనుభూతిని మనిషి పొందుతూ ఉంటాడు. ఈ అనుభూతి ద్వారా తన పాదాలను దృఢంగా, మనసును నిష్ఠగా వుంచుకొని

ఏకోన్ముఖుడైపోతాడు. చివరికి అననుకూల పరిస్థితుల్లో సైతం ఈ విశ్వాస వీరుడు విజయవార్తలను వీనులకు విందుగా వినగల్గుతాడు. యుద్ధంలో దైవసహకారంపై సంపూర్ణ విశ్వాసం కలిగి ఉండటం ఒక ధర్మ యుద్ధ విశ్వాస వీరునికి ఆత్మీయ ఆహారంగా పని చేస్తుంది. ఈ ఆహారం ద్వారా ఇతను నూతన ఉత్తేజాన్ని నిరంతరం పొందుతూ వుంటాడు. ఈ దివ్యమైన చిత్రాన్ని దైవగ్రంథం ఈ క్రింది పద బంధాలలో చిత్రీకరించింది :

**"విశ్వాసులు అల్లాహ్‌నే నమ్ముకోవాలి. మన జీవన మార్గాలలో అల్లాహ్ మనకు మార్గదర్శకత్వం వహించినప్పుడు మనం అల్లాహ్‌ను ఎందుకు నమ్ముకోకూడదు? మీరు మమ్మల్ని పెడుతున్న బాధలను ఓర్పుతో సహిస్తాము. నమ్ముకునేవారు అల్లాహ్‌ను మాత్రమే నమ్ముకోవాలి." *(ఖుర్ఆన్, 14:12)***

విశ్వాసులు, వారి విశ్వాస సహచరులు నిరంతరం భవిష్యత్తుపై దృష్టి నిలిపి ఉంటారు. భవిష్యత్తును ఆశాజనకంగా ఊహిస్తారు. ప్రస్తుత బలహీనతలన్నీ తొలగిపోతాయనీ, అవసరమైన శక్తియుక్తులు సమకూర్చుకోబడతాయనీ భావిస్తారు. ఆ దృఢ విశ్వాసంతో శత్రుపక్షాన్ని ఎదుర్కోవడానికి నిరంతరం సిద్ధంగా ఉంటారు. ఈ వీరత్వం దృఢత్వాలే సత్య విరోధులకు అహంకారంగా, పిచ్చితనంగా కనపడు తుంది.

**"అప్పుడు కపటులూ, హృదయాలకు రోగం తగిలినవారూ అందరూ ఇలా అన్నారు : 'వారిని వారి ధర్మం పిచ్చివారుగా చేసింది.' వాస్తవానికి ఎవరైనా అల్లాహ్‌ను నమ్ముకుంటే, నిశ్చయంగా అల్లాహ్ మహా శక్తిమంతుడూ, మహా వివేకవంతుడూను." *(ఖుర్ఆన్, 8:49)***

అల్లాహ్‌పై ఆధారపడటం (తవక్కల్) మన పోరాటానికి అంతులేని ఫలితాలను ప్రసాదిస్తుంది. మన కృషి నుండి 'తవక్కల్' ఎప్పుడు తగ్గిపోతుందో లేక బలహీనపడు తుందో అప్పుడు ఇస్లామీయ ముఖచిత్రం మసిబారడం ప్రారంభిస్తుంది. సత్య తిరస్కారులకు ఇస్లాం తేలికగా జీర్ణమయ్యే ఆహారంగా మారిపోతుంది.

ఒక విశ్వాసి శక్తిమంతునిగా మారడానికి, అతడు అన్నిరకాల కపటత్వాల నుండి, అనైతిక ఆచరణల నుండి పరిరక్షింపబడాలి. పవిత్రత, పరిశుభ్రతలను కోరు కునేవాడై ఉండాలి. ఎవరి మనస్సు పై లక్షణాల నుండి ఖాళీ అయివుంటుందో – ఆ వ్యక్తి శక్తిమంతుడు కాలేడు. పులితోలు కప్పుకున్నంత మాత్రాన నక్క పులిగా మారదుకదా!

అహంభావానికి లోనైన హూద్ ప్రవక్త జాతిని ఉద్దేశించి అల్లాహ్ శక్తి వాస్తవికతను ఈ క్రిందివిధంగా తెలియపర్చాడు :

**“మీ ప్రభువును క్షమాభిక్ష కోరండి. ఆయన వైపునకు పశ్చాత్తాపంతో మరలండి. ఆయన మీకై ఆకాశపు ద్వారాలను తెరుస్తాడు. ఇప్పుడు మీకున్న శక్తిని మరింత శక్తి ఇచ్చి పెంచుతాడు. దోషులై (ఆరాధనకు) విముఖులు కాకండి.” (11:52)**

మనిషి వారు ఒక విశ్వాసి వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా తీర్చిదిద్దడానికి, దానిని ఉన్నత శిఖరాలకు చేర్చడానికి అవసరమైన వివేకవంతమైన బోధనలు, ఆదర్శనీయ ఆచరణలు అందించారు. మనసుకు హత్తుకునే ఉదాహరణలను అందించారు. మనిషి ఔన్నత్యాన్ని, అల్లాహ్ వద్ద మనిషి స్థానాన్నే తెలియపర్చే ఈ క్రింది ప్రవచనం గమనీయమైనది :

“అల్లాహ్ భూమిని సంతులపర్చడానికి దృఢమైన పర్వతాలను సృష్టించాడు. పర్వతాల దృఢత్వపు శక్తిని గమనించిన దైవదూతలు అల్లాహ్‌తో ‘ఓ అల్లాహ్! ఈ పర్వతాల కంటె దృఢమైన శక్తిమంతమైన మరేదానినైనా నీవు సృష్టించావా?’ అని ప్రశ్నించారు. అందుకు అల్లాహ్ ‘ఇనుమును నేను సృష్టించివున్నాను’ అన్నాడు. ఆపై, ఇనుము కంటె దృఢమైనది నీ సృష్టిలో ఉన్నదా?’ అనే దైవదూతల ప్రశ్నకు “అగ్ని” అని సమాధానం ఇవ్వబడింది. తదుపరి దైవదూతల ప్రశ్నకు “నీరు” అనీ, ఆపై ప్రశ్నకు “గాలి” అనీ జవాబు ఇవ్వబడింది. చివరగా ‘గాలి కంటె శక్తిమంతమైన సృష్టితం ఏదైనా ఉన్నదా?’ అని దైవదూతలు ప్రశ్నించినప్పుడు దానికి జవాబుగా అల్లాహ్ “ఆదం పుత్రుడు – మహాశక్తిమంతుడు. అయితే ఒక్క షరతు ఈ ఆదం పుత్రుడు తన కుడిచేతితో చేసిన దానాన్ని ఎడమ చేతికి కూడా తెలియనివ్వనివాడై ఉండాలి” అని జవాబు ఇవ్వబడింది. (తిర్మిజి)

మనిషి ఈ సృష్టి మొత్తంలో సర్వోన్నత, అద్భుత సృష్టితం. ఈ మనిషి వ్యక్తి త్వంలో ఎప్పుడైతే అల్లాహ్ కోరుకునే నైజం చోటు చేసుకుంటుందో అతడు ఈ సృష్టికి సంక్షేమకరుడైపోతాడు. ఈ సృష్టి మొత్తం అతనికి దాసోహమైపోతుంది. కఠినాతి కఠినమైన ప్రతిదానినీ తన అధీనంలోనికి తెచ్చుకోగల్గుతాడు. తద్వారా లబ్ధిపొందు తాడు. అయితే ఇదే మనిషి వ్యక్తిత్వంలో దిగజారుడుతనం చోటు చేసుకుంటే, అతడు ఈ సృష్టి మొత్తానికి నష్టదాయకుడైపోతాడు. సర్వసృష్టితాల అభిశాపానికి గురౌతాడు.

తుదకు సృష్టి మొత్తంలో అత్యంత హీనమైన పిపీలకం అయిపోతాడు. పై ప్రవక్త ప్రవచనంలో సృష్టిని, సమాజానికీ సంక్షేమకరుడైన ఒక వ్యక్తి యొక్క స్వభావం తెలుపబడింది. ఈ స్వభావపు ఉన్నత వ్యక్తిత్వం గలవారు మాత్రమే ఉత్తమ స్థానాలను, ధార్మిక అంతస్తులను అందుకుంటారు.

శక్తిమంతుడైన ఒక ముస్లిం సత్య విషయాన్ని స్పష్టమైన మాటల్లో జంకుగొంకు లేకుండా ప్రకటిస్తాడు. విశాల హృదయంతో, ఉత్తమ విలువలతో, సూత్రబద్ధతతో తనతోటి వారిని కలుస్తాడు. సత్య ప్రకటన విషయంలో ఎటువంటి కష్టాన్నైనా ఎదుర్కొంటాడు. తన వ్యక్తిత్వం, గౌరవప్రద ఆచరణ ద్వారా తన స్నేహితులను ప్రభావపరుస్తాడు. తాను ఏ విషయానికి ప్రతినిధియో ఆ విషయాన్ని ప్రకటించడానికి తన శక్తి మొత్తాన్ని వినియోగిస్తాడు. తాను ఏ ధ్యేయం కోసం జీవిస్తున్నాడో, ఆ ధ్యేయ సాధనలో, లక్ష్యమార్గంలో మడమ తిప్పని ధీరునిలా సాగుతాడు.

ప్రవక్త(స)వారి కుమారుడు ఇబ్రాహీం (రజి) మరణించిన రోజు యాదృచ్ఛికంగా సూర్యగ్రహణం సంభవించింది. ప్రజలు ఇబ్రాహీం (రజి) మరణం వల్ల ఇలా సంభవించిందని చెప్పుకోసాగారు. ఈ మూఢ విషయం ప్రవక్త(స) చెవులపడింది. ఈ మూఢ నమ్మకాన్ని శాశ్వతంగా తుదముట్టించడానికి ప్రవక్త(స) తాను దుఃఖసాగరంలో ఉన్నప్పటికీ నడుం కట్టారు. ఆ సమయంలో ఈ విధంగా ఉపన్యసించారు : "సూర్యచంద్ర గ్రహణాలు ఎవరి చావు లేక పుట్టుకలకు సంబంధించి సంభవించవు. ఈ గ్రహణాలు, తన దాసుల కొరకు అల్లాహ్ యొక్క స్పష్టమైన గుర్తులుగా ఉన్నాయి. మీరు ఈ గ్రహణాలు సంభవించినపుడు నమాజ్‌ను ఆచరించడానికి పరుగిడండి." (బుఖారి)

సత్యపూరిత వాతావరణంలో శ్వాస తీసుకుంటున్న వ్యక్తి, అసత్యాన్ని ఎంత మాత్రమూ సహించలేడు. అసత్య విషయాల నుండి దూరంగా వైదొలగిపోతాడు. తన జీవిత పరుగుపందెంలో నిరంతరం ఉత్తమ విలువల ఖజానా వైపుకు అడుగులు వేస్తాడు. అసత్యం, దౌర్జన్యం, మోసం లాంటి నీచత్వాలను వదిలి తన వ్యక్తిత్వాన్ని ఉన్నతమానవీయ పునాదులపై నిర్మిస్తాడు. ఈ వ్యక్తిత్వపు విశ్వాసి మాత్రమే మంచిని ఆజ్ఞాపించే, చెడును నిరోధించే విధి నిర్వహణకు సంపూర్ణ మనస్సుతో పూనుకుంటాడు. మంచిని ఆజ్ఞాపించే, చెడును నిరోధించే ఆచరణల వివిధ రూపాలను, వివిధ రంగాలను, నా ఇతర గ్రంథాలలో వివరంగా తెలపివున్నాను. పాఠకులు ఆయా గ్రంథాలను అధ్యయనం చేయవలసిందిగా మనవి.

ఈ గ్రంథంలో ఇస్లామీయ వ్యక్తిత్వం గల వ్యక్తి యొక్క స్వభావాన్ని వివరించడం మాత్రమే చేశాను. ఇస్లామీయ వ్యక్తిత్వాన్ని ఆపాదించుకున్న వ్యక్తి ఈ ప్రపంచం విసిరే ఎంతటి పెద్ద సవాలునైనా స్వీకరిస్తాడు. కనపడిన చెడును నిరోధించడానికి విరుచుకుపడతాడు. ఈ విధి నుండి ఆ వ్యక్తిని ఎవరి భయమూ నిరోధించజాలదు. రక్త సంబంధాలు, బంధుత్వాలు ఏవీ ఈ మార్గంలో అతనికి అవరోధాలను సృష్టించజాలవు.

కపటులు, ద్రోహుల ముందు మనిషి తల వంచి నిలబడటాన్ని ఇస్లాం నిరసిస్తుంది. వారిని గౌరవ పదబంధాలతో స్తుతించడాన్ని అసహ్యించుకుంటుంది. ప్రవక్త (స) ఈ విషయంగా "ఎవరైతే ఒక కపటిని, ఓ నాయకా! అని సంబోధించడం ద్వారా తన నిజ ప్రభువుకు కోపోద్రిక్తునిగా చేస్తున్నాడు" అని హెచ్చరించారు. ఈ విషయంగా దివ్య ఖుర్ఆన్ హెచ్చరిక ఇలా ఉంది :

**"అల్లాహ్ ఎవరినైతే అవమానంపాలు చేస్తాడో, ఇక అతనికి గౌరవం ఇచ్చేవాడెవ్వడూ ఉండడు. అల్లాహ్ తాను కోరిన దానిని చేస్తాడు." (22:18)**

అసూయ, ఈర్ష్య, పరోక్షనింద (చాడీతనం) లాంటి లక్షణాలు గల వ్యక్తి పిరికి వాడై ఉంటాడు. ఇస్లాం ఈ చెడు లక్షణాన్ని నిషేధించింది. మనిషిని శక్తిమంతునిగా, నిర్భయునిగా మలచడానికి ఇస్లాం నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంటుంది. ఎదుటి మనిషిలోని బలహీనతల పునాదులపై తాను సంతృప్తి చెందే వ్యక్తి కడు నీచుడై వుంటాడు. నీచుడు ఎప్పటికీ సాహసి కాలేడు.

సాహసి అయిన వ్యక్తి ఎదుటి మనిషిలోని లోపాన్ని వివేకవంతంగా అతని ముందే స్పష్టపరుస్తాడు. ఆ లోపాల ద్వారా ఆ వ్యక్తిని లొంగదీసుకోవాలని ప్రయత్నించడు. అసత్యాన్ని అసత్యంగానూ, సత్యాన్ని సత్యంగానూ నిర్భయంగా ప్రకటిస్తాడు. అసత్యాన్ని జంకుగొంకు లేకుండా విమర్శిస్తాడు.

అయితే ఒక శక్తిమంతుడు, సాహసి అయిన ముస్లిం నిరంతరం ఇతరులను విమర్శిస్తూనే ఉంటాడని అర్థం కాదు. ఒక వ్యక్తిలో లోపం, కపటత్వం అతని వరకే పరిమితమై ఉంటే, దానిద్వారా సమాజానికి ఎటువంటి హానీ జరగని పక్షంలో ఆ వ్యక్తి పట్ల సహనం పాటిస్తాడు. అలాకాక, ఈ లక్షణం ద్వారా ఒక వ్యక్తి సమాజాన్ని భ్రష్టుపట్టిస్తూ ఉంటే, చెడు ప్రబలడానికి కారకుడవుతూ ఉంటే, చూస్తూ ఊరుకోడు.

ఆ కపటి, దుష్టుడు, ద్రోహి వాస్తవికతను సమాజం ముందు బహిర్గతపర్చడం ఒక సాహసి అయిన విశ్వాసికి తప్పనిసరి అవుతుంది.

తన నేరాల ద్వారా, అసత్య చర్యల ద్వారా, ఒక ద్రోహి అల్లాహ్ హక్కులకు బహిరంగంగా విఘాతం కల్గిస్తూ ఉంటే, ప్రజల హక్కులను కాలరాచి వికటాట్టహాసం చేస్తూవుంటే, ఒక సాహసి అయిన విశ్వాసి సత్యవచన పరిరక్షణకై నిర్భయుడైన దైవ సైనికులా నిలుస్తాడు. సత్యవచనాన్ని సమున్నతపర్చడానికి చేయవలసిన కృషి అంతా చేస్తాడు. ఈ క్రమంలో అసత్యం వాడే అసభ్య పదజాలాలన్నింటిని, సభ్యత-సంస్కారం లాంటి తన ఉత్తమ నైతిక వర్తనతో ఎదుర్కొంటాడు. తద్వారా సత్యవ్యతిరేకికి సభ్యతా సంస్కారాలను నేర్పించే ప్రయత్నం చేస్తాడు. అదేసమయంలో నిశ్శబ్ద ప్రేక్షకుల హృదయాలను తనకు మద్దతుగా మలచుకునే, గెల్చుకునే ప్రయత్నం చేస్తాడు.

ఈ విషయంగా దైవప్రవక్త (స) వారి శిక్షణ ఈ క్రింది పదాలలో తెలియపర్చ బడింది : "ఎవరైతే ఒక విశ్వాసి యొక్క గౌరవాన్ని భంగపరచడం ద్వారా ఆహారాన్ని సంపాదించుకుంటాడో - అల్లాహ్, తీర్పుదినాన ఆ వ్యక్తి కడుపును అగ్నితో నింపి వేస్తాడు. ఎవరైతే ఒక విశ్వాసి యొక్క మానమర్యాదలకు భంగం కల్గించడం ద్వారా మంచి దుస్తులు సంపాదించుకుంటే, తీర్పుదినాన అల్లాహ్ అతనికి అగ్ని దుస్తులను తొడిగింపజేస్తాడు. ఎవరైతే ఒక విశ్వాసి యొక్క ఉత్తమత్వాన్ని కించపర్చడం ద్వారా హెూదాను పొందితే తీర్పుదినాన అల్లాహ్ అతనికి అగ్ని యొక్క పూర్తి రుచి చూపి స్తాడు." (అబూదావూద్)

చివరగా, అసూయ, ఈర్ష్య, కపటత్వం లాంటి దుర్గుణాలు కేవలం ఒక భీరువు మాత్రమే కలిగివుంటాడు. శక్తిమంతుడైన ఒక విశ్వాస వీరుని పై చెడులన్నింటి నుండి దూరంగా ఉంటాడు.

## ఇతరుల భిక్షపై జీవించడాన్ని - బానిస మనస్తత్వాన్ని ఇస్లాం అంగీకరించదు

ఇస్లాం, ఇతరులపై ఆధారపడి జీవించే పరాన్నభుక్కుతనాన్ని ఆమోదించదు. అదేవిధంగా యితరుల దయాభిక్షపై ఆధారపడి జీవించడాన్ని అంగీకరించదు. సింహం తినగా మిగిలివున్న ఎంగిలి మాంసంకై ఆశపడే నక్కగా వీరిని పరిగణిస్తుంది.

ఒక ముస్లిం పై విధమైన జీవితాన్ని ఎన్నటికీ కోరడు. ఇతరుల పునాదులపై

తన ఉనికిని చాటుకునే ప్రయత్నం చేయడు. ఈ అవమానకర స్థితి నుండి ఒక విశ్వాసి వీలైనంత త్వరగా బయటపడే కృషి చేస్తాడు. గౌరవనీయ ఉపాధి, గుర్తింపుల కొరకు దేశంలోని ప్రతి మూలనూ వెతుకుతాడు. దైవప్రవక్త (స) స్వర్గవాసులను, నరకపు మిత్రులను వారి వివరాలను సవివరంగా తెలియపర్చారు. అందులో మొదటి వర్గం వారిలోని శక్తి, సాహసం, గౌరవం నైతికతల ఫలాలను లెక్కించారు. అదేవిధంగా రెండవ వర్గంలోని నీచత్వం, అగౌరవం, బలహీన మానసిక స్థితి, అసహాయత, అనైతికతలనూ ప్రస్తావించారు.

"స్వర్గవాసులు మూడు తరహాలుగా ఉంటారు. అందులో మొదటి తరహావారు, శక్తిమంతుడైన సాహసులుగా ఉంటారు. వారు సమన్యాయంతో వ్యవహారాలు నడుపుతారు. దానధర్మాలు, పుణ్యకార్యాలను సర్వసాధారణంగా చేసేవారు. మృదుత్వం, క్రమత్వాలను తమ జీవన విధానంగా స్వీకరించినవారు.

ఇక రెండవ తరహావారు తన బంధువుల, ఇతర ప్రతి విశ్వాసిపట్ల కారుణ్య హృదయం కలిగి, సహాయ సహకారపు వైఖరి కలిగి ఉంటాడు. ఇక మూడవ తరహా వారు గంపెడు సంసారం కలిగివున్నప్పటికీ తననూ, తన కుటుంబాన్ని దైవ నిషేధాల నుండి కాపాడుకుంటాడు. తన పేదరికాన్ని బహిరంగపర్చుకోడు. అయితే (మీరు) తమ వద్దనున్న అమానతులను మింగే ఉద్దేశ్యం కలిగి వుండకండి. పగలు రాత్రుళ్ళు సంపద విషయంగా ద్రోహబుద్ధి కలిగి ఉండకండి. పిసినారితనం, అబద్ధం, అశ్లీల – అనైతికతలను విడనాడండి. అల్లాహ్ నాకు 'వహీ' ద్వారా తెలియపరచినది ఏమంటే; మీరు ఒకరిపట్ల మరొకరు గర్వపడకండి. ఒకరిపై మరొకరు దౌర్జన్యం చేయకండి." (ముస్లిం)

ఒక విశ్వాసిని ఇబ్బందులకు గురిచేసే మలుపులు జీవితంలో అనేకసార్లు ఎదురుపడతాయి. కొన్ని సందర్భాల్లో విశ్వాసి తనకు తానుగా తనను దుర్బలునిగా భావిస్తాడు. దుఃఖాల సంకెళ్ళలో బంధించబడిన నిస్సహాయునిగా చతికిలపడిపోతాడు. దారితెన్ను కానక అడ్డదారులు తొక్కడానికి కూడా సిద్ధపడతాడు. అయితే ఒక దృఢ విశ్వాసి అయిన ముస్లిం, అననుకూల పరిస్థితులన్నింటినీ ధైర్యంగా ఎదుర్కొంటాడు. బాధలకు, కష్టాలకు, పరీక్షలకు వెన్నుచూపక, వాటిని ఎదుర్కోవడానికి సిద్ధపడతాడు. తన మార్గానికి ఎదురువచ్చే అడ్డంకులన్నింటినీ అధిగమిస్తాడు. సకల అవరోధాలన్నింటిని తుత్తునియలు చేస్తాడు.

చివరి దైవప్రవక్త ముహమ్మద్ (స) పైన పేర్కొన్న కష్టాలన్నింటి నుండి, ఇబ్బందుల నుండి విముక్తి కొరకు విశ్వప్రభువు అల్లాహ్‌ను వేడుకునేవారు. అల్లాహ్ రక్షణకు అర్థించేవారు :

"ఓ అల్లాహ్! ప్రతి కష్టం నుండి, దుఃఖం నుండి నీ శరణు అర్థిస్తున్నాను. ఇతరుల ముందు దీనంగా నిలిచే స్థితి నుండి, పిరికితనం నుండి శరణు కోరుతున్నాను. పిసినారితనం, అధైర్యాల నుండి శరణు కోరుతున్నాను. ఇతరుల ఆధిపత్యం నుండి, దౌర్జన్యపరుని దౌర్జన్యం నుండి శరణు అర్థిస్తున్నాను." (అబూదావూద్)

సహనం, విజయం పట్ల సంపూర్ణ నమ్మకం అనేవి వర్తమాన భవిష్యత్ కాలాలకు ఆయుధాలుగా ఉపయోగపడతాయి. కాలం విసిరే సవాళ్ళను ఎదుర్కొనడానికి ఈ ఆయుధాలు ఎంతో అవసరమవుతాయి. జీవితపు అన్ని రంగాలలో, అన్ని పార్శ్వాలలో తలవంచని వీరునిగా, చెడును ధైర్యంగా ఎదరించే దృఢశాలిగా నిలబెడతాయి. ఒక విశ్వాసి ఉపద్రవాల నుండి, కల్లోలాల నుండి, పరీక్షల నుండి కొనసాగి తన్నుతాను ఉన్నత శిఖరాలకు చేరవేసుకునే ధైర్యాన్ని పెంపొందించుకుంటాడు. సృష్టిలోని ఏ అస్తిత్వం ముందూ తలవంచని విశ్వాసవీరునిగా రూపుదిద్దుకుంటాడు. కేవలం .... కేవలం సృష్టికర్త (అల్లాహ్) ముందు మాత్రమే తలవంచుకొని గజ గజ వణుకుతాడు.



# 14వ భాగం

# క్షమ - మృదు స్వభావం

- మృదు స్వభావం - విశాల హృదయం
- క్షమ - మన్నింపుల వైఖరి
- శాపాలు - ద్వేషాలు నీచత్వానికి నిదర్శనం
- తిట్లు నిషేధం
- కఠినత్వానికి మృదుత్వంతో సమాధానం
- ఉత్తమ నైతిక ప్రమాణం (ఆచరణ)

# మృదు స్వభావం - విశాల హృదయం

జీవితంలో ఒక్కోసారి మనిషి దుఃఖంలో మునిగిపోయే సందర్భాలూ, సాను భూతి అవసరమయ్యే సందర్భాలూ అనేకం ఎదురవుతాయి. అవి మనిషి హృదయాన్ని పిండి పిండి చేసివేస్తాయి కూడాను. ఇటువంటి సందర్భాలలో మనిషి ఉద్వేగానికి లోనవుతాడు. ఈ పరిస్థితుల్లో అమాయక, అజ్ఞాన ఆవేశపూరిత చర్యలు చేపడతాడు. ఫలితంగా నలుగురిలో తన బలహీనతను తనకు తానుగా చాటుకుంటాడు. అయితే సంయమనం, సహనం, మృదుస్వభావం, విశాల హృదయం, లోతైన సైద్ధాంతిక అవగాహన కలిగిన వ్యక్తి ఇటువంటి పరిస్థితులలో కూడా తన గౌరవాన్ని హుందాతనాన్ని కోల్పోకుండా ఉండగలడు.

మనిషి శాంతంగా లేక కోపంగా ఉండటం, నింపాది లేక తొందరపాటుగా ఉండటం, పవిత్రత లేక అపవిత్రునిగా ఉండటం అనేది ఆ వ్యక్తి యొక్క సహజ నైజం, ఆరోగ్యవంతమైన శరీరంపై ఆధారపడి ఉంటుంది. ఈ సహజ స్వభావం మనిషి యొక్క సహనం - నింపాదులపై, క్షమ మన్నింపు వైఖరులపై బలమైన ప్రభావం చూపుతుంది. ఒక మనిషి తనలో ఎంతటి నైతికత, మృదుస్వభావం కలిగివుంటాడో - అతని హృదయం అదే స్థాయిలో విశాలత్వం కలిగి వుంటుంది. ఎదుటివారిలో ఉన్న లోపాలతో పాటు వాటి సంస్కరణామార్గాలను కూడా వివేకవంతంగా చూపుతాడు. క్షమాపణలు కోరిన వారిని విశాల హృదయంతో క్షమిస్తాడు. తనకు నష్టం కలిగించే ప్రయత్నం చేసేవారిని ఒక తాత్వికునిగా గమనిస్తాడు. పిల్లచేష్టగా భావించి దీనిని క్షమించివేస్తాడు.

కోపం మనిషిని పిచ్చివానిగా మార్చివేస్తుంది. మనిషి కోపంలో తన శత్రువును అప్పటికప్పుడు ఉరిశిక్ష విధిస్తే బాగుండునని కూడా భావిస్తాడు. తత్వ్యతిరేకంగా ఒక మృదుస్వభావి, శాంతశీలి అయిన వ్యక్తి తన ఉన్నత స్థాయి నుండి ప్రతి కష్టాన్ని, ఇబ్బందిని హుందాగా, ప్రశాంత చిత్తంతో ఎదుర్కొంటాడు. ఇతరులను అవమానించే వాడు స్వయంగా అవమానించబడతాడనే సత్యాన్ని ఎరిగివుంటాడు.

ఈ ఉత్తమ మానవీయ స్వభావం ప్రవక్త హూద్ (అలై)లో ప్రస్ఫుటంగా దర్శన మిస్తుంది. ఆయన జాతి ఆయనపై విరుచుకుపడినప్పుడు, తిట్లు శాపనార్థాలతో దాడి చేసినప్పుడు, ఆయన ప్రశాంత చిత్తంతో వాటిని భరించారు. ఆద్ జాతి వారి

మాటలను, ప్రవక్త హూద్ (అలై) సమాధానాన్ని దివ్య ఖుర్ఆన్ ఈ క్రిందివిధంగా రికార్డు చేసింది.

**"నీవు తెలివి తక్కువతనానికి గురిఅయినట్లు మేము భావిస్తున్నాము. నీవు అసత్యవాదివని మా అనుమానం' అతను ఇలా అన్నాడు : 'నా జాతి సోదరులారా! నేను తెలివి తక్కువతనానికేమీ గురికాలేదు. నేను సకల లోకాల ప్రభువునకు ప్రవక్తను. మీకు నా ప్రభువు సందేశాలను అందజేస్తాను. నేను మీ యొక్క నమ్మదగిన శ్రేయోభిలాషిని." *(ఖుర్ఆన్, 7:66-67)***

ఆద్ జాతివారి క్రోధపూరిత వాగ్బాణాలు ప్రవక్త హూద్ (అలై)ను తన కర్తవ్యం నుండి విముఖులుగా చేయలేకపోయాయి. దైవ సహాయంతో ఫలాపేక్షారహితంగా దైవ సందేశాన్ని అందజేసే ఉత్తమ వ్యక్తిత్వం ఒక వైపున ఉండగా, మరోవైపున తమ దుష్కర్మలచేత, దుర్మార్గ, దౌర్జన్యాలచేత భూమికి బరువుగా మారిన గుంపు వుండింది. ఈ పోరాటంలో ఉత్తమ సందేశహరుడైన ప్రవక్త హూద్ (అలై) మనసు శత్రు బృందపు చర్యలకు ఏమాత్రం అలజడికి లోనుకాలేదు.

చివరి దైవప్రవక్త (స) మృదు స్వభావం, విశాల హృదయం గురించి అద్భుతమైన శిక్షణ గరిపేవారు. ఈ శిక్షణ తాలూకు సంఘటన ఈ విధంగా ఉల్లేఖించబడింది:

"ఒక పల్లెటూరి మొరటు అరబ్బు ప్రవక్త (స) సమ్ముఖానికి వేంచేశాడు. తనకు ఏదైనా సహాయం చేయమని కోరాడు. అందుకు ప్రవక్త(స) అతనికి కొంతసొమ్మును అందించి, 'నీకు సంతృప్తికరమైన సహాయం అందించనా?" అని ప్రశ్నించారు. అందుకు ఆ పల్లె అరబ్బు 'లేదు, నీవు నా పట్ల సరిగా ప్రవర్తించలేదు' అని నిరసన తెలిపాడు. ఆ నిర్లక్ష్య సమాధానం ప్రవక్తశ్రీ(స) సహచరులకు ఆగ్రహం కలిగించింది. వారు కోపోద్రిక్తులై అతని వైపుకు అడుగులు వేశారు. దైవప్రవక్త (స) వారిని కనుసైగతోనే నిలిపివేశారు. అతనిని ఇంటిలోనికి తీసుకెళ్ళి మరింత ధన సహాయం అందించి "ఇప్పుడు నీకు సంతృప్తిగా వుందా?" అని ప్రశ్నించారు. అందుకు ఆ మొరటు అరబ్బు 'మీకు మీ కుటుంబానికి అల్లాహ్ మరిన్ని వరప్రసాదాలు అందించుగాక!" అని సంతోషంతో జవాబిచ్చాడు. అప్పుడు దైవప్రవక్త (స) "నీ దుఆ సరే, కాని, నీ పట్ల నా అనుచరులు కోపంగా ఉన్నారు. నీవు ఇప్పుడు కనబరచిన సంతృప్తిని వారి ముందు కూడా ప్రకటించు" అని చెప్పారు. ఆ పల్లెటూరి అరబ్బు అదేవిధంగా చేశాడు. అప్పుడు

ప్రవక్త(స) "ఈ వ్యక్తికి నాకు మధ్యనున్న సంబంధం ఎటువంటిది అంటే; ఒక టక్కరి ఒంటె దాని యజమానితో చేసే టక్కరి చేష్టలాంటిది. అయితే, అదే ఒంటె దాని అవసరం తీర్చుకోవడానికి తన యజమానినే ఆనందంగా ఆశ్రయిస్తుంది" అన్నారు.

ఒక పల్లెటూరి మొరటు వ్యక్తి తన మూర్ఖత్వంతో ప్రవక్త(స) ఔన్నత్యాన్ని గుర్తించలేదు. వారి పట్ల అవమానకరంగా ప్రవర్తించాడు. అయినా ప్రవక్త(స) ఆ వ్యక్తి యొక్క స్వభావాన్ని అర్థం చేసుకొని తదనుగుణంగా ఆ వ్యక్తితో వ్యవహరించారు. ఆ వ్యక్తి హృదయాన్ని గెలుచుకొని హృదయాల విజేతగా నిలిచారు. అదేవిధంగా మృదుత్వం, విశాల హృదయుడైన వ్యక్తి ఎదుటి మనిషి చేసే తప్పులు శిక్షార్హమైనవి అయినప్పటికీ, వాటిని విశాల హృదయంతో క్షమిస్తాడు. విమర్శించిన నోటినుండే ప్రశంసలు అందుకుంటాడు. నైతిక విలువలు లేని అతి గొప్ప మేధావి అయినా ఈ తరహా ఆచరణ కలిగి వుండటం సాధ్యం కాదు.

పైన పేర్కొన్న పల్లెటూరి వ్యక్తిని కసిరి పంపివుండవచ్చు. కాని, అతని హృదయాన్ని గెలుచుకోవడానికి ప్రవక్త(స) అనుసరించిన పద్ధతి చాలా గొప్పది. ఆ వ్యక్తి పట్ల తన సహచరుల కోపాన్ని తగ్గించడానికి చేసిన ప్రయత్నము కడు ప్రశంసనీయమైనది. ఇచ్చిన బహుమానం చిన్నదా? పెద్దదా? అనేది ప్రధానాంశం కాదు. ఆ బహుమానం ఆ వ్యక్తికి ఎంత ఉపయోగకరం అనేది ప్రధానం. ఆ వ్యక్తి మనసు తృప్తి చెందిందా? లేదా అనేది చాలా ప్రధానమైన విషయం.

ప్రవక్త(స) వారికి అప్పుడప్పుడూ కోపం కూడా వచ్చేది. అయితే ఆ కోపం ఏనాడూ తన హద్దులను అతిక్రమించనేలేదు. ఎవరి గౌరవాన్ని కూడా భంగపర్చలేదు. తన కోపం వల్ల తన వ్యక్తిగత శత్రుత్వాన్ని ఏనాడూ తీర్చుకొనే ప్రయత్నం చేయనేలేదు. అయితే అల్లాహ్ హక్కులను ఉల్లంఘించినవారిని, సృష్టికర్త పట్ల ద్వేషం, శత్రుత్వం వహించినవారి పట్ల ప్రతీకారం తీర్చుకోవడానికి ఎప్పుడూ వెనుకంజ వేయనేలేదు.

"ఒకసారి ప్రవక్త (స) వద్దకు కొంత యుద్ధసొత్తు వచ్చింది. దానిని ప్రవక్త(స) అందరికీ వారి వారి వాటాల వారిగా పంచసాగారు. ఆ సమయంలో ఒక పల్లెటూరి మొరటు వ్యక్తి 'న్యాయంగా పంచండి' అంటూ విమర్శించాడు. నిజానికి యుద్ధసొత్తు కేవలం అల్లాహ్‌కు చెందినది. దానిపై పూర్తి హక్కులు దైవప్రవక్త (స)కు మాత్రమే ఉన్నాయి. అయినా ప్రవక్త(స) ఆ వ్యక్తిపై కోపగించుకోనేలేదు. ఇంకా, ఆ వ్యక్తికి, తన సహచరుల బృందానికి ఈ క్రిందివిధంగా శిక్షణ గరిపారు. "నీపాడుగాను, నేను

న్యాయం చేయకపోతే మరింకెవరు చేయగలరు? నేను న్యాయం పాటించకపోతే, నా ధర్మాన్ని నెరవేర్చలేనివాడిని అవుతాను" అని చెప్పి ఆ వ్యక్తి ప్రాణానికి తన సహచరుల ద్వారా హాని కలగని విధంగా మాట్లాడారు.

## క్షమ - మన్నింపుల వైఖరి

ఒకరోజు అస్ర్ నమాజ్ తరువాత మానవ మహోపకారి ముహమ్మద్ (స) ప్రజలనుద్దేశించి ఇలా ఉపన్యసించారు :

"ఆదం కుమారులు విభిన్న స్థాయిలలో, నైజంలో ఉనికిలోకి తీసుకొని రాబడినవారు. అందులో కొందరు ఆలస్యంగా కోపధారులవుతారు? అతి త్వరగా కోపాన్ని వదిలివేస్తారు. మరికొందరు త్వరగా కోపధారులై త్వరగా శాంతపడుతారు. మరికొందరు ఆలస్యంగా కోపధారులై ఆలస్యంగానే కోపాన్ని విడనాడుతారు. జాగ్రత్త! మరికొందరు త్వరగా కోపపడి ఆలస్యంగా కోపాన్ని వదులుతారు. వీళ్ళందరిలో చివరి నైజం బహుచెడ్డది. మంచి నైజం గల వ్యక్తి ఎవరంటే ఆలస్యంగా కోపాన్ని పొంది, త్వరగా దానిని త్యజించేవాడు" అని అన్నారు.

"ఆ తర్వాత మీలో, అవసరాలు తీర్చుకోవడంలో నిగ్రహం పాటించి అప్పు చెల్లించడంలో త్వరపడేవాడు ఉత్తముడు. అదేవిధంగా అవసరాలు తీర్చుకోవడంలో తొందరపడి, అప్పు చెల్లించడంలో నిర్లక్ష్యం పాటించేవాడు అధముడు" అని సెలవిచ్చారు. ఆ తరువాత ....

"జాగ్రత్త! కోపం ఆదం పుత్రుడి హృదయంలో నిప్పు కణికలా మండుతూ వుంటుంది. కోపధారి యొక్క కాళ్ళు ఎర్రగా మాడుతూ ఉండటం గమనించలేదా? అతని ముక్కుపుటాలు ఎగురుతూ ఉండటం చూడటం లేదా? ఈ స్థితిని పొందినవారు వెంటనే నేలపై కూర్చొండిపోవాలి" అన్నారు. (తిర్మిజి)

కోపోద్రిక్తుడైన వ్యక్తి వెంటనే కూర్చోవాలి. తనలోని కోపాగ్ని శిఖలు పెరగకుండా జాగ్రత్తపడాలి. కోపాగ్ని అన్ని విషయాలను భస్మం చేసివేస్తుంది. వివేకం, చైతన్యం లాంటి ప్రయోజనకర లక్షణాలన్నీ ఈ సమయంలో మాయమైపోతాయి. ఆవేశపు ప్రవాహంలో మనిషి బందీ అయిపోతాడు. ఈ స్థితిలో చేసే ఆచరణ వల్ల పరిస్థితులు మరింతగా భ్రష్టుపడతాయి. ఈ విషయమే ప్రవక్త(శ్రీ వారు పై హితోక్తిలో స్పష్టం చేయడం జరిగింది. ఒక విశ్వాసి తన కోపాన్ని నిరంతరం తన అదుపులో

వుంచుకుంటాడు తప్ప, తాను కోపం యొక్క అదుపులోకి వెళ్ళడు. కోపంలో మనిషి తలుపులను బాదడం, వస్తువులను విసిరికొట్టడం, పుస్తకాలను చించడంలాంటి పనులు చేస్తాడు. ఫలితంగా అంతులేని నష్టానికి గురవుతాడు.

ప్రవక్త (స) కాలంలో ఒక వ్యక్తి యొక్క దుప్పటి విసురుగాలిలో కొట్టుకు పోతుంది. ఈ విషయంగా ఆ వ్యక్తి శాపనార్థాలు మొదలెట్టాడు. అప్పుడు ప్రవక్త (స) ఇలా పలికారు : "ఓ ఫలానా! ఈ విషయంగా శాపనార్థాలు పెట్టకు సుమా! ఆ గాలి దైవాజ్ఞబద్ధమై ఆజ్ఞాపాలనలో నిమగ్నమైవుంది. ఏ వస్తువు శాపనార్థాలకు అతీతమైనదో – దానిపై పలికే శాపనార్థాలు తిరిగి ఆ వ్యక్తికే చుట్టుకుంటాయి" అన్నారు. (తిర్మిజి)

కోపకారణంగా జరిగే నష్టాలు అనంతమైనవి. నష్టాల నివారణ కొరకు కోపంపై నియంత్రణ ఒక్కటే మార్గంగా వుంటుంది. కోపాన్ని నియంత్రించుకున్నవాడు కడు వివేకవంతుడు అవుతాడు.

"ఇబ్నె మసూద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (స) "మీలో అతి గొప్ప మల్ల యోధుడు (పహిల్వాన్) ఎవరో తెలుసా?" అని ప్రశ్నించారు. అందుకు ప్రజలు ఎవరైతే మల్లయుద్ధంలో ప్రవీణుడో అతడేకదా ఓ దైవప్రవక్తా! అని బదులిచ్చారు. అందుకు ప్రవక్త(స) "కాదు! ఎవరైతే కోప సమయంలో తన్ను తాను నిగ్రహించు కుంటాడో – అతడే నిజమైన మల్లుడు" అని సెలవిచ్చారు. (ముస్లిం)

మరో ఉల్లేఖనంలో ప్రవక్తశ్రీని ఓ వ్యక్తి, "ఓ ప్రవక్తా! నేను మర్చిపోని విధంగా అతి చిన్న హితోపదేశం చేయండి" అని వేడుకున్నాడు. అందుకు మానవ మహోప కారి "కోపగించుకోకు" అని ముక్తసరిగా సమాధానమిచ్చారు.

దైవప్రవక్త (స) సందర్భానుసారంగా, పరిస్థితులకు అనుగుణంగా శిక్షణ గరిపే వారు. సందర్భోచితంగా సుదీర్ఘ ప్రసంగమూ చేసేవారు. అదే సమయంలో ముక్తసరిగా కూడా శిక్షణగరిపేవారు.

నాటి అరబ్బు భూభాగంపై రెండు రకాల అజ్ఞానాలు రాజ్యమేలుతూ ఉండేవి. ఒకటి మేధోపర అజ్ఞానం. కాగా రెండవది కాఠిన్యం. ప్రవక్త(స) మొదట అజ్ఞానాన్ని జ్ఞానం, వివేకం, హేతువు ప్రసంగాలు హితోక్తుల ద్వారా రూపుమాపారు. రెండవ అజ్ఞానాన్ని కోరికల అదుపుకు తర్ఫీదు ఇవ్వడం ద్వారా, మృదు స్వభావం, మన్నింపుల ధోరణి ద్వారానూ రూపుమాపారు. ఆనాటి అరబ్బుల పరిస్థితి "జాగ్రత్త! మా వద్ద అజ్ఞాన

ప్రదర్శన చేయకండి! మేము అజ్ఞానులను మించిన అజ్ఞానులం సుమా" అనేలా ఉండేది.

ఇస్లాం మనిషిలోని క్రోధాన్ని, ఉద్వేగాన్ని, అతి ఉత్సాహాన్ని నియంత్రించింది. క్షమ, మృదుత్వం, మన్నింపుల వైఖరిని పాదుగొల్పింది. మన్నించే గుణాన్ని పెంచి పోషించి ఉత్తమ స్థాయికి చేర్చేందుకు అవసరమైన చర్యలన్నింటినీ అమలుచేసింది. తీవ్రమైన నేరాలకు మాత్రమే శిక్షించే విధంగా సమన్యాయ వ్యవస్థను తీర్చిదిద్దింది.

నాటి అరబ్బుల్లోవున్న రోషం, వైరం, శత్రుత్వాలన్నింటిని – ఇస్లామీయ లక్ష్యం – ధ్యేయాల ముందు మోకరిల్లేలా దైవప్రవక్త (స) శిక్షణ అందించారు. తమ కోప తాపాలను, రోషవైషమ్యాలను, ఇస్లామీయ సభ్యతా సంస్కారాల హద్దుల లోపల బంధించివేశారు. ఒక సంఘంగా సభ్యుల మధ్య సంబంధాలను పటిష్ఠపర్చడానికి అవసరమైన అంశాలన్నింటిని వారికి నేర్పారు. ప్రత్యక్ష శిక్షణనిచ్చారు. సంబంధాల విచ్ఛిత్తి ధర్మవ్యతిరేక చర్యగా నిర్ధారించారు.

"ఒక ముస్లిం తిట్లు శాపనార్థాలకు దిగడం, కపటత్వంగా కొట్లాటకు దిగడంగా, తిరస్కారంగా ప్రవక్తశ్రీ నిర్ధారించారు." (బుఖారి)

అబ్దుల్లాహ్ బిన్ మసూద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం : "ఎక్కడైతే నలుగురు విశ్వాసులు గుమికూడుతారో – అక్కడ అల్లాహ్ కారుణ్యపు పరదాతో వారిని కప్పివుంచుతాడు. వారి మధ్య అశ్లీల సంభాషణ ప్రారంభమైన వెంటనే ఆ పరదాను అల్లాహ్ చింపివేస్తాడు" అని దైవప్రవక్త సెలవిచ్చారు. (బైహఖీ)

సాధారణ సమాజాన్ని ఉత్తమ సమాజంగా తీర్చిదిద్దే కృషిలో ప్రవక్త మహోపాధ్యాయుల కృషిని ఈ ఉల్లేఖనం తెలియపరుస్తుంది. "దైవప్రవక్త (స) వద్దకు ఇస్లాం నేర్చుకునేందుకు ఒక పల్లెటూరి అరబ్బు వెళ్ళాడు. అతని పేరు 'జాబిర్ బిన్ సలీమ్'. అతను ఇలా తెలియజేస్తున్నాడు. 'నేను విశ్వాసుల బృందంలో ఒక వ్యక్తిని చూశాను. అతను మాట్లాడిన ప్రతి మాటను ఇతరులు అనుకరించేందుకు ప్రయత్నిస్తున్నారు. నేను 'ఆ వ్యక్తి ఎవరు?' అని ప్రశ్నించగా అందుకు 'ఆయన దైవ సందేశహరులు' అని జవాబివ్వబడింది. అప్పుడు నేను 'అలైక అస్సలామ్! యా రసూలుల్లాహ్!' అని పలికాను. అందుకు ప్రవక్త(స) "ఈ విధంగా సలామ్ చేయవద్దు. ఇది మృతులకు సలామ్ చేసే పద్ధతి. సజీవులకు 'అస్సలాము అలైక' అని పలుకు" అన్నారు.

"మీరు దైవసందేశహరులా?" అని నేను ప్రశ్నించాను. అందుకు ప్రవక్త(స), "బాధల్లో కష్టాల్లో శాంతిని ప్రసాదించేవాడు. కరువుకాటకాల్లో ఆహార సముపార్జన చేసేవాడూ, ఎడారిలో ఒంటెను పోగొట్టుకున్న వానికి అతని సవారీని తన కారుణ్యంతో ఇప్పించేవాడు అయిన అల్లాహ్ యొక్క సందేశహరుడిని నేను" అన్నారు.

అప్పుడు నేను 'ఓ ప్రవక్తా! నాకు ఏదైనా ఉపదేశించండి' అని అడిగాను. అందుకు దైవప్రవక్త (స) "ఎవరినీ తిట్టకు" అన్నారు. ఆ రోజు నుండి నేను మనుషులనే కాక జంతువులను తిట్టడం కూడా మానుకున్నాను. ఆ తర్వాత ప్రవక్త(స) "ఏ చిన్న మంచి పనిని అయినా తక్కువ దృష్టితో చూడకు. నీ సోదరునితో మందహాసంతో సంభాషించు. ఇది కూడా సత్కార్యమే. ఎవరైనా నీతో గొడవపడి నిన్ను అనరాని మాటలు అన్నా, నీలోని లోపాలను బహిర్గతపర్చి నిన్ను అవమానించినా, నీవు మాత్రం ఇందుకు ప్రతిగా ఆ వ్యక్తిని అవమానపర్చకు సుమా!" అంటూ హితోపదేశం చేశారు. (అబూదావూద్)

## శాపాలు - ద్వేషాలు నీచత్వానికి నిదర్శనాలు

కొందరిలో కోపం త్వరగా తగ్గదు. వారు సుదీర్ఘకాలం ఆ కోపంలోనే ఉద్వేగ – ఉద్రేకాలకు లోనౌతూ వుంటారు. వారి ముఖం ఎర్రగా కందిపోయి ఎదుటివారిని భయకంపితులు చేస్తూ ఉంటుంది. ఈ సమయంలో ఎవరైనా వారితో సంభాషణకు దిగినా, వారి ముందు భిన్నాభిప్రాయాలు తెలియపర్చినా, వీరు ఎదుటి వ్యక్తిపై విరుచుకుపడుతూ ఉంటారు. క్రమంగా వాగ్వివాదం నుండి తిట్లు శాపనార్థాలకు దిగుతారు. ఇస్లాం, ఈ మానసిక చెడు నుండి బయటపడమని తన అనుయాయులను ఆదేశిస్తుంది.

దైవప్రవక్త (స) ఇలా నుడివారు, "ఒక విశ్వాసి ఎవరి మనస్సునూ నొప్పించడు. ఎత్తిపొడిచే మాటలు పలకడు. శాపనార్థాలకు, తిట్ల పంచాంగానికి పూనుకోడు. అశ్లీలపు మాటలు చెడు ఆలోచనలకు తావివ్వడు." (తిర్మిజి)

ఎప్పుడూ ఇతరులను శాపనార్థాలు పెడుతూ వుండటం, ఆ వ్యక్తి యొక్క నీచత్వానికి నిదర్శనంగా ఉంటుంది. ఈ నైజం గల వ్యక్తి, నిరంతరం తన మాటల ద్వారా ఇతరుల మనస్సులను గాయపరుస్తూ ఉంటాడు. ఇస్లాం ఇటువంటి నీచ

ఆచరణల నుండి పత్యం పాటించమని హితవు గరుపుతుంది. అందుకు అవసరమైన శిక్షణనూ అందిస్తుంది.

ఒక వ్యక్తి మనిషిలో అల్లాహ్ పట్ల విశ్వాసం ఏ మేరకు ఉత్తమ స్థాయికి చేరుతూ వుంటుందో – ఆమేరకు ఆ మనిషి యొక్క హృదయం కఠినత్వాన్ని విడనాడుతూ వుంటుంది. మృదుత్వానికి అలవాటుపడుతూ ఉంటుంది. ఇతరుల హక్కులను కొల్లగొట్టడం మాని, వారి హక్కుల పరిరక్షణ వైపుకు పయనిస్తుంది. కోపం, కపట త్వాలను విడనాడి శాంతం, సహనం, సహకారం మన్నింపుల వైఖరికి అలవాటు పడుతుంది.

విశ్వాసులపై దౌర్జన్యాలను చేస్తూ వుండిన దైవతిరస్కార సర్దారులను శపించవలసిందిగా ప్రవక్త (స) ను కోరడం జరిగింది. ఈ సందర్భంగా కారుణ్యమూర్తి (స) "నేను కారుణ్యంగా చేసి పంపబడ్డాను. శాపనార్థాలు పెట్టేవానిగా నేను పంపబడలేదు" అని సెలవిచ్చారు. (ముస్లిం)

మరోచోట "మీరు ఒకే సమయంలో కోపధారులుగా, శాపనార్థాలు పెట్టేవారిగా – దానధర్మాలు చేసేవారిగా – దయామయులుగా ఎలా వుండగలరు" అని ప్రవక్త(స) ప్రశ్నించారు. (హాకిం)

'కోపానికి ప్రాయశ్చిత్తంగా అబూబక్ర్ (రజి) ఒక బానిసను విముక్తి ప్రసాదించారు. ఇకపై ఎవరిపట్లా కోపం కలిగి వుండననీ, శాపనార్థాలు పెట్టననీ' నిర్ణయించుకున్నారు.

కోపం, శాపం, మనసును గాయపర్చే మాటలు మనిషి యొక్క అధమత్వానికి ప్రతీకలుగా, బహిరంగ రుజువులుగా సాక్షాత్కరిస్తాయి. మాటిమాటికీ శాపనార్థాలు పెట్టే వ్యక్తికి కలిగే నష్టాలను దైవప్రవక్త (స) ఈ క్రింది మాటల్లో విశదపర్చారు :

"ఒక దాసుడు, ఏదైనా సంఘటనపై లేక ఇతర దాసునిపై శాపనార్థాలు పెట్టి నప్పుడు, ఆ పలుకులు ఆకాశం వైపుకు పయనిస్తాయి. అక్కడ ఆ శాపాలకు ద్వారాలు మూసి వేయబడతాయి. ఆ పలుకులు తిరిగి భూమి వైపుకు పయనిస్తాయి. భూమి తలుపులూ వాటి కొరకు మూసి వేయబడతాయి. చివరికి ఆ పలుకులు శపించబడిన వ్యక్తి వైపునకు పయనిస్తాయి. ఆ శాపనార్థాలు ఆ వ్యక్తికి తగినది కానప్పుడు ఆ శాపాలు వెనుతిరిగి శపించిన వ్యక్తిపై ఆవరించిపోతాయి." (అబూదావూద్)

## తిట్లు నిషిద్ధం

తిట్లు, బూతుపదాలు, ద్వంద్వార్థ పద ప్రయోగాలు ఇస్లాంలో అనుమతింప బడవు. మన నిత్య జీవితంలో, ఆఫీసు, గృహాలల్లో, వీధుల్లో ఒకరినొకరు అవమానించుకోవడం, ఎగతాళి చేసుకోవడం అనునిత్యం జరుగుతూనే ఉంటాయి. అత్తాకోడళ్లు ఒకరినొకరు సూటి పోటి మాటలు చెప్పుకోవడం, ఒకరి లోపాలు, బలహీనతలు మరొకరు బహిరంగపర్చుకోవడం లాంటి ఆమోదం కాని సంఘటనలు నేడు సంభవిస్తూనే ఉన్నాయి. ఏదో విషయంగా ఏర్పడిన అక్కసును అవకాశం దొరికినప్పుడు వెంటనే తీర్చుకోవడం మన సభ్యతా సంస్కారాలకు పొసగని చర్యలు. విలువలు, గౌరవ మర్యాదలు మంటకలసి పోవటం ఇస్లాంకు నప్పని చేష్టలు.

ఇటువంటి అసహ్యకర వాతావరణం ఏర్పడటానికి కారకుడైన మొదటి వ్యక్తి, ఈ పాపంలోని సింహభాగానికి అర్హుడవుతాడు. ఒక ప్రవచనంలో ఇలా సెలవివ్వబడింది: “వ్యక్తుల మధ్య తిట్లు అశ్లీల పదప్రయోగాల వాగ్వివాదాల పాపం మొత్తంగా మొట్టమొదట ఈ వాతావరణాన్ని సృష్టించిన వ్యక్తిపై మోపబడుతుంది.” (ముస్లిం)

ఈ అసహ్యకర నైజం నుండి, మానసిక స్థితి నుండి కేవలం క్షమాగుణం, ఆలోచనల్లో విశాలత్వం సహనంలు వ్యక్తిలో పాదుగొల్పడం మాత్రమే వ్యక్తిని రక్షించ గలుగుతుంది. పరాభవంపై కక్షసాధింపును – క్షమ మన్నింపులద్వారా ఎదుర్కోగల సాత్వికతను వ్యక్తి పెంపొందించుకోవాలి.

సాధారణంగా ఒక మనిషి ఇతరుల ద్వారా అవమానింపబడితే, ఆ పరాభవానికి తప్పనిసరిగా బదులు తీర్చుకోవాలని భావిస్తాడు. ఈ నైజం మనిషికి సర్వసాధారణమైనది. కాని, ఒక సైద్ధాంతిక బృందానికి, తన జీవిత లక్ష్యానికి అడ్డంకిగావున్న అన్ని అలవాట్లను, నైజాలను, మానిసకతలను వదులుకోవలసి వుంటుంది. లక్ష్యసాధనమే అవసరమైన అన్ని సభ్యతలను సంస్కారవంతమైన అలవాట్లను అలవర్చుకోవలసి కూడా ఉంటుంది.

## కఠినత్వానికి - మృదుత్వంతో సమాధానం

మనిషికి, తన ఔన్నత్యాన్ని ప్రకటించుకునే మార్గాలు అనేకం వున్నాయి. వాటిలో కోపాన్ని అదుపులో ఉంచుకోవడం అతి ముఖ్యమైంది. తన నోటిని, చేతులను

కట్టి వుంచడం, బదులు తీర్చుకోవాలనే ధోరణిని విడనాడటం కూడా ప్రధానమైనదే. అల్లాహ్ సమక్షంలో కృతజ్ఞతలు చెల్లించుకునే అనేక రూపాలూ ఉన్నాయి. అందులో ఇతరులను క్షమించడం, వారి లోపాలను బహిరంగపర్చకుండా వుండటం ప్రధాన మైనది.

ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) గారి సలహామండలిలో హుర్ బిన్ ఖైస్ సభ్యులుగా ఉండేవారు. హుర్ బిన్ ఖైస్ గారి ఖురాన్ పఠనాన్ని ఖలీఫా అమితంగా ఇష్టపడేవారు. హుర్‌గారి ఇంటికి ఆయన బాబాయి, ఆయినా బిన్ హసన్ వచ్చి, తనను ఖలీఫాతో కలపమని హుర్‌ను కోరాడు. అందుకు హుర్ ఖలీఫా వద్ద అనుమతి తీసుకున్నారు. ఆయినా బిన్ హసన్ ఖలీఫాతో అనవసరమైన మాటలు మాట్లాడి వెళుతూ వెళుతూ 'ఓ ఖత్తాబ్ కుమారుడా! నీవు నా పట్ల న్యాయంగా ప్రవర్తించలేదు. నాకు ఎటువంటి బహుమానమూ ఇవ్వలేదు' అని విమర్శనాత్మక మూర్ఖ ప్రసంగం చేశాడు. వెంటనే హుర్ కలగజేసుకొని 'ఓ అమీరుల్ మోమినీన్! ఈ వ్యక్తి పరమ మూర్ఖుడు. మూర్ఖులతో వాదించకు" అనీ, "మన్నింపు వైఖరి అవలంబించమని" అల్లాహ్ తన ప్రియ ప్రవక్త (స)కు సెలవిచ్చివున్నాడు. కనుక మీరు ఈ వ్యక్తిని మన్నించండి' అని విన్నవించారు. పై ఖురాన్ వాక్యాలు విన్నవెంటనే కోపధారులైవున్న ఖలీఫా ఉమర్ (రజి) వెంటనే శాంత స్వభావులైపోయారు.

ఒక ఉల్లేఖనంలో ఇలా సెలవివ్వబడింది : "ఎవరైతే ప్రతీకారం తీర్చుకోగలిగిన శక్తి ఉండీ - తన కోపాన్ని దిగమ్రింగి మన్నింపు వైఖరిని అవలంబిస్తాడో ఆ వ్యక్తిని ప్రళయదినాన అల్లాహ్ అందరి సమక్షంలో అతను కోరుకున్నదంతా ప్రసాదిస్తాడు. అందులో అత్యుత్తమ సౌందర్యరాశులైన స్వర్గ లోకపు కన్యలూ ఉంటారు." (అబూదావూద్)

అబాదా బిన్ సామిత్ (రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "స్వర్గం లోకంలో ఉత్తమ స్థానాలను పొందేవారు ఎవరో తెలుపనా?" అని ప్రశ్నించారు. అందుకు అనుచరులు 'తప్పకుండా ఓ ప్రవక్తా!' అని బదులిచ్చారు. "ఎవరైతే ఒక వ్యక్తి యొక్క మూర్ఖ-మొరటు ప్రవర్తనను సహించి, అతనిపట్ల విశాల దృక్పథం ప్రదర్శిస్తాడో అతడు." ఇంకా... "దౌర్జన్యపరుడిని క్షమించండి. తన హక్కులను కాలరాచినవానికి అతని హక్కులను చెల్లించేవాడు. సంబంధాలను తెంచుకున్న వ్యక్తితో సంబంధాన్ని పెనవేసుకునేవాడు" అని వివరించారు. (తిబ్రాని)

మనిషి సాఫల్యమార్గంలో పయనించి, చివరకు స్వర్గధామంలో చేరడానికి అవసరమైన ఆచరణలను దివ్య ఖురాన్ ఈ క్రింది మాటలలో స్పష్టపర్చింది.

**"మీ ప్రభువు క్షమాభిక్ష వైపునకు, స్వర్గం వైపునకు పోయేమార్గంలో పరుగెత్తండి. ఆ స్వర్గం భూమ్యాకాశాల అంత విశాలమైనది. అది భయభక్తులు కల వారి కొరకు తయారుచేయబడింది. వారు కలిమిలో, లేమిలో ఏ స్థితిలో ఉన్నా తమ సంపదను ఖర్చుచేసేవారు, కోపాన్ని దిగమ్రింగేవారు. ఇతరుల తప్పులను క్షమించేవారు. ఇలాంటి సజ్జనులంటే అల్లాహ్‌కు ఎంతో ఇష్టం."**

**(ఖుర్ఆన్, 3:133-134)**

## ఉత్తమ నైతిక ప్రమాణం

దైవప్రవక్త (స) జీవితం ఉత్తమ నైతిక ప్రమాణాలకు ప్రతీకగా ఉండింది. క్షమ మన్నింపుల వైఖరిని ఉత్తమ శిఖరాలకు చేర్చడంలో అత్యుత్తమ ఆదర్శం నెలకొల్పారు.

కపటుల నాయకుడైన అబ్దుల్లాహ్ బిన్ ఉబై పట్ల ప్రవక్త (స) వారు ప్రవర్తించిన తీరును చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖించి భద్రపర్చింది. ఈ కపటుల నాయకుడు విశ్వాసుల పట్ల కఠినాతి కఠినుడైన శత్రువుగా ఉండేవాడు. విశ్వాసుల మాన ప్రాణాలకు నష్టం కలిగించే కుట్రలను నిరంతరం పన్నుతూ ఉండేవాడు. సాకుల కోసం నిరంతరం గోతికాడి నక్కలా కాచుకొని వుండేవాడు. ముస్లింల శత్రువులందరితో రహస్య సంబంధాలను కలిగివుండేవాడు. మదీనా నగరపు ఇస్లామీయ ప్రభుత్వ రహస్యాలన్నింటినీ, బలహీనతలన్నింటినీ శత్రువులకు చేరవేసేవాడు. ముస్లింలలో అంతర్గత కలహాలు సృష్టించడానికి వీలున్న అవకాశాలన్నింటిని ఉపయోగించుకునేవాడు. విశ్వాసులకు నష్టం కలుగజేసే ఏ చిన్న అవకాశాన్ని కూడా చేజారనిచ్చేవాడు కాడు. చివరకు విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయెషా (రజి) గౌరవ మర్యాదలపై కూడా బురదజల్లే ప్రయత్నం చేశాడు. ఈ విషయంగా ప్రజల్లో అనుమానాలు రేకెత్తించే దుష్ప్రచారానికి పూనుకున్నాడు. ఫలితంగా అప్పుడప్పుడే నిలద్రొక్కుకుంటూ ఉన్న ఇస్లామీయ ప్రభుత్వ వ్రేళ్ళను పెకలింపజేసే కుట్రకు పూనుకున్నాడు. విశ్వాసుల నాయకులైన ప్రవక్త(స) నిబద్ధతకు మారుపేరైన వారి అనుచర సమాజమూ ఈ పరిస్థితిని తట్టుకొని నిలబడేందుకు తీవ్ర శ్రమ పడవలసివచ్చింది. చివరకు స్వయంగా సృష్టికర్త అల్లాహ్ కపటుల కుట్రలను, అభాండాలను, ప్రయత్నాలను పటాపంచలు చేస్తూ

ఆయెషా (రజి) స్వచ్ఛతను, ఔన్నత్యాన్ని చాటుతూ ఈ క్రింది విధంగా ప్రకటించవలసి వచ్చింది:

**"ఈ అభాండాన్ని సృష్టించి తీసుకువచ్చిన వారు మీలోని ఒక వర్గం వారే. ఈ సంఘటనను మీ విషయంలో కీడుగా భావించకండి, పైగా ఇది మీకు మేలైనదే. ఎవడు ఇందులో ఎంత పాత్ర వహించాడో, వాడు అంతే పాపాన్ని మూటగట్టుకున్నాడు. ఇంకా ఈ బాధ్యతలో పెద్ద భాగాన్ని, నెత్తిపై వేసుకున్న వ్యక్తికి పెద్ద శిక్షే పడుతుంది." *(ఖుర్ఆన్, 24:11)***

బహిరంగంగా విశ్వాసుల మాతృమూర్తిపై అభాండాలను ప్రచారం చేసేవారి కుట్రలన్నింటిని అల్లాహ్ ఓడించి ముస్లింలకు స్పష్టమైన విజయాన్ని ప్రసాదించాడు. తరతరాలుగా తలక్రిందులుగా నడుస్తూ ఉండిన సమాజాన్ని దాని కాళ్ళపై నిలబెట్టే కృషిలో ఇస్లాం విజయం సాధించింది. ఈ పరిస్థితిని జీర్ణం చేసుకోలేని కపటుల నాయకుడు ఉబై లోలోపలే కుమిలిపోయేవాడు. చివరకు ఈ మనోవేదనతో మంచం పట్టాడు. మృత్యుకౌగిలికి చేరువయ్యాడు. ఈ సమయంలో ఉబై కుమారుడు ప్రవక్త(శ్రీ వద్దకు వచ్చి, తన తండ్రిని క్షమించమనీ, అతని పాపపక్షమాపణ కొరకు అల్లాహ్‌ను ప్రార్థించమనీ విన్నవించుకున్నాడు. కారుణ్యమూర్తి అయిన ప్రవక్త(స) ఉబై తన పట్ల చేసిన నేరాలన్నింటినీ మన్నించివేశారు. విశ్వాసి అయిన ఉబై కుమారుని కోరిక మేరకు తన వస్త్రాన్ని 'కఫన్' కొరకు ఇచ్చారు. చివరకు ఇస్లామీయ ఉద్యమాన్ని నిరంతరం నష్టపరచిన, హీనపరిచిన కృషిలో నిమగ్నమైన వ్యక్తి పాప మన్నింపుకొరకు దైవ సమక్షంలో నిలబడ్డారు. కాని, అల్లాహ్ ప్రవక్త(స) వారి విజ్ఞాపనను అంగీకరించలేదు. దానికి ప్రతిగా ఈ క్రింది విధంగా దైవవాణిని అవతరింపజేశాడు :

**"ప్రవక్తా! ఒకవేళ నీవు వారిని క్షమించవలసిందిగా డెబ్బైసార్లు విజ్ఞాపన చేసినా అల్లాహ్ వారిని ఎంతమాత్రమూ క్షమించడు. ఎందుకంటే వారు అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ తిరస్కరించారు. అల్లాహ్ దుర్మార్గులైన ప్రజలకు మోక్షమార్గం చూపడు." (ఖుర్ఆన్, 9 : 80)**

దైవప్రవక్త (స) వారి ప్రత్యక్ష శిక్షణలో తర్ఫీదుపొంది హజ్రత్ అబూ బక్ర్ (రజి) గారి ఆచరణ కూడా ఉత్తమ నైతిక ప్రమాణానికి తార్కాణంగా వుండింది.

హజ్రత్ అబూబక్ర్ (రజి) సమీప బంధువు, తరచూ తన నుండి అనేక సహాయా

లను పొందేవాడు. ఇతని జీవితం మొత్తం అబూబక్ర్ సహాయ సహకారాలతోనే గడిచేది. ఇటువంటి వ్యక్తి విశ్వాసుల మాతృమూర్తిపై నిందా ప్రచారానికి పూనుకు న్నాడు. ఉబై పన్నిన కుట్రపూరిత వలలో చిక్కుకున్నాడు. హజ్రత్ ఆయెషా (రజి) స్వయానా అబూబక్ర్ (రజి) కుమార్తె. అది తెలిసి కూడా కపటి ఉబై యొక్క ప్రచార ప్రలోభానికి లోబడిపోయాడు. చివరకు ఇతడు అబూబక్ర్ గారితో సంబంధాన్ని సైతం తెంచు కున్నాడు. అప్పుడు అబూబక్ర్ (రజి) ఆ వ్యక్తిపట్ల కుపితులయ్యారు. ఇకపై ఈ వ్యక్తికి ఎలాంటి సహాయమూ అందించకూడదని మనసులో నిశ్చయించుకున్నారు. కాని, అల్లాహ్ ఈ నిర్ణయం సరికాదనీ, సంబంధాలను తెంచుకోవడం విశ్వాసుల లక్షణం కాదని, శిక్షణ గరుపుతూ ఈ క్రింది దైవవాణిని అవతరింపజేశాడు :

**"మీలోని ప్రముఖులూ, స్థితిపరులూ, తమ బంధువులకూ నిరుపేదలకూ, అల్లాహ్ మార్గంలో వలసవచ్చిన ప్రజలకూ, సహాయం చేయకూడదని ప్రమాణం చేయరాదు. వారిని క్షమించాలి. వారి (తప్పులను) ఉపేక్షించాలి. మిమ్మల్ని అల్లాహ్ క్షమించాలని మీరు కోరుకోరా? అల్లాహ్ గుణం ఏమిటంటే; ఆయన క్షమించేవాడూ, కరుణించేవాడూనూ." *(ఖుర్ఆన్, 24 : 22)***

ఈ వాక్య అవతరణ జరిగిన వెంటనే హజ్రత్ అబూబక్ర్ (రజి) తన నిర్ణయాన్ని మార్చుకున్నారు. "నాకు అల్లాహ్ క్షమాపణ లభించాలని నేను ఆశపడుతున్నాను... అభిలషిస్తున్నాను" అని పలికారు.



# 15వ భాగం

# కారుణ్యసాగరం

- దాతృత్వం – ఒక ముస్లిం నైతికతకు నిదర్శనం
- మనిషిని క్రుంగదీసే పేదరికం
- దానం– ఇహపరాలల్లో సాఫల్యధామం
- దానధర్మాలు సంపద వృద్ధికి సోపానాలు
- పేదరిక నిర్మూలనా ఉద్యమం
- మీ సంపదకు మొట్టమొదటి హక్కుదారులు

## దాతృత్వం ఒక ముస్లిం నైతికతకు నిదర్శనం

ఇస్లాం ఎటువంటి ధర్మమంటే; దాని పునాదులు, దాతృత్వం - సహాయ సహకారాలు, మరియు విశాలహృదయంపై నిర్మింపబడింది. సంకుచితత్వం, పిసినారితనం , అత్యాశలాంటి చెడులు సుందరమైన ఇస్లామీయ భశంతిని బీటలువార చేస్తాయి. ఈ కారణంగానే ఇస్లాం అనుయాయులు విశాల దాతృత్వ హృదయులుగా వుండాలని అది అభిలషిస్తుంది. వారి చేతులు నిరంతరం ఇతరులకు సహాయపడేవిగా, వారి ప్రవర్తన ఇతరులకు సంతృప్తినిచ్చేదిగా, వారి సహచర్యం కారుణ్య ఝరిగా, వారి ఆలోచన పుణ్యఫలాపేక్షతో నిండినదిగా, వారి జీవితపు అన్ని రంగాలు మంచికి మారు పేరుగా, వారి రాత్రింబగళ్ళు ఇతరుల సంక్షేమం కోరేవిగా ఉండాలి.

**"తమ సంపదను రేయింబవళ్ళు బహిరంగంగానూ, రహస్యంగానూ ఖర్చు చేసేవారు తమ ప్రతిఫలాన్ని తమ ప్రభువు వద్ద పొందుతారు. వారికి ఏ విధమైన భయంగాని, దుఃఖంగాని కలిగే అవకాశం లేదు." (ఖుర్ఆన్, 2:274)**

ఒక ముస్లిం తన జీవితావసరాలు తీర్చుకోవడంలో మధ్యేమార్గాన్ని అవలం బించవలసి వుంటుంది. తాను సంపాదించినది మొత్తంగా తన కోసమే ఖర్చు చేసుకోవడం ఒక ముస్లింకు భావ్యం కాదు. దైవ ప్రసాదంగా తనకు ప్రసాదించబడిన సంపదలో - కష్టాలకు, బాధలకు, ఇబ్బందులకు గురౌతూవున్న తన తోటి సోదరులకు కూడా భాగం వుందని భావించాలి. వారికి సహాయ సహకారాలు విధిగా అందించాలి.

దైవ సందేశహరులు (స) ఇలా ఉపదేశించారు: "ఓ ఆదం కుమారుడా! మీ సంపదల నుండి అవసరార్థుల కొరకు ఖర్చు చేయండి. ఇది మీకు ఎంతో లాభదాయక మైన విషయం. మీ చేతులను ఇతరులకు సహాయపడటం నుండి నిరోధించుకోకండి. మీ కుటుంబ సభ్యులపై మొట్టమొదట ఖర్చుచేయండి. (ఆ తరువాత ఇతరులపై ఖర్చుచేయండి). దానం ఇచ్చే హస్తాలు - ఇవ్వని హస్తాలకంటే ఎంతో ఉత్తమమైనవి." (ముస్లిం)

ఈ కారణంగానే దివ్య ఖుర్ఆన్ అనవసర దుబారా ఖర్చులను విడనాడమని హితవు గరిపింది. దుబారా మీ సంపదలను హరించివేస్తుందని హెచ్చరించింది. ఇతరుల హక్కులు చెల్లించవలసిన సంపదతో మీరు విలాస జీవితం గడపడం భావ్యం కాదని ఉపదేశించింది :

**"బంధువుల పట్ల మీ విధులను నిర్వహించండి. పేదవారి పట్ల, బాటసారుల పట్ల మీ విధులను నిర్వర్తించండి. వృధా ఖర్చు చేయకండి. వృధా ఖర్చు చేసేవారు షైతాను సోదరులు." *(ఖుర్‌ఆన్,* 17:26-27)**

ఆ తదుపరి పేదవారు, అవసరార్థుల గురించి వీలునామాలాంటి తీర్పు ఆదేశంగా ఇవ్వబడింది. వారి గౌరవానికి భంగం కలగని విధంగా, వారు ఆత్మన్యూనతా భావానికి లోనుకానివిధంగా, సహాయపడమని ఫర్మానా ఇవ్వడం జరిగింది. మీ వద్ద ఏమీ లేని పక్షంలో, వారితో ఉత్తమ రీతిలో నవ్వుతూ, మృదువుగా పలకరించమని ఆదేశించడమయింది.

**"మీరు .... అల్లాహ్ కారుణ్యాన్ని మీరు ఇంకా అన్వేషిస్తూ వున్నందువల్ల, మీరు వారిని (అవసరాలు తీరని బంధువులు, లేమికి గురైనవారు, బాటసారులు) తప్పించుకోవలసి వుంటే వారికి మృదువుగా సమాధానం చెప్పండి." (17:28)**

దాతృత్వం - పిసినారితనాల వాస్తవాలను మానవ మహోపకారి ముహమ్మద్ (స) విడమర్చి ఇలా సెలవిచ్చారు : "దాత అల్లాహ్ సామీప్యాన్ని పొందుతాడు. మనుషులకు ప్రియతముడు అవుతాడు. స్వర్గానికి చేరువవుతాడు. మరియు నరకాగ్ని నుండి దూరమవుతాడు. అదే సమయంలో పిసినారి అల్లాహ్ నుండి, ప్రజల నుండి, స్వర్గవనాల నుండి దూరమవుతాడు. నరకాగ్నికి దగ్గరవుతూ ఉంటాడు." (తిర్మిజి)

ఒకరినొకరు సంహరించుకోని, ఆధారపడని, సహాయసహకారాలు పొందని జీవన వ్యవస్థ ప్రపంచంలో ఇప్పటివరకూ ఏర్పడలేదు సరికదా ఏర్పడబోదుకూడా. సమాజంలోని మనుషుల నైపుణ్యాలలో, సహజ సామర్థ్యాలలో వైరుధ్యం వుండటం ఎంత సహజమో, అదే మేరకు వారిలో ఆర్థికపర వ్యత్యాసాలు ఉండటం కూడా సహజమే. ఈ వైరుధ్యాలను స్నేహపూర్వకంగా పరిష్కరించుకునే అత్యంత సహజమైన, సంక్షేమకరమైన పద్ధతిని ఇస్లాం ప్రతిపాదించింది. సమాజంలో కల్లోలం జనించకుండా ఉండటానికీ, మానవుల మధ్య స్నేహం, దయ, సౌభ్రాతృత్వం పరిఢవిల్లడానికి, సంబంధాలు దృఢం కావడానికి ధనవంతులు, విధిగా పేదవారికి సహాయపడాలి. శక్తిసామర్థ్యాలుగలవారు బలహీనులను విధిగా ఆదరించాలి. వారి అవసరాలు తీర్చే పనిని కర్తవ్యంగా స్వీకరించాలి.

ఆర్థిక వ్యవహారాలు వ్యక్తుల ప్రతిభాపాటవాలపై ఆధారపడివున్నప్పటికీ

స్థితిమంతుడు కూడా ఈ సమాజంలో సభ్యుడిగానే ఉంటాడు. ఈ కారణంగా అతడు ధనసంపత్తుల ఆధారంగా ఇతర ప్రజలతో వేరుపడి వారిని కేవలం తన విలాసాలకు సాధనాలుగా భావించే దోపిడిదారునిగా మారే హక్కు అతనికి లేదు. ఈ దోపిడీదారుని మానసికత కారణంగానే సమాజం కల్లోలజనితమవుతుంది. అల్లాహ్ వివిధ ప్రతిభలు గలవారిని కలిపి సమాజం సృష్టించాడు. వ్యక్తుల్లో సహజనైపుణ్యాలు ఉన్నప్పటికీ వారంతా సామాజిక చట్టంలో బంధించబడి ఉన్నారు. సంపన్నులకు వారి సంపద ఒక పరీక్షగా ఇస్లాం పేర్కొంది. సంపన్నులు తమ సంపదను ఇతర అవసరార్థులపై వారు ఎలా ఉపయోగిస్తారో అల్లాహ్ పరీక్షించదలిచాడు. ఈ కారణంగానే ఇస్లాం సంపదను ఒక పరీక్షా సాధనంగా పేర్కొనడం జరిగింది.

**"మేము మిమ్మల్ని ఒకరి కొకరు మరొకరిని పరీక్షా సాధనాలుగా చేశాము. నీవు సహనంతో వుంటావా? నీ ప్రభువు సర్వాన్నీ చూస్తున్నాడు." (ఖుర్ఆన్, 25:20)**

ఒక సమాజంలోని సభ్యులు పరస్పరం సహకారులుగా, దృఢమైన మానవ సంబంధాలు కలిగి ఉండనంత వరకు ఆ సమాజం అభివృద్ధి మైదానంలో నిలవ జాలదు. సమాజంలోని ఒక పెద్ద వర్గం, మరోవర్గం పట్ల వైషమ్యం, కసి కలిగిఉ ంటే - మరోవర్గం అనుమానం, హీనపూరిత భావజాలంతో వుంటే ఆ సమాజంలో శాంతి, సంక్షేమాలు, అభివృద్ధి వగైరాలను ఆశించడం గగనమై పోతుంది. ఇస్లాం సమాజాన్ని ఉత్తమస్థాయికి, ఉన్నత శిఖరాలకు చేర్చడానికి ఒక వైపున చట్టపరమైన కఠిన సూత్రా లను అమలుపరుస్తూ - మరోవైపున ధార్మికంగా, భావజాలపరంగా మానసిక తర్ఫీదుకూ పెద్ద పీటవేసింది. పేదవారిని (కష్టజీవులను) ఆదుకోవడం, అవసరార్థులకు సహకరించడం కేవలం వారికి మాత్రమే లాభదాయకం కాదు. ఈ చర్యల ద్వారా లభించే సామాజిక శాంతి ధనవంతుల క్షేమానికి కూడా అవసరమైనదేనని ఇస్లాం నొక్కి వక్కాణించింది. పరలోకంలో ఈ దాతృత్వగుణమే వారికి సఫలత అందించగల దని బోధించింది. హృదయ వైశాల్యం కలిగి మసలుకోండని ధనవంతులను హెచ్చరిం చింది :

**"చూడండి! అల్లాహ్ మార్గంలో ధనం ఖర్చుపెట్టండి అని మీకు పిలుపు ఇవ్వబడు తోంది. దాని విషయంలో మీలో కొందరు పిసినారితనంతో వ్యవహరిస్తారు. కాని పిసినారితనం మహించే వ్యక్తి నిజానికి తన పట్ల తానే పిసినారితనం చూపు**

**తున్నాడు. అల్లాహ్ అయితే ఎంతో సంపన్నుడు, మీరే ఆయనపై ఆధారపడి వున్నారు." (ఖుర్ఆన్, 47:38)**

# మనిషిని క్రుంగదీసే పేదరికం

పేదరికం మనిషిని కష్టాలకు, బాధలకు గురిచేస్తుంది. మనిషిని అతని సృష్టికర్త అల్లాహ్ ఏ స్థానంలో ఉంచదలిచాడో – ఆ ఉత్తమ స్థానం నుండి క్రిందికి నెట్టివేసే సాధనంగా పేదరికం పనిచేస్తుంది. అల్లాహ్ కారుణ్యం, వరప్రసాదాలను నిరాకరించే మానసిక ధోరణికి మనిషిని గురిచేస్తుంది. సృష్టిలో పరమోత్తమ స్థానం నుండి అతడిని దిగజార్చివేస్తుంది. చిరిగిన దుస్తులతో, చెదిరిన జుట్టుతో, తెగిన చెప్పులతో తన పేదరికాన్ని ప్రదర్శించుకుంటూ తిరగడాన్ని ఎవరి మనసూ అంగీకరించదు. కాలే కడుపుతో సంతృప్తికర ఆహారానికి నోచుకోని పరిస్థితిలో తిరుగాడుతూ ఉండటాన్ని ఎవరి మానసికతా అంగీకరించదు కదా!

ఎదుటి మనిషి కష్టాన్ని, పేదరికాన్ని చూసి ద్రవించని హృదయం హృదయమే కాదు. అది బండరాయి మాత్రమే. పేదవాని కన్నీటిని చూసి చలించని మనిషి మనిషే కాదు. అతనికి ముస్లింగా వుండే అర్హతే లేదు. ఇతరుల బాధను పంచుకోవడం మానవ లక్షణం. కఠిన హృదయులు కారుణ్య సుగుణ సువాసనను ఆఘ్రాణించలేరు. పేదరికాన్ని, పేదవానినీ చూసి చలించని మనిషిని అల్లాహ్ పట్ల భీతి కలిగి ఉండమని హెచ్చరించడం కూడా విశ్వాసపు షరతుల్లోనిదే.

ఒకసారి మానవ మహోపకారి (స)కు ఇటువంటి హృదయవిదారక దృశ్యం కంటపడింది. విశ్వకారుణ్యమూర్తి (స) హృదయం విలవిల్లాడిపోయింది. వెంటనే ప్రవక్త(స) ముస్లింలను సమావేశపర్చి ప్రభావవంతమైన ఉపన్యాసాన్ని ఇచ్చారు. మానవులపై ఇతర మానవుల హక్కుల గురించి, బాధ్యత, విధి, కర్తవ్యాల నిర్వహణ గురించి, అల్లాహ్ మరియు ప్రళయదినం గురించి భయపెట్టారు. పేదవారి హక్కుల చెల్లింపుల విషయంగా మనోహరంగా బోధించసాగారు. ప్రసంగం పూర్తిఅయ్యే సమయంలోగా అల్హందులిల్లాహ్ ఆ వ్యక్తిని సంపన్నునిగా చేసివేసేంత సంపద పోగయింది.

ఇబ్నె జరీర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం ఒకసారి మజర్ తెగకు సంబంధించిన కొంతమంది ప్రవక్త (స) సన్నిధికి ఏతెంచారు. వారి శరీరాలపై కేవలం ఒక్క అంగ

వస్త్రమే వుండి వాటికి అనేక చిరుగులు ఉన్నాయి. వారి ముఖాలపై ఆకలి ఛాయలు స్పష్టంగా కనిపించాయి. వారి ఈ దీన స్థితిని చూసిన విశ్వకారుణ్యమూర్తి హృదయం ద్రవించిపోయింది. ముఖకమలం కమిలిపోయింది. వెంటనే ఇంటిలోనికి వెళ్ళారు. తర్వాత బయటికి వచ్చి బిలాల్ (రజి)ను అజాన్ ఇవ్వమని ఆదేశించారు. తదుపరి నమాజ్ ఆచరించి ఉపన్యసిస్తూ ఈ క్రింది ఖురాన్ వాక్యాన్ని వినిపించారు:

**"మానవులారా! మీ ప్రభువుకు భయపడండి. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. అదే ప్రాణి నుండి దాని జతను సృష్టించాడు. ఇంకా ఆ జంట ద్వారా ఎంతోమంది పురుషులను, స్త్రీలను అవనిలో వ్యాపింపజేశాడు. ఏ దేవుని పేరు చెప్పుకొని మీరు పరస్పరం మీమీ హక్కులను కోరుకుంటారో ఆ దేవునికి భయపడండి. బంధుత్వ సంబంధాలను తెంచటం మానుకోండి. అల్లాహ్ మిమ్మల్ని పరికిస్తున్నాడనే విషయాన్ని తెలుసుకోండి." (ఖుర్‌ఆన్, 4 : 1)**

ఇంకా ....

**"విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. ప్రతి వ్యక్తీ తాను రేపటి కొరకు ఏమి సమకూర్చుకున్నాడో చూసుకోవాలి." (ఖుర్‌ఆన్, 59:18)**

ఆ తర్వాత ప్రవక్త(స) "ప్రతిమనిషీ తన వద్దనున్న దిర్హం, దీనార్, దుస్తులు, ఖర్జూ రాలు, గోధుమలు వగైరాలను అల్లాహ్ పేరుతో అవసరార్థులకు అందిస్తూ ఉండాలి. చివరికి ఒక్క ఖర్జూరపు పండునైనా సరే" అని హితవు పలికారు.

ప్రసంగం ముగిసిన వెంటనే ఒక అన్సారి తాను మోయగలిగినంత బస్తా నిండి ఖర్జూరాలను ప్రవక్త(స) సమక్షానికి తెచ్చాడు. చూస్తుండగానే, దుస్తులు ఆహార పదార్థాలు, ఇతర వస్తుసామగ్రి యొక్క కుప్పలు ప్రత్యక్షమయ్యాయి. ఈ దాతృత్వపు వాతావరణాన్ని గమనించిన కారుణ్యమూర్తి ముఖారవిందం మేలిమి బంగారంలా మిలమిల మెరవసాగింది. ఆ తదుపరి ప్రవక్త(స) :

"ఎవరైతే ఇస్లాంలో నా ఉత్తమమైన ఒక సాంప్రదాయాన్ని కొనసాగిస్తాడో – అల్లాహ్ అతనికి అత్యుత్తమ ప్రతిఫలం ప్రసాదిస్తాడు. దానిని ఆపై కొనసాగించే వారందరికీ కూడా అదేవిధమైన ప్రతిఫలాలు ప్రసాదించబడతాయి.

ఎవరైతే ఇస్లాంలో నాకు సంబంధంలేని దుష్ట (బిద్అత్) సాంప్రదాయాన్ని ప్రారంభిస్తాడో, అల్లాహ్ అతనికి కఠిన శిక్షను విధిస్తాడు. ఈ దుష్ట సాంప్రదాయాన్ని

కొనసాగించే వారందరికీ అదేవిధమైన కఠిన శిక్ష విధించబడుతుంది" అని వివరించారు. (ముస్లిం)

పై సుదీర్ఘ ప్రసంగం ప్రవక్త(స) దాతృత్వ, కారుణ్య హృదయానికి ప్రతీకగా నిలుస్తుంది. ముస్లిం సమాజపు నైజంగా వుండదగిన మహత్తర ఆచరణను మనకు అందిస్తుంది. కష్టకాలంలో, ప్రకృతి బీభత్సాలలో కనిపించే రిలీఫ్ చర్యలను మరిపిస్తుంది.

అదేసమయంలో ప్రవక్త(స) ఆచరణ, అల్లాహ్ హెచ్చరికలు సమాజంలోని ధనవంతులు, భూస్వాములకు హెచ్చరికగా ఉంది. దానధర్మాలకు, సహాయసహకారాలకు తమ సంపదను వెచ్చించకుండా, భోగవిలాసాలకు, సమాజంలో నూతన దుష్ట సాంప్రదాయాల ఆవిర్భావాలకు బీజంవేసే వారికి కఠిన శిక్ష, భీతిగొలిపే పర్యవసానాల హెచ్చరికలానూ ఉంది.

## దానం : ఇహపరాలలో సాఫల్యధామం

ధనసంపత్తులపై ప్రేమ, వాటిని పొందాలనే తాపత్రయం మనిషి నైజంలోనే నిక్షిప్తపర్చబడింది. వీటిని పొందటానికి మనిషి ఎన్నో కష్టాలను ఎదుర్కొంటాడు. నిరంతరం శ్రమకు లోనవుతాడు. వ్యక్తిగత లాభాపేక్ష, కొంత స్వార్థం, ప్రతి మనిషీ కలిగివుంటాడు. తన లాభానికి, సుఖానికి, ఇతరుల సుఖలాభాల కంటె ఎక్కువ ప్రాధాన్యతనిస్తాడు.

ప్రపంచంలోని నిధి నిక్షేపాలన్నీ, దైవం వద్ద నున్న వరప్రసాదాలన్నీ మనిషికి ఇచ్చినప్పటికీ, అతనికి సంతృప్తి కలుగదు. ఇంకా ఏదో కావాలనే తపన అతనిలో మిగిలేవుంటుంది. ఇవ్వబడిన సంపద మూలకంగా అనేక నైతిక సమస్యలకు లోనౌతాడు. అనైతిక చర్యలచే బాధించబడతాడు.

**"ప్రవక్తా! వారితో ఇలా అను : ఒకవేళ నా ప్రభువు కారుణ్య నిధులు మీ అధీనంలో వుండి ఉన్నట్లయితే అది ఖర్చయిపోతాయనే భయం వల్ల, వాటిని మీరు కదపకుండా ఉంచేవారు. యదార్థానికి మానవుడు ఎంతో సంకుచిత హృదయుడు." *(ఖుర్ఆన్, 17:100)***

దైవమార్గంలో సంపదను ఖర్చుచేయని పిసినారి మానసికతకు వ్యతిరేకంగా

ఇస్లాం, యుద్ధ ప్రకటన చేసింది. ఇహంలో విజయం, పరంలో సాఫల్యం కేవలం పిసినారి కాని వ్యక్తి మాత్రమే పొందగలడు. దాతృత్వం, కరుణ కలిగిన హృదయం మాత్రమే ఈ అర్హతకు నోచుకుంటుంది.

**"కనుక సాధ్యమైనంత వరకు అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. వినండి, విధేయత చూపండి, మీ సంపదను ఖర్చుపెట్టండి. ఇది మీకే శ్రేయస్కరం."**

***(ఖుర్‌ఆన్, 64 : 16)***

పోగుబడ్డ సంపద నుండి పేదవారికి, అవసరార్థులకు, వారి హక్కు భుక్తమైవున్న భాగాన్ని వేరుపర్చకపోతే, ఆ సంపద ఒక భయానకమైన విషసర్పంలా ఒక పీడ కలలా వెంటాడుతూనే ఉంటుంది. ప్రళయదినాన ఈ సంపద క్రూర సర్పంగా కోరలుచాస్తూ సదరు సంపద యజమానికై ఎదురుచూస్తూ ఉంటుంది. ఎదురుపడిన వెంటనే తన కోరల్లో బంధించడానికి ఆ వ్యక్తిని వెంబడిస్తుంది. చివరకు లోబర్చుకుంటుంది.

"ఎవరి సంపద నుండి పేదవాని హక్కు గల భాగం తీయబడదో – ఆ సంపద ప్రళయదినాన నల్లని విషసర్పంగా మారి ఆ వ్యక్తిని వెంబడిస్తుంద"ని ప్రవక్త(స) వారు స్పష్టపర్చారు." (బుఖారి)

ఇస్లాం తన అనుయాయులను సంపద ఖర్చుపెట్టే పద్ధతిని స్పష్టంగా నేర్పుతుంది. సంపదను దైవమార్గంలో, సత్కార్యాలకు ఖర్చుచేయడం లాభదాయకమైన వ్యాపారమని విశదపరుస్తుంది. సంపద, దాని వాస్తవికతను వివరిస్తూ దైవప్రవక్త (స) ఇలా తెలిపారు :

"దాసుడు నా సంపద! నా సంపద! అంటాడు. అయితే అతని సంపద కేవలం మూడు విధాలుగానే వుండింది. అతడు ఏదైతే తిన్నాడో, జీర్ణం చేసుకున్నాడో అది. ఏదైతే దుస్తులుగా తొడిగాడో – చినిగిపోయాయో అది. ఏదైతే ఇతరులకు దానం చేసి ప్రళయదినానికి భద్రపర్చుకున్నాడో అది. మిగిలినదంతా ముగిసిపోయింది. లేదా అతని చేజారిపోయింది." (ముస్లిం)

ఇహపరాల అవసరార్థంకాక, కేవలం వారసుల కోసం దాచిపెట్టబడే సంపద యొక్క వాస్తవికతను ప్రవక్త(స) ఇలా స్పష్టపర్చారు :

"మీ అవసరాల కోసం ఖర్చుపెట్టబడే సంపదకాక, మీ వారసుల కొరకు దాచబడే సంపదను ప్రేమించేవారు మీలో ఎవరైనా ఉన్నారా?" అని ప్రశ్నించారు.

అందుకు సహచరులు 'ఓ దైవప్రవక్తా! మేము మా మీద ఖర్చు పెట్టుకునే సంపదపైనే ఎక్కువ ప్రేమ కలిగి ఉంటాము' అన్నారు. అప్పుడు ప్రవక్త(స) "మీరు ఏదైతే అల్లాహ్ వద్దకు ముందస్తుగా (దానధర్మాల ద్వారా) పంపుకున్నారో ఆ సంపద మాత్రమే మీది. ఏదైతే మీరు వదలివెళ్ళారో అది మీ వారసులది సుమా" అని నుడివారు. (బుఖారి)

జకాత్ వసూలు చేసేవారు, చెల్లించేవారు ఉభయులకు ఆయా మర్యాదలను అత్యంత నిశిత దృష్టితో ప్రవక్త(స) వివరించారు. ఈ సందర్భంగా ప్రవక్త(స) శిక్షణ ఇలా ఉంది. జకాత్ వసూలులో అత్యంత మృదువు, మర్యాదల వైఖరిని అవలంబించారు:

"మరికొద్ది రోజులలో మీ వద్దకు జకాత్ వసూలు కోసం గుర్రపు స్వారీ చేస్తూ కొంతమంది రౌతులు (అధికారులు) వస్తారు. వారు మీ వద్దకు వచ్చినపుడు వారికి స్వాగతం పలకండి. జకాత్ వసూలులో (లెక్కలు తేల్చడంలో) వారికి పూర్తి స్వేచ్ఛను ఇవ్వండి. ఫలితంగా వారు మీ పట్ల పూర్తి న్యాయంతో వ్యవహరించగలరు. తద్వారా మీకు సంపూర్ణలాభాన్ని అందించగలరు. ఈ సందర్భంలో వారేదైనా కఠినత్వం ప్రదర్శిస్తే దాని ఫలితం వారితలకే చుట్టుకుంటుంది. వారి (జకాత్ వసూలుదారుల) మనస్సును కష్టపెట్టకండి. వారిని కసురుకోకండి. వారి బాధ్యతల నెరవేర్పులో మీ లాభం ఉంది. వారు మీ కొరకు అల్లాహ్ వద్ద దుఆ చేస్తారు." (అబూదావూద్)

మనిషి యొక్క విజయ – సాఫల్య మార్గంలో ఆటంకంగా నిలిచే పిసినారితనం, హ్రస్వదృష్టిని విడనాడాలి. అత్యంత ఉత్సాహంగా దైవమార్గంలో ఖర్చు చేసేందుకు ఉద్యుక్తుడవ్వాలి. తనకోసం – తన వారసుల కోసం కూడా ఉపయోగపడే ధన సంపాదనను కొనసాగించాలి. ఈ ప్రయాణంలో మనిషి మధ్యస్థ మార్గం అవలంబించాలి. ఈ క్రమంలో అతని హస్తాలు కట్టివేయబడకుండా ఉండాలి. ఇటువంటి వ్యక్తికి తన గురించి, తన వారసుల భవిష్యత్తు గురించి అతనికి ఎంతమాత్రమూ బెంగ ఉండనే వుండదు.

ఒకసారి, ఒక వ్యక్తి దైవప్రవక్త (స)ను "ఓ దైవప్రవక్తా! ఎటువంటి దానం అన్నింటికంటే ఉత్తమమైనది?" అని ప్రశ్నించాడు. అందుకు ప్రవక్త(స) "నీవు ఆరోగ్యవంతునిగా ఉండి, దానం చేసే సొత్తు యొక్క అవసరం నీకు ఉండీ, నీవు ఇబ్బందికి గురౌతూవుండీ చేసేదానం అతి ఉత్తమమైనది. దానాన్ని వాయిదావేస్తూ మరణ శయ్యకు దగ్గరయ్యే స్థితి తెచ్చుకోకండి. 'ఫలానా ఫలానా వారికి దానం చేయండి' అని వీలునామా రాసే దుస్థితికి దిగజారకండి' అని హితవు పలికారు." (బుఖారి)

పూర్తి ఉత్సాహంతో, కారుణ్యంతో దైవమార్గంలో చేసేదానం మనిషి పాపాలను ప్రక్షాళించివేస్తుంది. తప్పులను తుడిచివేస్తుంది.

**"మీరు, మీ దానధర్మాలను బహిరంగంగా చేసినా మంచిదే. కాని రహస్యంగా నిరుపేదలకు దానమివ్వడం మీకు ఎక్కువ మేలు చేకూరుస్తుంది. మీ దుష్కార్యాలు ఎన్నో దీనివల్ల సమసిపోతాయి. మీరు ఏమి చేసినా అది అల్లాహ్‌కు తెలుస్తుంది." *(ఖుర్‌ఆన్, 2:271)***

మరోచోట ...

**"తమ హృదయ లోభత్వం నుండి రక్షణ పొందినవారే సాఫల్యం పొందేవారు. మీరు గనక అల్లాహ్‌కు మంచి రుణం ఇస్తే, ఆయన మీకు దానిని ఎన్నోరెట్లు పెంచి తిరిగి ఇస్తాడు. మీ పొరపాట్లను మన్నిస్తాడు." *(ఖుర్‌ఆన్, 64:17-18)***

మనిషి ద్వారా ఏదైనా పాపం జరిగిపోయినప్పుడు, ఆ పాపకార్యం ద్వారా అల్లాహ్‌కు, ఆ దాసునికి మధ్య దూరం పెరిగిపోతుంది. ఆ దూరాలను తగ్గించీ, దైవాగ్రహాన్ని, అనుగ్రహంగా మార్చివేసేందుకు, అల్లాహ్ మార్గంలో తనకు అత్యంత ప్రియమైన ధనాన్ని దానం చేయడం తప్పనిసరి. ఈ దానం మనిషిని తిరిగి పరిశుద్ధునిగా మార్చివేస్తుంది. మనిషికి నూతన వెలుగును ప్రసాదిస్తుంది. పేదవారికి, అవసరార్థులకు సహాయపడటం ద్వారా కరుణామయుడైన అల్లాహ్ కారుణ్యానికి మనిషి అర్హుడౌతాడు.

హజ్రత్ అబూజర్ (రజి) ఇలా ఉల్లేఖించారు: "దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు : "బనీ ఇస్రాయీల్ ప్రజలలో నిరంతరం దైవధ్యానంలో నిమగ్నుడై ఉన్న ఒక సన్యాసి ఉండేవాడు. అతడు అరవై ఏళ్ళుగా ఒకకొండపై ఆశ్రమాన్ని నిర్మించుకొని దైవధ్యానంలో గడిపేవాడు. ఒక వర్షాకాలంలో కొండ క్రిందనున్న (పల్లె) గ్రామం పచ్చపచ్చగా కళకళలాడుతూ ఆ సన్యాసికి కనిపించింది. తన అవసరానికి సరిపడే రెండు రొట్టెలను తీసుకొని గ్రామం చూడటానికి క్రిందికి దిగాడు. గ్రామంలో అతనికి ఒక స్త్రీ పరిచయమైంది. మాటల్లో పరిచయం కాస్తా ప్రణయంగా మారిపోయింది. ఆ సన్యాసి తన తప్పు తెలుసుకొని దగ్గరలోని చెరువులో స్నానమాచరించడానికి వెళ్ళాడు. అక్కడ ఒక పేదవాడు సన్యాసిని భోజనం అర్థించగా, ఆ సన్యాసి తన వద్ద నున్న రెండు రొట్టెలను దానం చేసి స్నానంకై చెరువులో దిగి ప్రమాదవశాత్తు ఈత రాక మునిగి చనిపోయాడు. దైవసమక్షంలో ఆ సన్యాసి యొక్క 60 ఏళ్ళ ఆరాధన,

వ్యభిచార పాపానికి తుడిచిపెట్టుకొని పోయింది. అయితే చివరి నిముషంలో చేసిన ఆ రెండు రొట్టెల దానం అతని పుణ్యఫలాల త్రాసు పళ్ళాన్ని బరువుగా చేసివేసింది." (ఇబ్నె హిబ్బాన్)

దాతృత్వ గుణం మనిషిని పరలోక నష్టాల నుండి కాపాడుతుంది. అల్లాహ్ యొక్క క్షమ, మన్నింపులను మనిషిని అర్హునిగా మారుస్తుంది. ఈ విషయాన్ని దైవప్రవక్త (స) ఈ క్రింది ఉదాహరణ ద్వారా తెలియపర్చారు:

"నేను దానధర్మాలు చేయవలసిందిగా మిమ్మల్ని ఆజ్ఞాపిస్తున్నాను. దానధర్మాలు మీకు అత్యవసర సమయాల్లో ఆదుకునే సాధనాలవుతాయి. దాని ఉదాహరణ ఈ క్రిందివిధంగా ఉంది. 'ఒక వ్యక్తి శత్రువుల చేతికి చిక్కగా, అతని కాళ్ళు చేతులు బంధించబడ్డాయి. అతని శిరస్సు ఛేదించడానికి కరవాలమూ సిద్ధమైపోయింది. ఒక్క వేటుతో శిరస్సు వేరైపోయే సమయాన ఆ వ్యక్తి తన వద్ద భద్రపర్చబడివున్న సంపదను శత్రువుకు ఇస్తాననీ, దానిబదులుగా తనకు ప్రాణభిక్షపెట్టమని అర్థిస్తాడు. తుదకు తన భద్రపర్చబడిన సంపద ద్వారా తన ప్రాణాన్ని రక్షించుకుంటాడు." (హాకిం)

జకాత్, ఉష్ర్‌లాంటి దానధర్మాలు మనిషిని తన నిజ దైవానికి అత్యంత చేరువగా చేస్తాయి. ఇహపరసాఫల్యాలలో ఈ దానాలకు అత్యంత ప్రాముఖ్యత వుంటుంది. దానధర్మాలపై ఆధారపడి ఒక విశ్వాసి యొక్క ధార్మికత అంచనా వేయబడుతుంది. ధర్మంతో అతని బంధం యొక్క గట్టితనం, అతని దాతృత్వపు గుణం ద్వారానే బహిర్గతమవుతుంది. అల్లాహ్ అనుగ్రహం పట్ల అపనమ్మకం కలిగి, తన సంపద పట్ల పిసినారితనం చూపేవాడు నిజమైన విశ్వాసి కాజాలడు. తత్భిన్నంగా విశ్వ ఖజానాకు అధిపతి అయిన అల్లాహ్ ప్రీతి తనకు లభించడం తన అదృష్టంగా భావించాలి. తన అభివృద్ధికి తన దానగుణం, మార్గం సుగమం చేయగలదని విశ్వసించాలి.

దైవప్రవక్త (స) ఇలా వివరించారు: "సత్కార్యం, దానం మనిషిని పాపకార్యాల నుండి రక్షిస్తుంది. రహస్యంగా చేసేదానం దైవాగ్రహాన్ని చల్లబరుస్తుంది. సత్కార్యం దాతృత్వగుణం మనిషి ఆయుష్షును పెంపొందిస్తుంది." (తిబ్రాని)

మరో ప్రవచనంలో ఇలా ఉంది: "మీ సంపద నుండి జకాత్ తీయడం ద్వారా మీ సంపదను పరిశుద్ధపర్చుకోండి. రోగులకు చికిత్స చేయించండి. కష్టాల అలలను దానం – దుఆల ద్వారా ఛేదించండి." (అబూదావూద్)

షైతాన్‌ను ఓడించి, అతని కుట్రలను ఛేదించే, అతని దుష్ట చేష్టలకు చెంపపెట్టు

పెట్టే ఏకైక ప్రధాన సాధనం దానం. దానం ద్వారా మనిషి హృదయం వికసిస్తుంది ... విశాలమవుతుంది. దాన గుణం మనిషిని ధైర్యశాలిగా తీర్చిదిద్దుతుంది. అశాశ్వత మైన ఈ లోకం నుండి శాశ్వతమైన పై లోకంతో సంబంధం కలగజేస్తుంది. దివ్య ఖురాన్ ఇలా హెచ్చరించింది :

**"దారిద్ర్య ప్రమాదం నుండి షైతాను మిమ్మల్ని భయపెడతాడు. నీతిబాహ్యమైన, నీచమైన మార్గం అవలంబించండి అని ప్రేరేపిస్తాడు. కాని, మిమ్మల్ని క్షమిస్తానని, అనుగ్రహిస్తాననీ అల్లాహ్ వాగ్దానం చేస్తున్నాడు. అల్లాహ్ అత్యంత ఉదార స్వభావుడు, అన్నీ తెలిసినవాడు." *(ఖుర్‌ఆన్, 2:268)***

ఒక ప్రవచనంలో ఇలా ఉంది : "మనిషి దానం చేయాలని తలచి అందుకు ఉద్యుక్తుడవుతూ ఉండగా అతనిని నిలవరించడానికి 70 మంది షైతానుల బృందం అతనిని కమ్ముకుంటుంది." (అహ్మద్)

మనిషి తన నెలసరి సంపాదనను ఆయా పద్దుల క్రింద ఖర్చుచేసే ప్రణాళికను సిద్ధం చేసుకుంటాడు. అందులో అన్నపానీయాలకు, భార్యాబిడ్డల క్షేమానికి, వైద్య–విద్యావసరాలకు ఇతర కుటుంబ అవసరాలకు వెచ్చిస్తాడు. ఆ జాబితాలో దానధర్మాలకు 'స్థానం' సాధారణంగా ఉండదు. ఇది అనవసరమైన పద్దులాగా మనిషి భావిస్తాడు. వాస్తవమేమిటంటే, ఏదైతే దాన ధర్మాల పద్దు క్రింద ఖర్చుచేస్తాడో – అది మాత్రమే తన వెంట వస్తుంది. నిజమైన పొదుపు దానధర్మాలలో దాగి ఉంటుంది.

హజ్రత్ ఆయెషా (రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త(స) ఒక రోజున ఒక మేకను జిబహ్ చేశారు. దాని మాంసాన్ని దానం చేశారు. అప్పుడు ప్రవక్త(స), "అందులో ఏదైనా మిగిలివుందా?" అని ప్రశ్నించారు. అందుకు ఆయెషా (రజి) 'దాని ముందు కాలిలోని కొంత భాగం మిగిలివుంది' అని జవాబిచ్చారు. అప్పుడు ప్రవక్త(స) "అంతా పొదుపుకు గురిఅయింది. ఒక్క ముందు కాలి భాగం మాత్రమే పొదుపుకు నోచుకోలేదు" అని అన్నారు. (తిర్మిజి)

పై ప్రవచనం ఈ క్రింది అల్లాహ్ ఆదేశానికి అనుగుణంగా చెప్పబడింది :

**"మీ దగ్గరున్నదంతా ఖర్చు అయిపోయేదే. అల్లాహ్ వద్ద ఉన్నదే అసలు మిగిలి ఉండేది." *(ఖుర్‌ఆన్, 16 : 96)***

మరో హదీసె ఖుదసీలో ఇలా సెలవివ్వబడింది : "ఓ ఆదం కుమారుడా! నీ ఖజానాను అల్లాహ్ మార్గంలో వ్యయపర్చు. నా వద్ద (నీవు పంపిన) ఈ సంపద

మునగనూ మునగదు. కాల్చబడి మసిగా మారదు. దొంగలించనూబడదు. (నా మార్గంలో) ఖర్చుచేయబడిన సంపదకు ప్రతిగా ఏది కోరినా అది నీకు ప్రసాదించబడుతుంది." (బైహఖీ)

## దాన ధర్మాలు సంపద వృద్ధికి సోపానాలు

దాన ధర్మాల గుణం మనిషిని పేదవానిగా మార్చివేస్తుందనే ఆలోచన తరచుగానూ, సహజంగానూ ప్రతి మనిషికీ కలుగుతుంది. ఫలితంగా మనసు కల్లోల భరితమవుతుంది. ఈ ఆలోచన షైతాన్ ప్రేరితంగా భావించాలి. సంపద యొక్క చల్లని నీడలో శయనిస్తూ వున్న వ్యక్తి ఈ ఆలోచనకు ఉలిక్కిపడకతప్పదు. నిజానికి దానధర్మాలు మనిషి యొక్క సంపదవృద్ధికి మార్గాలు. అల్లాహ్ ప్రసాదించిన సంపదను అల్లాహ్ మార్గంలో, విశాల హృదయంతో రెండు చేతులా దానధర్మాలు ఆచరించే వారి పట్ల, ఖజానాల అధిపతి అయిన అల్లాహ్ పరమ సంతుష్టుడవుతాడు. ఫలితంగా వర్తమాన భవిష్యత్‌లలో కూడా ఆ దానశీలికి తన కారణంగా కటాక్షాలతో ముంచివేస్తాడు. ఒక ప్రవక్త ప్రవచనంలో ఇలా తెలుపబడింది:

"ముగ్గురు వ్యక్తుల గురించి నేను రూఢీగా చెప్పగలను. దాన ధర్మాలు చేసే దైవదాసుని సంపద ఈ కారణంగా తరిగిపోదు. దౌర్జన్యంపై సహనం పాటించిన వాని మానమర్యాదల పరిరక్షణను అల్లాహ్ స్వీకరిస్తాడు. పిసినారితనపు తలుపులు తెరిచిన దాసుని వైపునకు అల్లాహ్, దారిద్ర్యం, దీనత్వాల తలుపులు తెరుస్తాడు." (ఇబ్నెమాజా)

మనిషి దానశీలిగా వుండాలి. విశాల హృదయం, దాతృత్వపు గుణం అలవర్చుకోవాలి. సమాజంలో ఆర్థిక అసమానతల ద్వారా చెలరగే కల్లోలాలను నిలవరించాలి. అవసరార్థుల అవసరం కోసం చేతులు చాచినప్పుడు వారిని సంతృప్తికరంగా సాగనంపాలి. తద్వారా అల్లాహ్‌తో లాభదాయక వ్యాపారం చేయాలి. ఇహంలో గౌరవాన్ని, పరంలో సాఫల్యాన్ని అందించే వ్యాపారం ఇది తప్ప మరేది కాగలదు?

'ఒక హదీసె ఖుదసీలో యిలా సెలవివ్వబడింది."అల్లాహ్ యిలా ఆజ్ఞాపిస్తున్నాడు. "ఓ దాసుడా! ఖర్చుచేయి! ఖర్చు చేయి! (అల్లాహ్ మార్గంలో) ఖర్చుచేయడం నీకు విధి చేయబడింది. అల్లాహ్ హస్తాలు ఎప్పుడూ నిండి వుంటాయి. రేయింబవళ్ళు ప్రసాదించినా అందులో ఏ కొరతా ఏర్పడదు. భూమ్యాకాశాల సృజనలో అల్లాహ్ ఖర్చుపెట్టినది ఎంతో ఊహించగలవా? ఆయన అధికారపు (అర్ష్) పీఠం సమస్త

సృష్టిపై ఆవరించి వున్నప్పుడూ ఆయన చేతుల బంధించబడలేదు. ఆయన చేతిలో సమతూకపు త్రాసు వుండీ – అది నిరంతరం క్రిందికీ మీదికీ ఊగుతూ వుంటుంది." (బుఖారి)

అల్లాహ్ యిలా ఆదేశిస్తున్నాడు.

**"మీరు దానిని ఖర్చు చేసినప్పటికీ దాని స్థానంలో ఆయనే మీకు మరింత యిస్తాడు. ఉపాధి ప్రదాతలందరికంటే ఆయనే ఉపాధి దాత"**

***(ఖుర్ఆన్, 34 : 39)***

సుఖ సంతోషాలలోనూ, లాభనష్టాలలోనూ, దానధర్మాలు చేసే వారు పై రెండు స్థితులలోనూ అల్లాహ్ కృపకు అర్హులు అవుతారు. దైవదూతలు వారి సంపదలో వృద్ధి కొరకు, అల్లాహ్ను వేడుకుంటారు. వారిపై శాంతి శుభాల దరూద్లను పంపుతూ వుంటారు. తత్వ్యతిరేకంగా పైసా పైసా లెక్కించి దాచిపెట్టే వారు తమకు నష్టాన్ని మాత్రమే చేర్చుకుంటున్నారు. వారు నిరంతరం తమ సంపదతోనే అంటిపెట్టుకొని వుంటారు. అయితే, ఈ సంపద వీరి వద్ద శాశ్వతంగా వుంటుందా? ఈ సంపద వేరొకరి వద్ద నుండి ఇతని వద్దకు వచ్చి చేరినదేకదా? మరి ఇతని వద్ద నుండి వేరొకరి వద్దకు వెళ్ళదని గ్యారంటీ వుందా? ఇటువంటి చంచలమైన సంపదపై అహంకారం, గర్వం ఎందుకు? ధనమదం, సంపద గర్వం, తద్వారా మనిషి తనలోని నీచత్వాన్ని మాత్రమే బహిర్గతపర్చుకుంటాడు.

మనిషి ఈ భూమ్యాకాశాల మధ్యనున్న ఏ వస్తు సంపదతో అంటిపెట్టుకొని వున్నాడో. ఆ సంపదకు నిజమైన వారసుడు సృష్టికర్త అల్లాహ్ మాత్రమే. ఈ సంపద మొత్తానికి ఏవిధమైన సంబంధం లేక ఖాళీ చేతులతో వచ్చాడో – అదే విధంగా ఖాళీ చేతులతో విశ్వప్రభువు సమక్షానికి చేరుకుంటాడు. ఏ సంపద పట్ల పిసినారితనం వహించాడో – ఆ సంపద ప్రళయదినాన అతనికి ఉరిత్రాడులా దాపురిస్తుంది. వారు భూమిలో తమకు ప్రసాదించబడిన సంపదను తమ మనోకాంక్షల నెరవేర్పు కోసం మాత్రమే వెచ్చించారు. అవసరమైన దైవమార్గంలో వారు తమ సంపదను ఖర్చు చేయని ఫలితంగా అల్లాహ్ వారి పట్ల ప్రతీకారం తప్పక తీర్చుకుంటాడు.

'దైవసందేశహరులు (స) యిలా సెలవిచ్చారు, "ప్రతిరోజూ శుభోదయ సమయాన ఇద్దరు దైవదూతలు భువిపైకి ఏతెంచుతారు. అందులో ఒకరు, "ఓ ప్రభూ! నీ మార్గంలో సంపదను ఖర్చుచేసేవానికి దాని పరిపూర్ణ ఫలితాన్ని ప్రసాదించు." అని

ప్రార్థిస్తాడు. మరొకరైతే "ఓ ప్రభూ! నీ మార్గంలో ధనాన్ని ఖర్చుచేయని పిసినారిని సర్వనాశనం చేసివేయి" అని వేడుకుంటాడు." (ముస్లిం)

## పేదరిక నిర్మూలనా ఉద్యమం

మనిషి, తానూ – తన సంతానం సుఖంగా జీవించడానికే సంపదను కోరుకుంటాడు. తద్వారా విసిరే సవాళ్ళను తట్టుకొని భవిష్యత్తులో ఆర్థిక రక్షణ పొందాలని భావిస్తాడు. స్వభావరీత్యా ఈ ఆలోచన సవ్యమైనదే. ఇస్లాం ప్రతి వ్యక్తినీ, తన సంతానానికి అవసరమైన ఆర్థిక రక్షణఐ కల్పించమని చెబుతుంది. వారు దారిద్ర్యానికీ, పేదరికానికీ గురికాకుండా వుండేందుకు అవసరమైన రక్షణాత్మక పద్ధతిని అవలంబించమని హితవు పలికింది. ఇతరుల దారిద్ర్యాన్ని పారద్రోలే ఉపాయాలతోపాటు, స్వయంగా తన యింటిని కూడా దారిద్ర్యం నుండి రక్షించుకునే మార్గాలనూ ఇస్లాం అందించింది. ఒక ప్రవక్త (స) ప్రవచనంలో ఇలా సెలవివ్వబడింది:

"మీరు మీ వారసులను కనీస ధనవంతులుగా చేసివెళ్ళండి. వారిని ఇతరుల వద్ద చేయి చాచేవారిగా, దరిద్రులుగా, పేదవారిగా వదలివెళ్ళకండి." (బుఖారి)

పిల్లల పోషణ, వారి భవిష్యత్తును తీర్చిదిద్దడం, పెద్దల కర్తవ్యం అయినప్పటికీ – ఈ బాధ్యత పరదా వెనుక ధర్మాన్ని, ధర్మాచరణను బలిపెట్టడం సమంజసం కాదు. తన సంపదను పిల్లల భవిష్యత్తుకోసం భద్రపర్చకపోవడం దైవాదేశాల ధిక్కారంగా పరిగణించబడుతుంది.

ఇస్లాం, ధనసంపత్తులతోపాటు సంతానాన్ని కూడా అల్లాహ్ వరప్రసాదంగా ప్రకటించింది. ఈ వరప్రసాదాలు రెండు కూడా మనిషికి పరీక్షా సాధనాలేనని స్పష్టం చేసింది. ఈ పరీక్షా సాధనాలను లక్ష్యాలుగా మార్చుకొని అందులోనే కూరుకుపోయిన మనిషి స్వయంగా తనకు తానే నష్టాన్ని కొనితెచ్చుకుంటాడు. చివరకు పరీక్షా సాధనాలు మనిషికి శత్రువుకంటే కూడా ఎక్కువ నష్టానికి గురిచేస్తాయి.

**"విశ్వాసులారా! మీ భార్యలలో, మీ సంతానంలో కొందరు మీకు శత్రువులు; వారి విషయంలో అప్రమత్తంగా వుండండి. ఒకవేళ మీరు ఉపేక్షించి, మన్నిస్తే అల్లాహ్ క్షమించేవాడూ, కరుణించేవాడూనూ. మీ సిరిసంపదలూ, మీ**

సంతానమూ మీకొక పరీక్ష. అల్లాహ్ వద్దనే గొప్ప ప్రతిఫలం వుంది."

**(ఖుర్‌ఆన్, *64 : 14-15*)**

ఒక వ్యక్తి తన భార్య వ్యామోహంలో పడి దైవమార్గంలో శ్రమించడం పట్ల నిర్లక్ష్యం వహిస్తే - పిల్లల భవిష్యత్తు గురించి బెంగపడుతూ దైవమార్గంలో ఖర్చు చేయడానికి వెనుకంజవేస్తే - అటువంటి వ్యక్తి అల్లాహ్ ప్రసాదించిన పై వరప్రసాదాల పట్ల ద్రోహిగా భావించబడతాడు. ఈ వరప్రసాదాలన్ని తనకు పరీక్షా సాధనాలేననే సత్యాన్ని గ్రహించలేని అజ్ఞానిగా, బుద్ధిహీనునిగా మిగిలిపోతాడు. ఖ్వాలా బిన్తె హకీం (రజి) ఉల్లేఖనం ప్రకారం:

ప్రవక్త (స) తన ఒక మనవడిని ఒడిలో తీసుకుని వున్నారు. అప్పుడు ఆ పిల్లలతో ఇలా పలికారు, "మీరు పిసినారితనానికి, పిరికితనానికి, అజ్ఞానానికి, అహంకారానికి కారకులుగా వున్నారు. అదే సమయంలో మీరు అల్లాహ్ యొక్క సువాసన కూడానూ." (తిర్మిజి)

అనగా పిల్లలు, వారి భవిష్యత్తు తల్లిదండ్రులకు పరీక్షలు. అదే సమయంలో దైవప్రసాదాలు కూడాను. వారి ద్వారా మనిషి ఏది పొందాలనుకుంటాడో - వాటిని పొందవచ్చు. పిల్లల భవిష్యత్తు పట్ల బెంగతో మనిషి తన నిజ దైవాన్ని విస్మరించడం తనకు నష్టదాయకమని తెలుసుకోవాలి. సంపద ఒకే వ్యక్తి వద్ద శాశ్వతంగా వుంటుందనే గ్యారంటీ ఏమీలేదు. తాతముత్తాతలు సంపాదించిన కొండంత ఆస్తి తరిగిపోయి వారసులు బికారుల్లా తిరుగుతూ వుండటం మనకు తెలిసిన వాస్తవమే. సంపద వాస్తవికత - దాని ఖర్చు చేయడం గురించి అబ్దుల్లాహ్ బిన్ మస్‌ఊద్ (రజి) ఉల్లేఖనం యిలా తెలియపర్చింది:

"ప్రవక్త (స) యిలా నుడివారు" అల్లాహ్ రెండు రకాల దాసులకు ఎంతో ధనాన్ని, సంతానాన్ని ప్రసాదించాడు. అందులోని ఒక రకం వారితో అల్లాహ్ యిలా ప్రశ్నిస్తాడు, "ఓ ఫలానా వ్యక్తి కుమారుడా! నేను, నీకు ఎంతో సంపదను, ధనరాశులను ప్రసాదించలేదా?" అందుకు ఆ బృంద సభ్యులు - 'ఓ మా ప్రభూ! నీవు మాకు తప్పక ప్రసాదించావు" అని బదులిస్తాడు. అందుకు అల్లాహ్ "మరి ఆ సంపదను ఏమి చేసి వచ్చావు" అని తిరిగి ప్రశ్నిస్తాడు. దాసుడు జవాబుగా "ఓ మా ప్రభూ! ఆ సంపదను మేము, మా సంతానం దారిద్ర్యానికి లోనుకాకూడదని వారికి వదలివేసి వచ్చాము" అని బదులిస్తారు. అప్పుడు విశ్వప్రభువు "నీకు ఇప్పటి వాస్తవం తెలిస్తే

నీవు తక్కువ నవ్వుతావు. మరి ఎక్కువగా ఏడుస్తావు సుమా! నీవు ఏ విషయం (దారిద్ర్యం) గురించి నీ బిడ్డల పట్ల భీతి చెందుతూ వుండినావో – అదే నేను వారికి అందజేశాను" అనీ బదులిస్తాడు."

ఆ తరువాత రెండవ రకం వారిని అల్లాహ్ పిలుస్తాడు వారు హాజరయ్యాము ప్రభూ!' అంటూ హాజరవుతారు. మొదటి రకం వారిని ప్రశ్నించినట్లుగానే వీరినీ ప్రశ్నిస్తాడు. వారు "మేము నీ మార్గంలో నీవు ప్రసాదించిన ధనాన్ని ఖర్చు చేసాము. మా పిల్లలను నీ కారుణ్య ఛాయలో, నీ కృపానీడలో వదిలివచ్చాము" అంటారు. అప్పుడు విశ్వప్రభువు. "వినండి! మీకు నేటి వాస్తవం తెలిస్తే ఎక్కువగా ఆనందిస్తారు. చాలా తక్కువ దుఃఖిస్తారు. మీరు మీ సంతానాన్ని ఏ స్థితిలో, ఏ నమ్మకంతో వదిలి వచ్చారో – మేము వారిని దానికి పాత్రులుగా చేశాము" అని ప్రకటిస్తాడు. (తిబ్రాని)

ఇస్లాం మనిషిని ముందుగా తన స్వయంపట్ల, ఆ తరువాత ఇంటివారి పట్ల, ఆపై తన పొరుగు వారిపట్ల కరుణ కలిగి మెలగమని హితువు గరిపింది. ధర్మబద్ధ వ్యక్తిగత అవసరాలు తీర్చుకోవడం ద్వారా మనిషి తన స్వయంపట్ల బాధ్యత నిర్వర్తిస్తాడు. అందుకుగాను, ఆకలి, దారిద్ర్యం, పేదరికం నుండి తన్నుతాను కాపాడుకోవటానికి అవసరమైన ధర్మబద్ధమార్గాలు ఎంచుకోవాలి. తద్వారా సమాజంలో గౌరవనీయునిగా, సమాజాన్ని ప్రభావితం చేసేవానిగా ఎదగాలి. పిసినారితనం సంకుచితత్వం, అనవసర దుబారా ఖర్చుల ద్వారా మనిషి గౌరవం కోల్పోతాడు. ఒక ముస్లిం తన సమాజంలో దీనునిగా, హీనునిగా జీవించడు. తన అవసరాలు తీర్చుకోడానికి అవసరమైనంత సంపాదన లేనివాడు ఫకీరుగా, అవసరార్థిగా భావించబడతాడు., అబూ సయీద్ ఖుద్రీ (రజి) ద్వారా యిలా ఉల్లేఖించబడింది:

'ఒక నిస్సహాయకుడైన వ్యక్తి మస్జిదె నబవీలో ప్రవేశించాడు. ఆ సమయంలో దైవప్రవక్త (స) ప్రజలకు దానధర్మాలు చేయడం గురించి ఉత్సాహపరుస్తున్నారు. ప్రజలు తమ తమ దానాలను ప్రవక్త(స) సమక్షంలో జమచేయసాగారు. అందునుండి ప్రవక్త(స) రెండు జతల బట్టలను అతనికి ప్రసాదించారు" (అబూ దావూద్)

ప్రవక్త (స) సమాజంలోని పేదవారిని, దారిద్ర్యం నుండి బయటపడటానికి అవసరమైన అన్ని చర్యలనూ తీసుకున్నారు. అయినా కొంతమంది ధర్మం పేరుతో తమ్ముతాము దరిద్రులుగా, నిస్సహాయులుగానే వుంచుకునేవారు. దైవప్రవక్త (స)

ఇటువంటి మానసికతను వ్యతిరేకించారు. ఇస్లామీయ వ్యవస్థలోని ప్రజలు నిస్సహాయులుగా, దరిద్రులుగా వుండటాన్ని ఇస్లాం అంగీకరించదు. సమాజంలోని ప్రతి మనిషి తన సంపాదన, ప్రవర్తన, నైతికతల పునాదులపై గౌరవించబడాలని ఇస్లాం అభిలషిస్తుంది.

'జాబిర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, 'ఒక వ్యక్తి బంగారపు చిరు ముద్దను దైవ ప్రవక్త (స) వద్దకు తెచ్చి సదఖా (దానం)గా యివ్వబోతూ 'ఓ దైవప్రవక్తా! ఇది నాకు ఒక గని ద్వారా లభ్యమయింది. నా వద్ద ఈ ధనం తప్ప మరే ధనమూ లేదు. మీరు దీనిని సదఖాగా స్వీకరించండి' అని విన్నవించుకున్నాడు. ప్రవక్త(స) అతని నుండి సదఖా తీసుకోకపోగా ముఖం తిప్పుకున్నారు. ఆ వ్యక్తి మరలా అటు తిరిగాడు. చివరకు ఆ వ్యక్తి నలువైపుల నుండి పదే విజ్ఞప్తి చేయసాగాడు. అప్పుడు ప్రవక్త (స) కోపంగా ఆ బంగారు చిరు ముద్దను తీసుకొని విసురుగా అతనిపై విసిరారు. ఆ తర్వాత....

"మీలో చాలా మంది తమ వద్ద నున్న సంపద మొత్తాన్ని సదఖాగా (దానంగా) యివ్వడానికి తీస్తున్నారు. ఇది సరైన విధానం కాదు. ఇప్పుడు మొత్తం సదఖా చేయడం, ఆ తరువాత అవసరార్థులై చేయిచాస్తూ నిస్సహాయులుగా తిరగడం ఆమోదించ బడదు. నిజానికి సదఖా ఒక ధనికుని వద్ద నుండి రావాలి సుమా" అని శిక్షణ గరిపారు.

## మీ సంపదకు మొట్టమొదటి హక్కుదారులు

కుటుంబ సభ్యుల నిత్యావసరాలను తెలుసుకోవడం, వాటిని తీర్చడం కుటుంబ యజమాని యొక్క విధి. వ్యక్తి తన భార్యాపిల్లలను, ఇతర కుటుంబ సభ్యు లను నిస్సహాయులుగా వదిలివేసి ఇతరత్రా కార్యక్రమాల కోసం ధనం వెచ్చించడాన్ని ఇస్లాం అంగీకరించదు. కుటుంబ సంబంధాలు అన్ని సంబంధాల కంటే అత్యంత ప్రాముఖ్యత కలిగి వుంటాయి.

'దైవప్రవక్త (స) ఈ విధంగా హితవు పలికారు." ఒక దీనార్ అల్లాహ్ మార్గంలో ఖర్చు చేయబడుతుంది. మరో దీనార్ బానిస విడుదల కోసం ఖర్చు చేయ బడుతుంది. మరొక దీనార్ తన కుటుంబ సభ్యుల కోసం ఖర్చు చేయబడుతుంది... కాని ఈ దీనారులన్నింటిలో కుటుంబ సభ్యులపై ఖర్చుచేయబడిన దీనారు అత్యంత పుణ్యఫలదాయినిగా వుంటుంది." (ముస్లిం)

మరొక సందర్భంలో 'నిబద్ధత' (ఇఖ్లాస్)పై చర్చిస్తూ ప్రవక్త(స) యిలా సెలవిచ్చారు. "ఒక విశ్వాసి అల్లాహ్ ప్రీతిని పొందే ఉద్దేశ్యంతో తన కుటుంబ సభ్యుల అవసరాల కొరకు ఖర్చు చేయడం కూడా 'సదఖా'గా భావించబడుతుంది." (బుఖారి)

ఇస్లాం సమాజంలో ఆర్థిక సమతుల్యత కోసం అవసరమైన అన్ని చర్యలూ తీసుకుంది. సమాజానికి పునాది కుటుంబం. కుటుంబం దృఢంగా ఆరోగ్యంగా కళకళలాడుతూ వుంటే సమాజం కూడా అదే విధంగా వుంటుంది. ఈ కారణంగానే ఇస్లాం మొదట కుటుంబ సంస్కరణకు అత్యధిక ప్రాధాన్యత కల్పించింది.

పై హితవులు, నిర్లక్ష్యంగా వ్యవహరించే కుటుంబ యజమానులకు ఒక హెచ్చరిక లాంటివి. బయట స్నేహితుల కోసం, వ్యక్తిగత జల్సాల కోసం, విపరీతంగా ధనం వ్యయపర్చేవారు తమ కుటుంబ సభ్యుల విషయంలో అత్యంత కఠినులుగా, దరిద్రులుగా వ్యవహరిస్తాడు.

ఒక మనిషి యొక్క ధర్మబద్ధ సంపాదనలో మొట్టమొదటి హక్కు అతని కుటుంబ సభ్యులకు మాత్రమే వుంటుంది. సద్ఖా కొరకు పైకి లేచిన హస్తాలు మొట్ట మొదట తన రక్త సంబంధీకుల వైపు తిరుగవలసి వుంటుంది. తన చుట్టుప్రక్కల వారు అవసరార్థులై వుంటే – దూరంగా వున్న వారిని వెతకడం వివేకమనిపించుకోదు. దగ్గరి వారిని నిర్లక్ష్యపర్చి ఇతరులకు సహాయపడటం ద్వారా దగ్గరి వారి మనస్సుల్లో అసూయ, ద్వేషం పెంపొందడానికి కారకులు కావడం తెలివితక్కువతనం కాదా? సదఖా ఇతరుల మనస్సులను గెలచుకోవడానికే తప్ప గాయపర్చడానికి కాదు. 'సదఖా', సదఖా యొక్క ప్రయోజనాన్ని పూర్తి చేసేదిగా వుండాలి. అప్పుడే దానివల్ల సంపూర్ణ ప్రయోజనం చేకూరుతుంది.

'ఒక ప్రవచనంలో ప్రవక్త (స) యిలా హెచ్చరించారు. "ఓ ముహమ్మద్ అనుచర సమాజమా! ఎవరి చేతిలో నా ప్రాణాలు బందీ అయి వున్నాయో ఆ సృష్టికర్త అల్లాహ్ సాక్షి! తన దగ్గరి బంధువులు సహాయార్థులై వుండగా వారిని వదిలి ఇతరులకు సహాయపడే వారి సదఖా అల్లాహ్ వద్ద అంగీకరించబడదు. ఎవరి అధీనంలో నా ప్రాణం వుందో ఆ శక్తి సాక్షి! ప్రళయ దినాన అల్లాహ్ ఈ వ్యక్తి వైపు కన్నెత్తి కూడా చూడడు." (తిబ్రాని)

"అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) గారి శ్రీమతి జైనబ్ (రజి) యిలా ఉల్లేఖిస్తున్నారు. దైవప్రవక్త (స) మహిళలను ఉద్దేశించి, "ఓ మహిళా బృందమా! సదఖా చేయండి. అవసరమైతే మీ నగలను అమ్మి అయినా సరే." అని సెలవిచ్చారు. అప్పుడు నేను నా భర్తను ఉద్దేశించి '(నేను ధనికురాలిని) మీరు కడుపేదవారు ప్రవక్త (స) (మాకు దానధర్మాలు (సదఖా) చేయమని ఉపదేశించారు. నేను మీకు సహాయపడటం, సదఖా యొక్క ప్రతిఫలానికి హక్కుదారునౌతానా? లేదా? లేని పక్షంలో నేను వేరే వారికి సదఖా చేయవలసి వుంటుంది. కనుక, మీరు వెళ్ళి దైవప్రవక్త (స)ను ఈ విషయంగా ధర్మసూక్ష్మం తెలుసుకొని రండి" అని చెప్పాను. అందుకు నా భర్త మస్ఊద్ (రజి) ఈ విషయం మీరే తెలుసుకుంటే మంచిది కదా? అన్నారు. ఇదే సమస్యతో సతమత మవుతూ వున్న మరో అన్సారీ మహిళతో కలిసి నేను దైవప్రవక్త (స) గృహానికి చేరుకు న్నాము. ప్రవక్తశ్రీ లోపల వున్నారు. హజ్రత్ బిలాల్ (రజి) బయట వున్నారు. నేను వారికి విషయమంతా వివరించి "ఇద్దరు మహిళలు బయట వున్నారు. వారు తమ పేదవారైన భర్తలకు సహాయపడటం, తమ ఒడిలో ఎదుగుతున్న అనాథ పిల్లల కోసం ఖర్చు చేయడం 'సదఖా' పరిధిలోకి వస్తుందా? రాదా? అడిగే మహిళలు ఎవరో మీరు చెప్పవలసిన అవసరం లేదు" అని అన్నాను.

హజ్రత్ బిలాల్ (రజి) ఈ సమస్యతో ఇంటిలోకి వెళ్ళారు. ప్రవక్త(స) వద్ద ఈ ధర్మ విషయాన్ని అడిగి తెలుసుకున్నారు. అప్పుడు ప్రవక్త(స) "ఆ ఇద్దరు మహిళలకూ సదఖా సంబంధ పుణ్యమూ, కుటుంబ సభ్యులకు సహాయపడిన పుణ్యమూ రెండూ లభిస్తాయి" అని పలికారు." (బుఖారి)

మరో సందర్భంలో దైవప్రవక్త (స) యిలా ఉద్ఘాటించారు" పేదవారికి సహాయపడటం సదఖా. రక్త సంబంధ బంధువులకు సహాయపడటం రెండింత సదఖా. ఒక పుణ్యఫలం సదఖా కొరకు కాగా, రెండవది రక్త సంబంధ కారుణ్యానికి చెందినది" (తిర్మిజి)



# 16వ భాగం

# సహనం

- సహనం - కాంతి ధ్వజం
- సహనానికి రెండు ఆధారాలు
- సహనం వీర లక్షణం
- సమస్యలను ఆహ్వానించడం - విశ్వాస వ్యతిరేకం
- యవ్వన హక్కుల నెరవేర్పు
- సహజ నైజాల నియమబద్ధత
- సహనానికి అనేక రూపాలు

# సహనం - కాంతి ధ్వజం

"సహనం ఒక కాంతిపుంజం" (ముస్లిం) జీవితపు అల్లిబిల్లిదారుల్లో. ఆపదలు – కష్టాలు ఎదురైనప్పుడు, ఆందోళనల అంధకారాలు అలుముకున్నప్పుడు సహనం ఒక్కటే మనిషికి వెలుగుగా ఉపయోగపడుతుంది. ఒక ముస్లిం యొక్క అడుగులు తడబడకుండా, మార్గం తప్పకుండా కాపాడుతుంది. నిరాశా నిస్పృహల సుడిగుండం నుండి కాపాడుతుంది. సహనగుణం ద్వారానే ఒక ముస్లిం తన ఇహపరాల మార్గాన్ని సరిదిద్దుకోగలడు. సహనం పునాదులపైనే మనిషి తన జీవన కార్యాలన్నింటిని నెరవేరుస్తాడు. తన కోరికల, మనోకాంక్షల నెరవేర్పులో సహనాన్ని కరదీపికలా ఉపయోగిస్తాడు. జీవిత మైదానంలో ఎదురయ్యే ఓటములు, అపజయాలు, ఎదురు దెబ్బలను సహనం ద్వారానే ఒక విశ్వాసి ఎదుర్కొంటాడు. బాధ్యతల నుండి పారిపోని ధైర్యాన్ని, ఫలితాల కొరకు ఎదురు చూడక ముందుకు సాగిపోయే మొక్కవోని ధీరత్వాన్ని సహనమే అందిస్తుంది. భవిష్యత్తు పట్ల అంతులేని నమ్మకంతో, సంపూర్ణ ఆత్మ విశ్వాసంతో లక్ష్యాన్ని చేరుకోవడానికి ఎటువంటి భయానికి లోనుకాకుండా ఒక విశ్వాసి సహనం యొక్క సహకారంలోనే పయనిస్తాడు. కష్టాల కారుమబ్బులు తొలగి, విజయాల ఉషోదయం తప్పక ఆవిష్కరించబడుతుందని సహనశీలి అయిన విశ్వాసి మాత్రమే నమ్ముతాడు. విజయం కొరకు సహనంతో ఓర్పుతో వేచి వుంటాడు.

అల్లాహ్ సహనపు ప్రాధాన్యతను వివరిస్తూ – ఎవరినీ పరీక్షించకుండా వదలడం జరగదనీ, ఈ పరీక్షల్లో ఎదురయ్యే కష్టనష్టాలను, సమస్యలను మనిషి సహనంతో ఎదుర్కోవాలనీ, అస్థిరత్వానికీ, నిరాశా నిస్పృహలకు గురికారాదని ఆదేశించాడు.

**"మేము మిమ్మల్ని తప్పకుండా పరీక్షిస్తాము, తద్వారా మీ స్థితిని నిర్ణయిస్తాము. మీలో అల్లాహ్ మార్గంలో గట్టిగా కృషి చేసేవారు ఎవరో, స్థిరచిత్తులు ఎవరో చూస్తాము"** ***(ఖుర్ఆన్, 47 : 31)***

కష్టాల తిమిరాలు ఒక విశ్వాసిని మరింత దృఢ విశ్వాసిగా మార్చుతాయి. అతని ఆలోచనలు మరింత పదునెక్కుతాయి. విభిన్న పరిస్థితులను ఎదుర్కొను, సవాళ్లను ఎదురించే చతురత అలవడుతుంది. ఈ విషయాన్నే ఒక కవి ఇలా కవిత్వీకరించాడు.

కష్టాల కడలి విరుచుకుపడక మునుపే దానికై ఎదురు చూశాను. అది నన్ను అలుముకున్నప్పుడు చిరునవ్వుతో దాటుకుంటూ సాగిపోయాను.

## సహనానికి రెండు ఆధారాలు

సహనం రెండు సత్యాల (ఆధారాల) సహకారం తీసుకుంటుంది. ఇందులో మొదటి ఆధారం ఇహలోక సంబంధమైనది. అనగా, సృష్టికర్త అల్లాహ్ ఇహలోకాన్ని, శాంతి, సంతృప్తుల- శిక్షా, బహుమానాల నిలయంగా చేయలేదు. ఇహలోకం మనిషికి ఒక పరీక్షా కేంద్రంగా చేయబడింది. మనిషి ఇక్కడ అనేక పరీక్షలకు గురవుతాడు. ప్రపంచ గమనంలో, మనిషికి దొరికిన సమయంలో అనేక అనుభవాలను పొందుతాడు. ఈ పరీక్షలు సయితం ఒక్కొక్కరికి ఒక్కొక్కరకంగా, విభిన్నంగా వుంటాయి. ఇనుము కొలిమిలో కాల్చబడి, ప్రత్యేక రూపాన్ని పొందిన తరువాత, చల్లటి నీటిలో ముంచబడుతుంది. ఇదే విధంగా మనిషి కూడా విభిన్న పరిస్థితుల ద్వారా పరీక్షింపబడతాడు.

ప్రవక్త సులేమాన్ (అలై)కు అల్లాహ్ విశేషమైన అధికారాలు విశాలమైన సామ్రాజ్యం, ప్రసాదించినపుడు ఆయన, ఈ ప్రపంచపు వాస్తవికతను బాగా ఎరిగి వున్నందున, ఆయన విశ్వప్రభువును ఇలా వేడుకున్నాడు.

**"ఇది నా ప్రభువు అనుగ్రహం. నేను కృతజ్ఞతలు తెలుపుతానో లేక కృతఘ్నుడనై పోతానో పరీక్షించడానికి ఆయన ఇలా చేశాడు. ఎవడైనా కృతజ్ఞతలు తెలుపుకుంటే, అతని కృతజ్ఞతలు అతనికే లాభదాయకమవుతాయి. అలాకాక కృతఘ్నుతకు పాల్పడితే నా ప్రభువు నిరపేక్షాపరుడు, తనంతట తానే ఘనుడైన వాడు."** ***(ఖుర్ఆన్, 27 : 40)***

బాధలు, కష్టాలు, దుఃఖాలు మనిషిని పరీక్షించే సాధనాలు, యుద్ధ మైదానంలో శత్రువుతో పోరాడే సైనికుని నుండి మనం ఉత్తేజాన్ని ఉదాహరణనూ స్వీకరిస్తూ వుండాలి. కొన్ని సందర్భాలలో సైనికుడు వీరోచితంగా పోరాడుతూ తన విలువైన ప్రాణాలను సయితం బలిపెట్టవలసి ఉంటుంది. శత్రుసైనిక శిబిరాన్ని ఓడించడానికి విభిన్న రకాల యుద్ధ పథకాలనూ రచిస్తాడు. వ్యూహాలను పన్నుతాడు ఈ చర్యలు రెండు వైపులా జరుగుతాయి. ఇరువురికీ పరీక్షల్లా వుంటాయి. ఈ పరీక్షల నుండి ధైర్యంగా ముందుకు సాగినవారే తుదకు విజయులవుతారు.

మనిషి జీవిత చక్రం కూడా ఇటువంటిదే. ఇక్కడ మనిషి వివిధ రకాల పరీక్షలకు గురవుతాడు. కొన్ని సందర్భాలలో ఓడిపోతాడు. ఈ పరిస్థితిలో మనిషికి సహనం, ఓర్పు వహించడం తప్ప మరే మార్గమూ వుండదు. ఇక్కడ విజయం, సఫలత పొందడానికి, అపజయాల లోతుల నుండి విజయాల మెట్లపైకి ఎగబ్రాకడానికి సహనంతో నిరంతరం శ్రమించడం, అవిరళ కృషి జరగడం తప్పనిసరి అవుతుంది.

ఈ జీవితంలో మనిషి ఎదుర్కొనే పరీక్ష ఎటువంటిది? దీనికి సంబంధించిన పరీక్షా పత్రం ఏది? ఈ ప్రశ్నాపత్రం నింపడానికి అవసరమైన సమాధానాలు ఉపదేశాలు వున్నాయా? అని ఆలోచిస్తే, మనిషికి ఎదురయ్యే కష్టాలు, బాధలు, దుఃఖాలు ఇతర సమస్యలే ఆ పరీక్షలని ఇట్టే అర్థమవుతుంది. ఈ పరీక్షల మూలంగానే మనిషి ఆందోళన, అశాంతి, అస్థిరతలకు లోనవుతాడు. ఈ కష్టాల కడలియే మనిషిని మనోకాంక్షల దాసునిగా మార్చివేస్తుంది. ఈ పరీక్షలే మనిషిని అత్యంత స్వార్థపరునిగా ఎముకల వెంటపడి కొట్లాడుకునే కుక్కల్లా మార్చివేస్తాయి. ఇరువురు మిత్రుల మధ్య తీవ్ర వైరాన్ని, జాత్యాహంకార భావజాలాన్ని రేకిత్తిస్తాయి. ఒకరి హక్కులను మరొకరు కొల్లగొట్టే వారిగా, ఇందుకోసం రక్తపాతానికి సయితం ఒడిగట్టే నరరూప రాక్షసులుగా మలుస్తాయి.

మానవ చరిత్ర ప్రారంభం నుండి ఇప్పటి వరకూ ఇటువంటి హృదయ విదారక సంఘటనలతోనే కొనసాగింది. గుంతలు, ముళ్ళ పొదలతో నింపబడి వున్న ఈ జీవిత మార్గంలో మనిషి స్వయంగా తన సాఫల్య రాచమార్గాన్ని తయారుచేసుకో వలసి వుంది.

ఇక రెండవ విషయం విశ్వాసంతో సంబంధం కలిగి ఉంది. మనిషికి అతని ప్రభువుతో గల సంబంధాన్నే విశ్వాసం అని పిలుస్తాము. మానవ సంబంధాలలో మిత్రుత్వం దాని స్వచ్ఛతలు, కష్టాలు ఆపదల సమయంలో మాత్రమే బహిర్గతమవుతాయి. విశ్వాసంలో కూడా ఇటువంటి పరిస్థితియే వుంటుంది. సృష్టికర్త, ప్రభువు అయిన అల్లాహ్ పట్ల ఒక దాసుని నిబద్ధత ఏ స్థాయిలో వుందో దానిని కేవలం పరీక్షించడం ద్వారానే తెలుస్తుంది. ఒక విశ్వాసి ఇదే విధంగా పరీక్షించబడతాడు. ఈ పరీక్షల కొలిమి నుండి మేలిమి బంగారంలా బయటికి వస్తాడా? లేదా? అనేది తేల్చివేయబడుతుంది.

"మేము విశ్వసించాము" అని అన్నంత మాత్రాన్నే వారిని వదిలివేయడం జరుగుతుందనీ, వారిని పరీక్షించటం జరగదనీ ప్రజలు భావిస్తున్నారా? వాస్తవానికి

మేము వారికి పూర్వం గతించిన వారందరినీ పరీక్షించాము. అల్లాహ్‌కు సత్యవాదు లెవరో, అసత్యవాదులెవరో తప్పనిసరిగా చూడవలసి వున్నది." (29 : 1-3)

నిస్సందేహంగా అల్లాహ్ జ్ఞానం, గోచర అగోచర విషయాలన్నింటిపై ఆవరించి వుంది. ఆయన జ్ఞానంలో ఎప్పటికీ ఎదుగుదల అనేది అవసరమే వుండదు. ఎందుకంటే, ఆది నుండి అంతం వరకు గల సర్వజ్ఞానమూ ఆయన స్వంతమే. దైవజ్ఞానం పునాదులపై మనిషిని విచారించడం న్యాయం కాదు. వ్యక్తి యొక్క వ్యక్తిగత ఆచరణల పునాదులపైనే అతని విచారణ జరుగుతుంది. తీర్పుదినాన ఈ పరీక్షా కాలంలోని సాక్షులు, వారి సాక్ష్యాలు అన్ని సిద్ధంగా వుంటాయి. చివరికి ప్రతివ్యక్తి యొక్క అవయవాలు కూడా సాక్ష్యమిస్తాయి.

**"మేము వారందరినీ సమావేశపరిచే రోజున ముష్రిక్కులను ఇలా అడుగు తాము. "మీరు మీ దైవాలుగా భావించి నిలబెట్టిన ఆ భాగస్వాములంతా ఇప్పుడెక్కడు న్నారు? అప్పుడు వారు, "ఓ మా ప్రభూ! నీతోడు! మేము ముష్రిక్కు లము కానేకాము. అని (అసత్యం) పలకడం తప్ప వేరే కుతంత్రం సృష్టించ లేరు. చూడండి అప్పుడు వారు తమను గురించి తామే ఏ విధంగా అబద్ధాలు కల్పిస్తారో అక్కడ వారి బూటకపు దేవుళ్ళందరూ మటుమాయమై పోతారు.**

***(ఖుర్‌ఆన్, 6 : 22-24)***

కనుక ఒక వ్యక్తి యొక్క ఇహలోకపు ఆచరణ, అతని పరలోకపు విశ్వాసంపై ఆధారపడి వుంటుంది. ఈ రెండు సూత్రాలపైనే సహనం ఆధారపడి వుంటుంది. ఇస్లాం మనిషి నుండి ఈ వైఖరినే ఆశిస్తుంది. కాని, మనిషి వాస్తవాలను చూచీ చూడనట్లు ప్రవర్తించడం ద్వారా కష్టాలు, ఆపదలకు లోనై అశాంతికి గురవుతాడు. కష్టాలు, ఆపదలను ఎదుర్కొనే ఈ క్రమంలో మనిషి అత్యంత సహజంగా సహనాన్ని కోల్పోతాడు. ఈ స్థితిలో విశాలంగా వున్న ఈ భూమి అతనికి ఇరుకైపోతుంది. ఈ బాధలు కష్టాలు, నష్టాల నుండి బయటపడటానికి ఆత్రంగా అడ్డదారులన్ని తొక్కతాడు. ఈ అడ్డదారుల ప్రయాణంలో మనిషి విజయం సాధించలేని అజయునిగా మిగిలి పోతాడు. ఎందుకంటే, ఈ ప్రయత్నం అల్లాహ్ విధి విధానాలకు, ఆయన సాంప్రదా యాలకు వ్యతిరేకమయింది. ఒక ముస్లిం సహనంతో ఆచరణ కొనసాగిస్తూ, అల్లాహ్‌పై పూర్తి విశ్వాసంతో అవసరమైతే ఒక సుదీర్ఘ కాలం ఫలితం కోసం ఎదురు చూడాలి. అందుకు అలవాటుపడాలి.

**"మానవుడు తొందరపడే ప్రాణి. ఇప్పుడే నేను నా సూచనలను చూపిస్తాను. నన్ను తొందరపెట్టకు."** ***(ఖుర్ఆన్, 21 : 37)***

మహాప్రవక్త (స) ప్రచనంలో యిలా సెలవివ్వబడింది, "సహనం పాటించే వ్యక్తికి అల్లాహ్ సహనం ప్రసాదిస్తాడు. మానవునికి సహనం కంటే గొప్పదైన కానుక ఏదీ యివ్వబడలేదు." (బుఖారి)

## సహనం వీరలక్షణం

సహనం, ఔన్నత్యానికి, పరిపూర్ణతకు, వీరత్వానికి నిదర్శనం. పరిసరాల పరిశీలనకు, వాటి ద్వారా ఎదురయ్యే కష్టనష్టాల నుండి కాపాడుతుంది. ఈ కారణం గానే అల్లాహ్ నామాలలో 'సమీర్' అనే పేరు చోటు చేసుకుంది. ఈ గుణవిశేషణ కారణంగానే అల్లాహ్ తన దాసుల్లోని పాపాత్ములను సహనంతో వ్యవధినిస్తాడు. శిక్ష విధించడంలో తొందరచేయక, ఆసల్యం చేస్తాడు. మనుషులు చెడు వైపునకు త్వరగా ఆకర్షింపబడతారు. కాని, సృష్టికర్త అల్లాహ్ తన తీర్పును ఒక్కోసారి శతాబ్దాల్లో పూర్తి చేస్తాడు. పాపాత్ములకు ఒక సుదీర్ఘ కాలం వ్యవధినిస్తాడు. వారి తప్పులను వెంటనే శిక్షించటం అల్లాహ్ సాంప్రదాయం కాదు.

**"వారు శిక్ష కొరకు తొందరపడుతున్నారు. అల్లాహ్ తన వాగ్దానానికి భంగ కరంగా ఎంతమాత్రం వ్యవహరించడు. కాని, నీ ప్రభువు వద్ద ఒక రోజు అంటే మీ లెక్కలో వేయి సంవత్సరాలకు సమానమవుతుంది."** ***(ఖుర్ఆన్, 22 : 47)***

సహనం వీరుల, ధైర్యవంతుల లక్షణాల్లో ఒకటి. జీవిత భారాన్ని బలహీనులు, బక్కచిక్కినవారు మోయలేరు. బరువుగల వస్తువుల మోతను పిల్లలు వృద్ధులు, బలహీనులకు అప్పజెప్పము గదా? ఇస్లామీయ ధర్మస్థాపన అనే మహత్తరమైన, మహా గొప్ప బాధ్యతను కూడా దృఢంగా, బలంగా సామర్థ్యం వున్న సహనశీలి మాత్రమే నిర్వ హించగలడు. ఒక స్థితి నుండి మరో పరిస్థితిలోనికి నడిపంచగల బరువు బాధ్యతలు శక్తిహీనులకు, అసహనం కలవారికి అప్పజెప్పడం జరగదు. ఈ కారణంగానే ప్రపంచంలోని గొప్ప గొప్ప నాయకులు, లీడర్లు తమ తమ సామర్థ్యాల మేరకు పని చేయడంతోపాటు కష్టాలను, నష్టాలను ఎదుర్కొనే ధైర్యం స్థయిర్యాలు కలిగి వుండే వారు. ఒక ప్రవచనంలో యిలా వుంది:

"ఎవరి పరీక్ష చాలా కఠినంగా వుంటుంది? అని ప్రవక్త (స)ను ఒక వ్యక్తి అడిగాడు. అందుకు ప్రవక్త (స) మొదట ప్రవక్తలది, ఆ తరువాత వారికంటే తక్కువ స్థానం కలవారిది. ప్రజలను వారి వారి ధార్మిక స్థితిని బట్టి పరీక్షించడం జరుగుతుంది. ధర్మంలో దృఢత్వంగల వారి పరీక్ష కూడా అదే స్థాయిలో వుంటుంది. ధార్మిక బలహీనుల పరీక్ష బలహీనంగానే ఉంటుంది. మానవులను నిరంతరం పరీక్షిస్తూ వుండటం జరుగుతుంది. పరీక్షలో ఉత్తీర్ణులైన వారిపై ఎటువంటి పాపమూ వుండదు." (హిబ్బాన్)

అలసట, శ్రమ, అశాంతి, కష్టాలు ఆపదల మధ్య హెచ్చుతగ్గులు వుంటాయి. అది వారి సహనం, ఓర్పు, సామర్థ్యం, శక్తియుక్తులపై ఆధారపడి వుంటుంది. గౌరవోన్నతుల ఈ రహస్యాన్ని తెలుసుకున్న ఒక అమెరికన్ లీడర్ ముస్లింలను ఉద్దేశించి "అల్లాహ్ మీ భారాన్ని తగ్గించాలనీ ప్రార్థించండి. మిమ్మల్ని మరింత శక్తియుక్తులుగల వారిగా తీర్చిదిద్దమని వేడుకోండి" అని సలహా యిచ్చాడు. పరిస్థితుల అన్ని అనుకూలంగా వుంటే, బలహీనుడైన పిల్లవాడు కూడా చాలా పనులు చేయగలుగు తాడు. కాని, జీవితంలో ఎదురయ్యే కార్యకలాపాలు, విధులు, బాధ్యతలు, దుఃఖాలు, ఆపదలు, యుద్ధాలు, వాటి అనుభవాలు కృషి-ప్రయత్నాలు, అలసటలు అన్ని వీరులకు సంపతులుగా వుంటాయి.

ఇంటిలో సురక్షితంగా కూర్చొని వున్న వ్యక్తికి బయట వున్న దుమ్ము ధూళిల గురించి తెలిసే అవకాశమే లేదు. యుద్ధ రంగం నుండి పలాయనం చిత్తగించే భీరువుడైన సైనికునికి ఆయుధాల బరువు, గాయాల బాధ వ్యధ, యుద్ధ పర్యవసానపు విచారాలతో సంబంధమేముంటుంది? జీవితపు యుద్ధ మైదానంలో దుమికి, అందులో నిమగ్నమైన వారు మాత్రమే కష్టనష్టాలను, గాయాల బాధలను ఎదుర్కొ గలడు. అలసట, పీడనల కష్టాలను భరించగలడు. ఇటువంటివారే మదమతిప్పుని వీరులుగా ముందుకు సాగుతారు.

ఈ కారణంగానే ఇస్లాం ఇహలోక పరీక్షల్లో, రోజువారీ సమస్యల్లో మునిగి వున్న వారిని గౌరవించి ప్రోత్సహిస్తుంది. అలిసిపోయిన వారిని, ఆపద దుఃఖాలలో వున్న వారిని ఓదార్చి మనశ్శాంతి చేకూరుస్తుంది. మనసులను తేలిక పరుస్తుంది. ఒక ఉల్లేఖనంలో యిలా చెప్పబడింది:

"విశ్వాసి ఒకే సమయంలో సున్నితమైన, మృదువైన - చాలా దృఢమైన

మొక్కలా వుంటాడు. గాలి తన ఊపులతో ఒక్కోసారి అతనిని పడవేస్తుంది. మరోసారి లేచి నిలబెడుతుంది. ఈ క్రమంలోనే తన జీవితాన్ని పూర్తి చేసుకుంటాడు. కాని అవిశ్వాసి ఒక బలహీన లాంటివాడు. గాలి ఒక్క ఊపుకే పెకిలించి వేయబడతాడు." (ముస్లిం)

జీవిత రణరంగంలో కృషి చేసే ఒక విశ్వాసి కష్టాలకు, ఆపదలకు చిరునామాగా మారుతాడు. పిరికితనంతో పలాయన మంత్రం పఠించినవానికి ఏ ఆపదా రాదు కదా? ఈ విషయంగా దైవప్రవక్త (స) యిలా బోధించారు.

"ఎవరికైతే అల్లాహ్ మంచిని ప్రసాదించదలుస్తాడో – ఆ వ్యక్తిని తప్పకగాయ పరుస్తాడు" (బుఖారి) మరో ఉల్లేఖనంలో యిలా వుంది:

"అల్లాహ్ ఏ జాతిని యిష్టపడతాడో – ఆ జాతిని ముందుగా పరీక్షకు గురి చేస్తాడు. ఆ పరీక్షకు ఆ జాతి సంతోషపడితే, ఆ సంతోషమే ఆ జాతికి చాలు. ఆ పరీక్ష పట్ల అసంతృప్తి చెందిన జాతికి ఆ అసంతృప్తియే శిక్షగా మారుతుంది." (తిర్మిజి)

జీవిత సమస్యలతో పోరాడుతూ, వాటిని ఓడిస్తూ, వాటి ద్వారా ఓడబడుతూ వున్న వ్యక్తి అల్లాహ్‌కు ఎంతో ప్రియతముడు. దూరం నుండే తమాషా చూస్తూ సమస్యలతో పోరాడకుండానే ఓడిపోయే భీరువును అల్లాహ్ ఇష్టపడడు.

జీవిత పోరాటంలో సహనం, ధైర్యసాహసాలు ప్రదర్శించిన వ్యక్తికి తీర్పు దినం నాడు లభించే కానుకలు – ఒక నమాజీకి, విధులను నిర్వర్తించిన ఒక పుణ్యాత్మునికి లభించే కానుకల కంటే కూడా ఎంతో అధికంగా వుంటాయి. ఒక ఉల్లేఖనంలో ఈ విషయం యిలా తెలుపబడింది:

"ఇహలోకంలో భోగ విలాసాల్లో జీవితం గడిపిన వారు, తీర్పు దినంనాడు సహన స్థయిర్యాలతో జీవన పోరాటం జరిపిన వారికి లభించే అనుగ్రహాలు, బహుమతులు చూసి అసూయ చెందుతారు. 'ఇహలోకంలో మేము కూడా మా చర్మాలను యిలా కత్తిరించుకొని వుంటే ఎంత బాగుండేది' అని విచారిస్తారు." (తిర్మిజి)

## సమస్యలను ఆహ్వానించడం - విశ్వాస వ్యతిరేకం

ఆశ్చర్యకర విషయమేమంటే; కొందరు ఇస్లాంను కష్టాలు, ఆపదలు కొని తెచ్చుకునే ధర్మంగా అర్థం చేసుకుంటున్నారు. ఆపదలకు ఆహ్వానం పలకడం ద్వారానే గౌరవం లభిస్తుందని, సౌభ్రాతృత్వం జనింపజేస్తుందని భావిస్తారు.

ఇది అత్యంత తీవ్రమైన అపోహ మాత్రమే. అనస్ బిన్ మాలిక్ ఉల్లేఖనం ప్రకారం, "ఒక వృద్ధుడు తన ఇరువురు కుమారుల సహాయంతో నడిచి వెళ్ళడం దైవ ప్రవక్త (స) చూశారు. ప్రవక్త(స) విషయాన్ని అడిగి తెలుసుకోగా, ఈ వృద్ధుడు కాలి నడకన హజ్‌కు వస్తానని మొక్కుకున్నట్లు తెలిసింది. అప్పుడు దైవప్రవక్త (స) 'తన్ను తాను బాధకు గురి చేసుకోవడాన్ని అల్లాహ్ అనుమతించడు' అని పలికి, ఆ వ్యక్తిని వాహనంపై ఎక్కమని ఆదేశించారు." (బుఖారి)

'ఇబ్నె అబ్బాస్ ఇలా ఉల్లేఖించారు, "ఉఖ్‌బ చెల్లెలు కాలినడకన హజ్ చేస్తానని మొక్కుకుంది. ఈ విషయం దైవప్రవక్త (స)కు తెలిసింది. అప్పుడు ఆయన "మీ చెల్లెలు నడుస్తూ హజ్ చేయడాన్ని అల్లాహ్ ఏ మాత్రం యిష్టపడడు. ఆమెను వాహనం సిద్ధపర్చుకోమను. పరిహారంగా ఒక జంతువును ఖుర్బానీ యివ్వమను" అని ఉఖ్‌బాతో చెప్పారు." (అబూదావూద్)

ఈ విషయంగా అల్లాహ్ ఆదేశం యీ క్రింది విధంగా వుంది:

**"మీరు కృతజ్ఞతలు చూపే దాసులుగా, విశ్వాసమార్గంలో నడుస్తూ వున్నపుడు అల్లాహ్ నిష్కారణంగా ఎందుకు శిక్షిస్తాడు. అల్లాహ్ యోగ్యతకు ఎంతో విలువ నిస్తాడు. ఆయన అందరి స్థితినీ ఎరిగినవాడు."** ***(ఖుర్‌అన్, 4 : 147)***

ఇస్లాం – కష్టాల్లో, ఆపదల్లో, పరీక్షల్లో వున్న వారిని ప్రశంసించడం ద్వారా వారిలో ధైర్యం, ప్రోత్సాహం, దృఢత్వం, విశ్వాసంలో ఉన్నతత్వం కలుగజేస్తుంది. వ్యక్తి, బాధలకు, వ్యాధులకు లోనై వ్యాకులపడి వున్నప్పుడు, తనలోని శక్తి సామర్థ్యాల ద్వారా, సహనం ఓర్పుల ద్వారా, సదరు సమస్య నుండి బయటపడమనీ– సోమరితనం, పిరికితనాలను దరిచేరనీయవద్దనీ బోధిస్తుంది. నా తలరాత (తఖ్దీర్) యింతేనని చతికిలపడవద్దని హితవు పలుకుతుంది.

ఒక హదీసులో యిలా చెప్పబడింది. 'దైవప్రవక్త ముహమ్మద్ (స) ఒక వ్యాధి గ్రస్తురాలైన స్త్రీని పరామర్శించడానికి వెళ్ళారు. ఆమె తన వ్యాధిని తిడుతూ జ్వరాన్ని నానా శాపనార్థాలు పెడుతూ వుండటం చూసి ఆమెను వారించారు. ఎంతో సానుభూతిని ఆమెపై కరిపిస్తూ, "ఈ జ్వరం ఆదం సంతానపు పాపాలను పోగొడుతుంది. ఇనుము యొక్క తుప్పును కొలిమి దూరం చేసినట్లుగా" అని చెప్పారు. (ముస్లిం)

యుద్ధ సమయంలో ఒక విశ్వాస సైనకుని శరీరం బురదమట్టితో నిండి

వుంటుంది. యుద్ధంలో అనేక బాధలకు కష్టాలకు ఆ సైనికుడు గురవుతాడు. అయితే ఆ సైనికునికి ఎదురయ్యే ప్రతి బాధ అతని స్థానాన్ని మరింత ఉన్నతం చేస్తుంది. దైవానికి సన్నిహితునిగా చేస్తుంది.

ఒక విశ్వాసికి నిరంతరం ఎదురయ్యే కష్టాల వల్ల అతను 'తనను అల్లాహ్ మరిచిపోయాడేమో' అనీ 'తనను తన కారుణ్యానికి దూరం చేసాడేమో' అనీ భావిస్తాడు. ఇది అత్యంత నీచమైన ఆలోచనగా అర్థం చేసుకోవాలి. ఇటువంటి బలహీనమైన నీచస్థాయి భావనలు నేటి ముస్లింలో వ్యాపించి వున్నాయి. నిజానికి మనిషికి ఎదరయ్యే ఈ కష్టాలు అతని భవిష్యత్తుకు ఉపయోగపడతాయి. ఆశయాల, ఉద్దేశ్యాల దృఢత్వానికి ఉపయోగకారులవుతాయి.

## యవ్వన హక్కుల నెరవేర్పు

దైవప్రవక్త ముహమ్మద్ (స) యిలా సెలవిచ్చారు: "తండ్రి, తాత, ముత్తాతలు ఉత్తములుగా వున్న ఆ వ్యక్తి ఉత్తముడు. ఆయన యూసుఫ్ బిన్ యాఖూబ్ బిన్ ఇస్‌హాఖ్ బిన్ ఇబ్రాహీం" (బుఖారి)

ప్రవక్త యూసుఫ్ (అలై) ప్రవక్తల ఒడిలో సంరక్షణ, శిక్షణ పొందిన వ్యక్తి. ఆయన ఉత్తమ వంశానికి చెందినవారు. ఉత్తమ శీల సంపదగలవారు. పవిత్రజీవితపు ముద్రలను అల్లాహ్‌చే పొందినవారు. ఈ అత్యుత్తమ వ్యక్తి తన జీవనపు ప్రారంభ దశల్లోనే అనేక కష్టాలు, ఒకదాని తర్వాత మరొకటిగా పొందారు. బాల్యంలోనే తల్లిని కోల్పోయారు. సవతి సోదరులు ఆయనకు వ్యతిరేకంగా కుట్రలు పన్నారు. తండ్రి వాత్సల్యానికి కూడా నోచుకోని విధంగా ఆయనను బావిలో పడవేశారు. ఒక బాటసారుల బృందం ఆయనను బావి నుండి తీసి ఉచితంగా దొరికిన బానిసగా భావించి అతి కొద్ది ధనానికే ఆయన బానిసల బజారులో అమ్మివేయబడి, ఈజిప్ట్ అంతఃపురంలోకి చేరుతారు. అంతఃపుర స్త్రీల నీచకుట్రలకు గురై అల్లాహ్ సహాయంతో పరిరక్షించబడి నేరస్తునిలాగా చెరసాలలో అనేక సంవత్సరాలు బంధించబడ్డారు.

ఒక సాధారణ వ్యక్తి అయి వుంటే తనకు ఎదురైన బాధలు, వ్యధలు, అవమానాలకు రోధిస్తూ ధైర్యాన్ని కోల్పోయి, ధైర్యాన్ని నిందించి వుండేవాడు. కాని, ఉత్తమ వ్యక్తిత్వంగల యూసుఫ్ (అలై) విశ్వాసానికి వెలుగు స్థంభంలా నిలిచారు. కటకటాల

వెనుక కూడా దేవుని ఏకత్వం వైపునకు తోటి ఖైదీలను ఆహ్వానించారు. జ్ఞానహీనులైన ఇతరులను సత్యజ్ఞానం వైపునకు సందేశమిచ్చారు. దైవతిరస్కారులను దేవుని అనుగ్రహాల వరప్రసాదాల గురించి హితువు గరిపారు. ఆ దృశ్యాన్ని దివ్యఖుర్ఆన్ ఈ క్రింది పద చిత్రాల్లో లిఖించింది:

**"నా తోటి ఖైదీల్లారా! స్వయంగా మీరే ఆలోచించండి. చాలామంది విభిన్న ప్రభువులు మేలా లేక సర్వశక్తిమంతుడు అయిన ఏకైక దేవుడు మేలా? ఆయనకు కాదని మీరు దాస్యం చేస్తున్న వారు, మీరూ మీ తాతముత్తాలూ కల్పించుకున్న కొన్ని పేర్లు మాత్రమే తప్ప మరేమీ కాదు. వారి కొరకు అల్లాహ్ ఏ నిదర్శనాన్ని అవతరింపజేయలేదు. పరిపాలించే అధికారం అల్లాహ్‌కు తప్ప మరెవరికీ లేదు. ఆయనను తప్ప మీరు ఎవరి దాస్యాన్నీ చేయకూడదని ఆయన ఆజ్ఞ. ఇదే శుద్ధమైన సరైన జీవిత విధానం."** ***(ఖుర్ఆన్, 12 : 39 - 40)***

గొప్పవారైన ఉత్తమ పురుషులు ఇటువంటి సుగుణాలనే కలిగి వుంటారు. వారిలో ప్రాపంచిక రంగులు వెలిసిపోయినా, వారిలోని అంతర్గత ధార్మికత ఏ మాత్రం తగ్గదు. వారిపై కష్టాల కడలులు విరుచుకుపడినా తమ్ము తాము బలహీనులుగా భావించరు. జీవితం విసిరే సవాళ్ళను ధైర్యంగా ఎదుర్కొన్నవారే ప్రపంచంలో ఆదర్శ వంతులుగా నిలుస్తారు. ప్రవక్తలు, సత్యసంధులు, అమరగతులు, సత్‌పురుషుల జీవిత చరిత్రలు ఇందుకు నిదర్శనాలు. దైవప్రవక్త (స) ఇలా తెలిపారు.

"అల్లాహ్ వైపు నుండి దాసునికి ఉన్నత స్థానం ప్రసాదించబడుతుంది. అయితే దాసుడు కేవలం తన ఆచరణ ద్వారా ఆ స్థానానికి చేరుకోలేడు. అప్పుడు అల్లాహ్ అతడిని, ధన, ప్రాణ, సంతానం ద్వారా పరీక్షిస్తాడు. ఆ వ్యక్తి ఆ పరీక్షలో ఉత్తీర్ణుడై, ఆ ఉన్నత స్థానానికి అర్హత సంపాదించుకుంటాడు." (మస్నద్ అహ్మద్)

కష్టాలు, బాధలు, ఆపదలు ఒక దైవదాసునికి శుభసాఫల్యాల మార్గాలను సరళం చేస్తాయి. అతని స్థానాన్ని ఉన్నతపరుస్తాయి. ఇహలోకపు మత్తులో మునిగి భోగవిలాసాల్లో ఏమరుపాటుకు గురైన వ్యక్తికి మేల్కొలుపులుగా ఒక్కోసారి ఉపయోగపడతాయి. ఎంతో ప్రమాదకరమైన వ్యాధులు, బాధలు కష్టనష్టాలు సయితం లాభాలు చేకూర్చే సాధనాలుగా మారిపోతాయి. అనేక సంఘటనలు దైవపరీక్షలుగా వుండి, దైవసహాయం, కారుణ్య కటాక్షాల ద్వారాలు తెరిచేవిగా ఎదురవుతాయి.

## సహజ నైజాల నియమబద్ధత

సహనం, స్థిరత్వం, ఓర్పు, ఓపికలు, కొనసాగింపులు మనిషి సహజ నైజాలు. విత్తనాలు విత్తిన వెంటనే మొక్కలు మొలవవు. మొలిచినా వెంటనే కాయలు కాయవు. ఫలితాలు చేతికి అందేందుకు నెలల కాలం వేచి వుండాలి. తల్లి గర్భంలోని శిశువు, సమయం ఆసన్నమయ్యేంత వరకు వేచి వుంటుంది. ఈ క్రమంలోనే ఆ శిశువుకు అవసరమైన అవయవ నిర్మాణాలు జరుగుతాయి. సృష్టి క్రమానికి ఆరు కాలాలు (Six periods of time) పట్టిందని స్వయంగా అల్లాహ్‌యే ప్రకటించాడు. వాస్తవానికి రెప్పపాటులో ఆయన విశ్వ వ్యవస్థను సృష్టించగలడు. రాత్రింబవళ్ళు - భూమి, సూర్య చంద్రాదుల భ్రమణ, పరిభ్రమణల ద్వారానే ఆయుష్షు పూర్తి అవుతుంది. పరిస్థితులు, ఆలోచనల్లో, వ్యక్తిత్వాల్లో మార్పులు కూడా కాలానుగుణంగానే జరుగుతుంది. తుదకు అందరూ వారి ప్రభువు వైపునకు మరలిపోతారు.

> **"ఆయన మిమ్మల్ని ఇప్పుడు పుట్టించిన విధంగానే మీరు మళ్ళీ పుట్టించబడ తారు. ఒక వర్గానికి ఆయన రుజుమార్గం చూపించాడు. కాని రెండో వర్గానికి మార్గభ్రష్టత్వం బాగా సరిపోయింది.** ***(ఖుర్‌ఆన్, 7 : 29-30)***

మనిషి జీవితం కష్టసుఖాలకు నిలయం. వాటిపట్ల మనం సహనం- ఓర్పు, నిలకడలు పాటించాలి. అతి ఉత్సాహానికి, అహంభావానికి లోనైతే అవి మనల్ని నాశనం చేస్తాయి. దైవాదేశాలకు అనుగుణంగా వున్న విధి విధానాలను మార్చడం మరల్చడం మన వశంలో లేదు.

## సహనానికి అనేక రూపాలు

సహనానికి అనేక రూపాలు వున్నాయి. అందులో ఒకటి విధేయత అనుస రణల్లో స్థిరత్వం. కాగా, మరొకటి కష్టాలు, ఆపదల్లో ధైర్యసాహసాలు ప్రదర్శిం చడం. ఇందులోని మొదటిరకం ఇస్లామీయ విధులపై స్థిరంగా వుండటం. విధులను తప్పనిసరిగా పాటించడం. ఉదాహరణకు నమాజ్, ఎల్లప్పుడూ మాటిమాటికి ఆచరించే విధిగా వుంది. ఈ విషయంగా అల్లాహ్ ఆదేశం ఇలా వుంది:

> **"నీ కుటుంబ సభ్యులకు 'నమాజు చెయ్యండి' అని ఆజ్ఞాపించు. స్వయంగా నీవు కూడా దానిని పాటించు."** ***(ఖుర్‌ఆన్, 20 : 132)***

**బఖరా సూరాలో యిలా సెలవివ్వబడింది: "ఓ విశ్వాసులారా! సహనం మరియు నమాజ్‌ల ద్వారా సహాయం పొందండి. నిస్సందేహంగా సహనం కలవారికి అల్లాహ్ తోడుగా వుంటాడు."** ***(ఖుర్‌ఆన్, 2 : 153)***

విశ్వాసుల మధ్య పరస్పర సంబంధాలు పటిష్టంగా వుండాలి. ఒకరి పట్ల మరొకరు మన్నింపుల వైఖరి అవలంభించాలి. ఒకరి లోపాలను మరొకరు భరించాలి. ఇందుకు సహనం తప్పనిసరి.

**"తమ ప్రభువు ప్రసన్నత అర్థిస్తూ ఎవరు ఉదయం, సాయంత్రం ఆయనను వేడుకుంటారో, వారి సహచర్యం పట్ల నీ హృదయాన్ని సంతృప్తి పర్చుకో. వారి నుండి నీ దృష్టిని ఏ మాత్రం మరల్చకు."** ***(ఖుర్‌ఆన్, 18 : 27)***

దివ్యఖుర్‌ఆన్‌లో సహన గుణాన్ని వివరిస్తూ, సత్యాన్ని పరస్పరం బోధించు కోవడానికి అవసరమైన నైజంగా చెప్పబడింది. మనిషి యొక్క శ్రేయో సంక్షేమాలు పరస్పర బోధన, సహన గుణాలలో వున్నాయని అల్లాహ్ కాలాన్ని సాక్షిగా చేసి వివరించాడు.

**కాలం సాక్షిగా! నిస్సందేహంగా మానవుడు పెద్ద నష్టానికి గురిఅయి ఉన్నాడు. విశ్వసించి సత్కార్యాలు చేస్తూ ఉండేవారూ, ఒకరికొకరు సత్యోపదేశం, సహన బోధ చేసుకునేవారూ తప్ప."** ***(ఖుర్‌ఆన్, 103 : 1-3)***

చెడుకు ఎదురు నిలిచి పోరాడే తత్వాన్ని మనిషికి సహన గుణమే అందిస్తుంది. మనోకాంక్షల పాపాలను విడనాడి, పుణ్యకార్యాల వైపునకు మనిషిని సహన గుణమే మరలిస్తుంది. దైవ సందేశహరులు (స) యిలా బోధించారు:

"మనిషి ఇష్టపడని విషయాలతోనే స్వర్గం ఆవరించబడి వుంది." మనిషిని రంజింపజేసే విషయాలతో నరకం ఆవరించబడి వుంటుంది."

కష్టనష్టాలను ఎదుర్కోవడం, చెడులు, పాపాల నుండి దూరంగా వుండటం కేవలం సహనం వల్లనే సాధ్యమవుతుంది. విశ్వాసంలో దృఢత్వాన్ని దైవ ప్రీతిని పొందే ఆచరణ నుండి మాత్రమే సహన గుణం జనిస్తుంది. మనిషిని పాపాల నుండి రక్షించేది కేవలం ఈ సహజ గుణం మాత్రమే. అల్లాహ్ ఆజ్ఞ ఈ విధంగా వుంది:

**"ప్రభూ! మాకు ఓరిమి (సహనం)ని అమితంగా అనుగ్రహించు. మమ్మల్ని ప్రపంచం నుండి లేపినపుడు నీకు విధేయులుగా (ముస్లింలుగా) వున్న స్థితిలోనే లేపు."** ***(ఖుర్‌ఆన్, 7 : 126)***

ఒక విశ్వాసి అయిన దైవదాసుడు – ధన, మాన, ప్రాణ నష్టానికి గురైనప్పుడు, భార్యాబిడ్డలను ఆపదలు చుట్టిముట్టినప్పుడు పదవి గౌరవ మర్యాదలకు నష్టం కలిగేలా వున్నప్పుడు సహనగుణమే అతనిని కాపాడుతుంది. జీవితంలో కష్టాలు, బాధలు తప్పనిసరిగా వస్తూ వుంటాయి. బాధల తుఫానులు తాకని, కష్టాల అలలు చుట్టుముట్టని జీవితం చాలా విచారకరమైనది.

అయితే, ఒక విశ్వాసి (ముస్లిం) ఎప్పుడైతే అల్లాహ్ రక్షణలోకి చేరుకుంటాడో – అల్లాహ్ శరణుకోరుకుంటాడో అప్పుడు అతని చుట్టూ వున్న కష్టాల విచ్చుకత్తులన్ని మొద్దుబారిపోతాయి. ఆ విశ్వాసి శరీరంపై ఈ కత్తులు ఎలాంటి గాయాన్నీ కలిగించ లేవు. ఆ విశ్వాసిలోని సహనం, విశ్వాసాలు కత్తుల కుట్రలన్నింటిని నిర్వీర్యం చేసి వేస్తాయి. ఒక ముస్లిం యొక్క విశ్వాసం బలహీనపడనంత వరకు అతని నుండి దైవ కారుణ్యం తొలగిపోదు. అల్లాహ్ సాంప్రదాయం ఈ విధంగా వుంటుంది:

**"భయప్రమాదాలకు, ఆకలిబాధకు ధన, ప్రాణ, ఆదాయాల నష్టానికి గురిచేసి మేము మిమ్మల్ని తప్పకుండా పరీక్షిస్తాము. ఈ పరిస్థితులలో స్థయిర్యంతో ఉండేవారు కష్టకాలం దాపురించినప్పుడు, "మేమంతా అల్లాహ్‌కే చెందిన వారము. అల్లాహ్ వైపునకే మరలిపోవలసినవారము" అని అనేవారికి శుభ వార్తలు తెలుపు. వారిపై వారి ప్రభువు తన అపూర్వ అనుగ్రహాలను కురిపిస్తాడు. ఆయన కారుణ్యచ్ఛాయలు వారికి ఆశ్రయమిస్తాయి. వారే సన్మార్గ గాములు.**

***(ఖుర్ఆన్, 2 : 155-157)***

ఉమ్మె ఆలా (రజి) ఉల్లేఖనం ప్రకారం: దైవప్రవక్త (స) నన్ను పిలిపించారు. అప్పుడు నేను అనారోగ్యంతో వున్నాను. ప్రవక్త (స) అప్పుడు యిలా సెలవిచ్చారు, "ఓ ఉమ్ముల్ ఆలా! సంతోషించు! ఒక ముస్లింను అతని అనారోగ్యం, అతని పాపాలను చెరిపివేస్తుంది. ఇనుము, వెండి లాంటి లోహాలను నిప్పు శుభ్రపరిచినట్లుగా చేసి వేస్తుంది" (అబూదావూద్) మరో హదీసులో యిలా వుంది:

"తనకు అత్యంత ప్రియమైన వ్యక్తి మరణించినపుడు సహనం పాటించి దైవ ప్రసన్నతను పొందగోరే వ్యక్తికి అల్లాహ్ స్వర్గం కంటే తక్కువ బహుమతి యివ్వడానికి ఇష్టపడడు." (నసాయి)

అన్నింటికంటే, అన్నింటిపై అల్లాహ్‌కు మాత్రమే హక్కు వుందని గుర్తించాలి. వ్యక్తికి ప్రియాతిప్రియమైన కుమారుడు కూడా ప్రాథమికంగా అల్లాహ్‌కు దాసుడు

మాత్రమే. తండ్రి కంటే కూడా ఆ కొడుకుపై అల్లాహ్‌కు మాత్రమే హక్కు ఎక్కువగా ఉంటుంది. కుమారుని మరణంపై తండ్రి విలపిస్తూ 'నా కుమారుడా!' అంటాడు. కాని నిజానికి ఆ కుమారుడు అల్లాహ్‌కు దాసుడు. తన దాసుడిని తాను యిష్టపడిన సమయాన అల్లాహ్ పిలిపించుకుంటాడు. 'నా దాసునిపై అందరి కంటే నాకే ఎక్కువ హక్కు వుందని' అల్లాహ్ ప్రకటిస్తాడు. ఇటువంటి సమయాల్లో సహనమే మనిషికి తోడు అందిస్తుంది.

ఒక సంఘటనలో మనకు మంచి ఉదాహరణ దొరుకుతుంది. "ఖాసిం బిన్ ముహమ్మద్ సతీమణి మరణించింది. ఆయనను పరామర్శించడానికి ముహమ్మద్ బిన్ కఆబ్ అల్ ఖర్బీ వచ్చారు. తన పరామర్శలో ఆయన సహనపు హితవు పలుకుతూ బనీ ఇస్రాయీల్‌లోని ఒక పండితుడైన దైవదాసుని (భక్తుని) కథను వినిపించారు. ఆ పండితునికి అత్యంత అనుకూలవతి, శౌశీల్యవతి అయిన భార్య వుండేది. అతను ఆమెను గాఢంగా ప్రేమించేవాడు. అకస్మాత్తుగా ఆమె మరణించింది. ఆమె మరణంతో విరక్తి చెందిన ఆ దైవభక్తుడు తన ఇంటిలోనే తలుపులు మూసుకొని రోధిస్తూ, కుమిలిపోతూ జీవించసాగాడు. ఆ పండితుడు అందరితో తన సంబంధా లను తెంచు కున్నాడు. ఆయనను సంస్కరించదలచుకున్న ఒక స్త్రీ తన ధర్మసందేహాన్ని నివృత్తి చేయవలసిందిగా ఆ పండితుడిని దృఢంగా కోరింది. చివరకు ఆ పండితుడు ఆమో దించాడు. అప్పుడు ఆ స్త్రీ, అయ్యా! నేను నా పొరిగింటి మహిళనుండి విలువైన ఆభరణాలను తీసుకొని, సుదీర్ఘకాలం వాటిని ఉపయోగించుకుంటున్నాను. ఇంతకాలం తర్వాత ఆమె తన ఆభరణాలను అడుగుతుంది. నేను యివ్వాలా! వద్దా? అని అడిగింది. అందుకు పండితుడు నిస్సందేహంగా యిచ్చివేయవలసిందే' అని ఫత్వానిచ్చాడు.

దానికి ఆ స్త్రీ అయ్యా! ఆ ఆభరణాలు చాలా కాలం నా దగ్గర వున్నాయి కదా? అని పలికింది. అందుకు ఆ పిండితుడు 'అయినా సరే యిచ్చి వేయడమే సబబు' అని అన్నాడు. అప్పుడు ఆ స్త్రీ 'అల్లాహ్ మిమ్మల్ని కరుణించుగాక! అల్లాహ్ మీకు యిచ్చిన ఆభరణాన్ని ( మీ భార్యను) ఆయనే తీసుకున్నాడు. మీ భార్యపై అల్లాహ్‌కే ఎక్కువ హక్కు ఉంది అని పలికింది. పండితునికి తన తప్పు తెలిసి వచ్చింది. ఆ స్త్రీ వివేకం ఆ పండితునికి లాభించింది. సహనం కోల్పోతే జరిగే నష్టం తెలిసి వచ్చింది.



# 17 వ భాగం

# అన్నింటిలోనూ మధ్యే మార్గం

- ఆత్మ–శరీరాల సమతుల్యత
- అవసరం వరకే ఆహారం
- సమాజంలో సమత – సంతులనాల మార్గం
- నిర్మాణాత్మక విషయాల్లోనూ సమతుల్యత
- దారిద్ర్యం – అహంకారాల మధ్య సమతుల్యత



## ఆత్మ - శరీరాల సమతుల్యత

ఇస్లామీయ బోధనలలోని ఒక పెద్దభాగం, ప్రత్యేకించి ముస్లింల శిక్షణ, సంస్కరణలకు సంబంధించినది. తద్వారా వీరిలో మానసిక శారీరక శిక్షణ జరుగు తుంది. ఈ శిక్షణ మొత్తంగా అత్యంత హుందాగా, ఉత్తమంగా పరిశుద్ధమైనదిగానూ వుంటుంది. ఆహార పానీయాల మర్యాదలు, సంపాదన, వస్త్రధారణ, నివాసం, ఏర్పాటుతోపాటు, తన ధర్మబద్ధ అవసరాల నెరవేర్పుల, వాటి పరిపూర్ణతల చుట్టూ ఈ శిక్షణ అల్లుకొని వుంటుంది. ఒక విశ్వాసియే కాక ప్రతి మనిషి కూడా ఈ అవస రాల కోసమే నిరంతరం శ్రమచేస్తూ ఉంటాడు. ఈ విషయంగా మనిషి వైరాగ్యానికి లోనై, సన్యాసత్వం స్వీకరించడు. అదే సమయంలో కేవలం భౌతిక సదుపాయాల కోసం మాత్రమే జీవించడు. ఈ రెండు మార్గాలకు మధ్య సమతులనాన్ని పాటిస్తాడు. మధ్యే మార్గాన్ని అవలంబించడం ద్వారా తన శిక్షణను సులభతరం చేసుకుంటాడు.

ఇస్లాం మనిషి శారీరక, మానసికతలు రెండింటిని సంబోధిస్తుంది. తన బోధనల ద్వారా ఏ ఒక్క దానినీ మరొక దానిపై ఆధిక్యతలేని స్థితిని కల్పిస్తుంది. మనిషి ఇహ పరాలు రెండూ విజయవంతం కావడానికి అవసరమైన క్రమాన్ని పరిపూర్ణంగా అందిస్తుంది. మానవ నిర్మిత సైద్ధాంతిక సూత్రాలు మనిషిని కేవలం భౌతికదాసులుగా మార్చివేస్తాయి. మరణానంతరం ఎవరి ముందు హాజరు కావలసి వుందో - ఆ మహాశక్తి అయిన సృష్టికర్తకు సంబంధించిన కనీస అవగాహన కూడా ఇవి అందిం చవు. చివరికి మనిషి స్వయంగా పతనాన్ని కొనితెచ్చుకునే వానిగా తయారు చేసి వదులుతాడు.

కొన్ని వైరాగ్య సిద్ధాంతాలు మనిషి సాధారణ కోరికలను, శారీరక సహజ ధర్మాలను సయితం అణిచివేయడానికి ప్రయత్నిస్తాయి. శరీరాన్ని కృశింపజేస్తేనే మనిషి ఆత్మీయంగా ఎదుగుతాడని వీరు భావిస్తారు. మరికొన్ని సిద్ధాంతాలు సర్వం భౌతికమయినమని తీర్మానించాయి. ఐహిక, మనోకాంక్షల నెరవేర్పుల చుట్టూ, శారీరక కోరికల చుట్టూ తమ సిద్ధాంతాలను అల్లుకున్నాయి.

కాని, ఇస్లాం పై రెండు విధానాలకు మధ్య సంతులనాత్మక వైఖరిని స్వీకరిం చండి. ఇస్లాంలో సన్యాసత్వానికి, వైరాగ్యానికి తావులేదు. మానవులను, ప్రకృతిపర సహజ ధర్మాలనుండి దూరం చేసివేసే కారుణ్య రహిత, బాధ్యతారహిత సన్యాసత్వాన్ని

ఇస్లాం ఆమోదించదు. సన్యాసత్వం మానవత్వానికి వ్యతిరేకమైనది. అదే సమయంలో కేవలం ఆహారం, నిద్ర, మైధునం లాంటి కేవలం జంతు సంబంధ భౌతిక సుఖాలను కూడా ఆమోదించదు. కేవలం భౌతిక కాంక్షలు మాత్రమే తీర్చుకునే జంతువుగా 'మనిషి' వుండకూడదని ఇస్లాం సిద్ధాంతీకరిస్తుంది.

పరలోకాన్ని మనస్ఫూర్తిగా ఆమోదించిన, విశ్వసించిన ఒక విశ్వాసి యొక్క జీవితానికి – భౌతిక ప్రపంచాన్ని అందులోని సుఖాలను జుర్రుకోవడమే జీవిత లక్ష్యంగా గల ఒక అవిశ్వాసి జీవితానికీ భూమ్యాకాశాలంత తేడా వుంటుంది. ఈ వాస్తవాన్ని మనం ఎన్నడూ మరువకూడదు.

తన మనోకాంక్షల, భౌతిక కోరికల నెరవేర్పుకోసం అనేకమంది తమ గౌరవ మర్యాదలను సయితం వదలుకుకుంటారు. రాత్రింబవళ్ళు భౌతిక సుఖాల కొరకు శ్రమిస్తూ వుండీ, సృష్టితాలలోనే అత్యంత నీచమైన సృష్టితంగా వ్యవహరిస్తాడు. ఇటువంటి వారి గురించి అల్లాహ్ యిలా సెలవిచ్చాడు:

**"విశ్వసించి మంచి పనులు చేసే వారిని అల్లాహ్, క్రింద సెలఏళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. అవిశ్వాసులు కేవలం కొన్నాళ్ళ ప్రాపంచిక జీవితంలోని సౌఖ్యాలను జుర్రుకుంటున్నారు. పశువుల మాదిరిగా తింటు న్నారు. త్రాగుతున్నారు. వారి అంతిమ నివాసం నరకం అవుతుంది."**

**(ఖుర్‌ఆన్, *47 : 12*)**

మరోచోట....

**తిరస్కరించిన వారే అప్పుడు పశ్చాత్తాపపడుతూ: "అయ్యో! మేము ముస్లిము లము అయివుంటే ఎంత బాగుండేది" అని అంటారు. వారిని వదిలిపెట్టు – తినటానికి, త్రాగటానికి సుఖాలు అనుభవించటానికీ, లేనిపోని ఆశలు వారిని భ్రమలో పడవేసి ఉంచటానికీ. అతి త్వరలోనే వారు దానిని గ్రహిస్తారు.**

**(ఖుర్‌ఆన్, *15 : 2-3*)**

అయితే ఒక విశ్వాసి మాత్రం తన ఆశలనూ, కోరికలను ఇహపరాల రెండింటి లోకి విశాలపరిచి వుంటాడు. వర్తమానం, భవిష్యత్తుల్లో మంచిని ఆశిస్తూ ఉంటాడు. ఇహపరాల్లో క్షేమాన్ని, సంక్షేమాన్ని, అనుగ్రహాలను కోరడం దైవారాధనలో భాగమేనని ఖుర్‌ఆన్ స్పష్టం చేసింది.

**"మీ హజ్ విధులను ముగించిన తరువాత, మీరు మీ తాత ముత్తాతలను పూర్వం స్మరించే విధంగానే ఇంకా దానికంటే అధికంగానే అల్లాహ్‌ను స్మరిం చండి. (కాని అల్లాహ్‌ను స్మరించేవారిలో కూడా ఎంతో వ్యత్యాసం ఉంది). వారిలో కొందరు, "మా ప్రభూ! మాకు ఈ లోకంలోనే అన్నీ ప్రసా దించు" అని ప్రార్థి స్తారు. అలాంటివారికి పరలోకంలో ఏ భాగమూ లేదు. ఇంకా కొందరు ఈ విధంగా ప్రార్థిస్తారు : "మా ప్రభూ! ఇహలోకంలోనూ, పరలోకం లోనూ మాకు మంచిని ప్రసాదించు. మమ్మల్ని నరకబాధ నుండి కాపాడు." ఇలాంటి వారు తమ సంపాదనకు అనుగుణంగా ఉభయ లోకాలలో తమ వాటాను పొందుతారు."** ***(ఖుర్‌ఆన్, 2 : 200-203)***

ఇహపరాల సాఫల్యం కొరకు పరిశ్రమించమని అల్లాహ్ తన గ్రంథంలో ఆదేశించాడు. ఇహలోకం, పరలోకానికి చేరే మార్గం. మార్గం సరైనది అయితే గమ్యాన్ని సురక్షితంగా చేరగలం. అప్పుడే సాఫల్యం, విజయం, ముక్తి మన్నింపుల గౌరవ మర్యాదలు లభ్యమవుతాయి. ఖుర్‌ఆన్ ఆదేశం ఈ క్రింది విధంగా వుంది:

**అల్లాహ్ నీకు ఇచ్చిన సంపదతో పరలోకంలో గృహాన్ని నిర్మించుకునే యోచన చేయి. ప్రపంచంలో కూడ నీ వాటాను విస్మరించకు, అల్లాహ్ నీకు ఉపకారం చేసిన విధంగానే నీవూ ఉపకారం చేయి. భూమిపై కల్లోలాన్ని సృష్టించే ప్రయత్నం చేయకు. అల్లాహ్ కల్లోలం సృష్టించే వారిని ప్రేమించడు."** ***(ఖుర్‌ఆన్, 28 : 77)***

## అవసరం మేరకే ఆహారం

పై సంతులనాత్మక బోధనలకు అనుగుణంగానే – మనిషి, కడుపు మర్మాంగా లకు బానిస కాకూడదని ఇస్లాం హెచ్చరించింది. 'తినడానికే జీవించడం'గా కాక, 'జీవించడానికై తినాలి' అనే లక్ష్యం మనిషి కలిగి వుండాలి. జీవతపు పరుగు పందెం మొత్తంగా కేవలం తినడం, త్రాగడం, రుచులు పొందడంగా వుండకూడదు. రుచికర పృష్టాన్న భోజనంపై సంబరపడటం, లేకపోతే నిరాశా, ఆగ్రహాలు ప్రదర్శిం చడం, అదృష్టాన్ని నిందించడం ఒక విశ్వాసి చేయకూడనిది.

కేవలం రుచుల కొరకు వెంపర్లాడేవారు, రాత్రింబవళ్ళు అందుకోసమే శ్రమించే

వారు ఉత్తమ ఆశయాలను, లక్ష్యాలను సాధించలేరు. అందుకు శ్రమించనూ లేరు. వీరు పిరికివారుగా, ఐహిక వాంఛలకు దాసులుగా వుంటారు. దైవ మార్గంలో సర్వం ఒడ్డిపోరాడే ధీరత్వం వీరిలో వెతికినా కనిపించదు.

'దైవప్రవక్త (స) ఇలా నుడివారు, "ప్రపంచంలో అందరికంటే అధికంగా కడుపు నింపుకునేవారు తీర్పు దినాన అందరికంటే ఎక్కువ ఆకలిగొన్నవారుగా వుంటారు."

అనేక వ్యాధులకు జీర్ణాశయమే పుట్టిల్లుగా వుంటుంది. మితంలేని తిండివల్ల అజీర్తి - తద్వారా అనేక రోగాలు కలుగుతాయి. అందుకనే ప్రవక్తశ్రీ (స) "ఆదం సంతానపు కడుపు ఒక పెద్ద నీటి తొట్టి" లాంటిదని చమత్కరించారు.

రోగాలపాలైన మనిషి తన ఆలోచనలను, ఉత్తమ, ఉన్నత ఆశయాల వైపు మళ్ళించలేడు. పొట్ట చేసే చెడుగుల నుండి కేవలం ఉత్తమ ఆశయం, గొప్ప జీవిత లక్ష్యాలు మాత్రమే కాపాడగలుగుతాయి.

ఒక విశ్వాసి దైవప్రవక్త (స) వద్దకు అతిథిగా వచ్చాడు. ప్రవక్త(స) మేకపాలు పితికించి అతనికి యిచ్చారు. వరుసగా ఏడు మేకల పాలు అతను త్రాగాడు. రాత్రి గడిచిన తర్వాత ఉషోదయాన్నే ఆ వ్యక్తి ఇస్లాం స్వీకరించాడు. ఉదయం ఆ నవ ముస్లింకు ప్రవక్త శ్రీ (స) ఒక మేకపాలు పితికి ఇచ్చారు. ఆ నవ ముస్లిం పూర్తిగా త్రాగాడు. రెండవ మేకపాలు త్రాగలేకపోయాడు. అప్పుడు దైవప్రవక్త (స):

"విశ్వాసి ఒక కడుపుకు తింటాడు. కాని, ఒక అవిశ్వాసి ఏడు కడుపులకు తింటాడు." అని చమత్కరించారు.

ఒక వ్యక్తి అవిశ్వాసపు అజ్ఞానస్థితి నుండి, జ్ఞానవంత విశ్వాసపు స్థితికి రాగానే అతను తన బాధ్యతలను గుర్తిస్తాడు. తన నిజ ప్రభువు అల్లాహ్‌తో తనకు వున్న సంబంధాన్ని తెలుసుకుంటాడు. తీర్పుదినపు జవాబుదారీతనాన్ని, విచారణను గుర్తిస్తాడు. ఫలితంగా తనలోని ఔన్నత్యాన్ని సమున్నత పరచుకుంటాడు. ఉన్న దానితోనే కడుపు నింపుకొని సంతృప్తి చెందుతాడు.

భౌతిక రుచులు, కోరికలు, కాంక్షలు అన్నీ తాత్కాలికమైనవే. ఇందులో ఇరుక్కొన్న వ్యక్తి తేనెలోపడ్డ ఈగలా మారిపోతాడు. కదలలేని వదలలేని స్థితిలో నీచంగా, హీనంగా అవమానకరంగా ప్రవర్తిసాడు. నేటి ప్రపంచంలో సాధారణంగా మనం ఈ దృశ్యాలనే చూస్తూ వున్నాం.

"దైవప్రవక్త (స) ఆహారాన్ని ప్రపంచంతో పోల్చి ఉదాహరణగా యిలా చెప్పారు, "రుచికరంగా వండిన ఆహారం క్షణాలలో సమాప్తం అయిపోతుంది" అనీ.... మరో చోట "ఆదం సంతానపు శరీరం నుండి వెలుపలికి వచ్చే (కల్మషం) దానిని ప్రపంచ వాస్తవికతతో పోల్చబడింది" అని చెప్పారు. (అహ్మద్)

పై ఉదాహరణల ద్వారా చాలామంది అపార్థానికి గురయ్యే ప్రమాదం ఉంది. ఇస్లాం, ప్రపంచం దాని విషయాల నుండి, దైవప్రసాదాలు, అనుగ్రహాల నుండి పారి పోవడంగా భావిస్తారు. నిజానికి ఇస్లాం ఉద్దేశ్యం దీనికి పూర్తి భిన్నమైంది. ధర్మసమ్మ తాలను నిషిద్ధపర్చుకోరాదు. నిషిద్ధాలను ధర్మసమ్మతం చేసుకోరాదు. ఈ రెండు పద్ధతులూ మహాపాతకాలే... దైవధిక్కార చర్యలే. దైవానుగ్రహాలను, కృతజ్ఞతలతో అవసరమైన మేరకు స్వీకరించాలి. తద్వారా పరిశుభ్రమైన ఆరోగ్యకర జీవితం గడపాలి. అల్లాహ్‌కు ఈ జీవిత విధానమే ఎంతో యిష్టం. జీవితం పట్ల సంతృప్తి కలిగి వుండి, పరిశుద్ధ వస్తువుల ద్వారా లబ్ది పొందడం ఒక విశ్వాసికి హక్కుగా వుంటుంది.

**"విశ్వసించి మంచి పనులు చేసే వారిని, వారు పూర్వం తిన్న దానిని తాగిన దానిని గురించి ప్రశ్నించడం జరగదు. కాని, వారు ఇకపై హరాము చేయబడిన వస్తువులకు దూరంగా వుండాలి. స్థిరమైన విశ్వాసం కలిగి వుండాలి. మంచి పనులు చేయాలి. ఇంకా మానుకోవాలని ఆజ్ఞాపించబడిన వస్తువులన్నింటిని మానుకోవాలి. అల్లాహ్ ఆజ్ఞను అంగీకరించాలి. భయభక్తులతోపాటు సద్వర్తన కూడా కలిగి వుండాలి. అల్లాహ్ సౌశీల్యవంతులను ప్రేమిస్తాడు."**

***(ఖుర్‌ఆన్, 5 : 93)***

ఆదర్శప్రాయులైన ప్రవక్త ఇబ్రాహీం (అలై) తన అతిథులకు ఏ మాత్రం ఆలస్యం చేయక ఒక కండపట్టిన దూడను వేయించి వారి ముందు వుంచారు. ఆ సంఘటనను ఖుర్‌ఆన్ ఈ క్రింది విధంగా రికార్డు చేసింది.

**"అతను (ఇబ్రాహీం (అలై) మౌనంగా తన ఇంటి వారి దగ్గరకు వెళ్ళి ఒక (వేపబడిన) బలిసిన ఆవు దూడను తెచ్చి అతిథుల ముందు పెట్టాడు?" 'అవును మీరు తినరా? అని అడిగాడు.** ***(ఖుర్‌ఆన్, 51 : 26-27)***

అల్లాహ్ ఈ క్రింది ఆదేశాన్ని ప్రవక్త ముహమ్మద్ (స) వారి ప్రియ సహచర సమూహం చాలా నిష్ఠగా అమలు జరిపేవారు:

**"విశ్వాసులారా! అల్లాహ్ మీ కొరకు ధర్మ సమ్మతం చేసిన పరిశుద్ధ వస్తువులను నిషిద్ధం చేసుకోకండి. హద్దులను అతిక్రమించకండి. మితిమీరి ప్రవర్తించే వారంటే అల్లాహ్‌కు ఏ మాత్రం ఇష్టం వుండదు."** ***(ఖుర్‌ఆన్, 5 : 87)***

శరీరానికి కొన్ని సహజ ధర్మాలు వున్నాయి. వాటి పరిపూర్తి తప్పనిసరిగా జరగాలి. లేని పక్షంలో అనేక సమస్యలు తలెత్తుతాయి. శాస్త్రజ్ఞులందరూ ఈ విషయాన్ని ముక్త కంఠంతో అంగీకరించారు. ఈ శరీర సహజ ధర్మాలకు అడ్డుతగిలే సకల పద్ధతులను, భక్తి వైరాగ్యాలను జీవిత విధానాలను ఇస్లాం నిర్ద్వంద్వంగా వ్యతిరేకిస్తుంది. అదే సమయంలో ఆధ్యాత్మికత, భక్తి భావాలను దెబ్బతీసే 'భౌతిక పూజను' అశ్లీల విశృంఖలత్వాలను, స్వార్థం, దోపిడీ తదితరాలను ఇస్లాం ఏ మాత్రం సహించదు.

## సమాజంలో సమత - సంతులనల మార్గం

దుస్తుల ఎంపిక - వాటిని ధరించడంలో సమతుల్యత పాటించమని ఇస్లాం ఆదేశిస్తుంది. గర్వం - అహంభావంతో విర్రవీగే దుస్తులు ఇస్లాం యిష్టపడదు. ఖరీదైన దుస్తులు వీరత్వానికి, ఉత్తమ నడివడికకూ నిదర్శనాలు కావని స్పష్టపరుస్తుంది. అతుకుల దుస్తులు ధరించిన వ్యక్తి కొన్ని సందర్భాలలో బంగారు, వెండి రాశుల కంటే కూడా విలువైన వాడుగా వుంటాడు.

దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు, "చిరిగిన దుస్తులు ధరించిన ఎంతో మంది తమ వాగ్దానాలను అత్యంత నిష్ఠతో పూర్తి చేస్తారు." (తిర్మిజీ)

ఖరీదైన దుస్తులు ధరించి, వాటిని ప్రదర్శిస్తూ అటూ ఇటూ గర్వంతో తిరిగే వ్యక్తి తన్ను తాను గొప్పవానిగా భావించవచ్చుగాక, ఇది బుద్ధిహీనతకు నిదర్శనమే. దుస్తుల పట్ల, అలంకరణ పట్ల వందలాది గంటలు వ్యర్థపరిచే యువతకు నేడు కొదవలేదు. ఈ విలువైన సమయాన్ని జ్ఞాన సముపార్జన కోసం, వ్యాయామం కోసం లేక ధర్మ విషయ సేకరణ కోసం వెచ్చించమని చెప్తే నేటి యువకులు మెల్లగా

జారుకుంటారు. శరీర అలంకరణ, ఖరీదైన దుస్తుల ధరింపులే వారి దృష్టిలో గౌరవ మర్యాదలుగా వుంటాయి.

ఇస్లాం ఇటువంటి బుద్ధిహీన చేష్టల పట్ల కఠినంగా హెచ్చరించింది. ముస్లింలను ఈ చేష్టల నుండి దూరంగా వుంచమని తాకీదు చేసింది. దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:

"ప్రపంచంలో, పేరు ప్రఖ్యాతుల కోసం ఖరీదైన దుస్తులు ధరించిన వారికి తీర్పు దినాన అల్లాహ్ నీచమైన, అవమానకరమైన అగ్ని దుస్తులను ధరింపజేస్తాడు." (ఇబ్నెమాజ)

పై అహంభావపు రోగానికి గురైన స్త్రీ పురుషులు సాధారణంగా తమలోని నైతిక లోపాలను కప్పిపుచ్చుకోవడానికి ఈ దుస్తుల ప్రదర్శన చేస్తాడు. ఇది చాలా విచారకర విషయం. అబూ బురేదా ఉల్లేఖనం ప్రకారం :

"నేను ఒకసారి ఆయెషా (రజి) గారి వద్దకు వెళ్ళాను. ఆమె ఒక అతుకుల దుప్పటి, ఒక యమనీ లుంగీని మాకు చూపెట్టారు. దైవంసాక్షి! దైవప్రవక్త (స) పరమపద సమయాన వారి వద్ద ఈ రెండు బట్టలే వున్నాయి." అని చెప్పారు. (బుఖారి)

హజ్రత్ జాబిర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం.... "మేము హజ్రత్ అలీ (రజి), ఫాతిమాల (రజి) వలీమాల విందులో పాల్గొన్నాము. అటువంటి మంచి విందు మేము మరెక్కడా చూడలేదు. ఖర్జూరపు ఆకులు నింపిన బొంతలపై కూర్చొన్నాము. ఖర్జూరాలు, కిస్‌మిస్ పండ్లు మాకు వడ్డించబడ్డాయి. వాటిని మేము తృప్తిగా తిన్నాము. వధూవరులకు పడకగా ఒక గొర్రెచర్మం వుండింది." (బజ్జార్)

దుబారాకు దూరంగా వుంటూ అవసరమైనపుడు వెంటనే ఖర్చు చేయడం ఉత్తమ నడవడికకు నిదర్శనం. ఇస్లాం అతుకుల, చిరుగుల దుస్తులను ఆహ్వానించదు. విరాగి జీవితాన్ని కోరుకోదు. గర్వం అహంకారంతో కూడిన దుస్తులు ప్రదర్శనాబుద్ధి ఉండకూడదని మాత్రమే ఇస్లాం ఉపదేశిస్తుంది.

ఒక వ్యక్తి అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ను "నేను ఎటువంటి దుస్తులు ధరించాలి? అని ప్రశ్నించాడు. అందుకు ఆయన బుద్ధిహీనులు ఆమోదించేవిగా

వుండకూడదు. వివేకవంతులు లోపాలు ఎంచలేని విధంగా వుండాలి" అని అన్నారు. మరలా ఆ వ్యక్తి ఎంత ఖరీదువి అయి వుండాలి? అని ప్రశ్నించాడు. అందుకు ఇబ్నె ఉమర్ (రజి) ఐదు నుండి ఇరవై దిర్‌హమ్‌లలోపు అని సమాధానమిచ్చారు.

ఆయా కాలాలకు తగినట్లుగా వస్తువుల ఖరీదు వుంటాయి. కాలానుగుణంగా వచ్చిన మార్పులను బేరీజు వేసుకొని దుస్తుల కొనుగోలులో సంతులనం పాటించాలి.

'ఒక వ్యక్తి ప్రవక్త (స) వద్దకు వచ్చాడు. అతని శరీరంపై తక్కువ స్థాయి దుస్తులు వున్నాయి. ప్రవక్త (స) అతడిని "నీ వద్ద సంపద వుందా?" అని ప్రశ్నించారు. అందుకు అతను, "వుంది" అని సమాధానమిచ్చాడు. అందుకు ప్రవక్త శ్రీ, "అది ఏ విధమైన సంపద?" అని మరలా ప్రశ్నించారు. అందుకు ఆ వ్యక్తి 'అల్లాహ్ నాకు అన్ని విధాలైన సంపదను ప్రసాదించాడు' అని బదులిచ్చాడు. అప్పుడు ప్రవక్త శ్రీ (స) "మరి అల్లాహ్ నీకు అన్ని విధాలైన సంపదను ప్రసాదించినప్పుడు, అల్లాహ్ అనుగ్రహాన్ని, దాతృత్వాన్ని నీవు ప్రదర్శించు" అని హితబోధ చేశారు." (నసాయి)

మరో ప్రవచనంలో, "ఒక ధనవంతుడు తన రోజువారీ కార్యకలాపాల కోసం రెండు జతల బట్టలు కలిగి వుంటే, అతను వాటితోపాటు శుక్రవారం కోసం మరో రెండు జతలు వుంచుకుంటే అతని సొమ్మేం పోతుంది అని దైవప్రవక్త (స) ప్రశ్నించారు. (అబూదావూద్)

ఇస్లాం తన అనుయాయులను వస్త్రధారణ, అలంకరణల గురించి ఎటువంటి ఉత్తమ బోధనలు, హితవులు అందించిందో గమనించారు గదా! లోపాలను కప్పిపుచ్చుకునేందుకు, అటు గర్వం ప్రదర్శించడానికి చేసే ఖరీదైన వస్త్ర ప్రధర్శనను ఒక వైపున ఇస్లాం ఖండిస్తుంది. మరో వైపున నైతిక పరిపూర్ణత కోసం, శరీర సంరక్షణ, గౌరవ మర్యాదలు ఉట్టిపడే దుస్తులు ధరించమని ప్రోత్సహిస్తుంది. ఈ శిక్షణ మనిషిని ఉత్తమునిగా తీర్చిదిద్దుతుంది.

నేటి ముస్లింలు అనేక భ్రష్టత్వాలకు (బిద్‌అత్) గురయివున్నారు. ప్రతి నెలా ఏదో ఒక వంకన క్రొత్త బట్టలు కొనడాన్ని తప్పనిసరి చేసుకొని వున్నారు. వేసవి, సీతాకాలాల దుస్తులు, రాత్రి పగలు దుస్తులు, పుట్టిన, పెళ్ళి రోజు దుస్తులు, నేడు సర్వసాధారణాలయ్యాయి.... మనిషిని దుబారాలో ముంచి వేస్తున్నాయి. నిజానికి ఈ అలవాట్లు పాశ్చాత్య దేశాలకు చెందినవి. యువతుల విచ్చలవిడి తిరుగుళ్ళు,

వారి వెంట చొంగకార్చుకుంటూ తిరిగే యువకుల గుంపులు వారిని వీరు, వీరిని వారు అనుకరించడాలు లాంటి ప్రమాదకర చట్రంలో బంధించబడి వున్నారు. ఇస్లాం ఈ దుశ్చేష్టలన్నింటిని నిషేధిస్తుంది. దైవభీతి పరులను ఇటువంటి విషయాలనుండి దూరంగా ఉండమని ఆదేశిస్తుంది.

"అలంకరణకు, బంగారానికి ప్రాధాన్యతనిచ్చే స్త్రీలకు వినాశనం వుంది" అని దైవప్రవక్త (స) హెచ్చరించారు. (హిబ్బాన్)

ఆభరణాల పిచ్చి, ఇతరులను ఆకట్టుకునే జిలుగుల దుస్తులు వీటి కాంక్షలు స్త్రీలను వారి విధులు, బాధ్యతల నుండి మరుపుకు గురిచేస్తాయి. ఇస్లామీయ బోధనల్లో బంగారం, పట్టు వస్త్రాలు పురుషులకు నిషేధించబడ్డాయి. పురుషులు ఆభరణాలు ధరించకూడదు. స్త్రీలు బంగారాన్ని ఉపయోగించవచ్చు. అలంకరణ చేసుకోవచ్చే కాని, వీటికే ప్రాధాన్యతనివ్వడం ద్వారా, వీటి కొరకే ధనాన్ని వెచ్చించడం, దుబారా ఖర్చుల రూపంలో వృధా చేయడం ఇస్లాం ఆమోదించదు.

## నిర్మాణాత్మక విషయాల్లోనూ సమతుల్యత

ఇస్లాం దృఢమైన కట్టడాలకు వ్యతిరేకం కాదు. పాఠశాలలు, కళాశాలలు, విశ్వ విద్యాలయాలు ఆసుపత్రులు, యాత్రికుల నివాసాలు, ఇతర ప్రభుత్వ కార్యాలయాలు తరాల తరబడి వుండి ప్రజా సంక్షేమ కేంద్రాలుగా సేవలందిస్తాయి. అయితే, ఒక వ్యక్తి తన భోగ, విలాసాల కోసం అంతఃపురాలను నిర్మించుకోవడం, అందుకు కోట్లాది రూపాయలు దుబారా చేయడం ఇస్లాం ఆమోదించదు. స్వంత నివాస గృహాలను నిర్మించుకోవడాన్ని ఇస్లాం స్వాగతిస్తుంది. కాని, అందులో అహం, గర్వం, భోగలాలసత్వాలను అది వ్యతిరేకిస్తుంది.

ఖైస్ బిన్ హాజిమ్ ప్రకారం, "మేము ఇబ్నుల్ హారిస్ (రజి) ను పరామర్శించడానికి వెళ్ళాము. ఆయన పొట్టపై ఏడు వాతలు వుండటం మేము చూశాము. ఆయన "ఈ ప్రపంచం నష్టం కలిగించకముందే నా స్నేహితులందరూ దైవసాన్నిధ్యాన్ని చేరుకున్నారు. నాకు ఎటు చూచినా మట్టియే కనిపిస్తుంది. ప్రవక్త (స) చావు గురించి ప్రార్థించడాన్ని వారించారు. లేకపోతే నేను తప్పకుండా చావును కోరుకునేవాడిని." అన్నారు.

మరో సందర్భంలో ఆయన తన ఇంటి గోడను కడుతూ వుండగా ఆయనను కలిశాము. అప్పుడు ఆయన "ఒక ముస్లిం ఇతర విధులపై ఖర్చు చేస్తే ఫలితం వుంటుంది. కాని ఈ మట్టిపై ఖర్చు చేసిందానికి ఎటువంటి ప్రతిఫలమూ లభించదు" అని అన్నారు. (బుఖారి)

ప్రవక్తశ్రీ (స) వారి ఈ ఉత్తమ సహచరుని ఉద్దేశ్యంలో ధర్మప్రచారం, దైవ మార్గంలో చేసే ఖర్చు మాత్రమే పుణ్యఫలాలను సాధించిపెడుతుంది. అయితే కేవలం ప్రాపంచిక వ్యామోహంలో, కేవలం భౌతిక ప్రయోజనాల కోసం నిర్మించుకునే గృహాలు, వాటి నిర్మాణాల వల్ల మనిషికి ఎటువంటి పుణ్యఫలం లభించదు. తీర్పు దినాన్ని అల్లాహ్ మార్గాన్ని మరువకుండా నిరంతరం దైవ ధర్మ స్థాపనకు కృషి చేస్తూ తన రక్షణ, తన కుటుంబ రక్షణ కొరకు గృహాన్ని నిర్మించుకోవడం ధర్మస్థాపనలో భాగంగానే పరిగణించబడుతుంది... దైవారాధనగానే భావించబడుతుంది.

గృహ నిర్మాణ విషయంగా ఇస్లాం చాలా స్పష్టంగా వుంది. ఇంటిలో విలాసాలు, గొప్పతనం చాటుకునే కట్టడాలను ఇస్లాం ఖండించింది. ఇంటిలో కావలసిన వినియోగకర వస్తువుల పట్ల ఇస్లాం ఆమోదం తెలిపింది. ముయాజ్ బిన్ జాబిర్ (రజి)ను యమన్‌కు గవర్నర్‌గా పంపుతూ దైవ ప్రవక్త (స)

"ఓ ముఆజ్! విలాసాలకు దూరంగా వుండు. అల్లాహ్ భక్తులు సుఖప్రియులు కాలేరు సుమా!" అంటూ హితోపదేశం చేశారు.' (అహ్మద్)

ఈ కారణంగానే ఇస్లాం బంగారు, వెండి పాత్రలను, పట్టుపీతాంబరాల పడకలను నిషేధించింది. కొంతమంది బంగారు, వెండి గిన్నెలను ఖరీదైన ఆసనాలను తమ హోదాకు నిదర్శనంగా భావిస్తారు.

"హుజైఫా (రజి) గారి ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) "మమ్మల్ని వెండి, బంగారు గిన్నెలలో తినరాదని వారించారు. పట్టు వస్త్రాలు ధరించడాన్ని వాటిపై ఆసీనులవడాన్ని నిషేధించారు" (బుఖారి)

ఇటువంటి ఆదేశాలు చూచి ఇస్లాం సుఖమయ జీవితానికి వ్యతిరేకమని భావిస్తే తప్పులో కాలేసినట్లేనని భావించాలి. ఇస్లాం భోగవిలాసాలను మాత్రమే వ్యతిరేకించింది తప్ప, మనిషి సుఖంగా, సంతోషంగా జీవించడాన్ని వ్యతిరేకించదు.

మనిషికి సుఖం కేవలం బంగారు, వెండి లాంటి విలువైన సామగ్రిలో లేదని స్పష్టం చేసింది. వ్యక్తిగతంగా, సామూహికంగా దుబారా, భోగవిలాసాల మానసికతను పెకిలించి వేయాలని తద్వారా వ్యక్తి, సమాజానికి సుఖ సంతోషాలు అందించాలని ఇస్లాం అభిల షిస్తుంది. తద్వారా మానవ సమాజాల ఉనికిని సుఖప్రదం చేయాలని భావిస్తుంది. ముస్లిం సమాజం తన జీవితాన్ని అల్లాహ్ ధర్మ సేవలో గడపడమే తన బాధ్యతగా స్వీకరించాలి. ధర్మవ్యాప్తికి, దాని స్థాపనకు నిరంతరం కృషి చేయాలి. తమ బాహ్య అంతర్గతాలను ప్రాపంచిక కల్లోలాల నుండి, ఉపద్రవాల నుండి పరిరక్షించుకుంటూ ముందుకు సాగాలి.

నిషేధాలకు, వ్యసనాలకు బానిసలవడం, బాధ్యతలను విస్మరించడం, ప్రయత్నాలకు దూరం కావడం, గౌరవ మర్యాదల మార్గాలను త్యజించడం మనిషిని పతనానికి చేర్చే చేష్టలే. పాపాలలో, నేరాలలో కూరుకొని పోయిన జాతి తన గౌరవ స్థానాన్ని కోల్పోక తప్పదు.

దైవప్రవక్త (స) ఒక భవిష్యవాణిని యిలా తెలిపారు, “భవిష్యత్తులో నా అనుచర సమాజంలో రుచికరమైన భోజనాలు కోరుకునేవారు వస్తారు. విభిన్న పానీయాలు త్రాగేవారూ, రంగురంగుల దుస్తులు ధరించేవారూ వస్తారు. వారు తమ గొంతులను చించుకొని మాట్లాడుతారు. వారు నా అనుచర సంఘంలో హీనీ స్థాయిగలవారు” (తిబ్రానీ)

ధర్మాన్ని కేవలం ఒక భావజాలంగా, ఒక ఆటగా, తమాషాగా మార్చివేసిన వారి గురించి పై విధంగా చెప్పబడింది. ధార్మిక సత్యతలను అడుగున పడవేసినవారు వీరే.

సత్యం ఉల్లేఖనాలల్లో తప్పిపోయింది!
అనుచర సమాజం భ్రష్టత్వంలో పడిపోయింది!

## దారిద్ర్యం - అహంకారాల మధ్య సమతుల్యత

భోగవిలాసాలకు అలవాటుపడ్డ వారిని అల్లాహ్ నీచులుగా పేర్కొన్నాడు. జంతు సంబంధమైన శారీరక ఇతర భౌతిక అవసరాల పరిపూర్తిని తమ జీవిత లక్ష్యంగా చేసుకున్నవారు వీరేనని పేర్కొన్నాడు. తమలోని నైపుణ్యాలను, ప్రత్యేకతలను

వీరు కేవలం పై అవసరాల నెరవేర్పుకోసమే వెచ్చిస్తారు. ఈ విషయంగా అల్లాహ్ ఆదేశం ఈ క్రింది విధంగా వుంది:

**ఈ అవిశ్వాసులను అగ్ని ముందుకు తీసుకువచ్చి నిలబెట్టినప్పుడు, వారితో ఇలా అనటం జరుగుతుంది "మీరు మీ వంతు వరాలను మీ ప్రాపంచిక జీవితంలో పొందారు. వాటి ద్వారా ఆనందాన్ని మీరు అక్కడే అనుభవించారు. ఇక ఏ హక్కూ అర్హతా లేకుండా మీరు భూమిపై ప్రదర్శిస్తూ ఉండిన దురహంకా రానికి, మీ అవిధేయతా చేష్టలకు పర్యవసానంగా, ఈ రోజు మీకు అవమాన కరమైన శిక్ష విధించబడుతుంది." *(ఖుర్ఆన్, 46 : 20)***

పై నరక శిక్షను విధించేటప్పుడు, ఇది వారు మధ్యేమార్గాన్ని అనుసరించ నందుకు, తద్వారా మార్గభ్రష్టత్వానికి గురైనందుకు, నిర్లక్ష్యం, ఏమరుపాటుకు గురయినందుకు అని గుర్తు చేయడం జరుగుతుంది.

**"మీ ఈ ముగింపుకు కారణం మీరు భూమిలో అసత్యాన్ని అనుసరించి, ఆనం దించడమే, దానికి గర్వపడటమే. ఇక వెళ్ళండి, నరక ద్వారాలలో ప్రవే శించండి. కలకాలం మీరు అక్కడనే వుండవలసి వుంది. అది దురహంకారుల నివాసం బహుచెడ్డది." *(ఖుర్ఆన్, 40 : 75)***

వాస్తవమేమంటే, ఇస్లామీయ ఖిలాఫత్ రాజ్య వ్యవస్థ కుప్పకూలిపోయిన తర్వాత ముస్లిములలోని మెజారిటీ సమతుల్యత, మధ్యేమార్గం, స్థిరత్వాలకు దూరమయిపోయారు. ఇస్లామీయ బోధనలను పెడచెవిన పెట్టి, ప్రాపంచిక రుచుల్లో మనోకాంక్షల నెరవేర్పుల్లో కూరుకుపోయారు. దైవప్రవక్త (స) ఈ దుస్థితి గురించి ముందస్తుగా హెచ్చరించారు.

అబూ బర్ఖా (రజి) ఉల్లేఖనం ప్రకారం, ప్రవక్త (స) "నాకు మీ పొట్ట, కామం, మనోకాంక్షల దాస్యం లాంటి భ్రష్టత్వాల గురించి భయంగా వుంది." (అహ్మద్)

ఇస్లాం ప్రారంభం- పేదలు, దళితులు, పూటకు గతిలేని వారు, బానిసులతో ప్రారంభమైంది. వారు ఎంతటి దౌర్భాగ్యులంటే; వారి కనీసం అవసరాలు కూడా తీరేవి కావు. ఇంతటి కఠిన పరిస్థితుల్లో కూడా వారు ఇస్లాం ధ్వజాన్ని సమున్నతంగా నిలిపారు. అబూ హురైరా ఉల్లేఖనాన్ని ఇమామ్ బుఖారి (రహ్మ) వివరణ ప్రకారం

ప్రవక్త(స) వారి సుఫహ్ అనుచరుల్లో (అరుగుపై జీవించిన సహచరులు) చాలా మందికి సరైన దుస్తులు వుండేవి కావు. కేవలం వారి శరీరాలపై ఒక్క వస్త్రం వుండేది.

అదే సమయంలో పేదరికం ఒక బాధాకరమైన ఆపదగా ఇస్లాం సూత్రీకరించింది. పేదరికం, దారిద్ర్యాల నుండి తమ్ము తాము కాపాడుకోవాలని ప్రజలను ఆదేశిం చింది. ఆడంబరం భోగలాలసం విశ్వాసులకు ఉపద్రవం అనీ పేర్కొంది. పేదరికం ఒక చెడు అని బోధించింది. ఈ విషయంగా ప్రవక్త (స) హెచ్చరిక ఇలా వుంది:

"మీ పేదరికం పట్ల నేను భయపడటంలేదు. నా భయమల్లా మీరు ప్రాపంచిక భోగలాలసల్లో నిమగ్నమై, పరస్పరం వీటికై పోటీపడతారని భయపడుతున్నాను. మీ పూర్వీకులు ఇలాగే చేసి సర్వనాశనం అయి పోయారు. ఇది మిమ్మల్ని కూడా నాశనం చేయగలదు" (బుఖారి)

జీవితపు అన్ని రంగాల్లోనూ సమతుల్యత, మధ్యేమార్గాలు అనుసరించడం ఉత్తమ ఆచరణగా పేర్కొనబడింది. ఉత్తమ జీవిత లక్ష్యాలను సాధించడానికి కోరికలను అదుపులో వుంచుతూ ముందుకు సాగడాన్నే మధ్యేమార్గం అంటారు. సంపదలను పోగుచేసుకోవడం, జీవితావసరాలను పూర్తిగా త్యజించడం లాంటి రెండు మార్గాలూ సమతుల్యతకు మధ్యే మార్గానికి వ్యతిరేకాలు. మధ్యేమార్గం దైవదౌత్యపు విధుల్లో ఒకటిగా వుంది.

"దైవప్రవక్త (స) యిలా సెలవిచ్చారు, నగుమోము, లోతైన అవగాహన, మధ్యేమార్గం (సమత-సమతుల్యతలు) దైవదౌత్యం యొక్క నలభై భాగాలలోని భాగాలు" (తిర్మిజి)



# 18వ భాగం

# శుచి - శుభ్రతలు

- పరిశుభ్రత సగం విశ్వాసం
- నమాజ్ - పరిశుద్ధత
- అన్న పానీయాలలో - శుచి శుభ్రతలు
- సౌందర్యం - నైపుణ్యం ప్రీతిమయాలు
- ఆరోగ్యం - చికిత్సల ప్రాధాన్యత



# పరిశుభ్రత - సగం విశ్వాసం

ప్రతి ముస్లిం, ప్రతి క్షణం జీవితంలో పరిపూర్ణత సాధించడానికి ముందుకు సాగాలి. అభివృద్ధి పథంలో నిరంతరం పయనం సాగించాలి. అల్లాహ్ వద్ద మనిషి సాగించిన కృషి, సాధించిన ఔన్నత్యాల పునాదలపైనే సాఫల్యం పొందుతాడు. పరిశుద్ధతల శిఖరాలకు చేరుకున్న మనిషి అదే స్థానంలో మృతి చెందితే అతడు స్వర్గవాసులలో కలిసిపోతాడు. పరిశుద్ధతల మార్గంలో పయనిస్తున్న బాటసారి మార్గ మధ్యంలోనే లక్ష్యం నెరవేరక మునుపే ఈ లోకం వీడిపోతే, అతడు క్షమ మన్నింపులకు హక్కుదారునిగా, సాఫల్యఫలాలకు అర్హునిగా ఎంచబడతాడు. తత్ భిన్నంగా పరిశుద్ధ జీవితానికి వ్యతిరేకంగా జీవించినవాడు, దైవాదేశాలను ధిక్కరించినవాడు మృతి నొందితే అతడు ప్రళయ దినాన అంధునిగా లేపబడతాడు. సత్యాన్ని ఇహలోకంలో చూడనందుకు, పాపకార్యాలలో మునిగి వున్నందుకు ఆ వ్యక్తి ఈ విధంగా హాజరవు తాడు.

ఈ ప్రపంచంలో పరిశుభ్రత, పరిశుద్ధతలను పాటించి శరీరం తదితర అవయవాలను శుభ్రపర్చుకున్న వ్యక్తి తీర్పు దినాన తలతళలాడే ముఖవర్చస్సుతో లేపబడతాడు. అతని నుదురు నుండి వెలుగు కిరణాలు జ్వాజ్వలమానంగా ప్రసరిస్తూ వుంటాయి. అతని అవయవాలు అత్యంత పరిశుద్ధంగా వుంటాయి అని దైవప్రవక్త ముహమ్మద్ (స) స్పష్టపర్చారు.

'అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఒకసారి స్మశానానికి వెళ్ళారు. అక్కడ "ఓ (మృత) విశ్వాసులారా! మీపై అల్లాహ్ శాంతి కురిపించుగాక! అల్లాహ్ దయతో మేము కూడా మిమ్మల్ని త్వరలో కలుసుకుంటాము. నేను సోదరులను కనులారా చూడాలని అభిలషిస్తున్నాను."అని అన్నారు. అందుకు ప్రవక్త (స) సహచరులు 'ఓ దైవ ప్రవక్తా! మేము మీ సోదరులం కామా?' అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్తశ్రీ (స) "మీరు నా సహచరులు ఇంకా (ఈ భూమిపైకి) రానివారు నా సోదరులు." అని అన్నారు. దానికి దైవప్రవక్త (స) అనుచరులు, 'ఓ ప్రవక్తా! మీరు వారిని చూడలేదు కదా? మరి, ఎలా గుర్తు పడతారు?" అని ప్రశ్నించారు. అందుకు ప్రవక్తశ్రీ (స), "తెల్లమచ్చలుగల గుర్రాలు నల్లటి గుర్రాలల్లో కలిసిపోతే వాటిని మీరు గుర్తుపట్టలేరా?" అని ప్రశ్నించారు. అందుకు వారు 'తప్పక పోల్చుకుంటాం' అని సమాధానమిచ్చారు. అప్పుడు దైవప్రవక్త (స) "తీర్పు దినాన వీరి పరిశుద్ధతల వుజూల కారణంగా వీరి అవయవాలు అన్ని మెరుస్తూ వుంటాయి." అని చెప్పారు. (ముస్లిం)

# నమాజ్ - పరిశుద్ధత

ఆరోగ్యం, పరిశుద్ధత, సౌందర్యాల పట్ల ఇస్లాం ప్రత్యేక శ్రద్ధ తీసుకొంది. దైవదౌత్య విధుల్లో వీటిని భాగం చేసింది. తన్ను తాను పరిశుభ్రంగా వుంచుకొని, చెడు కర్మలకు, చెడు పదార్థాలకు దూరంగా వుండే వ్యక్తికి మాత్రమే ఇస్లాంలో ప్రాధాన్యత వుంటుంది. పరిశుభ్రత కేవలం శరీరానికి మాత్రమే పరిమితం చేయక మానసిక ప్రక్షాళన, ఆత్మ సౌందర్యాన్ని సాధించడానికి మనిషి కృషి చేయాలి. నోటి చెడు మాటల నుండి, చేతులను చెడు కార్యాల నుండి, కాళ్ళను చెడు చూపుల నుండి, హృదయాన్ని చెడు భావనల నుండి పరిరక్షించుకోవాలి. వ్యక్తిగత, సామాజిక బాధ్యతలను సవ్యంగా నిర్వర్తించే వ్యక్తికి, సహనం, దృఢత్వం, శక్తివంతం ఆరోగ్య వంతమైన శరీరం కంటే మరేది ముఖ్యం కాగలుగుతుంది?

శారీరక శుభ్రతను ప్రతి నమాజ్ కొరకు తప్పనిసరి విధిగా ఇస్లాం నిర్ణయించింది. ప్రతిరోజూ నమాజ్, వేరు వేరు సమయాల్లో ఐదు సార్లు విధిగా ఆచరించబడుతుంది. ప్రత్యేక సమయాల్లో శరీరం మొత్తాన్ని శుభ్రపర్చుకొమ్మని ఆదేశించిన ఇస్లాం, సాధారణ సమయాల్లో బహిర్గతంగా వున్న అవయవాలను పరిశుభ్రపర్చుకొమ్మనీ, దుమ్ములను ధూళి దూరం చేసుకొని నూతనోత్తేజం చురుకుదనం పొందమని సెలవిచ్చింది:

**"విశ్వసించిన ప్రజలారా! మీరు నమాజు కొరకు లేచినప్పుడు మీ ముఖాలను, చేతులను మోచేతల వరకు ప్రక్షాళనం చేసుకోండి. తలపై చేతులతో రాయండి. కాళ్ళను చీలమండల వరకు కడుగుకోండి."** ***(ఖుర్ఆన్, 5 : 6)***

మానవ సహజ నైజానికి అనుగుణంగా, శరీరాన్ని ఎల్లప్పుడూ శుభ్రంగా వుంచుకునే పద్ధతిని ఇస్లాం విధి చేసింది. మానవుడు కేవలం ఆత్మ స్వరూపుడై వుంటే అతనికి స్నానపానాదుల అవసరం వుండేది కాదు. కాని, మనిషి ఆత్మ, మట్టితో సృజించబడిన శరీరమనే కవచాన్ని ధరించి వుంది. పాంచ భౌతిక ప్రపంచంలో నివసిస్తున్న మనిషి వృక్ష, జంతు సంబంధ పదార్థాల ద్వారా తన జీవికను పొందుతున్నాడు. తత్ సంబంధిత మాలిన్యాలను విసర్జిస్తున్నాడు కూడాను. ఈ కారణంగానే ఇస్లాం శారీరక శుభ్రతకు అత్యంత ప్రాముఖ్యతనిచ్చింది. స్నానం, తలస్నానంలతోపాటు రోజుకు ఐదుసార్లు వుజూ (పాక్షిక స్నానం)లను నిర్దేశించింది. అశుద్ధతలనుండి అశు

ద్ధావస్థల నుండి మనిషి దూరమయ్యేందుకు ఉత్తమ మార్గాన్ని చూపింది.

పరిశుభ్రత – పరిశుద్ధతలను ఇస్లాం ప్రవేశపెట్టిన పద్ధతి 'నభూతో నభవిష్యతి' మానవునికి స్నానం, వుజూ ద్వారా, విశ్వాసుల సమాజంలోని ప్రతి సభ్యుడు దుమ్ము-ధూళి చెమటల నుండి దూరంగా వుంటాడు. కొందరు అలక్ష్యంగా వుండి పరిశుభ్రతపై జాగ్రత్త వహించరు. ఇటువంటి వారికి కనీసం వారంలో ఒక్కసారైనా సంపూర్ణ స్నానం తప్పనిసరిగా చేయమని సుగంధ ద్రవ్యాలు వాడమని ఇస్లాం ఉపదేశించింది.

"యుక్త వయస్సుకు వచ్చిన ముస్లిం తప్పనిసరిగా శుక్రవారం నాడు సంపూర్ణ స్నానం చేయాలి. మిస్వాక్ (దంతధావనం) చేయాలి. సువాసనలు వాడాలి" అని దైవప్రవక్త (స) హితవు పలికారు." (ముస్లిం)

మరొక హదీసులో... "ఈ రోజు పండుగరోజు. ఈ రోజును అల్లాహ్ ముస్లింల కొరకు నిర్ణయించాడు. శుక్రవారపు నమాజ్‌కు వచ్చే వ్యక్తి తప్పనిసరిగా సంపూర్ణ స్నానం ఆచరించాలి." అని దైవప్రవక్త (స) ఆదేశించారు."

## అన్న పానీయాలలో పరిశుభ్రతలు

అన్నపానీయాలలో పరిశుభ్రతను ఇస్లాం విధి చేసింది. భోజనానికి ముందు చేతులు శుభ్రం చేసుకోవడం, భోజనానంతరం చేతిని శుభ్రపర్చుకోవడం తప్పనిసరి చేసింది. మనిషికి ఇంతకంటే పరిశుద్ధమైన పద్ధతి మరొకటిలేదు.

"ఆహార స్వీకరణ యొక్క శుభం తినటానికి ముందు, తర్వాత, చేతులు శుభ్రం చేసుకోవడంలోనే వుంది" అని ప్రవక్త (స) ఉపదేశించారు. (ముస్లిం)

"భోజనం తర్వాత నోటిని పుక్కిలించండి. ఇది పరిశుభ్రతకు మార్గం. పరిశుభ్రత విశ్వాసానికి స్వాగతం పలుకుతుంది. ఎవరి హృదయంలో విశ్వాసం స్థానం ఏర్పరచుకుంటుందో అతడు స్వర్గ ప్రవేశం పొందుతాడు" అని దైవప్రవక్త (స) పలికారు." (తిబ్రాని)

నోటి, పంటి పరిశుద్ధత గురించి ఇస్లాం అత్యంత ప్రాధాన్యతనిచ్చింది. ప్రాచీన కాలంలో ఇంతటి ప్రాధాన్యత యిచ్చిన ధర్మం వేరొకటిలేదు.

"దైవప్రవక్త (స) యిలా ఉపదేశించారు "దంతాలను శుభ్రపర్చుకోండి. నోటి శుభ్రత ద్వారా దైవ ప్రీతిని పొందండి. జిబ్రాయిల్ నా దగ్గరిని వచ్చినప్పుడల్లా మిస్వాక్

చేయమని ఆదేశించేవారు. చివరికి మిస్వాక్ చేయడం విధి చేయబడుతుందేమోనని నేను భయపడ్డాను" (ఇబ్నెమాజ)

వుజూలో పళ్ళను శుభ్రపర్చడం, భోజనానంతరం పళ్ళను శుభ్రపర్చడం దైవప్రవక్త (స) సాంప్రదాయంగా వుండింది. మరీ ప్రత్యేకించి మాంసాహారం భుజించినపుడు పళ్ళ, చేతివ్రేళ్ళ మధ్యలో జాగ్రత్తగా శుభ్రం చేసుకోవాలి అలా కాని పక్షంలో నిద్రలో క్రిమికీటకాల కాట్లకు గురయ్యే ప్రమాదం వుంది. మరో హదీసులో దైవప్రవక్త (స) మిస్వాక్ చేసే ఆజ్ఞ ఎంత దృఢంగా యివ్వబడిందంటే తద్వారా నా దంతాలు ఊడిపోతాయేమో అని భయపడేవాడినని చెప్పారు.

ఇస్లాం నోటిలో దుర్వాసన జనింపజేసే పదార్థాలను తినవద్దని హితవు గరిపింది. తద్వారా వ్యక్తి సమాజాల పరిశుద్ధతను కాంక్షించింది. ఉల్లి వెల్లుల్లి లాంటి పదార్థాలు తిని సామూహిక నమాజ్‌లకు రావడం ద్వారా తోటి నమాజీలకు యిబ్బంది కలుగుతుందని హితోపదేశం చేసింది. నోటి దుర్వాసన కారణంగా సామూహిక నమాజ్‌లో పాల్గొనే అదృష్టాన్ని కోల్పోవడం ఎంత దురదృష్టకరమో ఆలోచించాలి. దుర్వాసన వల్ల ఇటు తోటి సమాజాల ఆరోగ్యం చెడుతుంది. అటు వ్యాధిగ్రస్తులకు యిబ్బందీ కలుగుతుంది. కనుక ఇస్లాం శారీరక, నోటికి సంబంధించిన పరిశుభ్రతకు ఎంతో ప్రాధాన్యతనిచ్చింది.

## సౌందర్యం - నైపుణ్యం ప్రీతిమయాలు

ఒక ముస్లిం అసహ్యతకు దూరంగా వుండాలి. అందంగా శుచిశుభ్రతలతో హుందాగా వుండాలని ఇస్లాం తాకీదు చేసింది. సౌందర్యాన్ని శుచిశుభ్రతలను నమాజ్ లాంటి విధితో సంలీనపరిచింది.

**"ఓ ఆదం సంతానమా! ప్రతి ఆరాధన సమయంలో మీరు వస్త్రాలంకరణ పట్ల శ్రద్ధవహించండి."** ***(ఖుర్ఆన్, 7 : 31)***

వ్యక్తిగత, సామాజిక వ్యవహారాల్లోనూ, బాహ్య అంతర్గత విషయాలలోనూ, దుస్తుల విషయంలోనూ తమ చుట్టూ వున్న వాతావరణంతోనూ అందంగా ఆకర్షణీయంగా వుండేలా తమను తాము తీర్చిదిద్దుకోవాలని దైవప్రవక్త (స) ముస్లింలందరినీ ఉపదేశించారు.

"తలవెంట్రుకలు వున్నవారు వాటిని చక్కగా దువ్వుకోవాలి." (అబూదావూద్)

"అబూ ఖతాదా ఉల్లేఖనం ప్రకారం, "నేను దైవప్రవక్తను ఓ దైవప్రవక్తా! నాకు పొడవాటి వెంట్రుకలున్నాయి. నేను వాటిని దువ్వెనతో చక్కదిద్దుకోవాలా?' అని ప్రశ్నించాను. అప్పుడు ప్రవక్త శ్రీ (స) "ఔను వాటిని చక్కగా ఆకర్షణీయంగా వుంచుకో" అని చెప్పారు. అప్పటి నుండి అబూ ఖతాదా (రజి) ప్రతి రోజు సుగంధ తైలాన్ని వెంట్రుకలకు రాసుకునేవారు. తలను దువ్వెనతో చక్కదిద్దుకునేవారు." (నసాయి)

"అతా బిన్ యసార్ (రజి) కథనం ప్రకారం, 'ఒక వ్యక్తి దైవప్రవక్త (స) వద్దకు వచ్చాడు. అతని తల మరియు గడ్డం వెంట్రుకలు చెదిరిపోయి వున్నాయి. దైవప్రవక్త (స) అతనికి తలవెంట్రుకలను చక్కదిద్దుకొమ్మని సైగచేశారు. ఆ వ్యక్తి తలదువ్వకొని శుభ్రంగా ఆకర్షణీయంగా వచ్చాడు. అప్పుడు ప్రవక్త శ్రీ (స) "దయ్యంలా రావడం కంటే ఇప్పుడు బాగున్నావు కదా! " అని అన్నారు. (మాలిక్)

ఒక వ్యక్తి మాసిపోయిన చెమటవాసనగల దుస్తులు ధరించి వుండటం ప్రవక్తశ్రీ (స) చూశారు. అతడిని ఉద్దేశించి "బట్టలు ఉతుక్కోవడానికి ఇతని వద్ద డబ్బులు లేవా?" అని ప్రశ్నించారు.

దుబారా ఖర్చులేని అలంకరణను ఇస్లాం ఆహ్వానిస్తుంది. ప్రదర్శనాబుద్ధిలేని అలంకరణను శ్లాఘిస్తుంది. మనిషి తన గృహాన్ని, అంతర్ బాహ్యాలను అందంగా వుంచుకోవాలి. ముస్లింలను సౌమ్యంగా, అందంగా, ఆకర్షణీయంగా పరిశుభ్రంగా జీవించమని ఇస్లాం ఆదేశిస్తుంది.

"ఒక ప్రవచనంలో యిలా సెలవివ్వబడింది. హృదయంలో రవ్వంత అహంకారం కూడా వున్న వారు స్వర్గప్రవేశానికి అర్హులు కారు" అని ప్రవక్త (స) హెచ్చరించారు. అందుకు ఒక వ్యక్తి మంచి దుస్తులు, అందమైన చెప్పులు అహంకారపు గుర్తులు అవుతాయా?" అని అడిగాడు. అందుకు ప్రవక్త శ్రీ (స) "అల్లాహ్ అమిత సుందరుడు ఆయన సౌందర్యాన్ని యిష్టపడతాడు" అని అన్నారు. (అబూదావూద్)

మరో ఉల్లేఖనంలో, "అహంకారం అంటే సత్యాన్ని తిరస్కరించటం ఇతరులను హీనంగా చూడటమని" ప్రవక్తశ్రీ సెలవిచ్చారు.

శుచి, శుభ్రతల విషయంలో ప్రవక్త (స) చాలా లోతుగా, సూక్ష్మంగా జాగ్రత్తగా

వుండేవారు. ఎవరిలోనైనా ఇటువంటి లోపం కనిపిస్తే వెంటనే అతనిని సంస్కరించేవారు. మంచి స్థితిలో ఉండమని సలహా యిచ్చేవారు.

హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లా ఉల్లేఖనం 'దైవప్రవక్త (స) మా స్నేహితులలోని ఒక పశువుల కాపరిని చూశారు. అతని శరీరంపై వున్న దుస్తులు బాగా మాసిపోయి వున్నాయి. ప్రవక్తశ్రీ (స) "అతని దగ్గర వేరే బట్టలు లేవా? " అని విచారించారు. మరో రెండు జతల బట్టలు వున్నట్లు తెలుసుకొని వాటిని వెంటనే ధరించమని చెప్పారు. అతడు ఆ శుభ్రమైన బట్టలు ధరించి రాగా అతనిని తిలికించిన ప్రవక్తశ్రీ "వీనిదుంపతెగ ఇప్పుడు ఎంత చక్కగా వున్నాడు!" అని ప్రశంసించారు. ఆ పశువుల కాపరి ' ఓ దైవప్రవక్తా! మరి నేను దైవ మార్గంలో వెళ్తున్నాను' అని చెప్పి బయలు దేరాడు. అప్పుడు ప్రవక్త శ్రీ "నిస్సందేహంగా ఇతడు దైవమార్గంలో బయలుదేరాడు" అని చెప్పారు. ఉల్లేఖన కర్త ప్రకారం ఆ పశువుల కాపరి వీరమరణం పొందాడు. (మాలిక్)

మనిషి చేసే పనులను బట్టి, బట్టలపై శ్రద్ధ తీసుకోవడంపై నిర్లక్ష్యం వహిస్తాడు. కాని, మనిషిపై ఎన్ని బరువు బాధ్యతలు వున్నా, కార్యకలాపాల్లో మునిగి వున్నా తన అంతర్ బహిర్గతాలను పరిశుభ్రంగా, ఆకర్షణీయంగా మెరుగులు దిద్దుకోవాలి.

కొందరు అతివాద ధార్మిక పండితులు, పాత, చిరిగిన దుస్తులను ధరించడం ఒక ఆరాధనగా భావిస్తున్నారు. ప్రపంచం పట్ల వైరాగ్యం కలిగి ఉన్నామని, పరలోకం పట్ల నిమగ్నమై వున్నామని నమ్మబలుకుతారు. ఇటువంటి అతివాద పోకడలు, వాటి బోధనలు ఇస్లాం పట్ల నిందారోపణలు అవుతాయి.

"ఇబ్నె అబ్బాస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, ఖవారిజ్ తెగవారు విద్రోహానికి తలపడ్డారు. అప్పుడు నేను అలీ వద్దకు వెళ్ళాను. ఆయన వారిపై చర్యకోసం బయలు దేరమని చెప్పారు. ఆ సమయంలో నేను యమనీ దుప్పటిని ధరించి వున్నాను. నన్ను చూసి అలీ "స్వాగతం ఇబ్నె అబ్బాస్! కాని, ఈ దుప్పటి ఎలా ధరించారు?" అని అడిగారు. అందుకు నేను "మీరు నాపై అభ్యంతరం తెలుపుతున్నారు. ప్రవక్త (స) శరీరంపై ఇటువంటి దుప్పటిని నేను చూశాను." (అబూదావూద్)

ఇస్లామీయ పరిశుభ్రతలు వ్యక్తుల నుండి ప్రారంభమై ఇల్లు, రహదారుల వరకు వ్యాపిస్తాయి. ఇస్లాం తమ గృహాలను, పరిసరాలను పరిశుభ్రంగా, అందంగా, ఆకర్షణీ

యంగా ఉంచుకోమని ఆదేశించింది. యూదులు ఈ విషయం పట్ల అశ్రద్ధ కనబర్చేవారు. ముస్లింలను వారిని అనుసరించవద్దని హెచ్చరించారు.

"ఒక ఉల్లేఖనంలో యిలా వుంది, "అల్లాహ్ పరిశుద్ధుడు, ఆయన పరిశుభ్రతను కోరుకుంటాడు. శుచి శుభ్రతలంటే ఆయనకు ఎంతో ఇష్టం. దాతృత్వం అంటే ఆయనకు ఎంతో ఇష్టం. ఆయనకు ఆదరణ అంటే ఎంతో ఇష్టం. కనుక తమ ఇళ్ళను పరిసరాలను పరిశుభ్రంగా వుంచండి. యూదులను అనుకరించండి. (తిర్మిజి)

దారిలోని రాయిని, ముల్లును తొలగించటం విశ్వాసంలో ఒక భాగం. ఇది చాలా చిన్న పని. కాని దీన్ని దానంగా పరిగణించటం జరుగుతుంది.

'ఒక హదీసులో ఇలా వుంది, "బలహీనుని బరువు మోయటం నమాజుకు సమానం. దారిలోని అడ్డంకిని తొలగించడం ఒక నమాజుకు సమానం." (ఇబ్నె ఖుజైమా)

మరో హదీసులో ఇలా వుంది, "నమాజు కొరకు వేసే ప్రతి అడుగు ఒక దానానికి సమానం. దారి నుండి అడ్డంకిని తొలగించడం దానం" అని ప్రవక్తశ్రీ (స) సెలవిచ్చారు. (బుఖారి)

దారిలోని రాళ్ళు, రప్పలూ, ముళ్ళ కంపలు వుండి ప్రజల రాకపోకలకు అంతరాయం కలిగే వాటిని తొలగిస్తే పుణ్యం లభిస్తుందని ఇస్లాం ప్రకటించింది.

## ఆరోగ్యం చికిత్సల ప్రాధాన్యత

ఇస్లాం పరిశుభ్రత, ఆరోగ్య పరిరక్షణకు చాలా ప్రాముఖ్యతనిచ్చింది. తద్వారా ముస్లింల నైతిక, ఆర్థిక, శక్తులతో అభివృద్ధి సాధించడం దాని లక్ష్యంగా వుంది. ఇస్లాంకు దాని లక్ష్యసాధనలో – నరాలలో విద్యుత్తులా ప్రసరించే శక్తిగల శరీరాలు కావాలి. దృఢమైన, ఆరోగ్యవంతమైన అలలు అతని శరీరంలో ఎగిసిపడుతూ వుండాలి. అనారోగ్యులు, బలహీనులు ఈ భారాన్ని మోయలేరు. వణుకుతూ వుండే శరీరాలు ముందడుగువేయలేరు.

ఆరోగ్యవంత శరీరం ఆలోచనలను, వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేస్తుంది. ఇస్లామీయ సత్యసందేశ ప్రచారం బలహీన భుజాల ద్వారా నిలకడలేని కాళ్ళ ద్వారా వ్యాపింపజాలదు. ఈ కారణంగానే ఇస్లాం వ్యాధులకు వ్యతిరేకంగా పోరాడుతుంది. రోగకారక క్రిములకు అడ్డుకట్టవేస్తుంది. వాటి వ్యాప్తిని నిరోధిస్తుంది. తద్వారా

రోగాలు, బలహీనతలు, వ్యాధులు వ్యాపించకుండా జాగ్రత్త వహిస్తుంది.

చికిత్స కంటే రోగనిరోధానికే ఇస్లాం ప్రాధాన్యతనిస్తుంది. పరిశుద్ధత, పరిశుభ్రతలను పాటించడం ద్వారా ప్రాథమిక స్థాయిలోనే రోగకారక ద్వారాల తలుపులను మూసివేస్తుంది. అందుకు అవసరమైన జీవన సరళిని అందించింది. ప్రతి ముస్లింపై ఈ నియమావళిని విధి చేసింది. ఉషోదయాన నిద్రలేవాలి. రాత్రి త్వరగా నిద్రపోవాలి. ఆహార పానీయాల్లో శ్రద్ధ వహించాలి. అనైతిక అలవాట్లను విడనాడాలి. రాబడి ఖర్చులలో సంతులనం పాటించాలి. రోజుకు ఐదు సార్లు నమాజును స్థాపించాలి. సంవత్సరానికి ఒక నెలరోజుల ఉపవాసాలు పాటించాలి. తద్వారా శరీరాన్ని చురుగ్గా, హుషారుగా వుంచుకోవాలి.

అనైతిక చర్యలైన పాపాలకు దూరంగా వుండటం అనేక ప్రమాదకర రోగాలనుండి దూరంగా వుండటమేనని తెలుసుకోవాలి. ఒకవేళ ఒక ముస్లిం వ్యాధికి గురైతే వెంటనే దాని చికిత్సకు పూనుకోవాలి. ఇస్లాం వ్యాధుల నుండి రక్షించుకోటానికి చికిత్స, మందులను కూడా సూచిస్తుంది.

"దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "అల్లాహ్ సమస్త వ్యాధులతో పాటు వాటికి చికిత్సలను కూడా అవతరింపజేశాడు." (బుఖారి)

మరో ఉల్లేఖనంలో– "అల్లాహ్ వ్యాధులను వాటి చికిత్సలను కూడా సృష్టించాడు. ప్రతి వ్యాధికి తగిన చికిత్స–ఔషధాలను కూడా అందించాడు. కనుక వ్యాధికి తగిన చికిత్సలను అన్వేషించండి. కాని, వాటిలో నిషిద్ధ వస్తువులను ఉపయోగించకండి" అని సెలవిచ్చారు. (అబూదావూద్)

వ్యాధులకు మూఢాచార, మూఢనమ్మకాల చికిత్సలను ఉపయోగించడం ఇస్లాంకు వ్యతిరేకమైనది. ప్రతి శాస్త్రానికి దాని నిపుణులు వుంటారు. వారి సలహాను తప్పక పాటించాలి. దొంగ వైద్యులు, అజ్ఞానపు మోసగాళ్ళ మోసం నుండి తమ్ము తాము రక్షించుకోవాలి. వీరి మోసానికి గురికావడం ఒక ముస్లింకు తగనిపని.

"దైవప్రవక్త (స) ఇలా అంటూ వుండగా తాను విన్నానని ఉఖ్బ బిన్ ఆమిర్ (రజి) ఉల్లేఖించారు: "తావీజులు ధరించిన వ్యక్తి కోరికను అల్లాహ్ అంగీకరించకుండుగాక! మెడలో తాడు (గండా) ధరించిన వాడికి అల్లాహ్ క్షేమాన్ని ప్రసాదించ కుండుగాక!" (హాకిమ్)

దైవప్రవక్త (స) ఇంత కఠినంగా వారించినప్పటికీ ముస్లింలు అనారోగ్య కారణాలకు తావీజులు, గండాతాళ్ళు, మంత్రతంత్రాలను ఆచరిస్తునే వున్నారు. ఈ చర్యలన్నింటిని ఇస్లాం షిర్క్‌గా తీర్మానించింది. అజ్ఞానపు మూఢాచారాన్నీ మార్గ భ్రష్టత్వానికి గురిచేస్తాయి.

'ఉఖ్‌బా బిన్ ఆమిర్ (రజి) గారి మరో ఉల్లేఖనంలో ఇలా తెలుపబడింది: "పది మంది గల ఒక బృందం దైవప్రవక్త (స)తో ప్రమాణం (బయ్యత్) చేయడానికి వచ్చింది. ప్రవక్తశ్రీ (స) అందులో తొమ్మిది మందిచేత ప్రమాణం చేయించారు. ఒక వ్యక్తితో ప్రమాణం చేయించలేదు. అందుకు కారణం అడుగగా; అతని మెడలోని తావీజుగా దైవప్రవక్త(స) స్పష్టం చేశారు. ఆ వ్యక్తి దానిని తీసిపారేశాడు. అప్పుడు ప్రవక్త అతని నుండి క్రమేణా తీసుకున్నారు. అప్పుడు వీటిని (తావీజులను) ధరించేవారు అల్లాహ్‌కు సాటి కల్పించినట్లే" అని చెప్పారు. (అహ్మద్)

వ్యాధి నిరోధకాలను సూచిస్తూ వ్యాధుల నుండి రక్షణ పొందడానికి మలమూత్ర విసర్జనశాలలు దూరంగా వుండాలని ఇస్లాం నిర్దేశించింది. లోతైన గోతుల్లో మలమూత్రాలను కప్పిపుచ్చాలని, రాకపోకల మార్గంలో, ప్రజలు కూర్చొనే చోట మూలమూత్ర విసర్జచేయకూడదని ఆదేశించింది. నీరు, దాని ప్రవాహాన్ని, మలమూత్ర కల్మష ప్రభావానికి గురికారాదని హెచ్చరించింది.

ముస్లిం సమాజం పైబోధనలను, సూచనలను ఆమోదించి ఆచరించి వుంటే ఎంత బాగుండేదో కదా! ప్రమాదకర రోగాల నుండి ఎప్పుడో రక్షణ పొంది వుండేవారు. వీరి క్షమించరాని ఈ నిర్లక్ష్యం ఫలితంగా వీరి శక్తి నశించిపోయింది. వారి పట్టణాలు శిథిలాలుగా మారిపోయాయి. వీరు బలహీనులుగా మార్చివేయ బడ్డారు. ప్రవక్త (స) వారి ఈ క్రింది ఉపదేశాలను పరిశీలించండి:

'జాబిర్ (రజి) ఉల్లేఖనం "ఒక చోట స్థిరంగా వున్న నీటిలో మూత్ర విసర్జన చేయరాదు." (ముస్లిం)

"ప్రవహిస్తున్న నీటిలో మూత్ర విసర్జన చేయరాదు" (తిబ్రాని)

"ముఆజ్ (రజి) ఉల్లేఖనం : మూడు చెడు పనులకు దూరంగా ఉండండి. నీటి రేవుల వద్ద, నడిచే మార్గాలల్లో (చెట్ల) నీడల్లో మూత్ర విసర్జన చేయకండి" (అబూ దావూద్)

పైన సూచించిన అశుద్ధ పనులకు పాల్పడినవారు తిట్లకు, శాపనార్థాలకు గురవుతారు. బహిరంగ ప్రదేశాల్లో మలమూత్ర విసర్జన చేసేవారు సిగ్గు లజ్జ లేని వారిగా పరిగణించబడతారు.

దైవప్రవక్త (స) ఇలా నుడివారు, "ప్రజలను వారి మార్గంలో (మలమూత్రాల ద్వారా) హాని చేకూర్చితే అతనిపై ప్రజల శాపనార్థాలు తప్పనిసరి" (తిబ్రాని)

విశ్వాసుల మార్గంలో మలమూత్ర విసర్జన చేసినవాడు అల్లాహ్ దైవదూతలు, మానవులందరి అభిశాపానికి గురవుతాడు." (బైహఖి)

ఇస్లామ్ ఆరోగ్యకరమైన వాతావరణ హద్దులను నిర్ణయించింది. ఏదైనా ఒక పట్టణంలో భయానక ప్లేగు వ్యాధి వ్యాపిస్తే ఇస్లాం దాని చుట్టూ బలమైన గీతను గీస్తుంది. రోగ చికిత్స- దాని నిరోధానికి ప్రాధాన్యతనిస్తూ ఎవరూ ఈ గీత దాటి బయ టకు వెళ్ళకూడదనీ - ఎవరూ ఈ గీత దాటి లోనికి వెళ్ళరాదని ఆజ్ఞాపించింది. వ్యాధి అదుపులో రానంత వరకు ఈ ఆజ్ఞలు అమలవుతూ వుంటాయి.

దైవప్రవక్త (స) ఇలా హెచ్చరించారు, "ఒకవేళ మీరు ఎక్కడైనా ప్లేగు వ్యాధి వ్యాపించిందని వింటే అక్కడికి వెళ్లకండి. ఒకవేళ మీ ప్రాంతాలలో వ్యాపి స్తే అక్కడి నుండి బయటికి పోకండి." (బుఖారి)

వ్యాధి నియంత్రణలో రానంత వరకు ఎక్కడి వారిని అక్కడే వుండమని ఇస్లామీయ ప్రభుత్వం ఆజ్ఞలు జారీ చేస్తుంది. ప్రజలు తమ్ముతాము కాపాడుకోవాలనే ఉద్దేశ్యంతో ఇతర ప్రాంతాలకు పారిపోతారు. అయితే అంటు వ్యాధులను ఇతరులకు అంటిస్తున్నారని తెలుసుకోరు. ఈ స్థితిని ఇస్లాం పూర్తిగా నియంత్రిస్తుంది.

"ప్రాణాంతక అంటువ్యాధులు ప్రబలివున్న ప్రాంతంలో ప్రజలు ఓర్పు సహనా లను పాటించాలి. అక్కడి నుండి ఇతర ప్రాంతాలకు పారిపోకూడదు. దైవం తనకు విధి చేసిన నష్టమే తనకు కలుగుతుందని భావించాలి. ఈ స్థితిలో మరణం పొందిన వారు వీర మరణపు పుణ్యం లభిస్తుంది." (బుఖారి)

కొందరు దైవ నిర్ణయం ప్రకారమే లాభనష్టాలు జరగుతాయనీ రోగ ప్రాంతం లోకి వెళ్ళడం, రోగాలు రావడం తగ్‌దీర్‌కు అనుగుణంగా జరుగుతుందని మూర్ఖంగా వాదిస్తారు. ఇది పెద్ద అపరాధం మాత్రమే కాదు అపార్థం కూడాను. సిరియా దేశం

ప్లేగు వ్యాధికి గురైనప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) అక్కడికి వెళ్ళడాన్ని నిషేధించారు. విమర్శకులు "మీరు దైవ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నారు" అని విమర్శించారు. అందుకు ఖలీఫా ఉమర్ (రజి) "మేము దైవ నిర్ణయం నుండి ఆయన ఆదేశం వైపునకు పయనిస్తున్నాం" అని బదులిచ్చారు.

జీవన వనరులు, మార్గాలు అన్ని సమంజసమైనవే అయినప్పటికీ వాటి నుండి రక్షింపబడటం కూడా దైవ విధికి తగినదే. హజ్రత్ ఉమర్ (రజి) ఈ విషయాన్నే స్పష్టం చేశారు. ఇస్లాం అంటు వ్యాధుల నుండి దూరంగా వుండమని, తగు జాగ్రత్తలు వహించమని హెచ్చరించింది.

"అంటువ్యాధితో వున్నవారు, ఆరోగ్యంగా వున్న వారి వద్దకు వెళ్ళరాదని దైవప్రవక్త (స) సూచించారు." (బుఖారి)

మరో ఉల్లేఖనంలో, "కుష్టు రోగి నుండి దూరంగా తొలగిపోండి. సింహాన్ని చూసినవానిలాగా" అని చెప్పారు. (బుఖారి)

వచ్చిన వ్యాధి అంటు వ్యాధియా? కాదా? అనేది తప్పకుండా తెలుసుకొని ప్రవర్తించాలి. ప్రతి వ్యాధీ అంటు రోగం కాదు. దైవప్రవక్త (స) చేసిన ఉపదేశాలు అన్ని కేవలం అంటు రోగాల నిరోధానికి మాత్రమేనని గుర్తించాలి. రోగనిరోధక శక్తి గలవారు ఆ రోగం నుండి పరిరక్షించబడగలరు. కాని, ఆ శక్తిలేనివారు వ్యాధికి గురి అవుతారు. అన్ని వ్యాధులూ అంటు వ్యాధులైతే ప్రపంచం మొత్తం వ్యాధిమయం అయి వుండేది. అదే సమయంలో ప్రతి అంటువ్యాధీ ప్రమాదకరమైనది, ప్రాణాంతకమైనదీ కాదు. సాధారణ అంటువ్యాధుల పట్ల ప్రవర్తించే తీరు వేరుగా వుండాలి. ప్రాణాంతక వ్యాధుల పట్ల కడు జాగ్రత్త తప్పదు. సింహం యొక్క ఉదాహరణ ఈ విషయాన్నే స్పష్టపరిచింది.



# 19 వ భాగం

# సిగ్గు - లజ్జ

- ఒక ముస్లిం యొక్క ప్రాథమిక గుణం– లజ్జ
- సిగ్గు–లజ్జ, విశ్వాసాలు కవల పిల్లలు
- సిగ్గు–లజ్జ–మంచికి మూలం
- మీ ప్రభువు ముందు సిగ్గు పడండి



# సిగ్గు-లజ్జ ఒక ముస్లిం యొక్క ప్రాథమిక గుణం

సిగ్గు (లజ్జ) ఒక మనిషి యొక్క నైజానికి చిహ్నంగా వుంటుంది. ఒక వ్యక్తి యొక్క విశ్వాసం, వినయం నైతికతల స్థాయి ఈ అంశం మీదనే ఆధారపడి వుంటుంది. ఒక తప్పు చేసిన వ్యక్తి యొక్క ముఖం సిగ్గుతో కరిగిపోతూ వుంటే, తన పని పట్ల తనే అయిష్టత కనపరుస్తూ వుంటే, తన నుదురు లజ్జకు గురి అవుతూ వుంటే అతని అంతరాత్మే ఇంకా బ్రతికి వుందని భావించవచ్చు. అలాకాక, తప్పులకు ఎలాంటి సిగ్గు ప్రదర్శించకుంటే, తాను చేస్తున్న పాపాలకు కనీస లజ్జ చూపక లజ్జాహీనుడై తిరుగుతూ వుంటే లేక అతనిలో ఎలాంటి సంస్కరణా అవకాశం లేదని గ్రహించాలి.

ఇస్లాం తన అనుయాయులను సిగ్గు, లజ్జ పట్ల సుశిక్షణ అందించింది. మనిషి యొక్క ఉత్తమ గుణంగా ప్రశంసించింది. దైవప్రవక్త (స) ఈ విషయంగా యిలా సెలవిచ్చారు, "ప్రతి ధర్మానికి ఒక నైతిక గుణం ఉంటుంది. ఇస్లాం యొక్క నైతిక గుణం సిగ్గు లజ్జ" (మాలిక్)

ప్రవక్త మూసా (అలై) కాలంలో యూదుల బోధనల్లో ప్రత్యేక నైతిక గుణం వీరత్వంగా వుండింది. ప్రవక్త ఈసా (అలై) కాలంలో ఉత్తమ శిక్షణగా దాతృత్వం విశాల హృదయం వుండింది. ఇస్లాం యొక్క ప్రత్యేక నైతిక గుణం సిగ్గు, లజ్జలై వున్నాయి. ఇస్లామీయ ప్రపంచానికి ఈ నైతిక గుణమే ఇతర ధర్మాలపై దానికి ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పించింది.

ఒక ముస్లింలో మంచి పట్ల ప్రేమ, చెడు పట్ల అసహ్యం వుండి తీరాలి. ఈ గుణాలే అతని మంచిని ప్రేమించే వానిగా, చెడును ద్వేషించే వానిగా పునాదులు వేస్తాయి. ఒక ముస్లింలో గుణం తప్పనిసరి అవుతుంది. ఈ విషయాన్ని ప్రముఖ ఇస్లామీయ తాత్వికుడు ఇబ్నుల్ ఖయ్యూం (రహ్మ) యిలా తెలిపారు. " (పేజీ 244 ఆఖరి పేరా అనువాదం)

దైవప్రవక్త ముహమ్మద్ (స) అందరికంటే సున్నిత హృదయం గలవారు. పరిశుద్ధులు, శీలవంతులు, ఉత్తములు. అన్నింటిలోనూ ఉత్తమ విషయ పరిజ్ఞానం వున్న వారు నిషిద్ధాల నుండి దూరంగా తొలగిపోయేవారు.

అబూ సయీద్ ఖుద్రీ ఉల్లేఖనం ప్రకారం, "ప్రవక్త (స) యవ్వనంలో వున్న ఒక

యువతి కంటే కూడా ఎక్కువగా సిగ్గుపడేవారు. ఆయనకు అయిష్టత కలిగించే పని ఏదైనా ఆయనకు ఎదురైతే ఆ గుర్తును ఆయన ముఖంలో యిట్టే కనిపించేది." (ముస్లిం)

## సిగ్గు-లజ్జ, విశ్వాసాలు కవల పిల్లలు

విశ్వాసం అంటే సృష్టికర్త అయిన విశ్వ ప్రభువుకు ఆయన దాసునికి మధ్యగల సంబంధమే. ఈ సంబంధపు మొట్టమొదటి హక్కు ఆ దాసుని యొక్క ఆత్మ ప్రక్షాళనగా వుంటుంది. ఈ ప్రళక్షాళన ద్వారా దాసుడు తన్నుతాను సంస్కరించుకుంటాడు. నైతిక తను తరించుకుంటాడు. వ్యక్తిలో చెడుకు దూరంగా వుండాలనే చైతన్యం వున్నప్పుడు మాత్రమే ఇది సాధ్యమవుతుంది. మనిషి చిన్న చిన్న పాపాలను నిరాఘాటంగా చేస్తూ వుంటే అతనిలో సిగ్గు లజ్జలు లేవనీ- అతని విశ్వాసం అస్థిరతకు గురైందని తెలుసు కోవాలి.

"దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు, "సిగ్గు విశ్వాసాలు పరస్పరం స్నేహితులు. ఒకటి నశిస్తే రెండవదీ నశిస్తుంది." (హాకిమ్) ఎందుకంటే;

ఒక వ్యక్తిలో లజ్జా గుణం లేకపోతే అతడు చిన్న చిన్న పాపాలనుండి పెద్ద పెద్ద పాపాలవైపునకు సాగుతాడు. చివరకు అత్యంత అధమ స్థానానికి చేరుకుంటాడు. దైవప్రవక్త శ్రీ (స) వారి ఒక హదీసులో ఈ విషయం స్పష్టపరచబడింది. మనిషి పెద్ద పెద్ద పాపాల వరకు చేరడం సిగ్గు-లజ్జల వినాశనం నుండే ప్రారంభమవుతుంది.

"అల్లాహ్ ఎవరినైనా నాశనం చేయదలిచినప్పుడు అతని నుండి సిగ్గు-లజ్జలను తొలగించి వేస్తాడు. ఈ లక్షణం తొలగిన తర్వాత ఆ వ్యక్తి అసహ్యకర చేష్టలకు గురవు తాడు. ఆ తరువాత అతని నుండి అమానతుదారీతనం గుంజుకోబడుతుంది. అపుడు ఆ వ్యక్తి (ద్రోహిగా మారుతాడు. ఆ సమయాన అతని నుండి దైవకారుణ్యం హరిం చబడి శాపగ్రస్తుడవుతాడు. అప్పుడు అతను ఇస్లాం పరిధి నుండి తొలిగి పోతాడు."

(ఇబ్నెమాజ)

తాత్వికపరమైన రోగాలను గుర్తించడం, వివిధ దశలలో వాటి తొలగింపుల గురించి ఇస్లాం ప్రత్యేకమైన శిక్షణ ఇవ్వడం జరిగింది. ఎప్పుడు అయితే మనిషి సిగ్గు లజ్జల దుస్తులను తొలగించుకుంటాడో - అతనికి తన ఆచరణల పట్ల ఎలాంటి బాధ్యత లేకుండా పోతుంది. ఎవరి ఉపదేశాలను, హెచ్చరికలను లెఖ్ఖ చేయడు. చివరికి ప్రజలపై దుర్మార్గం చేసేవానిగా మారుతాడు. తన అధీనంలోని వారిపై అత్యాచారాలు

చేస్తాడు. ఇటువంటి దౌర్భాగ్యుడు ఎవరిపైనను దయచూపడు. హృదయాలల్లో ఈర్ష్యా ద్వేషాలను, శత్రుత్వాలను పెంపొందిస్తాడు.

సిగ్గు-లజ్జ లేకుండా ఇటువంటి నీచస్థితికి దిగజారిన వ్యక్తికి ఎటువంటి బాధ్యతా అప్పగించబడవు. ఏ విషయానికీ అమానతుదారునిగా వుండలేడు. ఇతని వాగ్దానానికి ఎలాంటి విలువా వుండదు. సమాజంలో గౌరవానికి అర్హత కోల్పోతాడు. దగాకోరు, మోసగాడు అయినందున పదవీ బాధ్యతలూ అప్పగించబడవు.

అల్లాహ్ పట్ల భీతి, ప్రజల పట్ల బాధ్యతలేని ఈ వ్యక్తి సిగ్గు, లజ్జ, అమానతు, నమ్మకం, నైతికతలు పోగొట్టుకొని ఒక పిచ్చికుక్కలా మారుతాడు. తన స్వార్థపు జొల్లు కార్చుకుంటూ మనోకాంక్షల వైపునకు పరుగెత్తుతూ వుంటాడు. సత్యత, మంచితనం లాంటి సుగుణాలను వదలిపెట్టి అగత్యపరులను దోచుకోవడం మొదలెడతాడు. బలహీనుల, బాధితుల పట్ల రవ్వంత కరుణగాని, జాలిగాని అతనిలో కానవు. కళ్ళపై అహంకారపు పొరలు కనిపిస్తు ఉంటాయి. ఈ నీచ నికృష్ట స్థాయిలో అతను అన్ని ధార్మిక సంబంధాలను తెంచుకొని ఇస్లాం నుండి దూరంగా తొలగిపోతాడు.

సిగ్గు-లజ్జలకు అత్యంత ఉత్తమ స్థానాలు వున్నాయి. సంభాషణా సమయాల్లో వినమ్రత, ప్రజల వ్యక్తిగత లోపాలను బహిర్గత పరచకుండా వుండటం. అసందర్భ ప్రేలాపనలు చేయకుండా వుండటం లాంటివన్నీ సిగ్గు లజ్జల ఉత్తమ గుణాలే.

దైవప్రవక్త (స) యిలా తెలిపారు: "సిగ్గు విశ్వాసంలో భాగం. విశ్వాసం గల వ్యక్తి స్వర్గ ప్రవేశానికి అర్హుడు. అశ్లీలత హింస వంటిది. హింసా వాది స్థానం నరకం తప్ప మరేదీకాదు." (అహ్మద్)

ముస్లింలు తమ సభలు, సమావేశాల్లో సయితం మధ్యేమార్గాన్ని సంతులనాన్ని పాటించడం కూడా సిగ్గు-లజ్జలలో భాగమైనదే. గంటల తరబడి మాట్లాడేవారు సభల్లో కారుకూతలు కూసేవారు తాము చేస్తున్న పనికి సిగ్గుపడరు. అవమానకరంగానూ భావించరు. ఇటువంటి అలవాటును ఇస్లాం అసహ్యించుకుంది.

"కేవలం తన మాటకారితనం చేత ప్రజలను మెప్పించి, తన పనులు చక్కబెట్టు కునేందుకే ప్రయత్నించే వ్యక్తీ - తన నైపుణ్యాన్ని ఇందుకు ఖర్చు చేసే వ్యక్తి యొక్క ఆచరణను అల్లాహ్ స్వీకరించడు." (అబూదావూద్)

మరో హదీసులో "ఒకే విషయాన్ని మాటామాటికి చెప్పడం ద్వారా అతడిని

తనకు అనుకూలంగా మల్చుకునేవాని సంభాషణను అల్లాహ్ అసహ్యించుకుంటాడు" అని ప్రవక్త (స) సెలవిచ్చారు. (తిర్మిజి)

ఈ అసహ్యతకు కారణం వీరి సంభాషణల్లో అబద్ధం, కల్పితాలు వుంటాయి. ప్రదర్శానా బుద్ధి, నైతిక రాహిత్యం చోటుచేసుకోని వుంటాయి. వారి సమావేశాలు సమస్త చెడులకు నిలయాలుగా వుంటాయి. వీరు సిగ్గు-లజ్జ వ్రీడలను అలవర్చుకుంటే పై నైతిక చెడుగులన్నీ దూరమైపోతాయి. ఈ విషయాలే అనేక హదీసుల్లో తేటతెల్లం చేయబడ్డాయి. హృదయ మాలిన్యాల విషయం ఇక్కడ ప్రస్తావించబడలేదు. కేవలం నోటి చెడుగుల నుండి తమ్ముతాము కాపాడుకునే అంశాలు అందించబడ్డాయి.

తన గురించి ఇతరులు మంచిగా చెప్పుకోవాలనీ- తన గురించి చెడ్డగా ప్రచారం కాకూడదని భావించడం కూడా సిగ్గులో భాగంగానే ఉంటుంది.

ఇతరులలో కనపడకుండా వున్న లోపాలను ప్రచారం చేయడం పరోక్షనింద అవుతుంది. పరోక్ష నింద ఇస్లాంలో నిషేధించబడింది. కొన్నిసార్లు ఇతరుల ప్రమేయం లేకుండానే వ్యక్తిలోని లోపం బహుళ ప్రచారమైపోతుంది. ఈ కారణంగానే దైవప్రవక్త (స) పాపం చేసిన వారు ప్రజల నుండి ముఖం చాటుచేసుకొని తిరగాలని సూచించారు.

ఒకసారి ప్రవక్తశ్రీ (స) వారు తన శ్రీమతితో మస్జిదె నబవీలోని ఒక మూలలో వుండగా ప్రియ సహచరులు చూశారు. వారు ముఖం తిప్పుకోగా ప్రవక్త(స) వారిని ఆపి తాను తన భార్యతో సంభాషిస్తున్నానీ - ఈ స్త్రీ అపరచితురాలుగా మీరు భావించ వద్దనీ చెప్పి అనుమానాలకు, పుకార్లకు తావులేని విధంగా స్పష్టపరిచారు.

ఒక వ్యక్తి తన రోజువారి ప్రవర్తన ద్వారా ఖ్యాతి పొందాలనీ, ప్రదర్శనాబుద్ధిని ప్రదర్శిస్తాడు. మరో వ్యక్తి తన గొప్పతనాన్ని దైవదాసుల దృష్టి నుండి దాచిపెట్టుకుంటాడు. వీరిద్దరి మధ్య భూమ్యాకాశాల తేడా వుంటుంది.

ఒక వ్యక్తి తన పాపాల కారణంగా సిగ్గుపడుతూ తిరగకూడదనీ, పాపరహిత జీవితాన్ని గడపాలని ఇస్లాం అభిలషిస్తుంది. తప్పులపై సిగ్గుపడే వ్యక్తిలో ఎంతో కొంత మంచి వుంటుంది. ఈ మంచిని అతను పెంచుకునే ప్రయత్నం చేయాలి. తన గొప్ప తనాన్ని చాటుకుంటూ గర్వంగా తిరిగే వ్యక్తిలో చెడు వుంటుంది. అతను ఆ చెడును తగ్గించుకునే కృషి చేయాలి. తన లోపాలను ఎవరూ వెలెత్తి చూపకూడదని భావించే

వారు - ఇతరుల లోపాల జోలికి వెళ్లకూడదు. ప్రతి ముస్లిం అంతరంగిక బాహ్య చెడులకు దూరంగా వుండాలి. బహిరంగ చెడులైనా రహస్య చెడులైనా వాటిని త్యజించే కృషికి పూనుకోవాలి.

ఒక ప్రఖ్యాత సామెత యిలా వుంది "మీ చెవులు మీ గురించి వినగలిగిన విషయాలను ఆచరించండి. చెవులు వినలేని ఆచరణలకు దూరంగా వుండండి."

## సిగ్గు-లజ్జ, మంచికి మూలం

సిగ్గు-లజ్జ శుభ సంక్షేమాలకు పునాదులు. ప్రతి పనిలోనూ గౌరవనీయతకు ప్రమాణం. దైవ సందేశహరులు (స) "ఏ విషయంలో అశ్లీలత వుంటుందో అది చెడి పోతుంది. మరి ఏ విషయంలో సిగ్గు-లజ్జ వుంటుందో అది సౌందర్యవంతంగా వుంటుంది" అని సెలవిచ్చారు." (తిర్మిజి)

మనిషి సిగ్గు-లజ్జలను తన దుస్తులుగా చేసుకుంటే అతను కార్యసాధకుడు, సాఫల్యవంతుడుగా మారుతాడు. హజ్రత్ ఆయెషా (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త మహాశయులు ఇలా సెలవిచ్చారు:"ఒకవేళ సిగ్గు-లజ్జ-వ్రీడలు మానవ రూపం ధరిస్తే అత్యంత సౌందర్యవంతంగా, సంపూర్ణంగా వుంటుంది. అదే అశ్లీలం, అనైతికతలు మనిషి రూపం ధరిస్తే అది అత్యంత నీచ నికృష్ట స్వరూపంలో వుంటుంది." (తిబ్రాని)

లజ్జావంతుడు, సిగ్గరి అయిన వ్యక్తి తోటి వారి హక్కులను గుర్తిసాడు. ఎవరి గౌరవ మర్యాదలను వారికి చెల్లిస్తాడు. సేవకునికి యజమానితో, శిష్యునికి గురువుతో గౌరవమర్యాదల సంబంధం వుంది. ఈ సంబంధాన్ని గౌరవిస్తాడు. బాధ్యుల ముందు పెద్దగా మాట్లాడటం- వారికంటే ముందుగా నడవటం చేయడు.

"ఒక హదీసులో "మీరు గురువులను గౌరవించండి" అని చెప్పబడింది. (తిబ్రాని)

"మరో హదీసులో "మీ ధార్మిక పండితులను అనుసరించని, సద్వర్తనుడి పట్ల సిగ్గుపడని కాలాన్ని నాకు చూపకు" అని దైవప్రవక్త (స) దుఆ చేశారు. (అహ్మద్)

"అబ్దుల్లా బిన్ యస్ర్ (రజి) ఇలా తెలిపారు, "నేను ఒక హదీసును చాలా కాలంగా వింటూ వస్తున్నాను. అందులో దైవప్రవక్త (స) "ఏదైనా ఒక జాతి వారి

వద్దకు వెళ్ళినపుడు వారి ముఖ కవళికల ద్వారా అక్కడ ఒక్కడు కూడా అల్లాహ్‌కు భయపడేవారు లేడని తెలిస్తే – అక్కడి పరిస్థితి చాలా ప్రమాదకరంగా వుందని తెలుసుకోవాలి" అని చెప్పారు. (అహ్మద్)

సిగ్గు, లజ్జా గుణాలు పిరికితనానికి నిదర్శనాలు కావు. సిగ్గరి అయిన వ్యక్తి తన కంటి చెమ్మ కోల్పోయే దానికి ముందే తన్ను తాను త్యాగం చేసుకోవడం ఉత్తమంగా భావిస్తాడు. ఈ స్థితి వీరత్వానికి వన్నె తెచ్చేదిగా చెప్పబడింది.

అప్పుడప్పుడు సిగ్గు లజ్జ గుణాలలో భయం కూడా కలిసిపోయే సందర్భాలు వస్తాయి. అపనిందల పాలౌతానేమోనని భీతిల్లే స్థితి ఏర్పడుతుంది. ఈ స్థితి ప్రశంసనీయమైనదే తప్ప వేరేది కాదు. నాడు యూదులు బైతుల్ ముఖద్దిస్ లోనికి దూసుకుని వస్తున్న మహాబలవంతులను ఎదుర్కోవడానికి నిరాకరించినప్పుడు – అలా నిరాకరించిన వారిలో అల్లాహ్ అనుగ్రహం పొందిన ఇద్దరు దైవదాసులు కూడా వున్నారు. వారు చెప్పిన మాటను దివ్యఖుర్‌ఆన్ ఈ క్రింది విధంగా రికార్డు చేసింది.

**"ద్వారం గుండా లోపలకు జొరబడి, ఆ బలవంతులను ఎదుర్కోండి. ఒకసారి మీరు లోనికి ప్రవేశించారా, మీదే పై చేయి అవుతుంది." (ఖుర్‌ఆన్, 5 : 23)**

పైన వివరించబడిన వ్యక్తులు అల్లాహ్‌కు భయపడేవారే. ఓడిపోతే పరాభవం పొందుతామేనని భీతిల్లేవారు. వెన్ను చూపడానికి సిగ్గుపడుతూ వున్నారు. ఒకవేళ దాడి చేసి సమర్థంగా నాయకత్వం అందించి వుంటే గెలిచి వుండేవారు కూడాను.

నిస్సందేహంగా సిగ్గు–లజ్జ మానవుని సహజ గుణాలు. మనుషుల్లోనే కొందరు సిగ్గు–లజ్జలకు కడు దూరంగా వుంటారు. మరికొందరు సిగ్గు–లజ్జలతో తొణికిసలాడుతూ వుంటారు. తప్పును ఒప్పుకోవడం లజ్జాగుణంలో భాగంగా ఉంటుంది. సిగ్గు లజ్జ అలంకారంగా వుండి మనిషికి గౌరవం తెస్తుంది. మరో రకమైన సిగ్గు పరాభవం ద్వారా జనిస్తుంది. ఒక్కోసారి ఈ పరాభవపు సిగ్గు పెద్ద పెద్ద నేరాలకు ఒడిగడుతుంది. సకారాత్మక సిగ్గు చెడుకు మార్గభ్రష్టత్వానికి లొంగదు. అది సత్యానికి సహాయకారిగా వుంటుంది. దైవగ్రంథం అవతరిస్తూ వున్న కాలంలో నాటి విశ్వాసులు విగ్రహారాధనను విమర్శించేవారు. అందులో భాగంగా ఈగ, దోమలు వాటిపై కూర్చున్నా అవి వాటిని తోలుకోలేవని విమర్శించేవారు. నాటి అవిశ్వాసులకు ఈగ, దోమల ఉదాహరణ చాలా అల్పంగా కనిపించింది. ఈ ఉదాహరణలకు సిగ్గేస్తుందని

ఎగతాళి చేసేవారు. వారి ఎగతాళిని తిప్పికొడుతూ సృష్టికర్త అల్లాహ్ ఈ క్రింది వాక్యాలను అవతరింపజేశాడు.

**“అవును దోమ లేక దాని కంటే మరీ అల్పమైన వస్తువును దృష్టాంతంగా చెప్పడానికి అల్లాహ్ ఎంతమాత్రం సిగ్గుపడడు. ఈ దృష్టాంతాన్నే సత్య స్వీకారులు చూసి, ఇది తమ ప్రభువు తరఫు నుండి వచ్చిన సత్యమేనని గ్రహిస్తారు. కాని సత్య తిరస్కారులు వాటిని విని ‘ఈ ఉపమానాల ద్వారా అల్లాహ్ చెప్పదలచుకున్నది ఏమిటి?’ అని ప్రశ్నిస్తారు.” (ఖుర్ఆన్, 2 : 26)**

పై వాక్యాలలో విగ్రహాల అసహాయత, బలహీనతలను స్పష్టంగా చూపించడం జరిగింది. సత్యవచనాలు తెలుపడంలో సృష్టికర్త అల్లాహ్ ఏ మాత్రం సిగ్గుపడడు. కనుక సత్యప్రియులైన ముస్లింలు సత్యాన్ని ప్రకటించడంలో సిగ్గుపడటం, భయపడటం లేక దాని గురించి యోచించడం గాని చేయకూడదు.

## మీ ప్రభువు ముందు సిగ్గుపడండి

సిగ్గు–లజ్జల ఉత్తమ (స్థానం) స్థాయి తన నిజ ప్రభువు అయిన అల్లాహ్ ముందు సిగ్గుపడటమే. ఆయన ప్రసాదించిన ఆహారాన్నే మనం తింటూ ఆయన గాలినే మనం పీల్చుకుంటున్నాం. ఆయన సృష్టించిన ఈ భూమిపై నడస్తూ – జీవిస్తూ – ఆయన సృష్టి అయిన నీలాకాశపు కప్పు క్రింద నీడ పొందుతున్నాం. మానవుడు, తనలాంటి మరో మానవుడు చేసిన ఉపకారానికి కృతజ్ఞత చూపిస్తాడు. కాని, అల్లాహ్ పట్ల ఈ వైఖరి అవలంబించడం లేదు. ఈ ధిక్కారానికి ఎలా పాల్పడుతున్నాడనేదే ఆశ్చర్యకర విషయం. అమ్మ ఒడి నుండి సమాధి ఒడి వరకు నిజ ప్రభువు, సర్వసృష్టికర్త అయిన అల్లాహ్ ఉపకారాల వల్లే మనిషి జీవిస్తున్నాడు. మరణానంతరపు శాశ్వత జీవితమూ అల్లాహ్ ప్రసాదితమే.

తన దాసులపై అల్లాహ్‌కు చాలా పెద్ద హక్కు వుంది. దాసుడు ఈ హక్కును గుర్తించి తదనుగుణమైన ఆచరణ కొనసాగిస్తే వారు ఎటువంటి బలవంతం లేకుండానే సత్కార్యాల వైపునకు మరలుతారు. చెడు నుండి పాపాల నుండి సిగ్గు, లజ్జలను ప్రదర్శిస్తూ దూరంగా వుంటారు.

“అబ్దుల్లాహ్ బిన్ మస్‌ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా

సెలవిచ్చారు. "మీరు అల్లాహ్ పట్ల సిగ్గు పడే విధంగా సిగ్గుపడండి. ఏ విధంగా దాని హక్కు వుందో దాని హక్కును నెరవేర్చండి." అందుకు మేము 'ఓ దైవప్రవక్తా! మేము అల్లాహ్ పట్ల సిగ్గు-లజ్జ కలిగివున్నాము' ఆయన పట్ల కృతజ్ఞత కలిగి వుంటున్నాం' అని చెప్పాం. దానికి దైవప్రవక్త (స) "సిగ్గు లజ్జలంటే ఇవి కావు. మీరు మీ తలనుండి కాళ్ళ వరకు గల అవయవాలన్నింటిని చెడుకు దూరంగా వుంచాలి. పొట్టను, ఇతర ఆహారాన్ని అధర్మ సంపాదన నుండి దూరంగా వుంచండి. మరణం, సమాధి స్థితిని నిరంతరం స్మరించండి. పరలోకాన్ని ప్రేమించే వ్యక్తి ప్రాపంచిక పటాటోపాలకు దూరంగా వుండాలి. పరలోకాన్ని ఇహలోకంపై ప్రాధాన్యతనివ్వాలి. ఎవరు ఈ విధంగా చేస్తారో - వారే అల్లాహ్ పట్ల సిగ్గు-లజ్జల హక్కును నిర్వర్తించినవాడు" అని వివరించారు." (తిర్మిజి)

పై ఉపదేశం తనలో అనేక ఇస్లామీయ సూత్రాలను ఇమిడ్చుకొని వుంది. ఒక ముస్లిం నోరు చెడు పలకకూడదు. కళ్ళు చెడును, నిషిద్ధాలను చూడకూడదు. అతని చెవులు చెడు విషయాలను వినకూడదు. తన పొట్టను అధర్మ సంపాదనతో నింపకూడదు. ధర్మబద్ధ సంపాదనే తన జీవిక కావాలి. తన సమయాన్ని అల్లాహ్ ప్రీతిని పొందే ప్రయత్నంలోనే గడపాలి. తన శక్తి సామర్థ్యాలు, సహజ నైపుణ్యాలు, వనరులు అన్నీ పుణ్యఫలాల సాధనకే వెచ్చించాలి. తన మనోకాంక్షలు - అసంబద్ధ కోరికలు తనను దారి తప్పించకుండా చూచుకోవాలి.

అల్లాహ్ నిరంతరం తనను గమనిస్తున్నాడనే చైతన్యంతో, నమ్మకంతో పై ఆచరణలను కొనసాగిస్తే అప్పుడు అల్లాహ్ పట్ల సిగ్గు-లజ్జల హక్కు నెరవేరినట్లు భావించవచ్చు. అప్పుడు మనిషి చేసే ఆచరణల్లో జరిగే పొరపాట్లు, తప్పులు, లోపాల పట్ల అసహ్యం చోటు చేసుకొని సన్మార్గం వైపునకు మరలుతాడు. పై వివరణల వెలుగులో గమనిస్తే సిగ్గు-లజ్జ పూర్తి ధర్మాన్ని ఆవరించి వుంది. సత్కార్యాలన్నింటితో దానికి సంబంధం వున్న కారణంగానే అది విశ్వాసంలో భాగంగా పరిగణించబడింది.

"దైవప్రవక్త (స) ఈ క్రింది విధంగా సెలవిచ్చారు, "విశ్వాసంలో డెబ్బయికంటే అధిక భాగాలున్నాయి. వాటిలో అన్నింటికంటే ఉత్తమమయినది 'లా యిలాహ ఇల్లల్లాహ్'ను స్వీకరించడం. అన్నింటికంటే చిన్న భాగం - మార్గం నుండి హానికర వస్తువును తొలగించటం. ఇంకా, సిగ్గు-లజ్జలు విశ్వాసంలోని భాగాలే" (బుఖారి)

మనిషి తన పెద్దల ముందు, తాను గౌరవించే వారి ఎదుట తాను ఎవరిని సంతోషపర్చాలని కోరుకుంటాడో వారి ముందు చాలా మంచిగా ప్రవర్తిస్తాడు. అవసరం మేరకే వారితో మాట్లాడి, సమయోచింతంగా వారి పనులు చేసి పెడతాడు. ఒక ముస్లిం తన నిజ ప్రభువు పట్ల అత్యధిక భయభక్తులు కలిగివుంటాడు. దైవాదేశాలను నిష్టతో పాటిస్తూ, నిషిద్ధాల నుండి దూరంగా తొలగిపోతాడు. అల్లాహ్ తనను నిరంతరం గమనిస్తున్నాడనే చైతన్యం కలిగి మసలుకుంటాడు. "మీలోని బలవంతుల ముందు భయపడినట్లు (అంతకంటే అధికంగా) అల్లాహ్‌కు భయపడండి" అదే హదీసులోని సారాంశం.

"కొన్ని సందర్భాలలో మానవుడు (తాను చేస్తున్న పనిపట్ల) సంకోచానికి గురవుతాడు. అతని ముఖ కవళికలు మారిపోతాయి. ఈ స్థితి కలిగిన వానిలో ఇంకా మంచి పరిశుద్ధతలు మిగిలివున్నట్లు భావించాలి. ఈ మానసిక, శారీరక స్థితి పేరే సిగ్గు-లజ్జ" అని ప్రవక్తశ్రీ (స) వివరించారు. (ముస్లిం)

ఒక వ్యక్తి వ్యక్తిత్వం నుండి సిగ్గు-లజ్జ తొలగిపోతే, జీవితం పాపకార్యాలలో చాలా తేలికగా దొర్లిపోతుంది. ఆ వ్యక్తి జులాయిగా తయారవుతాడు. నరకానికి ఇంధనంగా మారుతాడు. ఈ స్థితి నుండి హెచ్చరిస్తూ "మీలో సిగ్గునశిస్తే - మీరు కోరింది చేసుకోండి" అని చెప్పడం జరిగింది.



# 20వ భాగం

# సహెూదరత్వం

- సోదరత్వం - ఇస్లామీయ పునాది
- హృదయాలకు సాంత్వన
- సోదరత్వపు నియమాలు -మర్యాదలు
- అహంభావానికి దూరంగా మెలగాలి

# సోదరత్వం - ఇస్లామీయ పునాది

మానవుల మధ్య బేధభావాలను, తారతమ్యాలను, ఉచ్ఛనీచాలను సృష్టించే కారణాలు ఈ ప్రపంచంలో కనపడవు. ప్రకృతి దాని సహజ నైజాలు మానవులందరూ సోదరభావం, సహృద్భావం, జాలి, కరుణ, ప్రేమ కలిగి ఒక సమాజంగా కలిసికట్టుగా శాంతి సంక్షేమాలతో జీవించాలని స్పష్టం చేస్తున్నాయి. సృష్టికర్త, విశ్వప్రభువు అయిన అల్లాహ్ సమస్త మానవజాతిని ప్రవక్త ఆదం మరియు హవ్వా (అలై) లతో కలపడం జరిగింది. తద్వారా ప్రపంచ మానవాళిలో సోదరత్వ కుసుమాలు విలసిల్లాలి. ఈ విషయాన్ని దైవగ్రంథం దివ్యఖుర్ఆన్ ఈ క్రింది పదాలలో విస్పష్టంగా ప్రకటించింది.

**"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరి కంటే భయ భక్తులు కలవారే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు. నిశ్చ యంగా అల్లాహ్ సర్వజ్ఞాని, సకల విషయాలూ తెలిసినవాడు." (ఖుర్ఆన్, 49 : 13)**

పరస్పర పరిచయాలలో అసహ్యం, నీచత్వం, హీనత్వం, ఉచ్ఛనీచాలు వుండ కూడదు. మానవుల పరస్పర సంబంధాలకు ఈ పరిచయమే ప్రధానమైనది కాని కొన్ని ఆటంకాలు అపార్థాల వల్ల మానవుల మధ్య సరైన పరిచయాలు వుండవు. సంపాదనా మార్గంలో అధికతలు, వృత్తి పనుల్లో భేదాలు, వాటి విశ్లేషణల్లో అభిప్రాయ బేధాల వల్ల సమాజంలో అస్థిరత్వం ఏర్పడుతుంది. ఈ స్థితి పరిణామం చెంది యుద్ధాలు, కల్లోల వినాశనాలకు దారితీస్తుంది. ఈ అననుకూల పరిస్థితుల్లో కూడా మానవుల సృష్టి ఉద్దేశ్యాన్ని, వారి వ్యాపనలోని అసలు ఉద్దేశ్యాన్ని వారి లక్ష్యాన్ని మరువకూడదు.

మానవ పరిచయంలో వున్న అసమానతలన్నింటిని ఆటంకాలన్నింటిని తొల గించి వేయాలి. సమానత్వ పరిచయాన్ని దృఢపరిచే సానుకూల మార్గాలన్నింటిని ఉపయోగించుకోవాలి. సమానత్వానికి అనుకూలమైన పరిస్థితులను సమర్థించడం ద్వారా దానిని శక్తివంతం చేయాలి. దాని ప్రత్యేకతల ద్వారా సమాజం, వ్యక్తి లబ్ధి పొందాలి. ఇస్లామ్ కేవలం కొంతమంది మనుషులను ఒకచోట చేర్చే సబంధం పేరు కాదు. అది మానవుల మధ్య సమతుల్య సంబంధాన్ని ఏర్పర్చడమేకాక, సర్వమానవ

లకు వారి నిజ సృష్టికర్త, ప్రభువు అయిన అల్లాహ్‌కు మధ్య సంబంధం నెలకొల్పు తుంది. ఈ ఆచరణకు కావలసిన అన్ని అంశాలు, ప్రత్యేకతలు ఇస్లాంలో పుష్టికరంగా వున్నాయి.

కనుక ఈ సందేశ బాధ్యతను తమ భుజస్కందాలపై మోసుకునే ముస్లింలు ఈ విశ్వాసపు ప్రత్యేకతలు, విశిష్టలను తప్పక తెలుసుకుని ముందుకు సాగాలి. ఈ కృషిలో ఈ విశిష్టత తెలిసి సాగే సందేశకుల హృదయాలను సృష్టికర్త అల్లాహ్ వికసింప చేస్తాడూ.... విశాలపరుస్తాడు కూడా. ఈ మానవ సమానత్వ సిద్ధాంతంపై ఆధారపడి మాత్రమే వారి ఆచరణ కొనసాగుతుంది. ఈ సమత, సమానత్వ సోదరత్వ పరిచయం కేంద్రంగా మాత్రమే క్షీణించి వున్న బంధం, బంధుత్వం మళ్ళీ మొలకెత్తు తుంది. ఆది మానవులైన ప్రవక్త ఆదం (అలై) నుండి ప్రారంభమైన ఈ మానవ పరంపర అన్ని మతాలు, కులాల రంగుల ప్రజలను ఆవరించి వుంది. ఇస్లామీయ సత్యధర్మం మాత్రమే పటిష్టమైన సోదర భావాన్ని, స్నేహభావాన్ని అందించడం ద్వారా భూమిపై చెల్లా చెదురైపోయి వున్న మనుషులందరిని ఒకే ఒక్క బంధంలో ముడి వేస్తుంది. ప్రాంతాలు, దేశాలు, భాషలు వేరైనప్పటికీ మానవులందరిలో ఒకే ఒక ఏకత్వ భావం వుంటుంది. ఎన్ని తుఫానులు విరురుచుకుపడినా ఈ పటిష్ట బంధాన్ని ఏమీ చేయలేవు. ఇస్లాంను తమ జీవిత విధానంగా అంగీకరించిన ముస్లింలో ఈ ప్రత్యేకత కనపడటం ఇందుకు ప్రత్యక్ష ఉదాహరణగా వుంది.

ఈ విధమైన సోదర భావమే దృఢ విశ్వాసానికి ప్రాణం వంటిది. ఈ విశ్వాసం ఒక విశ్వాసి (ముస్లిం)ఇతర విశ్వాసుల గురించి ఇటువంటి భావననే తన హృదయంలో కలిగి వుంటాడు. ఈ స్థితి మరింత అభివృద్ధి చెంది ఒక విశ్వాసి జీవితం ఇతరులకు, ఇతర విశ్వాసుల జీవితం ఈతని కొరకు అంకితమైపోతాయి. ఒకే వటవృక్షానికి చెందిన కొమ్మల్లా మారిపోతారు. శరీరాలు అనేకం కానవస్తాయి. కాని, అందరిలో చలిస్తూ వుండే ఆత్మ ఒక్కటిగా వుంటుంది.

## హృదయాలకు సాంత్వన

స్వార్థం మనిషిని ఆవహిస్తే అతని మంచితనమంతా హరించివేయబడి, చెడు లకు అతని జీవితం ఆలవాలమవుతుంది. సంకుచిత స్వభావునిగా మార్చివేస్తుంది. జీవితాన్ని యిరుకు చేసి ఇతరులతో సంబంధం లేకుండా చేసి వేస్తుంది. సంతోషం,

దుఃఖం రెండూ తనకు కలిగినప్పుడే వాటిని గుర్తిస్తాడు. తన చుట్టూ వేల సంఖ్యలో జనం వున్నా తనకు అవసరం కలిగినప్పుడు లేదా వారి వల్ల భయం, ఆపద కలిగినప్పుడు మాత్రమే వారిని గుర్తిస్తాడు.

ఇస్లాం సదరు దౌర్జన్యకర స్వార్థాన్ని, న్యాయం, ధర్మం, సోదరభావం, సౌభ్రాతృత్వపు పునాదులతో చికిత్సచేస్తుంది. ఈ ప్రపంచంలో నీవు మాత్రమే జీవించటం లేదని, నీతోపాటు లక్షలాది ఇతరులు కూడా నివసిస్తున్నారని ఆ స్వార్థపరునికి తెలియపరుస్తుంది. సంస్కరణ, సాఫల్యాలు కేవలం ఒక్కరికి మాత్రమే సాధ్యం కాదని స్పష్టం చేస్తుంది. తనకు ఇతరులపై ఉన్న హక్కులను, అవసరాలను డిమాండ్ చేసే వ్యక్తి తనపై కూడా ఇతరులకు హక్కులు, అవసరాలు ఉన్నాయని గుర్తించాలి. ఈ కారణంగానే వ్యక్తి స్వార్థపరత్వానికి దూరమవ్వాలి. తన గురించే కాక ఇతరుల గురించి కూడా ఆలోచించాలి. పిసినారితనం, దుబారా ఖర్చులకు బదులు మధ్యేమార్గాన్ని, నిలకడను అవలంభించాలి.

ఒక ముస్లింకు మరో ముస్లింపై వున్న హక్కు ఏమిటంటే, ఒకతనికి నష్టం కలగడాన్ని మరొకతను ఏ మాత్రం ఆమోదించకూడదు.

ఆ నష్టాన్ని లేక కష్టాన్ని తొలగించడానికి పూనుకోవాలి. లేదా కనీసం ఆ నష్టాన్ని భరించడంలో భాగస్వామి కావాలి. వచ్చిన కష్టంపై మూల్యాంకనం చేయడం మానాలి. ఎదుటి మనిషి యొక్క కష్టనష్టాలపై మరో మనిషి హృదయం తప్పక చలించాలి. ఈ కష్టం నా మీద రానందుకు సంతోషపడకూడదు. ఎదుటి మనిషి యొక్క కష్టనష్టం గురించి ఆలోచించడం వ్యర్థం అని భావించడం నీచత్వానికి నిదర్శ నంగా భావించాలి. ఈ ఆలోచనలు సోదర సౌభ్రాతృత్వాలకు వ్యతిరేకమైనవని గుర్తిం చాలి. ఒక ముస్లిం మరో ముస్లిం యొక్క కష్టాన్ని చూసి ఆ కష్టం తనదిగా భావిస్తాడు.

"దైవప్రవక్త (స) యిలా సెలవిచ్చారు, "ముస్లింల ప్రేమాభిమానాలు, పరస్పర సంబంధాలు ఒక శరీరాన్ని పోలి వుంటాయి. ఒక భాగానికి బాధ కలిగితే ఇతర భాగాలన్ని జ్వరానికి, బాధకు గురవుతాయి" (బుఖారి)

తన తోటి సోదరుల అవసరాలు, కష్టాలు తెలుసుకొని వాటిని దూరం చేయనంత వరకు ఒక విశ్వాసి యొక్క హృదయానికి సాంత్వన లభించందు. జాలి, కరుణల

స్వభావం అతనిని ఏమీ పట్టని వానిగా కూర్చోనివ్వదు. ఈ కృషిలో సఫలత లభించగానే అతని ముఖం ఆనందంతో వికసిస్తుంది.

దైవప్రవక్త (స) ఇలా తెలిపారు, "ఒక ముస్లిం మరో ముస్లింకు సోదరుడు. అతని హక్కులను కొల్లగొట్టకూడదు. హింసించకూడదు. తత్భిన్నంగా ఒక సోదరుని హక్కును తీర్చిన వాడి హక్కును అల్లాహ్ తీరుస్తాడు. ఒక ముస్లిం యొక్క కష్టాన్ని దూరం చేస్తే ప్రళయ దినాన అతని కష్టాన్ని దూరం చేస్తాడు. అదే విధంగా ఒక ముస్లింలోని లోపాన్ని మరుగుపరిస్తే (కప్పిపుచ్చితే) తీర్పు దినాన అల్లాహ్ అతని లోపాలను కప్పిపుచ్చుతాడు." (ముస్లిం)

తన సోదరుని ప్రయోజనాన్ని కోరుకోవడమే నిజమైన సోదరత్వం అనిపించు కుంటుంది. తన సోదరునికి లాభం చేకూరితే తనకూ లాభించినట్లుగా సంబరపడాలి. ఈ గుణం ఒక ముస్లింలో ఏర్పడితే తదనుగుణమైన ఆచరణ అనుసరణల ద్వారా అల్లాహ్ సాన్నిత్యాన్ని పొందవచ్చు. సరైన ప్రతిఫలానికి హక్కుదారుల మయ్యామని భావించాలి. తోటి సోదరుల హక్కు నెరవేర్పు యొక్క ప్రాధాన్యతను తెలియపరుస్తూ ఇబ్నె అబ్బాస్ (రజి) గారి ఉల్లేఖనం ఈ క్రింది విధంగా వుంది:

ఇబ్నె అబ్బాస్ (రజి) ఎతెకాఫ్‌లో మస్జిదె నబవినందు కూర్చొని వుండగా ఒక వ్యక్తి మస్జిద్‌లోనికి ప్రవేశించి సలాం చేశాడు. వచ్చి కూర్చొన్నాడు. ఇబ్నె అబ్బాస్(రజి) ఆ వ్యక్తిని 'సోదరా నీవు చాలా విచారంగా వున్నట్లు కనబడుతున్నావు? ఏంటి విషయం?' అని అడిగారు. అందుకు ఆ వ్యక్తి, 'ఓ ప్రవక్త చిన్నాన్న కుమారుడా! నాపై ఫలానా వ్యక్తి యొక్క మిత్రృత్వపు హక్కు వుంది. కాని ఈ సమాధి యజమాని దైవప్రవక్త (స) సాక్షిగా! నాకు అంతటి (ఆర్థిక) శక్తిలేదు అని అన్నాడు.

అందుకు ఇబ్నె అబ్బాస్ (రజి) ఈ విధంగా నేను నీకు ఏదైనా సహాయపడనా?' అని పలికారు. అందుకు ఆ వ్యక్తి 'మీరు సహాయపడగలిగితే సహాయపడండి' అని చెప్పాడు. అప్పుడు ఇబ్నె అబ్బాస్ (రజి) చెప్పులు ధరించి మస్జిద్ నుండి బయటికి వచ్చాడు. వెంటనే ఆ వ్యక్తి 'మీరు ఎతెకాఫ్‌లో వున్నారు' అని గుర్తు చేశాడు. దానికి ఇబ్నె అబ్బాస్ 'ఈ సమాధి యజమాని' దైవప్రవక్త (స) చెప్పగా విని వున్నాను. ఆయన మరణించి ఇంకా ఎక్కువ దినాలు కూడా గడవలేదు. ఆయన కళ్ళు అశ్రుమయా లయ్యాయి. 'తన సోదరుని అవసరం తీర్చడానికి బయలుదేరిన వ్యక్తికి పది

సంవత్సరాల ఎతెకాఫ్ కంటే ఉత్తమ ఫలితం లభిస్తుంది. అదే విధంగా దైవప్రీతి కోసం ఒక దినం ఎతెకాఫ్ పాటిస్తే అల్లాహ్ ఆ వ్యక్తికి నరకానికి మధ్య మూడు కందకాలు అడ్డువేస్తాడు. ఒక్కో కందక దూరం తూర్పు పడమరల కంటే దూరంగా ఉంటుంది. (బైహఖీ)

సోదరభావానికి ఇస్లాంతో ఎంతటి ప్రాముఖ్యత ఉన్నదో పై ప్రవచనం తెలియ చెప్పింది. సమాజంలో ప్రజా సేవకు, ప్రజా సంక్షేమానికి తమ్ముతాము సిద్ధపర్చు కోవడం చాలా అవసరమనీ, అది అత్యంత ప్రాధాన్యతగల విషయమనీ తెలుస్తుంది.

ఎతెకాఫ్ ఎంతటి ఉత్తమమైన ఆరాధనో మనందరికి తెలుసు. ఇందుకు అల్లాహ్ వద్ద ప్రత్యేక ఫలితం ఉంది. ఎతెకాఫ్‌లో నమాజ్, ఉపవాసం, దైవస్మరణ, ధ్యానం లాంటివన్నీ కలగలిసి వుంటాయి. అందులోనూ ఎతెకాఫ్ కూర్చొన్న ప్రాంతం మస్జిదె నబవి. మస్జిదె నబవీలో చేసే ఆరాధనకు ఎన్నో రెట్లు అధిక పుణ్యఫలం లభిస్తుంది. అయినా ఇబ్నె అబ్బాస్ (రజి) ఒక ముస్లిం సోదరుణి అవసరం తీర్చుడానికి మస్జిదె నబవీ నుండి బయటికి వచ్చారు. మహాప్రవక్త, మహోపాధ్యాయులు ముహమ్మద్ (స) నుండి ఈ శిక్షణనే ఇబ్నె అబ్బాస్ గడించారు.

ఈ ప్రపంచం ఒక పరీక్షా స్థలి. ఇక్కడ అనేక అడ్డంకులు, అవరోధాలు తప్పని సరిగా వుంటాయి. వర్షానికి భూమిమొత్తంగా తడిసినట్లు ఇక్కడ సమస్యలు అందరినీ బాధిస్తాయి. మనిషి ఒంటిరిగా కష్టాలను, సమస్యలను ఎదుర్కోలేడు. మిత్రులు, స్నేహితులు, బంధువులు అతనికి సహాయపడతారని, కష్టాలనుండి ఆదుకుంటారనే నమ్మకం మనిషికి కొండంత ధైర్యాన్నిస్తుంది. ఈ కారణంగా ఒంటరి మనిషి బలహీనుడు – సమాజంలో మహాబలవంతుడు అనే సామెత పుట్టింది.

సోదరత్వ భావన ప్రతి ముస్లింలోనూ తాను వంటరివాడిని కాననీ, ముస్లిలందరి శక్తియుక్తులు తన వెంట వున్నాయనీ – సుఖ సంతోషాల్లో తనకు సహాయకారులుగా తన బంధుమిత్రులు వుంటారనే భావన కలిగించాలి. సోదరత్వ భావన యొక్క అసలైన ప్రభావశీల అర్థం ఇదే.

ఈ కారణంగా దైవప్రవక్త (స) "ఒక ముస్లిం మరో ముస్లిం పట్ల ఒక భవంతిని పోలి వుంటాడు. ఇందులోని ఒక భాగం, మరో భాగానికి దృఢత్వాన్నిస్తుంది" అని సెలవిచ్చారు. (బుఖారి)

ఈ భావన ప్రారంభమైన వెంటనే సోదరభావం కాస్తా దైవానుగ్రహ రూపం సంతరించుకుంటుంది. తద్వారా విశ్వాస, ఆత్మీయ సంబంధ శక్తితో పాటుగా భౌతిక, పదార్థికశక్తి కూడా ప్రాప్తమవుతుంది. విశ్వప్రభువు అల్లాహ్ తన గ్రంథంలో ఒకే వాక్యంలో ఈ అనుగ్రహాన్ని అనేకసార్లు ప్రస్తావించటం జరిగింది.

**"అల్లాహ్ మీకు చేసిన మేలును జ్ఞాపకం తెచ్చుకోండి. మీరు ఒకరికొకరు శత్రువులుగా ఉండేవారు. ఆయన మీ హృదయాలను కలిపాడు. ఆయన కటాక్షం వల్లనే మీరు పరస్పరం సోదరులయ్యారు. (ఖుర్ఆన్, 3 : 103)**

ధర్మంలో భాగమైన ఈ సోదర భావాన్ని ఇస్లాం తప్పనిసరి విధిగా చేసింది. పక్షపాతంతో కూడిన సహాయసహకారాలను వ్యతిరేకించి సత్యాన్ని నిరూపించడానికి అసత్యాన్ని నిరోధించడానికి విశ్వాసులు, సజ్జనులు పరస్పరం సహకరించుకోడాన్ని తప్పనిసరి చేసింది. దుర్మార్గుడి చేతులను దుర్మార్గం నుండి ఆపాలి. బాధితునికి సంపూర్ణ సహకారమందించాలి. చెడు నిర్మూలించేందుకు రంగంలో దుమికిన ముస్లింను ఒంటరివానిగా వదలివేయడం ధర్మసమ్మతం కాదు. అతనికి అన్ని విధాలైన సమర్థనను అందించాలి. ఈ క్రమంలో వ్యక్తి మార్గం తప్పితే – మార్గం చూపాలి. గర్వానికి లోనైతే – అతనిని చక్కబరచాలి. అతనిపై దాడి జరిగితే – అతనికి మద్దతుగా నిలవాలి. అతను హింసకు గురి అవుతూ ఉంటే– అతడిని విడిపించాలి. ఇస్లామీయ సహాయసహకారాలకు అర్థమిదే.

ఈ విషయాన్ని బహుచక్కగా వివరిస్తూ దైవప్రవక్త (స) "మీరు మీ సోదరునికి సహాయం చేయండి. అతడు బాధితుడయినా లేక అత్యాచారి అయినా" అని సెలవిచ్చారు. అందుకు సహచరులు, "బాధితునికి సహాయపడటంలో అర్థముంది. కానీ అత్యాచారికి ఎలా సహాయపడాలి." అని ప్రశ్నించారు. అప్పుడు ప్రవక్త మహోపాధ్యాయులు (స), "ఆ అత్యాచారిని, అత్యాచారం చేయకుండా ఆపండి. అదే అతనికి మీరు చేసే సహాయం" అని సమాధానమిచ్చారు. (బుఖారి)

ఒక బాధిత విశ్వాసిని ఒంటరిగా వదలివేయడం చాలా చెడ్డ విషయం. ఈ చర్య మొత్తం ముస్లిం సమాజానికి నష్టదాయకం. ఇది పౌరుషానికి, వీరత్వానికి వ్యతిరేకమైన చర్యగా భావించాలి. ఇది పరస్పర సహాయసహకారాలకు గొడ్డలిపెట్టు. ఈ పరిస్థితుల్లో బాధితుడు విధిలేక చెడు ముందు తలవంచేస్తాడు. పోరాటాన్ని వదలి

చేతులు ఎత్తేస్తాడు. ఫలితంగా ఈ వ్యక్తికి ఇతరులకు మధ్య వున్న సోదరత్వం నశించిపోతుంది.

గతంలో ముస్లింలు జాతులుగా, తెగలుగా విడిపోయిన కారణాన, ఒంటరిగా మిగిలిపోయారు. అంతులేని అవమానాలకు, పరాభవాలకు గురయ్యారు. ఇది కేవలం పరస్పరం సోదరభావం నశించిన దాని ఫలితంగానే జరిగింది. ఈ ముస్లింలు ఒకరినొకరు నీచ దృష్టితో చూసేవారు. తన సోదరుని కష్టాన్ని, నష్టాన్ని చూసి భుజాలు ఎగురవేసేవారు. వారితో తమకు ఎలాంటి సంబంధం లేదని చేతులు ముడుచుకుని కూర్చునేవారు.

ఈ నీచ అలవాటు ముస్లింలను అవమానాల, పరాభవాల గోతిలో పడవేసింది. వాస్తవానికి ఇస్లాం ఈ అలవాటును తీవ్రంగా ఖండించింది. జాలి లేక వ్యక్తిగత స్వార్థా నికి మొత్తం ఇస్లామీయ సమాజాన్ని నష్టానికి గురిచేసిన వారిని ఇస్లాం శపించింది.

"ఈ సందర్భంలో దైవప్రవక్త (స) బోధన ఇలా ఉంది. "మీకళ్ళ ఎదుట ఒకరిని బాధిస్తూ ఉంటే మీరు చూస్తూ ఊరుకోరాదు. తన కళ్ళ ముందు అత్యాచారం జరు గుతూ వున్న దానిని ఎదుర్కోని వాడిపై అల్లాహ్ అభిశాపం విరుచుకుపడుతుంది. (తిబ్రాని)

మీ కళ్ళ ముందు మీ సోదరుడు అవమానానికి, బాధకు గురవుతూ వుంటే, అతనికి మీరు సంపూర్ణంగా సహాయపడాలి. సమస్య సంపూర్ణంగా సద్దుమణిగే వరకు, అత్యాచారం ఆపివేయబడే వరకు ఈ సహాయం – తోడ్పాటు అందిస్తూ ఉండాలి.

ఒక ప్రవచనంలో ఇలా వుంది, "బాధితుని వెంటవెళ్ళి, అతని హక్కును అతనికి ఇప్పిస్తే, అల్లాహ్ ఆ వ్యక్తి పాదాలను 'పుల్‌సిరాత్'పై స్థిరంగా వుంచుతాడు. ఆ సహాయంలో ఇతరుల పాదాలు పట్టు తప్పి జారుతూ ఉంటాయి." (అస్ బహాని)

సోదరత్వ బాధ్యత నిర్వహణ మరింత అధికమయ్యే విషయాలల్లో మరికొన్ని వివరించడం ఇక్కడ అవశ్యం. ఒక వ్యక్తి సమాజంలో ప్రభావశీలమైన స్థానం కలిగి వున్నా ప్రజలు అభిమానంతో ఆ వ్యక్తి మాటను గౌరవించే స్థానంలో వున్నా, ఈ బాధ్యత మరింత అవసరంగా – ధనం నుండి జకాత్ తీయడమంత విధి అయి పోతుంది. పదవులు, గౌరవస్థానాలు జకాత్‌ను పై బాధ్యత నెరవేర్చడం ద్వారా చెల్లించవలసి వుంటుంది. సదరు పదువులు, గౌరవ స్థానాలు, పేరు ప్రతిష్టలు – శక్తి సామర్థ్యాలు

అల్లాహ్ ద్వారా ప్రసాదించబడినది– గర్వంతో వీర్రవీగడానికి కాదు సుమా. ప్రజలపై సోదరత్వ అవసరాలు మీ ద్వారా తీర్చబడటానికే అవి ప్రసాదించ బడ్డాయి. ఈ బాధ్యతలు ఇతరుల ద్వారా పూర్తి కాలేవు. మీ చుట్టూ వున్న మానవులు అందులోని బాధితుల సహాయార్థం మీరు చేసే కృషి వల్ల మీరు పుణ్యం సంపాదిం చుకుంటారు. అలా చేయని పక్షంలో దైవం ప్రసాదించిన అనుగ్రహాల పట్ల ద్రోహం చేసిన ద్రోహిగా పరిగణించబడతారు. కృతఘ్నుతకు పాల్పడిన వారిగా మిగిలిపోతారు.

ఈ విధేయంగా దైవప్రవక్త (స) బోధన ఈ క్రింది విధంగా ఉంది: " అల్లాహ్ కొందరికి తన ప్రత్యేక అనుగ్రహాలను, వరప్రసాదాలను యిచ్చి వున్నాడు. వాటి ద్వారా వారు ప్రజల అవసరాలను, హక్కులను నెరవేర్చాలి. ప్రజలు వారిపట్ల ఆందోళన, ఆక్రోశనకు గురికానంత వరకు అవి అనుగ్రహాలుగానే ఉంటాయి. కాని వారు పాలకులతో కలిసిపోయి (ప్రజాద్రోహులుగా మారితే) ఈ అనుగ్రహాలను ఇతరులకు బదలాయించడం జరుగుతుంది." (తిబ్రాని)

ప్రజలకు లాభం చేకూర్చటానికీ, వారిని నష్టాలనుండి కాపాడటానికి మాత్రమే తన శక్తిని, యుక్తిని, పరపతినీ ఒక వ్యక్తి ఉపయోగించాలి. చిత్తశుద్ధితో పరిశుద్ధ హద్దులకు లోబడి ప్రయత్నించాలి. అలాకాక ఈ చర్యలకు బహుమతులు పొగడ్తలు లేక ఇతర ప్రాపంచిక ప్రయోజనాలు పొందాలని ప్రయత్నిస్తే తీర్పుదినాన అల్లాహ్ వద్ద దక్కవలసిన ప్రతిఫలం లభించదు. ఈ పలుకుబడి వల్ల సంపాదించిన అధర్మ సంపద అతని సత్కార్యాలనన్నింటిని దహించివేస్తుంది.

"ఒక వ్యక్తి మరో వ్యక్తికి సహాయపడి లేక సిఫారసు చేసి దానికి ప్రతిఫలంగా కానుక ఇవ్వబడి, దానిని అతడు స్వీకరిస్తే అతడు మహాపాపకార్య ద్వారంలో ప్రవేశించినట్లేనని ప్రవక్తశ్రీ తెలిపారు. (అబూదావూద్)

## సోదరత్వపు నియమాలు - మర్యాదలు

సోదరభావాన్ని ధ్వంసం చేసే అన్ని చెడులతో ఇస్లాం పోరాటం చేస్తుంది. అటువంటి నియమ నిబంధనలు, భావజాలాన్ని వ్యతిరేకిస్తుంది.

హద్దులను అతిక్రమించిన వారిని వారి అసలు స్థానానికి మరల్చటం, వెనుక బడిపోయిన వారిని వారి స్నేహితులతో కలపటం, ఇద్దరు వ్యక్తులు కలహిస్తే వారి

వివాదాన్ని పరిష్కరించటం లాంటి ఆచరణలన్నీ సోదర భావ నియమ నిబంధనలకు మూలంగా వుంటాయి.

**"విశ్వాసులు పరస్పరం సోదరులు - ఇరువురు సోదరుల మధ్య కలహాలను పరిష్కరించండి. అల్లాహ్‌కు భయపడండి. తద్వారా మీరు ఆయన దయకు పాత్రులవుతారు."** **(ఖుర్ఆన్, 49 : 10)**

ప్రియ ప్రవక్త (స) ఒక సుదీర్ఘమైన హదీసులో పైన సూచించిన చెడులన్నింటి నుండి జాగ్రతపడమని హెచ్చరించారు. ఈ చెడులు పైకి చూడటానికి భిన్నంగా కనిపిస్తాయి. కానీ వాటి పర్యవసానం హృదయాలకు తుప్పు పట్టించి వేస్తుంది. ప్రేమ, అభిమానం, సుహృద్భావాలను శుష్కింపజేస్తుంది. దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:

"అనుమానాలు, అపార్థాలకు పోకండి. అది అత్యంత నీచమైన అసత్యం. ఇతరుల ఆచార వ్యవహారాలను అనుకరించకండి. ఇతరులతో పోటీపడకండి. ఈర్ష్యా ద్వేషాలకు గురి కాకండి. ఒకరినొకరు అసహ్యించుకోకండి. శత్రుభావాన్ని విడనాడండి. దైవదాసులుగా, సోదరులుగా అల్లాహ్ ఆశించినట్లు పరివర్తన చెందండి. ఒక ముస్లిం మరో ముస్లింకు సోదరుడు. ఒకరినొకరు హింసించుకోరాదు. ఒంటరిగా విడిచి పెట్టరాదు. ఎదుటి మనిషిని హీనంగా భావించడమే అసలైన చెడు. ఒక విశ్వాసి యొక్క ధన, ప్రాణాలు, గౌరవమర్యాదలు మరో ముస్లింపై నిషిద్ధం. అల్లాహ్ మీ ముఖాలను, శరీరాలను చూడడు. ఆయన మీ ఆచరణలను చూస్తాడు. దైవభీతి ఇక్కడ (గుండెలలో) ఉంటుంది. ఇక్కడ.... ఇక్కడ....జాగ్రత్త! మీలో ఎవరూ ఒకరి బేరంపై మరొకరు బేరం చేయరాదు (నష్టం కలిగించే ఉద్దేశ్యంతో) ఒక ముస్లిం మరో ముస్లింతో మూడు రోజుల కంటే ఎక్కువ కాలం మాట్లాడకుండా వుండకూడదు" (ముస్లిం)

ఏ సమాజంలో దైవంపై ప్రేమకారణంగా మానవుల మధ్య ప్రేమానురాగాలు, అభిమానాలు చోటు చేసుకుంటాయో - ఏ సమాజంలో విధుల నిర్వహణ ఇస్లామీయ పునాదులపై జరుగుతుందో - ఆ సమాజంలో సోదర భావం భౌతిక స్థాయి నుండి ఎదిగి ఆత్మీయ స్థాయికి చేరుకుంటుంది. అది కుటుంబ - రక్తసంబంధం కన్నా మరింత పటిష్టంగా తయారవుతుంది.

నిజానికి చిత్తశుద్ధి, మచ్చలేని సోదరభావంపైనే మొట్టమొదటి ఇస్లామీయ సమాజాన్ని తీర్చిదిద్దటం జరిగింది. తద్వారా ఇస్లామీయ పతాకం సమున్నతంగా

రెపరెపలాడింది. పై పునాదులమీదనే మానవ మహోపాధ్యాయులు (స) ఉత్తమ సమాజాన్ని రూపొందించారు. ఈ ఉత్తమ సమాజం నీచ తిరస్కారుల, శత్రువుల దాడులను ఎదుర్కొని నిరంతర పోరాటం ద్వారా నిలదొక్కుకుని విజయం సాధిం చింది. ఈ ఇస్లామీయ సంక్షేమ సమాజానికి శత్రువులుగా వున్న వారు మట్టిలో కలిసిపోయారు.

వస్తువులు- వాటి చర్యలు దాని అంతర్గత వైరుధ్యాల ద్వారా గుర్తించబడ తాయి. నేడు యూదులు ఒక అసత్య తాత్వికత కోసం, ప్రపంచపు అన్ని ప్రాంతాల నుండి పాలస్తీనా పవిత్ర భూమికి వలస వచ్చి చేరుకున్నారు. తాము సంవత్సరాలుగా జీవిస్తూ వుండిన ప్రాంతాలను వదిలివేసారు. ధన సంపత్తులను కాలదన్నారు. పాత జ్ఞాపకాలను గుర్తు చేసుకుంటూ ఈ పవిత్ర భూమికి వచ్చి నివాసం ఏర్పరచుకున్నారు. ఒక చెడు విశ్వాసం, చెడు లక్ష్యం కోసం ఇంతటి చైతన్యం ముందుచూపు చూపు తున్నారు. వీరి చర్యలు పధ్నాలుగు వందల సంవత్సరాల క్రితపు ఇస్లామీయ వ్యూహాన్ని గుర్తు చేస్తుంది. నాడు దేశంలోని విభిన్న ప్రాంతాల నుండి ముస్లింలు మదీనా నగరానికి వచ్చి చేరారు. ఈ వలసరావడంలో తమ స్వంత ప్రాంతాలను, వ్యాపారా లను, ధన సంపత్తులను, ఇల్లు వాకిళ్ళను, కడకు కుటుంబ సభ్యులను సయితం విడిచారు. మదీనాలో మొట్టమొదటి ఇస్లామీయ రాజ్యాన్ని స్థాపించారు.

మదీనా ముస్లింలు (అన్సారులు), వలసవచ్చిన (ముహాజిర్లు) ముస్లింలకు సంపూర్ణ హృదయంతో స్వాగతం పలికారు. విశాల హృదయంతో వారికి చోటిచ్చారు. దైవం పునాదులపై ఏర్పడిన ఈ చిత్తశుద్ధిగల సోదరత్వం, కారణంగా వీరిలో ప్రేమ త్యాగం, సమానత్వం, గౌరవ మర్యాదలు, ఇతరులకు ప్రాధాన్యతనివ్వటం లాంటి ఉత్తమ గుణాలు చోటు చేసుకున్నాయి. వంశాలు, కుటుంబాలు, అన్ని సమానమై పోయాయి. గౌరవ మర్యాదలు అందరి హక్కుగా మారాయి. వీరిలో సత్యధర్మ ప్రచార ఉత్సాహం పెల్లుబికింది. పుణ్యకార్యాల ఆచరణ అత్యుత్తమ స్థితికి చేరింది. మంచిని పెంచడంలో - చెడును నిర్మూలించడంలో పరస్పర సంబంధాలు దృఢతరమైనాయి. ఈ మానవ సంబంధాలను స్థాపించుకున్న వీరిని అల్లాహ్ ఈ క్రింది పదాలలో ప్రశంసించాడు.

**"ఈ శరణార్థుల రాకకు పూర్వమే విశ్వసించి వలస కేంద్రంలో స్థిరపడిన వారికి కూడా హక్కు ఉంది. వారు తమ వద్దకు వలస వచ్చిన వారిని ప్రేమిస్తారు.**

**వారికి ఏది యివ్వబడినా, దాని అవసరం సయితం వున్నట్లుగా వారు తమ మనస్సులలో భావించరు. వారు స్వయంగా అగత్యంగల వారైనప్పటికీ, తమ కంటే ఇతరులకే అధిక ప్రాధాన్యతనిస్తారు. (ఖుర్ఆన్, 59 – 9)**

"ఒక హదీసులో యిలా వుంది: ఒక ముస్లిం మరో ముస్లింను భయకంపితునిగా చేయడం ధర్మ సమ్మతం కాదు." (అబూదావూద్)

"మరో ప్రవచనంలో ఇలా సెలవివ్వబడింది: "ఒక ముస్లిం తన చూపుల ద్వారా ఇతరులను భయపెట్టినట్లయితే అల్లాహ్ తీర్పు దినాన అతనిని భయపెడతాడు" (తిబ్రాని)

ఏ వస్తువుతో ఒక విశ్వాసికి నష్టం కలిగే ప్రమాదముందో ఏ చర్యవల్ల ఒక విశ్వాసికి భయం కలుగుతుందో – ఆ వస్తువు – ఆ చర్య నేరగ్రస్థమైనదిగా భావించబడతాయి. పై విధంగా దౌర్జన్యం చేసే వారికి శిక్ష చాలా తీవ్రంగా వుంటుంది.

దైవప్రవక్త (స) ఇలా తెలిపారు: "తన సోదరుని ఇనుప వస్తువుతో సైగచేసి భయపెట్టేవారిని, దైవదూతలు ఆ వ్యక్తి ఆ వస్తువును క్రిందపెట్టే వరకు శపిస్తూనే వుంటారు. అతను సొంత సోదరుడయినప్పటికీ" (ముస్లిం)

సమత, సమతానత్వానికి దోహదపడే ఆదేశాలు, వాటిని ధ్వంసం చేసే చర్యలపై నిషిద్ధాలు విధించడం ద్వారానే సోదరభావం పెంపొందించబడుతుంది. సమాజంలో సుఖశాంతులు, భద్రతలు మూడుపువ్వులుగా వికశిస్తాయి. ఆరు కాయలుగా పండుతాయి.

ఈ విధమైన సోదరభావాన్ని పటిష్టం చేయడానికే ఇస్లాం గర్వాహంకారాలను నిషేధించింది. ఒకే తండ్రి బిడ్డలమని బిడ్డలమని, ఒకే ధర్మాన్ని అనుసరించేవారమని తెలిసిన తర్వాత కూడా, ప్రాపంచిక వ్యవహారాల్లో శత్రుత్వం ఎలా వహించగలరు? సమాజంలో గౌరవం, గొప్పతనాలు కేవలం దైవభీతి దైవభక్తి వల్ల లభిస్తాయని హృదయాల రహస్యాలు సైతం అల్లాహ్ తెలుసుకుంటాడని తెలిసిన తర్వాత కూడా మనిషిలో గర్వం – అహంకారం జనించగలవా?

దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "వినమ్రతను పాటించమనీ, ఒకరినొకరు హింసించుకోకూడదనీ, అర్థంపర్థంలేని గర్వం అహంకారాలను ప్రదర్శించకూడదని అల్లాహ్ దివ్యవాణిని అవతరింపజేశాడు." (అబూదావూద్)

అధికార హోదాల కోసం, గొప్పతనం కోసం, షైతాన్ మార్గాన్ని అవలంబించే వారిని ఇస్లాం తీవ్రంగా హెచ్చరించింది. అహంకారులు తీర్పు దినాన కుంచించుకొని వుంటారనీ, ఇక్కడ ఏ మేరకు దర్పం ప్రకటించి ఉంటే అక్కడ అంత హీనులుగా, దీనులుగా మారుతారనీ చివరికి పీడితులై పోతారని హెచ్చరించింది.

ఒక ప్రవచనంలో "తీర్పుదినాన అహంకారులు, గర్వాంధకారులు చిన్న చిన్న అణువుల్లా హ్రస్వ మానవుల్లా లేపబడతారు. వారు అత్యంత అవమానకర స్థితిలో వుంటారు" అని చెప్పబడింది. (తిర్మిజి)

హీన భావన, హేళనలు సోదర బంధాన్ని కత్తిరించి వేస్తుంది. ఒకరిని హీనులుగా, నీచులుగా భావించడం స్వయంగా అజ్ఞాన చిహ్నం. కష్టసమయాల్లో సహాయకుల మద్దతుదారులను పొందడం ఒక బలహీనుడి హక్కుగా వుంటుంది. దారి తెన్నూ కానక ఆందోళనలో వున్న వ్యక్తికి సరైన దారి చూపాలి. లోపాలతో, కష్టా లతో వున్న వారిని సూటిపోటి మాటలు, అభ్యంతరాల దాడుల ద్వారా వారిని ఎంత మాత్రమూ కించపర్చకూడదు.

**విశ్వాసులారా! పురుషులు ఇతర పురుషులను ఎగతాళి చేయకూడదు. వీరికంటే వారే శ్రేష్ఠులై ఉండవచ్చు. అలాగే స్త్రీలు ఇతర స్త్రీలను ఎగతాళి చేయ కూడదు. వీరికంటే వారే శ్రేష్ఠురాంద్రయి ఉండవచ్చు. ఒకరినొకరు ఎత్తి పొడుచుకోకండి, ఒకరినొకరు చెడ్డ పేర్లతో పిలుచుకోకండి.** ***(ఖుర్‌ఆన్, 49 : 11)***

హసన్ (రజి) ఇలా తెలిపారు, "ఎగతాళి చేసే వారిని పరలోకంలో స్వర్గద్వారం వద్దకు పిలవడం జరుగుతంది. అతను చాలా కష్టంగా అక్కడికి చేరుకుంటాడు. వెంటనే ద్వారం మూసివేయబడుతుంది. వెంటనే మరో ద్వారం తెరుచుకోబడి అక్కడికి పిలవబడతాడు. అక్కడికి చేరే సరికి ఆ ద్వారమూ మూసివేయబడుతుంది. ఈ పరం పర కొనసాగుతూనే వుంటుంది. చివరికి ఆ వ్యక్తి నిరాశ చెంది పిలిచినప్పుడు రావ డమే మానుకుంటాడు." (బైహఖీ)

ఇతరులను అవహేళన చేసే వారికి ప్రతిఫలం ఎంతటి తీవ్రంగా వుంటుందో పై హదీసు తెలియచెబుతుంది. చేసుకున్న వారికి చేసుకున్నంత' అనే సామెత ప్రకారమే తీర్పు దినాన అవమానింపబడతాడు. ఈ లోకంలో ఇతరులను అవహేళన చేసిన

దానికి బదులుగా పరలోకంలో అవహేళనకు గురవుతాడు. ఇతరులను హీనంగా ఎగతాళి చేసినందుకు అక్కడ హీనంగా ఎగతాళికి గురవుతాడు.

## అహంభావానికి దూరంగా మెలగాలి

ఇస్లాం సోదరభావాన్ని పరిరక్షించడానికి, కల్పిత ఉచ్చనీచాల గోడలను కూలగొట్టడానికి అన్ని ప్రయత్నాలూ చేస్తుంది. మానవులందరూ జన్మరీత్యా సమానులేనని గౌరవనీయులేనని ప్రకటించింది. ప్రజలందరికీ సమాన హక్కులూ అధికారాలు యిచ్చింది. వంశం, తెగ, రక్తం పట్ల గర్వాన్ని ప్రదర్శించడాన్ని అపరా ధంగా తీర్మానించింది. సర్వమానవులూ ఆదం (అలై) సంతానమేనని నిర్ద్వంద్వంగా ప్రకటించింది. ఆదం మట్టితో సృజించబడ్డారు. చక్రవర్తి అయినా, పూర్వీకుల గొప్ప తనమైనా, ఎవరూ చేయని ఘనకార్యం చేసినా జన్మరీతా- దైవాదేశాల రీత్యా సర్వులూ సమానులేననే సత్యాన్ని ప్రపంచానికి మొట్టమొదటసారిగా ఇస్లాం అందించింది.

"అబూ హురైరా(రజి) ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (స) యిలా సెలవిచ్చారు, "తీర్పు దినాన అల్లాహ్ ఆదేశంతో ఒక పిలిచేవాడు ఇలా పిలుస్తాడు' వినండి! నేను ఒక వంశపరంపర ఏర్పాటు చేశాను. కాని, మీరు మరో వంశపరంపరను సృష్టించుకున్నారు. నేను మీతో అందరికంటే ఎక్కువ భయభక్తులు గలవానిని గౌరవనీయునిగా ఎన్నుకున్నారు. కాని, మీరు ఫలానా కుమారుడా! ఫలానావాడు! అని చెప్పేవారు. కాని, నేను ఈనాడు నేను ఎంపిక చేసిన వంశపరంపరను ఉన్నత పరుస్తాను. మీరు ఏర్పర్చుకున్న అబద్ధపు వంశపరంపరను ఉన్నతపరుస్తాను. మీరు ఏర్పర్చుకున్న అబద్ధపు వంశపరంపరను హీనపరుస్తాను." (అని అల్లాహ్ సెలవిచ్చాడు) - (బైహఖి) ఈ విషయంగా అల్లాహ్ ఆదేశం ఈ క్రింది విధంగా వుంది.

> **"శంఖం ఊదబడిన తర్వాత వారి మధ్య ఏ బంధుత్వమూ వుండదు. వారు ఒకరినొకరు పరామర్శించుకోరు. అప్పుడు ఎవరి పళ్ళెములు బరువుగా వుంటాయో వారే సాఫల్యం పొందుతారు. ఎవరి పళ్ళెములు తేలికగా వుంటాయో వారే తమ్ముతాము నష్టానికి గురి చేసుకునేవారు. వీరే నరకంలో శాశ్వతంగా వుండేవారు"**
> **(ఖుర్ఆన్, 101-103)**

ఈ మహెూన్నతమైన బోధనలు, ఆచరణలు, ప్రవక్త (స) సాంప్రదాయాలు

అన్నింటిని కాదని నేటి అరబ్బులు కుటుంబం-వంశం-తెగల గర్వఅహంభావాలను ప్రదర్శించడం మొదలెట్టారు. గత, వర్తమానాలల్లో ఇస్లామీయ ఉద్యమం ఓటమి పాలవుతూ వుండటం కేవలం ఈ కారణంగానే జరుగుతుంది.

ఈ కారణంగానే మానవుల్లో పరస్పర సోదరభావం, సౌభ్రాతృత్వం, ప్రేమాభిమానాలు పెంపొందించి వాటిని పటిష్టపర్చేందుకు తీవ్రమైన కృషి చేసింది, చేస్తుంది కూడా సోదరత్వానికి గొడ్డలిపెట్టులాంటి జన్మభూమి - దేశభక్తి, నా దేశం -పరాయి దేశం, నా కుటుంబం ఇతరులు అనే కల్పిత విగ్రహాలను తునాతునకలు చేసివేసింది. నావాడు, పరాయివాడు అనే భేద భావాలను తొలగించి వేసింది. మానవుడు తన దేశాన్ని, తన ఊరును, ఇల్లు కుటుంబాన్ని ప్రేమించడం చాలా సహజ విషయం. అయితే అదే సమయంలో అల్లాహ్ సృష్టితాలపట్ల ఏమరుపాటుగా వుండటం, ఈ పునాదులపై ఇతరులను ద్వేషించడం లేదా దూరంగా వుంచి అనుమాన దృష్టితో చూడటం కుదరదు.

దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు, "తన కుటుంబం కొరకు పోరాడేవాడు మీలో అందరికంటే ఉత్తముడు. అయితే అది పాపకార్యంకై కాకూడదు." (అబూదావూద్)

మానవ మహోపకారి దైవప్రవక్త ముహమ్మద్ (స)ను 'పక్షపాతం' అంటే ఏమిటి?' అని ప్రశ్నించడం జరిగింది. అందుకు మహోపాధ్యాయులు (స), "పక్షపాతం అంటే నీ జాతి చేస్తున్న అత్యాచారం, దుర్మార్గాలకు వత్తాసు పలకడం" అని సమాధానమిచ్చారు. (అబూదావూద్)

ఇస్లామీయ సోదర భావమంటేనే, ఇస్లాం పట్ల చిత్తశుద్ధి, అల్లాహ్ పట్ల ప్రీతి కలిగి వుండటమే. ఆ మార్గంలో పయనిస్తూ- చైతన్యం పొందుతూ వుండటమే. అల్లాహ్ ఆదేశాలను శిరోధార్యంగా చేసుకొని, సామాన్య సంబంధాలు, ప్రత్యేక సంబంధాలు రక్త సంబంధ బంధుత్వాలు అన్నింటికంటే అల్లాహ్ ఆదేశానికే అత్యధికంగా ప్రాధాన్యతనివ్వాలి. కష్టసుఖాల్లో, ఆపద భద్రతల్లో అల్లాహ్ ఆదేశాలనే పాటించాలి. ఇందుకు వ్యతిరేకమైన సకల సిద్ధాంతాలను, ఆచరణలను, పిలుపులను నిర్ద్వంద్వంగా వ్యతిరేకించాలి.



# 21వ భాగం

# ఐక్యత - సంఘటితలు

- సంఘటితత్వపు ప్రాధాన్యతలు
- ఐక్యత యొక్క శుభ సంక్షేమాలు
- నియమాలు - మర్యాదలు

# సంఘటితతత్వపు ప్రాధాన్యతలు

ఇస్లామీయ ఆదేశాలు, ఉపదేశాలు ప్రతి ఒక్కరికీ వర్తిస్తాయి. ఎందుకంటే సమాజ ఉనికిలో ప్రతి ఒక్కరూ భాగస్వాములయి వుంటారు. మన దేహంలోని ఏ అవయవమైనా శరీరంతో కలిసి వుంటేనే దానికి జీవం వుంటుంది. వేరుపడిన వెంటనే అది విలువలేనిది అయిపోతుంది. శరీరం స్వీకరించే ఆహారం, ఇతర పోషక పదార్థాలు, పెరుగుదల, శక్తి లాంటి సహజ ధర్మాలను ఆయా అవయవాలు తమ తమ వంతు వాటాలను గ్రహిస్తాయి.

ఒంటరిమనిషి యొక్క పై స్థానాన్ని అల్లాహ్ గుర్తించి, గౌరవించిన కారణం గానే, ఒంటరి వ్యక్తికి మంచిని ఆదేశించే, చెడును నిర్మూలించే బాధ్యతను అప్పగించ లేదు. ఒక సంఘటిత సంఘానికే ఆ బాధ్యతను అప్పగించి, నాయకత్వపు స్థానాన్ని అందించాడు. ఈ సంఘటిత స్థానంలో వ్యక్తి భాగంగా వుంటాడు. ఈ సంఘటిత సమాజంలో భాగస్వామి అయిన కారణంగా తన బాధ్యతలను నిర్వర్తిస్తాడు. దైవ గ్రంథం ఖుర్‌ఆన్, ప్రవక్త (స) సాంప్రదాయం సున్నత్‌ల వెలుగులో ఈ విషయమే స్పష్టమవుతుంది. అల్లాహ్ ఒక వ్యక్తిని కాక, ఒక సమూహాన్ని, సంఘాన్ని సంబోధిస్తూ సంఘటిత ఆచరణ వైపునకు ఆదేశించాడు.

**"విశ్వాసులారా! రుకూ చేయండి, సజ్దా చెయ్యండి, మీ ప్రభువుకు దాస్యం చెయ్యండి, మంచి పనులు చెయ్యండి. దీని ద్వారానే మీకు సాఫల్య భాగ్యం లభిస్తుందని ఆశించవచ్చు. అల్లాహ్ మార్గంలో జిహాద్ చెయ్యండి, జిహాద్ చెయ్యవలసిన విధంగా." (ఖుర్‌ఆన్, 22 : 77-78)**

ఒక ముస్లిం అల్లాహ్ ముందు నిలబడి తన అసహాయతను వ్యక్తపరుస్తాడు. అల్లాహ్‌తో మాట్లాడుతాడు. అయితే ఈ ఆరాధనలో వేడుకోలులో తనను ఇతరులతో వేరుపర్చుకోవడం చేయడు. మొత్తం సమాజంలో భాగంగా సంఘం తరఫున వేడుకుంటాడు.

**"మేము నిన్నే ఆరాధిస్తాము. సహాయం కొరకు నిన్నే అర్థిస్తాము."**

**(ఖుర్‌ఆన్, 1 : 4)**

పై వేడుకోలులో 'మేము' అనే బహువచనం ఉపయోగించబడింది. 'నేను' అదే ఒంటరితనం లేకపోవడం గమనార్హం. ఆ తరువాత తాను దైవం వద్ద అర్థించే కారుణ్యం,

రుజుమార్గాలు కేవలం తన ఒక్కడికే కాక, విశ్వాసుల సంఘం మొత్తానికి కోరుకుంటాడు.

**"మాకు రుజుమార్గం చూపించు. నీవు అనుగ్రహించిన వారి మార్గం. నీ ఆగ్రహానికీ, మార్గభ్రష్టత్వాన గురికానివారి మార్గం" (ఖుర్ఆన్, 1 : 6-7)**

సృష్టికర్త అల్లాహ్ మానవులను విభేదాలు, విభజనలు, వైషమ్యాల కోసం సృష్టించలేదు. ఆయన మానవులందరి కోసం ఒకే జీవిత విధానాన్ని, ధర్మాన్ని నిర్ణయించాడు. ప్రపంచపు వివిధ భాగాల్లో ఏతెంచిన ప్రవక్తలందరూ తమ తమ జాతి వారిని ఒకే మార్గం వైపునకు ఆహ్వానించారు. తమ ధర్మాన్ని ముక్కలుగా చేసుకోవ డాన్ని, అనేక వర్గాలుగా చీలిపోవడాన్ని అల్లాహ్ ప్రారంభంలోనే నిషేధం విధించాడు.

అయితే మానవులు షైతాన్ యొక్క కుట్రలకు గురై అల్లాహ్ నిషేధానికి ప్రాముఖ్యతనివ్వలేదు. దైవాదేశాల పట్ల నిర్లక్ష్యం ప్రదర్శించాడు. అనేక సంఘాలుగా వర్గాలుగా చీలిపోయారు. ప్రతి వర్గం, మరో వర్గంతో తలపడటానికి సిద్ధం అయింది.

**ఓ ప్రవక్తలారా! స్వచ్ఛమైన వస్తువులను తినండి, మంచిపనులు చేయండి. మీరు ఏది చేసినా, అది నాకు తెలియకపోదు. మీ ఈ సంఘం ఒకే సంఘం, నేను మీ ప్రభువును, కనుక మీరు నాకు మాత్రమే భయపడండి. కాని, తరువాత ప్రజలు తమ ధర్మాన్ని వారిలో వారే ముక్కలు ముక్కలుగా చేసుకున్నారు. ప్రతివర్గం తన వద్ద ఉన్న దానితోనే ఆనంద పరవశమై ఉన్నది - మంచిది, వారిని విడిచిపెట్టండి, ఒక ప్రత్యేక కాలం వరకు తమ అజాగ్రత్తలోనే మునిగి ఉండనివ్వండి. (ఖుర్ఆన్ 23 : 51-54)**

స్వార్థపరమైన మనోకాంక్షలను అనుసరించటం, దైవాదేశాల పట్ల ద్రోహం తలపెట్టటం వల్లనే ప్రజలు విభేధాలకు, విభజనలకు గురి అయ్యారని అల్లాహ్ స్పష్టం చేశాడు. జ్ఞానం నైతికత నుండి విడిపోయినందువల్ల, సదరు జ్ఞానం ప్రజలకు కంటకంగా మారుతుంది. ఇస్లాంకు ముందు ప్రజలు అజ్ఞానపు అంధకారంలో కొట్టు మిట్టాడుతూ దారితప్పి తిరిగేవారు. ఇస్లాం వచ్చిన పిదప ఇందులో కపటులు బలహీన విశ్వాసులు చేరిపోయారు. వీరు ఇస్లామీయ బోధనలను తమ స్వలాభాల కోసం, మనోకాంక్షల నెరవేర్పుకోసం వాడుకోవడం ప్రారంభించారు. వ్యాపారంగా మలచు కున్నారు. అప్పుడు ముస్లిం సమాజం మరో సరికొత్త చెడుకు గురి అయింది.

దైవప్రవక్త (స) ఇలా చెప్పారు, "నేను మీ గురించి అధికంగా మాటకారి అయిన కపటి తెచ్చే ఉపద్రవాలకు భయపడుతున్నాను" (బజ్జార్)

విషతుల్యమైన హృదయం, జ్ఞానాన్ని కల్లోలాలకు, ఉపద్రవాలకు కారణంగా చేసుకుంటాడు. గతంలోనూ, ఆధునిక వర్తమాంలోనూ మానవత్వం, ఈ వినాశకర జ్ఞానం ద్వారా అనేక కష్టనష్టాలకు గురయింది. నోటి వరకే పరిమితమై, హృదయాన్ని ప్రభావితం చేయలేని జ్ఞానవంతుల వల్లనే మానవత్వం ముక్కచెక్కలయిందనే వాస్త వాన్ని అల్లాహ్ ఈ క్రింది పదబంధాల్లో వివరించాడు.

**"ఆయన నూహ్ ప్రవక్తకు ఆజ్ఞాపించిన ధర్మాన్నే నీకు కూడా నిర్ణయించాడు. దానినే (ముహమ్మద్ (సఅసమ్) ఇప్పుడు నీ వైపునకు మేము వహీ ద్వారా పంపాము. ఈ ధర్మాన్నే మేము ఇబ్రాహీమ్‌కు, మూసాకు, ఈసాకు బోధించాము. ఈ ధర్మాన్ని స్థాపించండి అనీ, దానిని గురించి విభేదాలకు లోను కాకండి అనీ తాకీదు చేశాము. ఈ విషయమే ఈ బహుదైవారాధకులకు ఎంతో అసహనం కలిగించింది దాని వైపునకే (ముహమ్మద్ (సఅసమ్) నీవు వారిని ఆహ్వానిస్తు న్నావు. అల్లాహ్ తాను కోరిన వారిని తనవారుగా చేసుకుంటాడు. ఆయన తన వైపునకు మరలేవారికి మాత్రమే, తన వైపునకు వచ్చే మార్గాన్ని చూపుతాడు."**

***(ఖుర్అన్, 42 : 13)***

ఆ తర్వాత ఇలా తెలిపాడు.

**"ప్రజల వద్దకు జ్ఞానం వచ్చిన తరువాతనే వారిలో విభేదం తలెత్తింది, వారు ఒకరికొకరు అన్యాయం చేయదలచుకున్న కారణంగానే ఇలాగయింది."**

***(ఖుర్అన్, 42 : 14)***

జ్ఞానం చిత్తశుద్ధి కోల్పోయినా, ప్రజల పట్ల ప్రేమాభిమానాలు కొరవడిన ఫలి తంగా మనవ సమాజం ఎంతటి ప్రమాదంలో పడిపోతుందో పై వాక్యాల ద్వారా తెలుస్తుంది. చిత్తశుద్ధి మృధ్యమైన జ్ఞానం, దైవభీతి దైవప్రీతి లేని జ్ఞానం, హృదయా లను వేరుచేసి పారేస్తుంది. ప్రజలను వర్గాలుగా విభజించి వివాదాలు, వైషమ్యాలకు గురి చేస్తుంది. బంధుత్వాలను, రక్తసంబంధాలను తుంచిపారేస్తుంది. కాని అల్లాహ్ ఈ సంబంధాలన్నింటిని కలిపి వుంచమని ఆదేశించాడు.

ఆలోచనల్లో, అభిప్రాయాల్లో భిన్నత్వం చాలా సాధారణ విషయం. అయితే

ఈ భిన్నత్వం, పరస్పర అసహ్యానికి, వ్యతిరేకతకు కారణం కాకూడదు. అభిప్రాయ బేధాలకు ఇతర ప్రాపంచిక ప్రయోజనాలు, తోడైనప్పుడే శతృత్వపు విపత్కర పరిస్థితులు ఏర్పడతాయి.

భిన్నాభిప్రాయాల ద్వారా జనించే చర్చల్లో నిజాయితీ, చిత్తశుద్ధి వుంటే ఆ చర్యలు ఫలవంతంగా వుండి భిన్నాభిప్రాయాలు తొలగి ఏకాభిప్రాయంగా మారుతుంది. అలాకాక, పేరు ప్రతిష్టలు, అధికార దర్పం, ఎదుటి మనిషిని ఓడించాలనే తత్వం వుంటే ఆ వివాదాలు, భిన్నాభిప్రాయాలు పరిష్కారం కావు. తద్వారా జనించే హృదయ విదారక విషాదకర సంఘటనలను చరిత్ర గ్రంథస్థం చేసి ప్రపంచానికి అందించి వుంది.

భిన్నాభిప్రాయాల విభేదాలకు రాజకీయ ప్రయోజనాలు, స్వార్థాలు కూడా తోడైతే చిన్న చిన్న విషయాలు కూడా పెద్దవయి పోతాయి. సమస్యలు జటిలం చేయబడతాయి. అభిప్రాయ విభేదాలు సైద్ధాంతిక, భావజాలాలకే పరిమితమై వుండి పెద్ద పెద్ద సమస్యలు కూడా పరిష్కరించడం తేలిక అవుతుంది.

విభేదాలు పెరిగి పెరిగి గాలివానగా మారకముందే వాటిని తొలగించాలని ఇస్లాం భావిస్తుంది. ఎందుకంటే ఈ విభేదాలు ధార్మిక, సామాజిక, సంఘటిత తత్వానికి ప్రమాదకరం. పరిణమిస్తుంది.

**"తమ ధర్మాన్ని ముక్కలు ముక్కలుగా చేసి, ముఠాలుగా చీలిపోయిన వారితో నిశ్చయంగా నీకు ఏ సంబంధమూ లేదు. వారి వ్యవహారం అల్లాహ్ అధీనంలో ఉంది. ఆయనే వారికి తెలుపుతాడు." (ఖుర్ఆన్, 6 : 159)**

గతంలోలాగా వర్గ విభజనా భేదాలకు గురి అయి గతంలోలాగా ఒకరి మెడలు మరొకరు నరుక్కునే వారిలాగా మారవద్దని అల్లాహ్ హెచ్చరించాడు.

**స్పష్టమైన ఉపదేశాలను పొందిన తరువాత కూడా ఎవరైతే తెగలుగా చీలిపోయారో, ఎవరైతే విభేదాలకు గురయ్యారో, వారి మాదిరిగా మీరూ కావద్దు. కొందరి ముఖాలు (సంతోషంతో) ప్రకాశిస్తూ ఉండేరోజున, మరికొందరి ముఖాలు నల్లబడిపోయేరోజున, ఇటువంటి వైఖరిని అవలంబించేవారికి కఠిన శిక్ష పడుతుంది. ఎవరి ముఖాలయితే నల్లబడిపోతాయో (వారితో ఇలా అనబడుతుంది): "విశ్వాస భాగ్యం పొందిన తరువాత కూడా మీరు అవిశ్వాస**

**వైఖరిని అవలంబించారా? సరే, కృతఘ్నత చూపిన దానికి ఫలితంగా మీరు ఇప్పుడు ఘోర శిక్షను చవిచూడండి. ఇక ఎవరి ముఖాలు ప్రకాశిస్తూ ఉంటాయో వారికి అల్లాహ్ కారుణ్యచ్ఛాయలో చోటు లభిస్తుంది. అదే స్థితిలో వారు శాశ్వతంగా ఉంటారు.** ***(ఖుర్ఆన్, 3 : 105-107)***

హృదయం ఉత్తేజం, నిజాయితీ, చిత్తశుద్ధి కలిగి వుండాలి. ఆలోచనలు, ఆచరణలు, వాటి పద్ధతులు అన్నీ ఒకే విధంగా వుండాలి. ఈ సూత్రాలు ఇస్లామీయ ఉత్తమ బోధనల ఖజానాలోనివే. విశ్వాసుల సంఘంలోని సభ్యులు స్నేహంగా, సంఘటితంగా వుండటాన్ని ఇస్లాం తప్పనిసరి విధిగా చేసింది. ఐక్యత, ఏకాభిప్రాయాల వల్లే సమాజంలో ఇస్లామీయ సంఘటన వికసిస్తుంది. ఈ సంఘటితత్వంలోనే ఆలోచనల, ఆదర్శాల అభివృద్ధి, సఫలతలు వున్నాయి. అన్నింటికంటే ముఖ్యంగా వికసించిన ముఖర్చస్సులతో నిజ ప్రభువు అల్లాహ్ కలుసుకునే గ్యారంటీ వుంది.

## ఐక్యత యొక్క శుభ సంక్షేమాలు

ఒక పనిని ఒక ఒంటరి వ్యక్తి చేస్తే దాని ఫలితం వేరుగానూ, అదే పనిని సామూహికంగా సంఘటితమై చేస్తే దాని శుభ లాభాలు మరో విధంగా వుంటాయి. ఉదాహరణకు రోజూ నిర్వహించే నమాజ్‌లనే తీసుకోండి. ఒక వ్యక్తి ఒంటరిగా ఫజ్ర్‌లోని రెండు రకాత్‌ల ఫరజ్ నమాజులైనా జొహర్‌లోని నాలుగు రకాత్‌ల ఫరజ్ నమాజ్ అయినా ఒంటరిగా ఆచరిస్తే కేవలం ఒక పుణ్యం లభిస్తుంది. అది సామూహికంగా ఐకమత్యాన్ని ప్రదర్శిస్తూ ఆచరిస్తే అందుకు 24 రెట్లు అధికంగా పుణ్యఫలం లభిస్తుంది.

నిజానికి రోజువారీ ఆరాధనల్లోని వాస్తవికత, రహస్యం ఏమిటంటే; మనిషి ఒంటరివాడిగా కుంచించుకొనిపోరాదు. అతడు సమాజంలో ఇతరులతో ఐక్యమై వుండాలి. ఒంటరితనపు మరుగుజ్జు ఆలోచనల పరిధిలోనే భ్రమించక సామూహిక సమిష్టి లాభాలను పొందాలి. మనిషి తన వరకై గిరగీసుకొని వుండటాన్ని ఆమోదించకూడదు.

ఒక ప్రవచనంలో యిలా చెప్పబడింది, "మూడు గుణాలు వున్నాయి. వీటి పట్ల ముస్లిముల్లో ఎవరూ అభ్యంతరం కలిగి వుండకూడదు. మొదటిది. నిజాయితీ

చిత్తశుద్ధి, రెండవది విశ్వాసుల పట్ల శ్రేయోభిలాష, ఇక చివరిది ఐక్యత. ఈ సుగుణాలు వున్న వారి దుఆలు అందరి శ్రేయాన్ని కాంక్షించేవిగా వుంటాయి." (బజ్జార్)

ఒక ముస్లిం తన సమాజంతో సంఘటిత సంబంధం కలిగి వుండటానికి విశ్వప్రభువు అల్లాహ్ ఐదు పూటల సామూహిక నమాజును తప్పనిసరి చేశాడు. ఈ నమాజుల్లో హాజరుకావడం, సామూహికంగా నిర్వహించడం ప్రోత్సహించబడింది. ఆ కారణంగా ఈ నమాజులకు హాజరుకాని వారిని శిక్షల ద్వారా హెచ్చరించటమూ జరిగింది. ఇక చిన్న చిన్న గ్రామాలు, పట్టణ ప్రజలను వారానికి ఒకసారి జుమా నమాజ్ ద్వారా హాజరుకావలసిందిగా ఆదేశించడమయింది. ఇంతకంటే ఇంకా ఎక్కువ మంది హాజరు కావడానికి ఊరవతల పెద్ద మహాసభ కోసం ఈద్ నమాజ్ లను నిర్ణయించడం జరిగింది. ఈ సభల్లో పురప్రముఖులు, మేధావులు, సాధారణ ప్రజలే కాక– బహిష్టు స్థితిలో వున్న స్త్రీలు సయితం పాల్గొనేలా చేయడమైంది.

ఇంకా ఆ తరువాత ప్రపంచ ప్రజల అంతర్జాతీయ మహాసభగా హజ్‌ను ఏర్పాటు చేయడం జరిగింది. శక్తిగల ముస్లింలకు హజ్ తప్పనిసిరిగా నిర్ణయించడమైంది. నిర్ణీత స్థానంలో, నిర్ణీత సమయంలోనే ప్రజలందరూ కలిసేలా ఏర్పాటు చేయడమైంది. వివిధ దేశాలు, జాతులు, తెగలు, ఖండాలు, రంగులు గల ప్రజలు (ముస్లింలు) ఇక్కడ తప్పకుండా కలుసుకుంటారు. అంతర్జాతీయ సమైక్యతను, సోదరత్వాన్ని, సౌభ్రాతృత్వాన్ని ప్రకటిస్తారు. సామూహికత నుండి వైదొలగి ఒంటరిగా జీవించడాన్ని దైవప్రవక్త (స) తీవ్రంగా ఖండించారు. విశ్వాసులు ఐక్యంగా – సంఘటితంగా వుండాలని మరీ మరీ చెప్పారు.

సయీద్ బిన్ ముసయ్యిబ్ (రజి) కథనం ప్రకారం, దైవప్రవక్త (స) "ఒకరు లేక ఇద్దరు వుంటే షైతాన్ వారి వెంటపడతాడు. కాని ముగ్గురు (అంతకంటే ఎక్కువ) వుంటే వారిని ఏ మాత్రం ఓడించలేడు" అని చెప్పారు. (మాలిక్)

ఒకసారి ఒక వర్తక బిడారులోని సభ్యులు, బిడారు ఆగిన వెంటనే చెల్లాచెదరు అయిపోవటాన్ని ప్రవక్త (స) గమనించి తమ అసహ్యతను వ్యక్తపర్చారు. వారిని ఈ విధమైన ఆచరణ నుండి, వారించారు. అబూ సఅలబ (రజి) ఈ విధంగా ఉల్లేఖించారు:

"మీరు ఇలా చెల్లాచెదరు కావడం షైతాన్ పన్నిన కుట్రలో భాగమే" అని ప్రవక్త

హెచ్చరించారు. ఆ తర్వాత విడిదుల్లో ఒక వ్యక్తి మరో వ్యక్తిని కౌగిలించుకొనేవారు. వారిపై ఒక గుడ్డ పరిస్తే అది వారిని కప్పేసంతగా వుండేది." (అబూదావూద్)

ఒకరిపట్ల మరొకరికి ప్రేమాభిమానాలు, గౌరవం, అప్యాయతలు, సోదర భావం, ఐకమత్యం, సంఘటిత జీవనం వారిలో ఉట్టిపడేది. ఆదర్శంగా వుండేది.

## నియమాలు-మర్యాదలు

ప్రజలు సత్యధర్మంపై నిలకడగా వుండకపోతే, అసత్యం వారిని కకావికలురుగా చేసిపారేస్తుంది. కృపాసాగరుడైన అల్లాహ్ దాసులు సంఘటితంగా వుండకపోతే, షైతాన్ ఏజంట్లు వారిని చెల్లాచెదురు చేసి పారేస్తారు. పరలోకపు శాశ్వత దైవాను గ్రహాలు వారిని తమ వైపుకు ఆకర్షించకపోతే, తద్వారా వారిలో ఐక్యత జనించకపోతే తాత్కాలికమైన ప్రాపంచిక విషయాల కోసం సంఘర్షించుకుంటారు. ఈ కారణంగానే ఈర్ష్యా ద్వేషాలు, శతృత్వం, యుద్ధం వాదవివాదాలు అంధకారపు అజ్ఞానానికి గుర్తులని - అవి అవిశ్వాసుల సహజ గుణాలని చెప్పబడింది.

"నా మరణం తర్వాత మీరు అవిశ్వాసుల్లా ప్రవర్తించకండి. ఒకరి మెడలు మరొకరు నరుక్కోకండి" అని దైవప్రవక్త (స) హెచ్చరించారు. (తిర్మిజి)

రక్తపాతాలు, యుద్ధ మారణహోమాలు కేవలం దైవభీతిలేని అవిశ్వాసుల వల్లనే జనిస్తాయి. ఈ అవిశ్వాసులు ఈ భూమిపై అనేక సైద్ధాంతిక గ్రూపులుగా విభజించబడి వున్నారు.

ఇస్లాం భిన్నాభిప్రాయాలకు స్వాగతం పలుకుతుంది. సంకల్పశుద్ధంగా వుండి ఆలోచనాపరంగా లోపం ఉంటే ఆ వ్యక్తికి ఒక పుణ్యఫలం లభిస్తుంది. సంకల్పం లోనూ ఆలోచనల్లోనూ పరిశుద్ధత వుండి అతనికి రెండింతల పుణ్యఫలం లభిస్తుంది. భవనాల్లో, దృక్పథాల్లో అభిప్రాయ భేదాలు వుండవచ్చు. కాని సత్యం ప్రత్యక్షమయిన వెంటనే దానిని స్వీకరించే నిజాయితీ తప్పనిసరిగా వుండాలి.

"పాలకుడు (ప్రజల సంక్షేమం గురించి) ఆలోచించాలి. అతడు సహేతుకంగా ఆలోచిస్తే అతనికి రెండింతల ప్రతిఫలం లభిస్తుంది. ఒకవేళ అతని ఆలోచనలో లోపం వుంటే - అతనికి ఒక వంతు ప్రతిఫలం లభిస్తుంది." (బుఖారి)

మనిషి ఆలోచనలపై - సంకల్పాలపైనే అల్లాహ్ కారుణ్యం ఆవరించి

వుంటుంది. అవి మానవ జాతి యొక్క సంస్కరణ- సంక్షేమాలను పర్యవేక్షించి వుంటుంది. అటువంటప్పుడు మనిషి తన ఆలోచనల్లో - సంకల్పాల్లో లోభితనం కలిగి వుంటం అవివేకం కాదా? అల్లాహ్ యొక్క సత్యధర్మం- జ్ఞానం మనిషిని విశాల హృదయునిగా సృషించింది. మరి ఈర్ష్యాద్వేషాలు - శతృత్వ హింసల సంకుచితత్వం ఎందుకు?

సంకల్పంలో చిత్తశుద్ధి, భిన్నాభిప్రాయాల వల్ల ఎటువంటి నష్టమూ జరగదు. ఇందుకు ఉదాహరణగా ప్రవక్తశ్రీ (స) వారి జీవితం నుండి ఈ క్రింది ఘట్టాన్ని చెప్ప వచ్చు. దైవప్రవక్త (స) మదీనా నుండి యుద్ధ రంగానికి సైన్య సమేతంగా బయలు దేరారు. బయలుదేరే ముందు అస్ర్ నమాజ్‌ను బనీ ఖురైజా ప్రాంతంలో చదవాలి అని చెప్పారు. కాని ప్రయాణ సమయంలోనే అస్ర్‌వేళ మార్గ మధ్యంలో వచ్చింది. కొందరు ప్రవక్తశ్రీ (స) వారి ఆదేశాన్ని ప్రయాణ శీఘ్రతకు నిరధ్శనంగా తీసుకొని అస్ర్ నమాజ్‌ను మార్గమధ్యంలోనే పూర్తిచేశారు. మరికొందరు ప్రవక్తశ్రీ వారి మాటలను యధాతథంగా స్వీకరించి బనీ ఖురైజాలో అస్ర్ నమాజ్‌ను ఖజా చేసి ఆచరించారు. ప్రవక్త శ్రీ (స) వారు ఇరువురి ఆలోచనలను, వాటి ఆధారంగా అమలైన ఆచరణలు రెండింటిని ఆమోదించారు. వీరిరువురిలో సంకల్పవుధ్ధి వుండటమే అందుకు కారణం. ఆపైన ఇరు వర్గం కలిసి ఒకే సైన్య పటాలగా మార్చి శిక్షణ యిచ్చారు.

ధర్మజ్ఞానానికి సంబంధించిన భిన్నాభిప్రాయాలల్లో సంకల్పశుద్ధి తప్పనిసరిగా వుండాలి. ఇస్లాం ఆశిస్తున్నది ఈ విషయాన్నే. విభేదాలకు కారణం కేవలం ఐహిక సుఖాలు, పేరుప్రతిష్ఠలు, ఈర్ష్యా ద్వేషాలు, ఇతర శతృత్వాలు అయితే వారి ఇహంపరం రెండూ వ్యర్థం అవుతాయి. వీరి నుండి జ్ఞానం హరించివేయబడుతుంది.

ఐక్యత, సోదరత్వం, సంఘటితత్వం ముస్లిం సమాజానికి ఎంతటి అవసరమో ఈ క్రింది ఉదాహరణ తెలుపుతుంది.

ఒక మస్జిద్‌లో కొందరు 8 రకాత్‌ల తరావీహ్ కోసం పట్టుపట్టగా, మరి కొందరు 20 రకాత్‌ల తరావీహ్ కోసం పట్టుపట్టారు. వాదోపవాదాలు జరిగి పరిస్థితి కోట్లాట వరకు చేరుకుంది. లోతైన ధర్మజ్ఞానం గల ఒక పండితుని వద్దకు తీర్పు కోసం వెళ్ళడం జరిగింది. ఇరువర్గాల వాదనను విన్న ఆ పండితుడు - ఇరు వర్గాల లోనూ ప్రవక్త సాంప్రదాయాన్ని ఆచరించాలనే తపనను కనుగొన్నారు. అదే సమయంలో వారిలోని మూర్ఖత్వాన్నీ గమనించారు. అత్యంత వివేకంగా తీర్పును ఈ

క్రింది విధంగా యిచ్చారు. "నా తీర్పు ఏమిటంటే ఈ మస్జిద్‌లో తరావీహ్ నమాజ్ ఆపివేయాలి. ఎందుకంటే తరావీహ్ నమాజ్ ఒక అదనపు (నఫిల్) ఆరాధన మాత్రమే కాని ముస్లిముల మధ్య ఐక్యత, సోదరత్వం సమైక్యత అనేది ఇస్లాంలో విధి అయి వుంది. ఒక విధిని పరిరక్షించడానికి ఒక నఫిల్‌ను రద్దు చేయడం ధర్మసమ్మతమే" అని తీర్పు చెప్పారు. ఇటువంటి విషయాల్లో వివాదాలకు తావు వుండకూడదు.

ముస్లింలలో ఐక్యతను పరిరక్షించడానికి ఇస్లాం చెడును సయితం తాత్కాలికంగా భరిస్తుంది. ఒక చెడును నిర్మూలించడంలో పెద్ద ఉపద్రవం తలెత్తే ప్రమాదముంటే, ఆ చెడును తొలగించడం తప్పనిసరికాదు. ఎందుకంటే ఒక చెడు ఉపద్రవం కంటే ప్రమాదకారి కాదు. ఈ కారణంగా పెద్ద ఉపద్రవాన్ని ఆహ్వానించడం కంటే చిన్న చెడును భరించడమే శ్రేయస్కరమని భావించాలి. ఒక రోగికి ఆపరేషన్ తప్పనిసరి అవుతుంది. కాని ఆ రోగి సదరు ఆపరేషన్‌ను తట్టుకునే శక్తి వుంటేనే డాక్టర్ ఆపరేషన్ చేస్తాడు. రోగి పరిస్థితి అందుకు అనుకూలంగా లేకపోతే, ప్రమాదకరంగా వుంటే డాక్టర్ ఆపరేషన్ చేయడు. వ్యాధిని కొంతకాలం భరించేలా చికిత్స చేస్తాడు.

దైవప్రవక్త (స) అన్సార్‌ల నుండి "మంచి స్థితిలోనూ, కష్టకాలంలోనూ – సుఖ దుఃఖాల్లోనూ, ఎల్లప్పుడూ విధేయత పాటిస్తామనీ, తాము తమకంటే ఇతరులకే ప్రాధాన్యతనిస్తామనీ" వాగ్దానం తీసుకున్నారు." (ముస్లిం)

పై ప్రవచనానికి అర్థం ఏమిటి? నిష్ఠాగరిష్టులైన ఇస్లామీయ ఉ్యమ కార్యకర్తలు ధన సంపత్తులకు, ఉన్నత పదవులకు ప్రాధాన్యతనివ్వకూడదు. అవి లభించనందుకు నిరాశ చెందకూడదు. పదవులు–ధనసంపత్తుల కోసం ఉబలాటపడటం, అవి దొరక నందుకు రోధిస్తూ పెడబొబ్బలు పెడుతూ తిరగటం కపటుల లక్షణంగా వుంటుందే తప్ప, విశ్వాసుల లక్షణంగా వుండదు. ఈ విషయంగా అల్లాహ్ కపటుల మానసిక స్థితిని ఇలా వివరించాడు.

**"వారిలో కొందరు సదఖాత్ పంపకం విషయంలో నీపట్ల ఆక్షేపణలు తెలుపుతారు. ఒకవేళ ఈ నిధుల నుండి ఏదైనా వారికిస్తే సంతోషిస్తారు. ఇవ్వక పోతే ఆగ్రహిస్తారు. (ఖుర్‌ఆన్, 9 : 59)**

చిత్తశుద్ధి, సంకల్పశుద్ధిలేని విబేధాలు, వర్గ విజనలను లోతుగా అధ్యయనం చేస్తే వీటన్నిటికీ కారణం పక్షపాతం, స్వార్థం, భౌతికవాంచలేనని ఇట్టే తెలిసిపోతుంది.

ఐక్యతలోనే గొప్పశక్తి వుంది. ఈ సిద్ధాంతం సర్వమానవులకు సంబంధించినది అయి నప్పటికీ విశ్వాసికి ఇది తప్పనిసరి. బలహీనమైన దారాలు కొన్ని కలిపి పురిపెట్టబడి బలమైన త్రాడుగా తయారవడం మనకు తెలిసిన సత్యమే సుమా. ఈ ప్రపంచం మొత్తంగా రేణువుల సమూహమేనని మరువకూడదు.

ఒక వివేకవంతుని కథ మన పాఠ్యగ్రంథాలలో చోటుచేసుకొని వుంది. అతడు ఐకమత్యపు ప్రాధాన్యతను తెలుపడానికి కొన్ని కట్టెపుల్లలను తన కుమారులకు యిచ్చి విరవమంటాడు. వారు అతి తేలికగా వాటిని విరిచివేస్తారు. అదే కట్టె పుల్లలను కలిపి ఒక కట్టగా చేసి విరవమంటే అందరూ విరవలేకపోతారు. ఐకమత్యానికి వున్న శక్తిని కథ సోహరణంగా మనకు తెలుపుతుంది.

పరస్పర విభేదాలు వ్యతిరేకతలు అత్యంత బలమైన జాతులను సయితం బలహీనపరిచివేస్తాయి. బలహీన జాతులను నాశనం చేసివేస్తాయి. ఈ విషయంగానే విశ్వప్రభువు అల్లాహ్ బద్ర్ యుద్ధ విజయ సమయంలో ముస్లిం సంఘానికి ఐకమత్యంతో, సంఘటితంగా మెలగమని ఆదేశించాడు. యుద్ధ సొత్తు విషయంలో అభిప్రాయబేధాలు తలెత్తినపుడు ఈ క్రింది వాక్యాలను అవతరింపజేశాడు.

**"వారు నిన్ను 'అన్‌ఫాల్'ను గురించి అడుగుతున్నారు. ఇలా అను : ఈ అన్‌ఫాల్ అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ చెందుతాయి. కనుక మీరు అల్లాహ్‌కు భయపడండి. మీ పరస్పర సంబంధాలను సంస్కరించుకోండి. అల్లాహ్‌కూ, ఆయన ప్రవక్తకూ విధేయత చూపండి," (ఖుర్ఆన్, 8 : 1)**

ఆ తరువాత ఈ ఇస్లామీయ సమాజ కార్యకర్తలకు ఐకమత్యంతో, సంఘటి తంగా జీవించమనీ, సాఫల్యాలకు, దైవసహాయానికి ఇదేమార్గమని స్పష్టం చేయ బడింది.

**"అల్లాహ్‌కూ ఆయన ప్రవక్తకూ విధేయత చూపండి. పరస్పరం కలహించు కోకండి. అలా జరిగితే మీలో బలహీనత ప్రవేశిస్తుంది, మీ శక్తి సన్నగిల్లి పోతుంది." (ఖుర్ఆన్ 8 : 46)**

ఇంకా, భౌతిక వాంఛలకు, లోభత్వానికి, అధికారలాలసకు గురయినవారిని ఎటువంటి పుణ్యాన్ని ఆశించని వారిని అనుసరించవద్దని అల్లాహ్ హెచ్చరించాడు.

**"తమ గృహాల నుండి విర్రవీగుతూ ప్రజల ముందు తమ దర్పాన్ని ప్రదర్శిస్తూ**

**బయలుదేరేవారి మాదిరిగా, అల్లాహ్ మార్గం నుండి ప్రజలను నిరోధించే వైఖరిని కలిగి వున్నవారి మాదిరిగా ప్రవర్తించకండి. వారు చేస్తున్నది ఏదీ అల్లాహ్ పట్టుకు అతీతంగా లేదు." (ఖుర్ఆన్ 8 : 47)**

ఆ తరువాత ముస్లింలకు ఉహూద్ యుద్ధంలో ఘోర పరాజయం ఎదురయింది. 70 మంది ప్రముఖ సహాబాలు వీరోచితంగా పోరాడి అమరులయ్యారు. పరాజయంపాలయ్యారు. అవిశ్వాసులు విజయులై ఆనందించారు. ఈ హృదయవిదారక అవమానం ఎందుకు సంభవించింది? ఎందుకంటే వారు పరస్పరం కలహానికి దిగారు. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త ఆదేశాలను అమలు చేయడంలో విభేదాలకు లోనయ్యారు. విధేయత పట్ల నిర్లక్ష్యం వహించారు.

**అల్లాహ్ మీకు చేసిన తన వాగ్దానాన్ని నెరవేర్చాడు. ప్రారంభంలో ఆయన ఆజ్ఞ ప్రకారం మీరే వారిని హతమార్చారు. కాని మీరు బలహీనతను ప్రదర్శించినప్పుడు మీ కర్తవ్యం విషయంలో పరస్పరం విభేదాలకు గురిఅయినప్పుడు మీరు వ్యామోహపడిన వస్తువును (అంటే విజయధనం) అల్లాహ్ మీకు చూపగానే మీరు మీ నాయకుని ఆజ్ఞను ఉల్లంఘించారు- ఎందుకంటే, మీలో కొందరు ఇహాన్ని కోరారు, మరికొందరు పరాన్ని కోరారు - అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని పరీక్షించటానికి అవిశ్వాసులకు బదులుగా మిమ్మల్ని ఓటమిపాలు జేశాడు. అయినప్పటికీ వాస్తవానికి అల్లాహ్ మిమ్మల్ని క్షమించాడు.**

***(ఖుర్ఆన్, 3 : 152)***

తమ చరిత్రయొక్క అత్యంత నాజూకు కాలమైన నేడు, ముస్లింలు ఎదుర్కొంటున్న అవమానాలు, విమర్శలు, వ్యతిరేకతలు, అనుమానాలు ఉద్రిక్తతలు అన్ని తాము ఐక్యత, సమైక్యత, సంఘసేవలు లోపించిన కారణంగా జనించినవేనని అర్థం అవుతుంది. దానికి తోడుగా మనోకాంక్షల దాస్యం వుండనే వుంది.

ఆధునిక యుగంలో క్రైస్తవ చర్చి చేసిన దాడులు అన్నీ విభజించి పాలించు సూత్రాల పునాదులపైనే జరిగాయి. వారు ముందుగా ముస్లింలలోని ఐక్యతను దెబ్బ కొట్టారు. జాతులుగా, తెగలుగా, దేశాల వాసులుగా వారిని విభజించారు. ఒకరిపట్ల మరొకరికి ఈర్ష్యా ద్వేషాలను రెచ్చగొట్టారు. విజయం సాధించారు.

ఈ కుట్ర పూరిత ఉపద్రవాలను ఇస్లాం ప్రారంభంలోనే పసిగట్టి దానికి పరిష్కా

రాలనూ సూచించింది. విభేదాలను అంతమొందించేందుకు సూత్రాలను, అందించింది. ఈ కృషిలో ముస్లిం సమాజం మొత్తాన్ని బాధ్యులుగా చేసింది. విభేదాలకు గురికాకుండా, సమైక్యంగా, సంఘటితంగా వుండే వారి వెంట అల్లాహ్ సహాయం వుంటుందని స్పష్టం చేసింది. సమాజం నుండి విడిపోయిన, లేక వేరుపడిన వాడిని నరకవాసిగా ప్రకటించింది.

ఇస్లామీయ ఉద్యమ శత్రువులు ముందుగా ముస్లింలలోనుండి కొందరిని తమ ఏజెంట్లుగా తయారు చేసుకుంటారు. వారి ద్వారా ముస్లిం సమాజాన్ని వినాశనానికి గురిచేయడానికి ప్రయత్నిస్తారు. ఇస్లామీయ వ్యవస్థను ఇటువంటి కపటుల నుండి రక్షించటానికీ, వారి కుట్రలను వ్రేళ్ళతో సహా పెకలించి వేయటం తప్పక చేయాలి.

దైవప్రవక్త (స) ఇలా హెచ్చరించారు, "ముస్లింలలో అనేక వర్గాలు జనిస్తాయి. అయితే ఈ మీ సమాజంలోని ఐక్యతను, సంఘటితత్వాన్ని నాశనం చేయ ప్రయత్నించేవారిని ఉపేక్షించకండి. వారిని కరవాలంతో శిక్షించండి. అది ఎవరైనా సరే." (ముస్లిం)

ఇస్లామీయ ఐక్యతకు భంగం కలిగించే చర్యలు చేసేవాడు అల్లాహ్ యొక్క ఈ క్రింది హెచ్చరికకు పాత్రుడు అవుతాడు.

"విధేయత పాటించక ఇస్లామీయ జమాఅత్ నుండి దూరమైనవాడు ఆ స్థితిలోనే మరణిస్తే అతని మరణం అజ్ఞానపు స్థితిలో మరణించినట్లు అవుతుంది." (బుఖారి)

మరో ప్రవచనంలో యిలా వుంది, "ముస్లిం సమాజానికి వ్యతిరేకంగా ఆచరించిన పుణ్యపాపాలను లెక్కచేయక ప్రజలను చంపినవాడు, విశ్వాసులను ధిక్కరించినవాడు, వాగ్దాన భంగానికి పాల్పడినవాడు – ఇతనికి నాకూ ఎటువంటి సంబంధం లేదు. అతనితో నాకు ఎటువంటి అవసరమూ లేదు." (ముస్లిం)

ఒక ధనవంతుని హక్కు–తన ధనం నుండి పేదల వాటాను తీసి వారి హక్కును చెల్లించాలి. స్థోమతగలవారు తమ సంపదల ద్వారా సమాజానికి లాభం చేకూర్చాలి. కాని, ఒక వ్యక్తి గౌరవం, విద్య పదవులు, ధనం నాయకత్వం యివ్వబడితే అతను పేదల హక్కును గుర్తించక కేవలం తన స్వార్థానికి స్వలాభానికి కృషి చేస్తే ఇతరులకు లాభం చేకూర్చకపోతే అతనికంటే అభాగ్యుడు మరొకడు వుండడు. అభాగ్యుడు దైవ

ప్రసన్నతకు దూరమైపోతాడు. ఎంతటి బల, ధన, సంపదలున్నప్పటికీ అపజయానికి అసఫలతకు అర్హుడవుతాడు.

ఈ కారణంగానే పదవులను, నాయకత్వ స్థానాలను కాంక్షించడం తగదని ఇస్లాం జాగ్రత్తలు చెప్పింది. అబూ మూసా (రజి) ఉల్లేఖనం ప్రకారం :

"నా వెంట బనూ అమీ తెగకు చెందిన ఇద్దరు వ్యక్తులు వచ్చి దైవప్రవక్తను కలిసారు. వారిలో ఒకరు 'ఓ దైవప్రవక్తా! అల్లాహ్ మీకు అప్పగించిన బాధ్యతల్లో ఒక దానిని నాకు అప్పగించండి. అని విన్నవించుకున్నాడు. రెండవ వ్యక్తి కూడా అదే విజ్ఞాపన చేశాడు. దానికి దైవప్రవక్త (స) "దైవంసాక్షి! మేము బాధ్యతలను (పదవులను) వాటిని కోరేవారికి అప్పగించలేము" అని సమాధానమిచ్చారు" (బుఖారి)

కాని, అత్యంత బాధాకర, హృదయవిదారక ఆశ్చర్యకరవిషయం ఏమిటంటే ఏ రోగాలు, క్రిములు, చెడుల గురించి ఇస్లాం హెచ్చరించిందో – రోగ నివారక చర్య లను అందించిందో – ముస్లిం సమాజం అదే రోగాలకు, వ్యాధులకు నేడు గురయి ఉంది. అధికారం కోసం, నాయకత్వ పదవుల కోసం, కుట్రలకు, కుతంత్రాలకు, ఘోర పాపాలకు ఒడిగడుతున్నారు. వంశపారంపర్య అధికారులుగా చెలామణి అవుతూ వున్నారు. అధికార ప్రాధాన్యతల కోసం ఇస్లాం బోధనలను ఏ మాత్రం లెక్క చేయక త్రోసిరాజంటున్నారు.

అధికారలాలస, నాయకత్వ అధికార దాహం గల వారు వేదికలెక్కితే అధికారాలు పొందితే, వారివల్ల సమాజానికి ఎటువంటి లాభమూ జరగదు. సమాజం అభివృద్ధి వైపునకు ముందడుగువేయడం అస్సలు జరగదు. నీచులు ప్రజలపై పెత్తనం చెలాయించే ఆశగలవారు బాధ్యతలకు అర్హులు ఎలా కాగలరు?

ఇస్లామీయ వ్యతిరేక ఆచరణలు, ఇస్లాంకు నష్టం కలిగించే పద్ధతులు ఎక్కడ కనపడినా వాటిని ఎదిరించడం సంస్కరించడం ప్రతి ముస్లిం యొక్క విధి అవుతుంది. ముస్లింలను వేరుపర్చే ఐక్యతకు నష్టం కలిగించే ప్రతి ఆచరణకు వ్యతిరేకంగా ఎదురొడ్డి పోరాడాలి. అప్పుడే ముస్లిం సమాజపు ఐక్యతను, సమైక్యతను, సంఘటి తత్వాన్ని పరిరక్షించుకోగలం.



# 22వ భాగం

# మిత్రుల ఎంపిక

- ఏకాంత-బహిరంగాలు (అంతర్-బాహ్యాలు)
- మిత్రుత్వ మర్యాదలు
- మంచి-చెడు సహవాసాల ప్రభావం
- స్నేహానికి సరైన సూత్రాలు

# మిత్రుల ఎంపిక

## ఏకాంత-బహిరంగాలు (అంతర్-బాహ్యాలు)

"నీ మిత్రులు ఎవరో చెప్పు - నీవెటువంటివాడవో నేను చెప్పగలను" అనేది జగమెరిగిన సామెత. అంటే; స్నేహం యొక్క ప్రభావం వ్యక్తి నైతికతపై తప్పక వుంటుందని అర్థం. ఈ ప్రభావం తాను జీవిస్తున్న సొసైటీపై తప్పక పడుతుంది. ఈ ప్రభావం సకారాత్మకమైతే సొసైటీ (సమాజం) అభివృద్ధి వైపు పయనిస్తుంది. ఈ ప్రభావం నకారాత్మకమైనది అయితే సమాజపు అడుగులు ముందుకు కాక, వెనుకకు రెండడుగులు వేస్తుంది. శాంతి, సుఖ సంతోషాలకైనా- అస్థిరత్వం, పతనాలకైనా గురవుతుంది.

ఇస్లాం మిత్రుత్వ సంబంధాలకు చాలా ప్రాధాన్యతనిస్తుంది. ఈ సంబంధాలు సజీవ మానవులతో వుండటం వల్ల వారిపై సకారాత్మక ప్రభావం పడవేయడానికి ఉపయోగపడతాయి. ఈ ప్రభావం వల్ల మనిషిలో అల్లాహ్ పట్ల నిష్ఠ, సహేతుకమైన జీవిత లక్ష్యం ఏర్పడితే ఆ స్నేహం అల్లాహ్ వద్ద ఆమోదయోగ్యమవుతుంది. ఈ సంబంధాలలో అల్లాహ్ యొక్క కరుణాకటాక్షాలు వుంటాయి. తత్ వ్యతిరేక సంబంధాలను అల్లాహ్ ఆమోదించడు. వాటివల్ల మనిషికి ప్రయోజనమూ వుండదు.

> **ఆ (తీర్పు) దినం వచ్చినప్పుడు- స్నేహితులందరూ భయభక్తులు కలవారు తప్ప ఒకరికొకరు శత్రువులైపోతారు. ఆ రోజున మా వాక్యాలను విశ్వసించి, మా ఆజ్ఞలకు బద్ధులై జీవితం గడిపిన వారితో ఇలా అనబడుతుంది: "నా దాసులారా! ఈనాడు మీకు ఏ భయమూ లేదు, మీకు ఏ దుఃఖమూ కలుగదు.**
>
> ***(ఖుర్‌ఆన్, 43 : 67-68)***

ఇస్లాం సంఘటితత్వం, పరస్పర ప్రేమానురాగాలు గల ధర్మం. ఒకరిని మరొకరు కలుసుకోవడం, సంబంధాలు అభివృద్ధి పరచుకోవడం ఇస్లామీయ బోధనలకు పునాదులుగా వుంటాయి. ఇస్లాం అడుగుజాడలు అజ్ఞానం అశ్లీలాలపై ఆధారపడినవికావు. ప్రజలకు దూరంగా ఏకాంతంగా ఆశ్రమ సన్యాసుల్లా జీవించడాన్ని ఇస్లాం వ్యతిరేకించింది. జీవితం విసిరే సవాళ్ళకు భయపడి పలాయనం చిత్తగించే

మనస్తత్వాన్ని ఇస్లాం అసహ్యించుకుంటుంది. కళ్ళుమూసి నిరంతరం తపం– జపం– ధ్యానం– చేయమనీ జీవన కార్యరంగాలన్నింటికీ వెన్నుచూపమనీ బోధించదు. అల్లాహ్ వద్ద గౌరవోన్నతుల స్థానాలు పిరికివారు, పలాయనవాదులు, మానసిక బలహీనుల కొరకు వుండవు.

దైవప్రవక్త (స) ఇలా బోధించారు, "ప్రజలతో కలిసిమెలసి వుండి వారి అనుచిత ప్రవర్తనలను సహనంతో సంస్కరించపూనుకునే విశ్వాసి – ప్రజలకు దూరంగా వుండి ప్రజల అనుచిత ప్రవర్తనను సహించని విశ్వాసి కంటే ఉత్తముడు." (తిర్మిజి)

రోజూ ఐదుపూటల సామూహిక నమాజ్ ఎవరిపై తప్పనిసరి చేయబడింది? వారాంతపు జుమా నమాజ్ ఎవరిపై విధి చేయబడింది? ధర్మ స్థాపనలో నిరంతర కృషి యొక్క కష్టనష్టాలు ఎవరు భరిస్తారు? ఈ మార్గంలో ఎదురయ్యే ఆపదలు, ఆటంకాలను ఎదుర్కోగల ధైర్యం ఎవరిలో వుంటుంది? ఈ బరువు బాధ్యతలు అన్ని కేవలం ప్రజలతో సత్ సంబంధాలు కలిగివున్న సంఘం మాత్రమే నిర్వహించ గలుగుతుంది.

పగలు ఉపవాసాలు పాటిస్తూ, రాత్రి ఆరాధనల్లో నిమగ్నమై వుండీ– సామూహిక ఐదుపూటల నమాజుల్లోనూ – జుమా నమాజుల్లోనూ పాల్గొనని వ్యక్తి గురించి ఇబ్నె అబ్బాస్ (రజి)ను ప్రశ్నించడం జరిగింది. దానికి ఆయన "అతడు నరకవాసి" అది అతనికి తెలియజేయండి' అని సమాధానమిచ్చారు. (తిర్మిజి)

ఇస్లామీయ ఆదేశాలను, ముస్లింలందరూ కలసి పరస్పరం సహాయ సహకారాలతో–ప్రేమాభిమానాలతో–సత్ సంకల్పంతో ఆచరించవలసి వుంటుంది. ఏకాంత వాసం– ప్రజలతో మమేకం కాకపోవడం అనేవి ఇస్లామీయ ఆచరణా విధానానికి పొసగనివి. అంతేకాదు గొడ్డలిపెట్టు లాంటివి కూడాను.

ముస్లింల ఐక్యత తమ సోదరుల మధ్య ఏ స్థాయిలో పెరుగుతూ ఉంటుందో – అదే స్థాయిలో దైవకారుణ్యం–శుభ సంక్షేమాలూ వర్షంలా కురుస్తాయి. ఒక దైవ ప్రవక్త (స) ప్రవచనం ప్రకారం:

'ఒంటరి వ్యక్తి నమాజ్ కంటే మరొకరితో కలసి ఆచరించటం మేలు. అదే విధంగా ఇద్దరి కంటే ముగ్గురు మేలు. సంఖ్య పెరిగే కొద్దీ దైవశుభాలు కూడా పెరు

గుతూ వుంటాయి.” (అహ్మద్) ఇటువంటి ప్రవచనమే తిబ్రానీ గ్రంథంలోనూ కాన వస్తుంది. నమాజ్ ఆచరించే వ్యక్తుల సంఖ్య వంద వరకు చేరేంతగా చెప్పబడింది.

పై హదీసుల వెలుగులో ఇస్లామీయ మానసికత ప్రజల ఒక మహా సమూహాన్ని కాంక్షిస్తుందని ఇట్టే తెలిసిపోతుంది. ప్రజలు ముఠాలుగా– ముస్లింలుగా చీలిపోయి వుండటం ఇస్లాం కాంక్షించదు.

ఒక్కోసారి, ఏకాంతవాసం లాగానే, సామూహిక నమాజుల వల్ల కూడా ప్రజలతో సంబంధాలు ఏర్పడకపోవచ్చు. ఇతర పనులు, ఆదేశాలు కారణంగా కలయికలు కుంటుపడుతాయి. ఈ ప్రమాదాన్ని వెంటనే నివారించుకోవాలి. ప్రజలతో దూరంగా వుండటం వల్ల మంచిని స్థాపించటం – చెడును నిర్మూలించడమనే పవిత్ర విధి నెరవేర్చబడదు. ఇది పలాయనంగా పరిగణించబడుతుంది. లేదా శత్రుమూకల ముందు బలహీనత ప్రదర్శించినట్టు అవుతుంది. ఈ చర్య, ఎన్ని సాకులు చెప్పినా ఆమోదించబడని నేరంగా పరిగణించబడుతుంది.

సంఘంలో విభిన్న మనస్తత్వాలు గలవారు వుంటారు. కొందరు సభల్లో, ఇతర సామూహిక కార్యక్రమాల్లో యిట్టే ముందుకు పోతారు. నవ్వుతూ తమ్ము పరిచయం చేసుకొని, సత్ సంబంధాలను ఏర్పరచుకుంటారు. చిరు దరహాసాలతో ప్రజల్లో కలిసిపోతారు. మరికొందరు దీనికి భిన్నంగా తమ చుట్టూ దట్టమైన గిరిగీసుకొని వుంటారు. ఈ గీతలను దాటడం ఇతరులకు చాలా కష్టమవుతుంది. వారు ఈ గిరి లోపల నుండే అప్రమత్తంగా ప్రజలను చూస్తూ ఉంటారు. ఎవరైనా వారిని పలక రించగోరితే తమ్ముతాము దాచివేస్తారు.

పై రెండు మనస్తత్వాలు గల వారికి ఇస్లాం హేతుబద్ధమైన మార్గదర్శనం చేసింది. కలుపుగోరుతనం నైజంగా కలవారిని ప్రోత్సహిస్తూ తద్వారా ధార్మిక హితోపదేశాలు చేయమని సలహా యిచ్చింది. గిరిగీసుకున్న వారిని మీరు సున్నితమనస్తత్వంతోపాటు ఇతరుల పట్ల దయ, జాలి, ప్రేమ కలిగి వుండాలని హెచ్చరించింది.

ఉపద్రవాలకు, కల్లోలాలకు కడుదూరంగా వుండమని తన అనుయాయులను ఇస్లాం హెచ్చరించింది. ఉపద్రవ సమయంలో ప్రజలు భౌతికవాంఛలకై పరుగు లిడుతూ వుంటారు. ఆ సమయంలో నైతికతకు ఎటువంటి విలువా వుండదు. ఈ

చెడులకు దూరంగా వుండటమే కాదు. వాటిని పారద్రోలడానికి పోరాటం చేయడం ధర్మసమ్మతమవుతుంది. చెడుతో పోరాటం గురించి దైవ ప్రవక్త (స) ఈ క్రింది విధంగా మార్గదర్శనం చేశారు: "చెడును చేతితో వారించగలిగితే చేత్తో వారించాలి. లేదా నోటితో వారించాలి. అదీ సాధ్యం కాని పక్షంలో మనసులో దాన్ని నిరసించాలి."

కల్లోల, ఉపద్రవాలు భయంకరమైన చెడులు. వాటిని చేత్తో ఆపగలిగి వుండీ చేతులు ముడుచుకొని కూర్చోరాదు. నోటితో ఆపే శక్తి ఉన్నప్పుడు మౌనం పాటించడం ధర్మం కాదు. నిరసన తెలియజేస్తూ బాయ్‌కాట్ చేయడమూ ప్రభావశీల మైన ఆయుధంగా ఉపయోగించాలి. నేటి ప్రభుత్వ విధానాల్లో ఈ పద్ధతే ఉప యోగించబడు తుంది. బలహీన వర్గాలు తమపై జరుగుతున్న అన్యాయాలను ఎదిరించాలి. దుర్మా ర్గుడు ఆయుధం ధరించి విర్రవీగుతూ వుంటే అతడిని అతని పద్ధతిలోనే సమాధాన మివ్వాలి. కల్లోల– ఉపద్రవాలను తొలగించే మార్గాలూ, వనరులు, వున్నప్పుడు మౌనంగా వుండటం చాలా పెద్ద నేరం. (ఈ విషయాన్నే ఒక ఆధునిక కవి ఇలా అన్నాడు: "నేరం అధికారమై నేరం చేస్తుంటే - చూస్తూ ఊరుకునే ప్రతి ఒక్కడూ నేరస్తుడే")

దైవప్రవక్త (స)ను ఒక వ్యక్తి ఇలా ప్రశ్నించాడు, "ఓ అల్లాహ్ ప్రవక్తా! మానవుల్లో ఎవరు ఉత్తములు?' దానికి ప్రవక్తశ్రీ (స) "తన ప్రాణాన్ని, ధనాన్ని, ఫణంగా పెట్టి దైవమార్గంలో పోరాడే వ్యక్తి" అని సమాధానమిచ్చారు. 'ఆ తరువాత ఎవరు?' అని ప్రశ్నించడమైంది. అప్పుడు ప్రవక్త(స) (విధిలేని పరిస్థితిలో) కొండల్లో, గుహల్లో దాక్కొని తమ ప్రభువును ఆరాధించేవాడు" అని బదులిచ్చారు. (బుఖారి –ముస్లిం)

ఒక ముస్లిం సమయాన్ని వ్యర్థపర్చకూడదు. ఏకాంతాన్ని కూడా లాభదాయ కంగా మలుచుకోవాలి. కలుపుగోలుతనాన్నీ లాభదాయకంగా చేసుకోవాలి. రెండు పరిస్థితుల్లోనూ లాభపడేలా విశ్వాసి వుండాలి.

## మిత్రుత్వ మర్యాదలు

మర్యాదల పునాదులపైనే మిత్రులను ఎన్నుకోవటం, వారితో సంబంధాలు ఏర్పర్చుకోవటం, లేదా వారిని దూరంగా వుంచటం జరుగుతుంది. మిత్రుత్వ మర్యాదల్లో మొదటి షరతు స్వార్థం, పక్షపాతం వుండకూడదు. సత్యత, చిత్తశుద్ధి

కోసమై ఉండాలి. అది కూడా దైవనిష్ఠ, విశ్వాసాల నీడలో సాగే మిత్రుత్వం మాత్రమే అల్లాహ్ కోసం చేసిన మిత్రుత్వమవుతుంది.

మనిషి తన హృదయంలో విశ్వాసపు దీపం వెలిగించిన వెంటనే, అతని హృదయం ఇస్లామీయ సత్యతల వెలుగుతో దేదీప్యమానమవుతుంది. అతని నోరు తీపివంతమై మానవులందరినీ, ఆ వెలుగులో చూస్తూ మృదుమధురంగా పలకరిస్తాడు. అతడి స్నేహమైనా - ద్వేషమైనా ఆదర్శాల పునాదులపై ఆధారపడి వుంటుంది. నిరాశా నిస్పృహలు- స్వార్థ ప్రయోజనాలపై ఆధారపడి వుండదు.

కొన్ని వర్గాలు, తమ స్వార్థం, స్వలాభాల ప్రాపంచిక సుఖాల కోసం ఒకచోట ఏకం అవుతాయి. ఒక్కోసారి ఈ ఐక్యత చాలా పటిష్టంగా వుంటుంది. అయితే ఈ ఐక్యత, ప్రేమ, అభిమానం, విశ్వాసాల వల్ల జనించే ఐక్యతలా వుండదు.

ఈ కారణంగానే ఇస్లాం శుద్ధ సంకల్ప మిత్రుత్వాన్ని ప్రతిపాదిస్తుంది. ముస్లింలు కేవలం అల్లాహ్ కోసమే స్నేహం చేయాలనీ, అల్లాహ్ కొరకే దానిని కొనసాగించాలని ఈ కృషికి గొప్ప ప్రతిఫల కానుకలు వున్నాయని పేర్కొంది.

దైవప్రవక్త (స) తీర్పుదినాన అల్లాహ్ యొక్క ఒక ప్రకటనను ఇలా తెలిపారు: "నా మూలంగా ప్రేమించేవారు, నా సింహాసనపు నీడలో వుంటారు. ఆ రోజున ఆ నీడ తప్ప మరో నీడ వుండదు." (అహ్మద్)

ఉమర్ ఖత్తాబ్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "దైవప్రవక్తలు కాని, అమరగతులు కాని కొందరు అల్లాహ్ భక్తులు వున్నారు. వారి స్థానాలు చాలా ఉన్నతంగా వుంటాయి. స్వయంగా ప్రవక్తలు, అమరులు కూడా ఈర్ష చెందుతారు" అన్నారు. అందుకా సహచరులు 'వారెవరో మాకు తెలపండి' అని విన్నవించుకున్నారు. అప్పుడు ప్రవక్త(స), "వారు కేవలం దైవప్రీతి కోసమే పరస్పరం ప్రేమించుకునేవారు. ఎటువంటి బంధుత్వం లేక పోయినా పరస్పరం ధన సహాయం చేసుకుంటారు. దైవం సాక్షి! వారి ముఖాలు మిరుమిట్లు గొలిపే కాంతితో వెలుగుతూ వుంటాయి. ఆ రోజు ప్రజలు భయంతో వణుకుతూ వుంటారు. అయితే వీరికి ఎటువంటి భయమూ ఆందోళనా వుండదు. ఇతరులు విచారంగా వుంటారు. అయితే వీరికి ఎటువంటి విచారమూ కలగదు." (అబూదావూద్)

ఆ తరువాత ఈ క్రింది దివ్యఖుర్‌ఆన్ వాక్యాన్ని పఠించారు:

**"విను! అల్లాహ్‌కు స్నేహితులైన వారికి, ఆయనను విశ్వసించి, భయభక్తుల వైఖరిని అవలంబించిన వారికీ ఏ విధమైన భయంగాని, విషాదం కాని కలిగే అవకాశం లేదు." (ఖుర్‌ఆన్, 10 : 62)**

కేవలం అల్లాహ్ కొరకే ప్రేమించే తత్వం అంత త్వరగా అలవడేది కాదు. అల్లాహ్ ప్రేమ ప్రటించబడేదీ కాదు. అందుకు ముందుగా మానవుడు తన నిజ ప్రభువును గుర్తించాలి. దైవాన్ని వాస్తవిక అర్థంలో గుర్తించి, అజ్ఞానాన్ని రోజు రోజుకూ అధికపర్చుకుంటూ సాగాలి. ఆ స్థితిలో అతని దృష్టిలో దైవేతర విషయాలకు ఎటు వంటి స్థానమూ వుండదు. తన సర్వస్వాన్ని అల్లాహ్‌మయం చేసుకుంటాడు. అప్పుడు –ఆ స్థితిలో అతడు కేవలం అల్లాహ్ కొరకే ఎవరినైనా ప్రేమిస్తాడు. లేక ద్వేషిస్తాడు. అలాకాక, ఒకరి వ్యక్తిత్వం, సామర్థ్యం లేదా చరిత్రల కల ప్రభావితమై ప్రేమాభిమా నాలు ప్రదర్శిస్తే అది నిరర్థకమవుతుంది. ఆ వ్యక్తికి దైవప్రేమతో ఎటువంటి సంబంధమూ వుండదు.

ఈ విషయంగా దైవప్రవక్త వివరణ ఈ విధంగా వుంది, "మూడు గుణాలు వున్న వ్యక్తి, విశ్వాసమాధుర్యాన్ని సంపూర్ణంగా పొందగలడు. అతనికి అందరికంటే అల్లాహ్, ఆయన ప్రవక్తలు అత్యంత ప్రియతములై వుంటారు. అతను అల్లాహ్ కొరకే ప్రేమిస్తాడు. అల్లాహ్ కొరకే ద్వేషిస్తాడు. అల్లాహ్‌కు సాటి కల్పించడం కంటే తన్ను తాను అగ్నికి ఆహుతి చేసుకోవడాన్ని ఇష్టపడతాడు." (ముస్లిం)

అంటే ముస్లిం సమాజానికి దైవం పట్ల ప్రేమ విశ్వాసపు ఉత్తమ స్థానంగా ఉంటుంది. ఈ దైవప్రేమ నరనరాల్లో ఉధృతంగా ప్రవహిస్తూ ఉన్నప్పుడే ఉత్తమ ఫలితాలు పొందగలరు. ఆ రెండు మాత్రమే ఉత్తమ స్థానం – అర్హతలు పొందే తత్వం ఉత్పన్నమవుతుంది.

దైవప్రవక్త (స) ప్రవచనం ఇలా వుంది, "ఇరువురు వ్యక్తులు ఒకరికొకరు తెలియకుండానే కేవలం అల్లాహ్ కొరకు మాత్రమే పరస్పరం ప్రేమిస్తే – వారిలో అల్లాహ్‌కు అతిప్రియమైనవాడు. తన మిత్రునికి కూడా అతిప్రియమైన వానిగా వుంటాడు." (తిబ్రాని)

అల్లాహ్ కోసమే పరస్పరం అభిమానించుకునే పై యిరువురు దాసులు అల్లాహ్ రక్షణలో – అభిమానంలో వుంటారు. ఒక హదీసె ఖుదసీలో యిలా వుంది:

"నా కోసం పరస్పరం ప్రేమించుకునే వారి కోసమే నా ప్రేమ నిర్ణయించబడింది. నా కోసమే కలుసుకునేవారి కోసమే నా ప్రేమ నిర్ణయించబడి వుంది. నా కోసమే పరస్పర సంబంధాలను - వ్యవహారాలు చేసే వారి కోసమే నా ప్రేమ తప్పనిసరి అయింది. అదే విధంగా నా కోసమే పరస్పరం మిత్రుత్వం విరిగిన వారికి నా ప్రేమ శాశ్వతంగా విధించడమైంది" అని అల్లాహ్ సెలవిచ్చాడు. (అహ్మద్-తిబ్రాని)

## మంచి-చెడు సహవాసాల ప్రభావం

ఒక స్నేహితునిపై మరో స్నేహితుని ప్రభావం తప్పనిసరిగా వుంటుంది. అందువల్లే స్నేహం చేయటంలో అప్రమత్తంగా వుండి తీరాలి. లోతుగా ఒక వ్యక్తిని పరిశీలించిన తరువాతనే స్నేహానికి హస్తం సాచాలి.

దైవప్రవక్త (స) యిలా సెలవిచ్చారు, "ఒక మిత్రుడు తన మిత్రుని మార్గాన్నే అనుసరిస్తాడు. అందువల్ల తాను ఎవరితో స్నేహం చేస్తున్నాను' అనే విషయాన్ని స్పష్టంగా తెలుసుకోవాలి". (అబూదావూద్)

మిత్రులు-దైవారాధనలు, విధులు, హక్కులు నిర్వర్తించడంలో సహాయంగా వుంటే - చెడులకు, నిషిద్ధాలకు దూరంగా వుంటే - వారు చాలా మంచి స్నేహితులు. ఇటువంటి వారి సహవాసంలోనే వుండాలి. వారి స్నేహాన్నే నిరంతరం కోరుకోవాలి. కాని, తత్ వ్యతిరేకంగా చెడు మార్గాలు అనుసరిస్తూ - చెడుకు గురి చేసే వారైతే పాపకార్యాలకు సహాయపడే వారైతే ఇటువంటి వారి స్నేహాన్నే గ్రక్కన విడిచిపెట్టాలి.

నిజమైన స్నేహితుడు, తన మిత్రునికి ఇహపర లోకాల్లో సాఫల్యం పొందే మార్గాన్ని చూపుతాడు. కాని చెడు స్నేహితుడు కష్టనష్టాలకు గురిచేస్తాడు. ఎంతో మంది ఈ విధంగా చెడు ఫలితాలను చవిచూశారు. ఈనాటికీ పశ్చాత్తాపం చెందుతూ, సిగ్గుపడుతూ వున్నారు.

> **"(తీర్పుదినాన) దుర్మార్గపు మానవుడు తన చేతులను కొరుక్కుంటూ ఇలా అంటాడు, "అయ్యో నేను దైవప్రవక్తకు తోడుగా ఉంటే ఎంత బాగుండేది! అయ్యో నా దౌర్భాగ్యం! నేను ఫలానా వ్యక్తితో స్నేహం చేయకుండా ఉంటే ఎంత బాగుండేది! అతడి మాయలోపడి నేను నా వద్దకు వచ్చిన హితబోధను స్వీకరించలేదు. షైతాను మానవుని విషయంలో నమ్మకద్రోహి అని తేలి పోయింది."**
>
> **(ఖుర్ఆన్, 25 : 27-29)**

ఒక మనిషి శరీరతత్వం మరొకరి శరీరతత్వంతో లబ్ధిపొందుతుంది. మనిషి చాలా త్వరగా ఒక స్నేహితుడిని అనుకరిస్తాడు. అంటురోగాలకు వున్న లక్షణమే నైతికతలోనూ వుంటుంది. మంచి విషయాలు – అలవాట్ల కంటే, చెడు విషయాలు – అలవాట్లే వేగవంతంగా వ్యాప్తి చెందుతాయి. ఉదాహరణకు సిగరెట్ల అలవాటునే మనం తీసుకోవచ్చు. మంచి మాట–విషయం–అలవాటును స్వీకరించడం – అలవర్చుకోవడం ఆలస్యంగానూ, అప్పుడప్పుడు మాత్రమే జరగడం మనకు తెలిసినదే.

ఈ ప్రభావాలు ఫలితాలను దృష్టిలో పెట్టుకునే దైవప్రవక్త (స) మంచి వారితో స్నేహం చేయమని ఉపదేశించారు. ఇంకా, మంచివాని సహవాసం, సుగంధ పరిమళాల వ్యాపారిని పోలి వుంటుందని, అతడు ఏమీ యివ్వకపోయినా, అతని వద్దనున్న పరిమాణం తనంత తానుగా మీ వద్దకు చేరుతుందని వివేకవంతంగా తెలిపారు. అదే విధంగా ఒక చెడు స్నేహితుని పోలికను నిప్పు కుంపటితో పోల్చారు. దాని మసి నుండి తప్పించుకున్నా పొగ వేడి మాత్రం తప్పక తగులుతుందని హెచ్చరించారు. (అబూ దావూద్)

రాత్రి పగళ్ళలో కొంత సమయం మాత్రమే స్నేహం చేసే స్నేహితుని ప్రభావమే ఇంతటి మార్పుకు గురిచేస్తుంటే – జీవితాంతం మనతో వుంటూ – సుఖదుఃఖాలలో తోడునీడగా వుండే వారి ప్రభావం ఎంతటి స్థాయిలో వుంటుందో గదా! మంచివాని సహవాసం మిత్రలాభాన్ని చేకూర్చగా – చెడ్డవాని స్నేహం నీచ అవమానకర నష్టాలకు గురి చేస్తుంది.

**"దుర్మార్గులు ఒకరికొకరు సహాయకులు. భయభక్తులు కల వారికి అల్లాహ్‌యే స్నేహితుడు. దూరదృష్టితో నిండివున్న ఈ దివ్య(గ్రంథ) కాంతులు ప్రజలందరికోసం. నమ్మేవారికి మార్గదర్శకత్వం. కారుణ్యమూ"**

***(ఖుర్‌ఆన్, 45 : 19–20)***

స్నేహం యొక్క పునాదులు విశ్వాసం, సత్కార్యాలు, పరిశుద్ధతలపై ఆధారపడి వుండాలి. మిత్రుల ప్రేమను, సహవాసాన్ని, ఇహపరలోకాల సాఫల్యానికి మార్గంగా రూపొందించుకునే వాడు ఉత్తముడు. ఇటువంటి వ్యక్తి గురించి దైవప్రవక్త (స) ఈ క్రింది విధంగా శ్లాఘించారు:

"ప్రజల వ్యవహారంలో వారిపై దౌర్జన్యం చేయనివాడు అసత్యం పలకక మౌనం

పాటించేవాడు, వాగ్దానం చేసి దానిని నెరవేర్చేవాడు, పరిపూర్ణ ఉత్తమగుణాలు కలవాడు. న్యాయశీలుడు, ధర్మపరాయణుడు, ఇటువంటి వారితో స్నేహం తప్పనిసరిగా చేయాలి."

అల్లాహ్ ప్రీతి కొరకు చేసే స్నేహంలో దైవ విధేయత తప్పనిసరి షరతుగా వుంటుంది. అప్పుడే అది అభివృద్ధి చెందుతుంది. సహవాసంలో వున్న ఇరువరూ కాపట్యానికి, కుట్రలకూ దూరంగా మెలగాలి. ఇరువురిలోనూ దైవవిధేయత తొణికిసలాడుతూ వుండాలి. ఈ తొణికిసలే హృదయాలను మార్చివేస్తాయి. అలాకాని పక్షంలో వారి హృదయాలు అవిధేయతకు గురై హృదయాలు కల్మషంతో నిండి పోతాయి. ఒక ప్రవచనంలో యిలా వివరించబడింది :

"ఎవరి చేతిలో నా ప్రాణం వుందో ఆ శక్తి సాక్షి! ఇద్దరు మిత్రులు విభేదాలకు గురై వేరైపోతే, అందుకు కారణం ఏదో ఒక పాపకార్యం అయి వుంటుంది. వారిద్దరిలో ఒకరు దానికి పాల్పడి వుంటారు."

ఈ కారణంగానే దైవప్రవక్త (స) సహచర సమాజం సత్యబోధన, సహన బోధనలకు సహాయకారిగా, శాశ్వత రక్షణ ప్రసాదించే ఆచరణగా–మిత్రుత్వ సంబం ధాలను, వారి పట్ల ప్రేమాభిమానాలను ప్రతిపాదించారు. దైవ క్షమాపణలు పొందే మార్గంగా భావించారు.

"అబూ ఖతాద (రజి) ఉల్లేఖనం ప్రకారం: 'ఇద్దరు వ్యక్తులు బజారులో కలిశారు. అది ప్రజల ఏమరుపాటుకు గురై వున్న కాలం. వారిలో ఒక వ్యక్తి 'రండి' మనం అల్లాహ్ క్షమాపణ–శరణుకోరుదాం!' అన్నాడు. ఇద్దరూ కలిసి అలాగే చేశారు. ఆ తరువాత వారిలో ఒకడు మరణించాడు. రెండవ వ్యక్తి స్వప్నంలో మరణించిన వ్యక్తి కనపడి 'ఈ రోజున అల్లాహ్ మనల్ని క్షమించివేశాడు' అని తెలిపాడు. (ఇబ్నె అబీదినియా)

అనస్ బిన్ మాలిక్ (రజి) ఉల్లేఖనం ప్రకారం: అబ్దుల్లాహ్ బిన్ రవాహ (రజి), ప్రవక్త సహచరుల్లో ఎవరితోనైనా కలిస్తే, 'రండి కొంత సమయం మనం మన ప్రభు వును వేడుకుందాం. ఆయన్ను విశ్వసిద్దాం! (విశ్వాసాన్ని తాజా పర్చుకుందాం)!' అని అనేవారు. ఈయన ప్రవర్తనకు ఒక వ్యక్తి ఆగ్రహించి దైవప్రవక్త (స) వద్ద ఫిర్యాదు చేశాడు. 'ఎల్లప్పుడూ విశ్వాసం కలిగి వుండక – 'కొద్దిసేపు విశ్వసిద్దాం' అని అంటు

న్నారు అని విమర్శించాడు. అందుకు ప్రవక్త శ్రీ(స) "ఇబ్నె రవాహపై అల్లాహ్ కారుణ్యం మరియు గాక, దైవదూతలు గర్వించే సభలంటే అతనికి ఎంతో యిష్టం" అని అన్నారు." (అహ్మద్ – తిబ్రాని)

## స్నేహానికి సరైన సూత్రాలు

మిత్రుడు పరస్పరం తమ అభిప్రాయాలను కలబోసుకోవాలి. ఒకరి అలవాట్లు అభిరుచులు తెలుసుకోవాలి. తద్వారా ఒకరికొకరు సరిగా పరిచయం చేసుకోవాలి. అప్పుడే వారిరువురి హృదయాలలో పరస్పరం ప్రేమ, సోదరభావం, అభిమానాలు కలుగుతాయి. తాను అతని పట్ల గల అనుబంధాన్ని వ్యక్తం చేయాలి. దైవ ప్రవక్త (స) ఉపదేశం యిలా వుంది:

"మీలో ఎవరైనా, ఎవరినైనా స్నేహంతో ప్రేమిస్తే, అతన్ని మీరు ప్రేమిస్తున్నారని, అతనికి తెలియపర్చాలి" (అహమద్)

అనస్ (రజి) కథనం ప్రకారం, ఒక వ్యక్తి దైవప్రవక్త (స) వద్ద కూర్చొని వున్నాడు. అటువైపు నుండి మరో వ్యక్తి వెళుతూ, 'ఓ దైవప్రవక్తా! నేను ఇతనిని ప్రేమిస్తున్నాను" అని చెప్పాడు. అందుకు ప్రవక్తశ్రీ "ఈ విషయం నీవు అతనికి తెలియపర్చావా?" అని అడిగారు. అందుకు అతడు 'లేదు' అని సమాధానమిచ్చాడు. అప్పుడు ప్రవక్తశ్రీ, "నీవు అతనిని ప్రేమిస్తున్నానని అతనికి తెలియపర్చు" అని సమాధానమిచ్చారు" (అబూదావూద్)

మరో ప్రవచనంలో ఇలా చెప్పబడింది, "ఎవరైనా, ఎవరినైనా అభిమానిస్తూ వుంటే అతని పేరు అతని తండ్రి పేరు, అతని వంశం, కుటుంబం గురించి తెలుసుకోవాలి. ఇది ప్రేమాభిమానాలను దృఢంగా వుంచుతుంది." (తిర్మిజి)

బంధుత్వాల – ప్రేమాభిమానాల పటిష్ఠతలో ఆలోచనల్లో, భావజాలాల్లో ఏకాభిప్రాయం ప్రధానపాత్ర పోషిస్తాయి.

ప్రజలు అనేక రకాలుగా వుంటారు. మీకు ఎవరితో పరిచయం అయితే వారికి దగ్గర అవ్వండి. పరిచయం కాని వారిని వదిలిపెట్టండి." అని ప్రవక్త శ్రీ ఉపదేశించారు. (బుఖారి)

అయితే ఉత్తేజకర సహవాసానికి విశ్వాసాలు, నైతికతలు మాత్రమే ఇంధనంగా

పని చేస్తాయి. ఈ ఉత్తేజపు ఇంధనం ద్వారానే ఒక విశ్వాసి తన హృదయానికి మార్గ దర్శనం అందిస్తాడు. దైవప్రీతిని కాంక్షిస్తూ ఈ ఆశయాల కోసం, తనలాంటి విశ్వాసం తోనే జీవిస్తున్న ఇతరులను కూడా అభిమానిస్తాడు. వారు సుదూరాలలో వున్న వారైనా, కాలంతోపాటు వెళ్ళిపోయిన వారైనా వారిని ప్రేమిస్తాడు. తన ద్వేషానికి సైతం ఈ అంశాలనే పునాదిగా కలిగి వుంటాడు. తద్వారానే ఈ వ్యక్తికి ఉన్నత స్థానాలు ప్రాప్తమవుతాయి.

"అబూజర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, ఒక వ్యక్తి దైవప్రవక్త (స)ను 'ఓ దైవప్రవక్తా! ఒక వ్యక్తి కొంతమంది పట్ల ప్రేమాభిమానాలు కలిగి వుండడు. కాని వాటిని ఆచరణాత్మకంగా ప్రకటించే శక్తి అతనికి వుండదు' అని అనుమానం వెలిబుచ్చాడు. దానికి ప్రవక్తశ్రీ (స) 'ఓ అబూజర్! నీవు ప్రేమించే వారితో (అనగా వారి ఆచరణతో) నీవూ వుంటావు అని బదులిచ్చారు. (తిర్మిజి)

స్నేహం, సహవాసాల పరిరక్షణకు పరస్పరం తరచుగా కలుస్తు వుండటం ఇస్లామీయ సాంప్రదాయంగా వుంది. ఈ కలయికకు ప్రేరణ కేవలం అల్లాహ్ ప్రీతి అయి వుండాలి.

'అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) యిలా తెలిపారు: 'ఒక వ్యక్తి మరో ఊరిలో వున్న తన మిత్రుడిని కలవడానికి వెళుతున్నాడు. అల్లాహ్ ఆజ్ఞతో దైవదూత ఈ వ్యక్తిని కలిసి "ఎక్కడికి, ఎందుకు వెళుతున్నావు' అని అడిగాడు. అందుకు ఆ వ్యక్తి 'నేను ఫలానా వ్యక్తిని కలవడానికి వెళుతున్నాను' అని చెప్పాడు. అందుకు ఆ దైవదూత "నీపై ఆ వ్యక్తి ఉపకారం వుందా? 'లేదు' నీవు దాని ప్రతిఫలం చెల్లించడానికి వెళుతున్నావా?" అని ప్రశ్నించాడు. అందుకు ఆ వ్యక్తి 'లేదు' నేను కేవలం అల్లాహ్ కోసం అతనిపై అభిమానంతో అతనిని కలవడానికి వెళుతున్నాను' అన్నాడు. అప్పుడు ఆ దేవదూత నేను అల్లాహ్ రాయబారిని, నీకు శుభవార్త అందజేయ డానికి వచ్చాను. నీవు కేవలం అల్లాహ్ కోసం ఆ వ్యక్తిని ప్రేమించావు. కనుక అల్లాహ్ నిన్ను తన సన్నిహితుల్లో చేర్చుకున్నాడు" అని పలికాడు. (బుఖారి)

పై సంకల్పంతో వేసే ప్రతి అడుగూ, దైవమార్గంలో వేసే అడుగుల్లా శుభకర మైనవి. ప్రతిఫలాన్ని అందించేవీ అయి వుంటాయి.

దైవప్రవక్త (స) ఇలా నుడివారు: "రోగిని పరామర్శించడానికి లేదా తన

సోదరుల్లో ఒకరిని కేవలం అల్లాహ్ ప్రీతికోసం కలవడానికి వెళితే ఒక ఎలుగెత్తి చాటే వాడు (దైవదూత)" శుభం కలుగుగాక! నీవు చాలా అదృష్టవంతుడివి. నీవు స్వర్గంలో ఒక ఇల్లు నిర్మించుకున్నావు" అని చాటుతాడు. (అబూదావూద్)

"మరో ప్రవచనంలో ఇలా వుంది : ఒక వ్యక్తి దైవప్రీతి కోసం తన సహవాసిని అయిన సోదరుడ్ని కలవడానికి వెళ్ళినప్పుడల్లా ఆకాశం నుండి 'నీకు శుభం కలుగుగాక' స్వర్గం నీకు ప్రసాదించబడుగాక !అని ప్రకటిస్తాడు. విశ్వసింహాసనా రూఢి అయిన అల్లాహ్ "నా దాసుడు నా కోసం కలవడానికి వెళ్ళాడు. నాపై అతని ఆతిథ్యం తప్పనిసరి అయింది. ఈ నా దాసునికి స్వర్గం కంటే చిన్నదైన ప్రతిఫలం ఇవ్వడానికి నేను ఒప్పుకోను" అని ప్రకటిస్తాడు. (ముస్లిం)

ఒక ముస్లిం మానవులందరి మేలును కోరుతాడు. మిత్రుల కోసం మరింత ఎక్కువగా కోరాలి. వారి లాభానికి తాను సంతోషించాలి. లాభం సోదరుని జ్ఞప్తికి తెచ్చే సాధానంగా వుండాలి.

> **"పరస్పర వ్యవహారాలలో ఔదార్యం చూపడం మరువకండి. మీరు చేసే పనులను అల్లాహ్ చూస్తున్నాడు." (ఖుర్ఆన్, 2 : 237)**

"మిత్రులు, స్నేహితులు అయిన వారు పరస్పరం కానుకలు, జ్ఞాపికలు యిచ్చి పుచ్చుకుంటూ వుండాలి. ఈ సత్ చర్య వల్ల పరస్పర హృదయాలలో వున్న అసూయ నశిస్తుంది. (తిర్మిజీ)

"విశ్వాసుల మాతృమూర్తి ఆయిషా (రజి) ప్రకారం, "దైవప్రవక్త (స) కానుకలు స్వీకరించేవారు, కానుకలు పంపిస్తూ వుండేవారు." (బజ్జార్)

స్నేహం, మిత్రుత్వపు హక్కుల నెరవేర్పులో అతి ప్రవర్తన మంచిది కాదు. ఇస్లాం 'అతి'ని అసహ్యించుకుంటుంది. ప్రతి పనిలోనూ సౌలభ్యాన్ని కోరుతుంది. అనవసర కష్టనష్టాలను ఇస్లాం ఆహ్వానించదు... బోధించదు కూడా. మిత్రుత్వంలో స్థిరత్వం, గాఢత సాధించడానికి అవసరమైన ఉత్తమ పద్ధతులు ఉపయోగించాలి.

"తన స్నేహితుని మంచిని కాంక్షించే వారే ఉత్తుములు. అదే విధంగా తమ పొరుగు వారి పట్ల మంచిగా ప్రవర్తించేవారే ఉత్తములు" అని దైవప్రవక్త (స) బోధించారు." (హాకిం)

స్నేహాన్ని పటిష్ఠపర్చుడానికి, తమ తల్లిదండ్రుల, సోదరుల, బంధువుల భోజనాల బంతిలో పాల్గొనే విధంగానే మిత్రుల భోజనాల్లోనూ పాల్గొనమని ఇస్లాం సూచించింది :

**"మీరు మీ ఇంట్లో తిన్నా, మీ తండ్రీ తాతల ఇళ్లల్లో తిన్నా, మీ తల్లీ నాయనమ్మల ఇళ్లల్లో, మీ సోదరుల ఇళ్లల్లో లేదా మీ సోదరీమణుల ఇళ్లల్లో లేదా మీ తండ్రుల సోదరుల ఇళ్లల్లో లేదా మీ మేనత్తల ఇళ్లల్లో లేదా మేనమామల ఇళ్లల్లో లేదా మీ పిన్నమ్మల, పెద్దమ్మల ఇళ్లల్లో లేదా తాళపు చెవి మీ అధీనంలో ఉన్న ఇళ్లల్లో లేదా మీ స్నేహితుల ఇళ్లల్లో తిన్నా మీకు ఏ ఆక్షేపణా ఉండదు."**

***(ఖుర్‌ఆన్, నూర్-61)***

స్నేహానికి ఇంతటి ప్రాముఖ్యత యివ్వబడటం పెద్ద ఆశ్చర్యకర విషయమేమీ కాదు. ఎందుకంటే ఇస్లాంలో ఈ సంబంధానికి చాలా ఔన్నత్యం వుంది. నరక శిక్షల నుండి తప్పించుకునే మార్గం ఏదైనా వుండి వుంటే – అది సోదరుని ద్వారా సాధ్యమవుతుందని నమ్మవచ్చు. కపటులు నరకంలో శిక్షలను అనుభవిస్తూ సంభాషించే మాటలను అల్లాహ్ తన గ్రంథంలో యిలా తెలిపాడు:

**"దైవం సాక్షి! మేము స్పష్టమైన మార్గభ్రష్టత్వానికి లోనయ్యాము. మమ్మల్ని మార్గం తప్పించిన వారు నిజంగానే అపరాధులు. ఇప్పుడు మాకు సిఫారసు చేసేవాడు గాని, స్నేహితుడుగాని ఎవడూ లేడు" (ఖుర్‌ఆన్, 26 : 97 -101)**

స్నేహ సంబంధాల హక్కుల నెరవేర్పుకు ఇస్లాంలో చాలా ప్రాముఖ్యత, ప్రాధాన్యత వుంది. దైవప్రవక్త ముహమ్మద్ (స) ఇలా ప్రవచించారు :

"విశ్వాసులతోనే స్నేహం చేయండి. మీ భోజనం దైవభీతిపరులే భుజించాలి" అని దైవప్రవక్త సెలవిచ్చారు. (అబూదావూద్)



# 23వ భాగం

# (భయభీతులు)
# వ్యక్తిత్వ దర్పం-దాని ప్రభావం

- గౌరవం - అవమానాల నిర్వచనం
- తిరస్కారుల పట్ల కాఠిన్యం
- విశ్వాసి ఉక్కు మనిషిలా వుండాలి
- అవమాన పరాభవాలకు కారణాలు

# గౌరవం - అవమానాల నిర్వచనం

మానవులపై అధికారం చెలాయించే ప్రభుసత్తాక గొప్పతనం కేవలం మనిషిని సృష్టించిన విశ్వ ప్రభువు అల్లాహ్‌కు మాత్రమే ఉంది. ఆయనే మన విధిని నిర్ణయించాడు. సృష్టిలో సంతులనాన్ని సృష్టించాడు. రుజుమార్గమూ చూపించాడు. ఆయన శక్తి దేదీప్యమానమైన శక్తిగా మెరుస్తూ మనముందు ఆవిష్కరింపపడుతుంది. ప్రచండశక్తివంతమైన ఆయన మెరుపు - వెలుగులను చూచి మానవ మేదస్సు వెలవెలపోతుంది.

> **"అల్లాహ్ మాత్రమే స్తుతిపాత్రుడు. ఆయన భూమికీ, ఆకాశాలకూ ప్రభువు, సకల లోకాలకూ ప్రభువు. భూమ్యాకాశాలలో ఘనత ఆయనకు మాత్రమే చెందుతుంది. శక్తిమంతుడూ, వివేకవంతుడూ ఆయన మాత్రమే."**
>
> ***(ఖుర్ఆన్, 45 : 36-37)***

దాసులు తమ ప్రభువు ముందు దీనత్వాన్ని ప్రదర్శించడం, అణుకువ కలిగి వుండటం లాంటి ఆచరణలన్ని సత్యం ముందు తలవంచడంగా వుంటాయి. సృష్టించడం, ఆదేశించడం, నిరపేక్ష, అధికారాలు అన్నీ విశ్వప్రభువు అల్లాహ్‌కు మాత్రమే చెందుతాయి. దాసుని మంచి చెడులు కూడా ఆయన పర్యవేక్షణలో వున్నవే. దాసుడు నమాజ్‌లో సజ్దా స్థితిలో ఉన్నప్పుడు పరమ పరిశుద్ధునిగా, ఉత్తమునిగా వుంటాడు. ఎందుకంటే తన నిజప్రభువు, సృష్టికర్తకు చెందిన హక్కును ఆయనకు సమర్పిస్తున్నాడు. ఈ సమర్పణలో అతిశయోక్తికి పాల్పడడు.

కాని, మానవులు తమలాంటి మానవుల ఎదుట సాష్టాంగపడటం, అధర్మం దౌర్జన్యం కూడాను. తన గొప్పతనాన్ని ప్రదర్శించే వ్యక్తి అత్యంత అహంకారి, అధర్మానికి పాల్పడేవాడవుతాడు. తన గురించి లేనిపోని గొప్పలకు పోతాడు. అదే విధంగా ఇతరుల ముందు సాష్టాంగ పడేవాడు తాను మానవుడైన కారణంగా తనకు వున్న ప్రాముఖ్యతను గుర్తించడం లేదు. విశ్వప్రభువుకు చెందవలసిన దాస్యాన్ని. దాని భద్రతను ఇతరులకు చెల్లించడం చేస్తున్నాడు. ఈ కారణంగానే ఇస్లాం మనిషిపై మరో మనిషి ఆధిపత్యాన్ని నిషేధించింది. అందుకు మానవులపైన గర్వం, అహంకారాలను నిరోధించింది. అవమాన-అహంకారాలను నిషేధించిన ఇస్లాం - మనషులందరికి గౌరవ-మర్యాదలను తప్పనిసరి చేసింది.

**"ఆవగింజంత గర్వం వున్నా, అల్లాహ్ ఆ వ్యక్తిని నరకంలో పడవేస్తాడు"** అని దైవప్రవక్త (స) హెచ్చరించారు." (అహ్మద్)

మరో ప్రవచనంలో ఒక వ్యక్తి డాబుసరి దుస్తులు ధరించి, లోలోన గర్వ పడుతూ వెళుతున్నాడు. తల దువ్వుకొని అందంగా తయారై తన నడకలో సైతం తదనుగుణమైన దర్పం-అహంకారం కనపడుతుంది. అల్లాహ్ ఆ వ్యక్తిని భూమిలో కూరుకొనిపోయినట్లు చేశాడు. (అనగా ప్రళయదినాన అవమానించబడతాడు) తీర్పుదినం వరకు ఆ వ్యక్తి భూమి లోతుల్లోకి కూరుకొని పోతూనే వున్నాడు." (బుఖారి)

ఈ విధంగా ఎందుకు జరగుదంతంటే దర్పం-గొప్పతనాలు, అనేవి కేవలం దేవుని గుణ విశేషణాలు. అవి ఆయనకే శోభిస్తాయి. మానవులకు ఇవి ధర్మసమ్మతం కావు. అల్లాహ్ హక్కులలో ఆయన గుణ విశేషణాలలో వ్రేలుపెట్టే హక్కు మానవ మాత్రునికి ఎంతమాత్రమూ లేదు. దర్పం, గొప్పతనం, ప్రదర్శించడం అంటే మనిషి సత్యాన్ని తిరస్కరించడమే అవుతుంది. ఈ చర్యలు అజ్ఞానంతో, అతిక్రమణకు పాల్పడి, హద్దులను దాటడంగా, ఇతర మానవుల పట్ల చులకన భావం కలిగినవిగా వుంటాయి.

అదే సమయంలో విశ్వాసులు తమ్ముతాము చులకనగా, హీనులుగా భావించ డాన్ని ఇస్లాం నిషేధించింది. ఇతరులతో పోల్చుకొని తమ్ముతాము చులకన పర్చుకోవ డాన్ని ఖండించింది.

అనస్ బిన్ మాలిక్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) 'ప్రాపంచిక అవసరాలు పొందడంలో (ఇతరులతో పోల్చుకొని) విచారాన్ని వ్యక్తం చేసినవాడు తన ప్రభువు అల్లాహ్ పట్ల అయిష్టత వ్యక్తం చేసినవాడవుతాడు. ధనవంతుని సంపదను చూచి తన దీనత్వాన్ని ప్రదర్శించేవాడూ దైవ అయిష్టతకు గురి అవుతాడు. ఖుర్ఆన్ గ్రంథాన్ని పొందిన తరువాత కూడా నరకవాసిలా ఆచరణ చేసేవాడు దైవకారుణ్యా నికి దూరమవుతాడు" అని సెలవిచ్చారు. (తిబ్రాని)

మరో ఉల్లేఖనంలో ఇలా హెచ్చరించడమయింది, "ధనవంతులతో కూర్చొని, అతని దర్పాన్ని తనతో పోల్చుకొని, తన దీనత్వాన్ని ప్రదర్శించే- చింతించే వ్యక్తి నుండి అతని ధర్మం 2/3 వంతు హరించిపోతుంది. అతడు నరకవాసి అవుతాడు."

కష్టాలు, దుఃఖాలల్లో కేకలు పెడబొబ్బలు పెట్టేవారు, ధనవంతుల చెవులు నాకే

వారికి పై హదీసులో గొప్ప హెచ్చరిక ఉంది. కోరినంత సంపాదన లభించనందుకు బాధపడటం తప్పుకాదు. కాని, అది తన దౌర్భాగ్యానికి కారణమని తాను దరిద్రుడని భావించడాన్ని ఇస్లాం అనుమతించదు. ప్రాచీన యుద్ధ రంగంలో గాయాలను భరించడం చికిత్సానంతరం నూతనోత్తేజంతో మరలా రంగంలోకి దుమకడాన్ని వీరత్వానికి చిహ్నంగా వుండేది. ఓటమిని అంగీకరించి చతికిలబడిపోవడం, ఇతరులు వచ్చి లేపుతారని ఎదురు చూడటం భీరువుకు గుర్తు అవుతుంది.

ఒక ప్రవచనంలో ఇలా ఉంది: ఎవరైతే అవమానాన్ని స్వయంగా కోరుకున్నాడో దానిని సహిస్తున్నాడో, వాడు మనలోని వాడుకాడు" అని దైవప్రవక్త (స) పలికారు.

ఇస్లాం తన అనుయాయులను, గౌరవ మర్యాదలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉన్న ప్రాంతంలోనే నివసించమని సలహా యిస్తుంది. ఈ హక్కులు లేని ప్రాంతం నుండి వెళ్ళిపోవడం మంచిదని సూచిస్తుంది. అల్లాహ్ ఆదేశం యిలా ఉంది:

**తమ ఆత్మలకు అన్యాయం చేసుకుంటూ ఉండేవారి ప్రాణాలను తీసి, దైవ దూతలు వారిని, "ఇదేమిటి మీ స్థితి ఇలా ఉందీ?" అని అడిగారు. అప్పుడు వారు ఇలా సమాధానం చెప్పారు: "మేము భూమిపై బలహీనులుగా, నిస్సహాయులముగా ఉండేవారము." దైవదూతలు "అల్లాహ్ భూమి విశాలంగా లేదా మీరు వలస పోవటానికి?" అని అడిగారు. వారి నివాసం నరకం. అది మహాచెడ్డ నివాసం. (ఖుర్ఆన్, 4 : 97)**

అదే సమయంలో ఈ వలసవెళ్ళి తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల హక్కును పరిరక్షించుకునే శక్తిలేని స్త్రీలు-పిల్లలు- ఇతర నిస్సహాయులను మినహాయించడమైంది.

**"నిజంగానే బయలుదేరటానికి ఏ మార్గమూ- ఏ సాధనా సంపత్తీ లేని పురుషులను, స్త్రీలను పిల్లలను అల్లాహ్ క్షమించవచ్చు." (ఖుర్ఆన్ 4 : 98-99)**

పైవాక్యం ద్వారా అవమానాన్ని, పరాభవాన్ని భరించడం ఎంతటి నీచకార్యమో తెలుస్తుంది. మనిషి వీటి నుండి తన్నుతాను శిక్షించుకోవడానికి సాధ్యమైనంత కృషి చేయాలి.

తనను, తన ధర్మాన్ని, తన నిజప్రభువు అయిన అల్లాహ్ గౌరవాన్ని కాపాడటం ఒక విశ్వాసి యొక్క విశ్వాసానికి గుర్తులుగా వుంటాయి. విశ్వాసి - అవిశ్వాసుల గౌరవ

మర్యాదల్లో భూమ్యాకాశాల వ్యత్యాసం వుంటుంది. బలం, అధికార దర్పంగల వ్యక్తి ముందు తన్ను తాను హీన దృష్టితో చూసుకోవడం ఒక విశ్వాసికి తగనిది. అదే విధంగా ఇతరుల ముందు, లేక ఇతరుల ద్వారా జరిగే అవమాన పరాభవాలను భరించడానికి ఒక విశ్వాసి యొక్క విశ్వాసం అనుమతించదు. అవిశ్వాసం అవిధేయతకు దూరంగా వుండటంతోపాటు – అవమాన పరాభవాలకూ దూరంగా వుండాలి.

> **"అల్లాహ్ మాత్రమే గౌరవానికి పూర్తిగా అర్హుడనే విషయాన్ని గౌరవాభిలాషి అయిన ప్రతివాడూ తెలుసుకోవాలి. ఆయన వద్దకు అధిరోహించే వస్తువు పరిశుద్ధ వాక్కు మాత్రమే, సత్కర్మ దానిని పైకి ఎక్కిస్తుంది. ఇక కుతంత్రాలు చేసేవారు, వారికైతే కఠిన శిక్ష పడుతుంది. వారి కుతంత్రం దానంతట అదే నాశనమైపోతుంది."** ***(ఖుర్ఆన్, 35 : 10)***

## తిరస్కారుల పట్ల కాఠిన్యం

గౌరవం, ఆత్మాభిమానం, ఆదరణ, అవగాహనలు చాలా ఉత్తమ గుణాలు. ఈ గుణాలను ఇస్లాం ప్రోత్సహించింది. ఉత్తమ సమాజ నిర్మాణంలో ఈ లక్షణాలకు పునాది స్థానం ఇచ్చింది. ఈ గుణాల అభివృద్ధికి, ఆచరణకు అవసరమైన విశ్వాసాలు, బోధన ఉపదేశాలు, చట్ట ఆదేశాలూ యిచ్చింది. ఈ విశేష గుణాల విషయాలను వివరిస్తూ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) తన దైన శైలిలో "అవమానాలకు పరాభవాలకు గురి చేయబడి వెంటనే గొంతెత్తి దాన్ని తిరస్కరించే వ్యక్తి అంటే నాకు చాలా యిష్టం." అని చెప్పారు.

ప్రతిరోజూ ఐదు పూటలూ ముఅజ్జిన్ గొంతెత్తి అల్లాహ్ మహోన్నతను (తక్బీర్) చాటుతాడు. ఎందుకు? నమాజ్‌లో ఈ తక్బీర్ ప్రకారం నిలబడటం, వంగటం, కూర్చోవటం, సాష్టాంగపడటం ఎందుకు?

ఈ ఆచరణ ద్వారా ఒక విశ్వాసి తనకు అల్లాహ్ తప్ప మిగిలిన వారందరూ ఆయన ముందు అల్పులని తెలియపరుస్తాడు. తద్వారా ఒక విశ్వాసి తన జీవిత వ్యవహారాల్లో అస్థిరతకు గురి కాకుండా వుండాలి.

అల్లాహ్ యొక్క సర్వోన్నత వాస్తవికతను తెలియపర్చడానికి ఆయన గుణ విశేషణాలను తెలియపర్చడం జరిగింది. వాటినే అస్మా ఉల్ హుస్నా (సర్వ సుందర

నామాలు)గా పేర్కొనబడ్డాయి. ఈ నామాల నుండి కొన్నింటిని ఒక విశ్వాసి రుకూ, సజ్దాలలో వల్లిస్తూ అల్లాహ్ యొక్క సర్వోన్నతను ప్రకటిస్తూ, కొనియాడుతూ వుంటాడు.

గౌరవం ప్రతి ఒక్కరి జన్మహక్కు. దాన్ని ఎలాగైనా సాధించి తీరాలి. ఈ గౌరవ పరిరక్షణకు మనిషి నిరంతరం జాగరూకుడై శ్రమించాలి. గౌరవాన్ని పోగొట్టుకునే చర్యలకు పాల్పడకూడదు. బాధ్యతలు అప్పగిస్తే ఇతరులు వేలెత్తి చూడని విధంగా వాటిని పూర్తి చేయాలి. శత్రువులు కూడా మెచ్చుకునేలా మన బాధ్యతలను నిర్వర్తించాలి.

"మంచి పనులు చేసిన వారికి మంచి బహుమానాలు లభిస్తాయి. ఇంకా ఎక్కువ అనుగ్రహం లభిస్తుంది. వారి ముఖాలను నల్లదనం గానీ, అవమానం గానీ కప్పివేయవు. వారు స్వర్గానికి అర్హులు, అక్కడనే శాశ్వతంగా ఉంటారు. చెడులు సంపాదించుకున్నవారు తమ చెడులాంటి ప్రతిఫలాన్నే పొందుతారు. అవమానం వారిని కప్పివేస్తుంది. అల్లాహ్ నుండి వారిని రక్షించేవాడెవడూ ఉండడు. వారి ముఖాలను చీకటి కప్పివేస్తుంది, రాత్రి యొక్క నల్లని తెరలు వారిపై పడి ఉన్నట్లు. వారు నరకానికి అర్హులు. అక్కడనే వారు శాశ్వతంగా ఉంటారు. (ఖుర్ఆన్ 26-27)

పై బోధనల వల్ల ఒక ముస్లిం యొక్క గౌరవ మర్యాదల చిరునామా తెలుస్తుంది. అల్లాహ్ మరోచోట ఈ క్రింది విధంగా తెలిపాడు :

**"తమపై దౌర్జన్యం జరిగినప్పుడు దానిని ఎదుర్కొంటారు. చెడుకు ప్రతిక్రియ అదేరకమైన చెడు. కాని ఎవడైనా క్షమించి రాజీపడితే దానికి ప్రతిఫలం యివ్వటం అల్లాహ్ బాధ్యత. అల్లాహ్ దుర్మార్గులంటే ఇష్టం చూపడు."**

***(ఖుర్ఆన్, 10 : 39-40)***

తనకంటే బలహీనుడైన వ్యక్తిపై కోపం కలిగినప్పుడు అతనిని క్షమించడం నైతికత యొక్క షరతు. అలాకాక ఒక దుర్మార్గుడు, దుర్మార్గంకై పరుగిడుతుంటే - తనపై దుముకుతూ ఉంటే దానిని ఎదుర్కొనే శక్తి కలిగి వుంటే ఒక విశ్వాసి ఆ దుర్మార్గుడికి తగిన గుణపాఠం నేర్పవలసి వుంటుంది. అతని పొగరు, గర్వం, మొత్తాన్ని అణిచివేయవలసి వుంటుంది. అతని కళ్ళు ఊడిపోవాలి. అతని డాపు, దర్పం, బూటకపు గౌరవం పటాపంచలు అయిపోవాలి.

ఒక ముస్లిం తన శక్తియుక్తులను ప్రదర్శించి నేరస్తులను, దుర్మార్గులను భయ

పెట్టాలి. శక్తి వున్నప్పటికీ క్షమించి వదిలివేయటం ఉత్తమ లక్షణం. ఈ క్షమాగుణం కూడా దుర్మార్గులకు గుణపాఠంలా వుండాలి.

పేర్కొనబడిన వాక్యాలలో రెండు రకాల నైతిక శిక్షణ యివ్వబడింది. అపరాధుల అపరాధాలను మన్నించడం ఉత్తమ నైతికంగా పేర్కొనడం జరిగింది. అదే సమయంలో నేరగాళ్ళను అవసరమైతే చట్టం ముందు నిలబెట్టడం, అతనికి శిక్ష పడేలా చేసి తగిన ప్రతీకారం జరగాలని చెప్పడం జరిగింది. తద్వారా నేరుస్తులు, దుర్మార్గులకు అవమానం, పరాభవం జరుగుతుంది. విశ్వాసుల -మంచి మనుషుల గౌరవ మర్యాదల్లో వృద్ధి జరుగుతుంది.

## విశ్వాసి ఉక్కు మనిషిలా వుండాలి

మనిషి నైజంలో లోపాలు, బలహీనతల లక్షణాలు సహజంగా వుంటాయి. కొన్ని సందర్భాలలో తన జీవిత అవసరాల పరిపూర్తి కోసం తత్ సంబంధిత వ్యక్తుల ముందు దీనంగా, చేతులు చాస్తూ నమ్రతగా ప్రవర్తిసాడు. ఈ చర్యవల్ల అతని ఆత్మ గౌరవానికి గాయమవుతుంది. ఈ కారణంగానే మానవ మహోపకారి ముహమ్మద్ (స) ఇటువంటి విషయాల్లో మనిషి బలహీనపడకూడదని, వ్యక్తిత్వాన్ని ఉక్కులా దృఢంగా తీర్చిదిద్దుకోవాలని ఉపదేశించారు.

"మీ అవసరాల పరిపూర్తి ఆత్మాభిమానం - ఆత్మగౌరవంతో చేయండి. జీవిత వ్యవహారాలు విధిపై ఆధారపడి వుంటాయి" అని ప్రవక్త(స) సెలవిచ్చారు.

విధి బలీయతను తెలియజెప్తూ ప్రవక్త (స) ఒక మనిషి వద్ద నున్న ఒక వస్తువును అతని కుటుంబ సభ్యులందరూ కలసి గుంజుకోదలచినా అది సాధ్యం కాదు. అదే విధంగా అల్లాహ్ తీసుకోదలిచిన వస్తువునూ అందరూ కలిసి అతనికి ఇప్పించనూ లేరు అని విశదపర్చారు. కనుక ఈ వ్యవహారాల భారాన్ని అల్లాహ్‌పై వేసి మనిషి కార్యోన్ముఖుడు కావాలి. అల్లానే నమ్ముకోవాలి.

తన ధర్మం యొక్క గొప్పతనాన్ని తెలుసుకోవాలి. దానిని తక్కువగా తలచరాదు. దానిని గౌరవించాలి. బుద్ధిహీనులైన ఇతరులు వేలెత్తి చూపేలా ధర్మాచరణ చేయ కూడదు. ఆ అవకాశం యితరులకు యివ్వకూడదు. ఏ పని అయినా దైవం విధించిన విధి విధానాలకు అనుగుణంగానే సాగుతుంది.

**"అల్లాహ్ ప్రజల కొరకు ఏ కారుణ్యద్వారాన్ని తెరిచినా, దానిని అడ్డుకునే వాడెవ్వడూ లేడు. ఆయన మూసివేసిన దానిని అల్లాహ్ తరువాత మళ్ళీ తెరిచేవాడూ ఎవ్వడూ లేడు. ఆయన శక్తిమంతుడు, వివేచన కలవాడు."**

**(ఖుర్ఆన్, 35 : 2)**

అనేక సందర్భాలలో మనం మన జీవితావసరాల పరిపూర్తిలో ఓడిపోయామని భావిస్తాం. కాని, ఈ భావన సరికాదు. ఈ భావనలో దైవ ధిక్కరణ దాగి వుంది. దైవంపై మనిషికి ఉన్న హక్కుకు వ్యతిరేకమవుతుంది.

**"అల్లాహ్ తన పనిని తాను చేసి తీరుతారు. కాని, చాలా మందికి ఈ విషయం తెలియదు."** **(ఖుర్ఆన్, 12 : 21)**

ఒక ముస్లిం ఎల్లప్పుడూ తన గౌరవాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఇస్లామీయ ప్రామాణికతను ముందుంచుకొని ఆచరణ చేయాలి. ఎటువంటి అవసరం, ఆపదల ముందు తలవంచకూడదు. కూలబడి పోకూడదు. కేవలం దైవాన్ని వేడుకోవాలి. ఆయనతోనే సంబంధం పటిష్టపర్చుకొని కార్యరంగంలో కృషి చేయాలి. ఆయన ముందే తన అసహాయతను వ్యక్తపర్చాలి. ఈ జీవితాచరణ మాత్రమే సత్యానికి దగ్గరైన లాభదాయకమైన సమస్యల పరిష్కారానికి సరైన మార్గం కాగలుగుతుంది.

**"అల్లాహ్ గనక నిన్ను ఏదైనా ఆపదకు గురిచేస్తే స్వయంగా ఆయన తప్ప ఆ ఆపదను తొలగించేవారు ఎవ్వరూ లేరు. ఇంకా, ఆయన గనక నీ విషయంలో ఏదైనా మేలు చెయ్యాలని సంకల్పిస్తే, ఆయన అనుగ్రహాన్ని మళ్ళించేవాడు కూడా ఎవ్వడూ లేడు. ఆయన తన దాసులలో తాను కోరిన వారికి తన అనుగ్రహాన్ని ప్రసాదిస్తాడు. ఆయన క్షమించేవాడూ, కరుణించేవాడూను."**

**(ఖుర్ఆన్ 10 :107)**

మానవ మహోపాధ్యాయులు ముహమ్మద్ (స) తన సహచర సమూహానికి ఎటువంటి ఉత్తమ శిక్షణ యిచ్చేవారో గత పుటల్లో మనం తెలుసుకున్నాం. చిన్న చిన్న వస్తువులను కూడా ఇతరుల వద్ద అడగరాదని మరీ చెప్పారు. చివరికి గుర్రం కొరడా క్రిందపడినా స్వయంగా ప్రవక్తశ్రీ వారే దిగి దానిని ఎత్తుకునేవారు. ఇరతుల సహాయం కోరేవారు కాదు.

## అవమాన పరాభవాలకు కారణాలు

ఒక సామాన్య మనిషి తన ఇహపరాలను రెండు కారణాల ద్వారా నాశనం చేసుకుంటాడు. మొదటిది దారిద్ర్యం(భుక్తి) కారణం కాగా, రెండవది జీవితం అత్యంత ప్రియం కావడం. వీరి మనో మస్తిష్కాలపై తన సంపాదనే ఆవహించి వుంటుంది. అయితే పై రెండు అంశాలనూ అల్లాహ్ మానవుని అధీనంలో వుంచలేదు. మానవుడు చావు భయం, ఉపాధి భయం అనే రోగాలకు గురి కావడం వల్ల – తద్వారా ఉత్పన్న మయ్యే ఆలోచనల ద్వారా అవమాన పరాభవాలకు గురవుతాడు. పేదరికం, అనావృష్టి, తదితరాలు కూడా మనిషిని దిగజార్చివేస్తాయి. అయితే మనిషి యొక్క వాస్తవికత ఏమిటంటే – అతను సుఖ దుఃఖాల్లోనూ అల్లాహ్ వైపునకే మరలాలి, ఆయనతో దృఢ సంబంధం వుంచటం– దేవుని ఏకత్వాలపై ఆధారపడి వుంది. మన చుట్టూ వున్న మనుషులపై ఆశలు, నమ్మకాలు కోరికలు ఉంచుకోవటం వల్ల ఎటువంటి లాభమూ కలగదు. అల్లాహ్ తప్ప ఇతరులు ఎవరూ దేనికీ వాస్తవ యజమానులు కారు. లాభ నష్టాల్లో కూడా వీరికి ఎటువంటి పాత్రా లేదు.

**"అల్లాహ్‌కు ప్రతికూలంగా మీకు సహాయం చేయగల సైన్యమేదైనా మీ వద్ద ఉన్నదా? చూపించండి? అసలు విషయం ఏమిటంటే, ఈ తిరస్కారులు మోసంలో పడిపోయారు. లేదా ఒకవేళ కరుణామయుడైన అల్లాహ్ తాను ప్రసాదించే ఆహారాన్ని ఆపివేసినట్లయితే, ఇంకెవరు మీకు ఆహారమివ్వగలరు? చెప్పండి? వారసలు తలబిరుసుతనానికీ, సత్యతిరస్కారానికీ, మూర్ఖంగా అంటిపెట్టుకొని ఉన్నారు."** ***(ఖుర్ఆన్, 67 : 20-21)***

అల్లమా ఇబ్నుల్ ఖయ్యూం (రహ్మ) ఒక కవితలో అల్లాహ్‌ను ఇలా వేడుకున్నారు : 'ఓ ప్రభూ నా ఆశలకు కేంద్ర బిందువు నీవే!'

నేను భయపడే అంశాల నుండి రక్షించేదీ నీవే! నీవు విరిచిన దానిని ప్రజలందరూ కలిసి కలపలేరు!!

నీవు కలిపిన దానిని వీరంతా కలిసి విడవనూ లేరు! ఈ ప్రకటన సంపూర్ణ దైవ ఏకత్వ ప్రకటనకు గుర్తుగా వుంది. ఈ ప్రకటన ద్వారానే బలహీనుల, అవసరార్థుల రోగాన్ని నయం చేయగలం. తమ చిగిన బట్టల ద్వారా ఇతరుల చీదరింపుల ద్వారా గురౌతున్న వారికి సాంత్వన యివ్వగల ఔషధం ఇదే. ఇస్లాం సృష్టిపూజను

మనిషి హృదయం నుండి పెకిలించివేయాలని కోరుతుంది. బాధలు, విచారాలు, సంకుచిత తత్వాల నుండి మానవ సమాజం విముక్తి కోరుతుంది. వారిని సుఖ సంతోషాల నందన వనంలో విహరింపజేయడానికి కంకణం కట్టుకొంది.

"ఉపాధి స్వయంగా మనిషిని వెతుకుతుంది. చావులాగా!" అని సంక్షిప్తంగా దైవప్రవక్త (స) తెలిపారు. (తిబ్రాని)

అంటే అర్థం, ప్రజలు పని చేయకుండా వుంటే ఉపాధి తనంతట తానుగా వస్తుందనే విపరీతార్థం తీయడం తప్పు. ఇది అజ్ఞానపు భావన. ప్రజలు ఇతరుల ముందు చేతులు చాస్తూ - దేబరిస్తూ వుండకూడదనే దీని అర్థం. అల్లాహ్ యొక్క ప్రమాణం కూడా ఈ విషయాన్నే ధృవీకరిస్తుంది.

**"ఆకాశంలోనే వుంది మీ ఉపాధి కూడా. మీకు వాగ్దానం చేయబడుతున్నది కూడా. కనుక భూమ్యాకాశాల సాక్షిగా! ఇది సత్యం. మీరు ఇప్పుడు మాట్లాడు తున్నంత నమ్మకమైనది"** ***(ఖుర్అన్, 51 : 22-23)***

అబ్దుల్లాహ్ బిన్ మసూద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (స) ఇలా తెలిపారు. స్వర్గానికి చేరువ చేసేవి కేవలం నా ఆదేశాలే. నరకానికి చేరువ చేసేవి కేవలం నేను నిషేధించినవే. మీలో ఎవ్వరూ తన ఉపాధి విషయంలో లోప భూయిష్ట ఆచరణ చేయకూడదు. మీరు మీ ఉపాధి పూర్తిగా పొందనంత వరకు ఈ లోకం వీడి పోరని జిబ్రాయీల్ నాకు తెలిపారు. కనుక, ప్రజలారా! దైవానికి నిష్ఠ కలిగి వుండండి. హుందాగా, మంచితనంతో ఉపాధిని వెతకండి. ఒకవేళ ఈ వెతుకు లాటలో ఎవరైనా వెనుకబడిపోతే దైవ విధేయతకు పాల్పడటం ద్వారా దానిని పొందే ప్రయత్నం చేయకండి. అల్లాహ్ పాపాలకు బదులుగా అనుగ్రహాలను అవతరింప జేయడు." (హాకిం)

పై ఉపదేశం ద్వారా ఇస్లాం, విశ్వాసుల స్థానాన్ని సమున్నతపరిచింది. వారి ప్రాముఖ్యత ఔన్నత్యాలను శిఖరాలకు చేర్చింది. ముస్లిం ఈ భూమిపై దైవ ప్రతినిధిగా, బాధ్యతగల అధికారిగా నాయకునిగా జీవించాలని మరీ మరీ చెప్పింది. ఎత్తుపల్లాల భూమిపై ఆకాశంలా జీవించాలి. మంచి మనిషిగా, ఉన్నతునిగా జీవించాలి. ప్రజల అవసరాలు, తీర్చే అల్లాహ్ సాధనాలుగా దైవక్షమాపణ, అనుగ్రహాలకు ప్రతి రూపాలుగా వుండాలి.

ఇబ్నె మసూద్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) తెలిపారు: "ఇతరులను సంతోష పెట్టేందుకు - అల్లాహ్ ఆగ్రహానికి గురికాకండి. దైవ అనుగ్రహాన్ని ఇతరులకు ఆపాదించి ప్రశంసించకండి. అల్లాహ్ మీకు ప్రసాదించని వాటి పట్ల ఇతరులను దోషులుగా భావించకండి. ఎందుకంటే మీ అత్యాశ వల్ల మీ ఉపాధి మీ వరకు చేరదు. ఇంకొకరి అయిష్టత వల్ల ఆపబడదు. అల్లాహ్ తృప్తి, మనశ్శాంతి, విశ్వాసాన్ని తన సంతోషం దాచివుంచాడు, విచారం, దుఃఖం అల్లాహ్ ఆగ్రహంలో వుంచాడు." (తిబ్రాని)

పై ప్రవచనం పునాదులపై ఆధారపడి సహాయపడిన వారికి కృతజ్ఞతలు తెలుపకూడదనీ అందుకు వారు తగరనీ అర్థంకాదు. వారి దయను గౌరవించకూడదనీ అర్థం కాదు. ఒక దైవప్రవక్త (స) బోధనలో ఇలా తెలుపబడింది:

"ప్రజలకు కృతజ్ఞత తెలుపనివాడు, దైవానికి కృతజ్ఞతలు తెలుపలేడు." (తిర్మిజీ)

ఉపకారం చేసిన వారిని కృతజ్ఞతతో అతిశయోక్తికి గురై అతిగా గౌరవించి దాసునిగా మారకూడదు. అన్నింటికంటే మొట్టమొదటి స్థానం సృష్టికర్త అల్లాహ్‌దిగా వుండాలి. ఉపకారం చేసేవారు కూడా తాము కృతజ్ఞతకు ప్రథమస్థానం గలవారని భావించకూడదు. ఉపకారం పొందిన వారిని దాస్యానికి ఉపయోగించుకునే ప్రయత్నమూ చేయకూడదు. దీనివల్ల వారు చేసిన ఉపకార ప్రతిఫలం నిర్వీర్యమై పోతుంది.

అల్లాహ్ కోసమే దానధర్మాలు చేసేవారిని, దైవప్రీతి కోసం ప్రజల హక్కులు చెల్లించేవారిని ఉద్దేశించి దైవప్రవక్త (స) యిలా తెలిపారు:

"ఎవరికైనా కానుక యివ్వబడితే దానికి ప్రతి కానుక ఇవ్వాలి. ఇవ్వలేని స్థితిలో అతడిని ప్రశంసించాలి. అలా ప్రశంసించినవాడు కృతజ్ఞతలు తెలుసుకున్నవాడవుతాడు. అలా చేయనివాడు కృతజ్ఞతలు చెల్లించనట్లే" (అబూ దావూద్)

మరణానికి భయపడి- జీవించాలనే కోరికకు గురయి, అవమానాలు పరాభవాలను భరిస్తూ బ్రతకడం అవివేకమవుతుంది. చావు నుండి పారిపోవడం ద్వారా జీవిత కాలం పెరగదు. లేక తక్కువ కాజాలదు.

> **"ప్రతి జాతికి ఒక గడువు నిర్ణయం అయివుంది. ఒక జాతి గడువు పూర్తి అయినప్పుడు ఒక్క ఘడియ కాలం కూడా అది వెనుకా ముందు అవటమూ సంభవించదు."** ***(ఖుర్‌ఆన్ 7 : 34)***



# 24వ భాగం

# కారుణ్య కృపాగుణాలు

- కారుణ్యం దైవగుణానికి చిహ్నం
- తనవారి కోసం మెతక – ఇతరుల పట్ల కాఠిన్యం(?)
- కారుణ్యానికి ప్రథమ అర్హులు
- అనాథలకు ఆపన్నహస్తం
- దౌర్భాగ్యుల పట్ల ఆత్మీయత
- సేవకుల పట్ల సత్ ప్రవర్తన
- జంతువుల పట్ల జాలి



# కారుణ్యం - దైవగుణానికి చిహ్నం

కారుణ్యం, మానవుని నైజంలో వున్న ఒక సహజగుణం. ఈ గుణం వున్న కారణంగానే మనిషి తన చుట్టూ వున్న సృష్టితాల ఆపదలు, కష్టాల పట్ల తన దృష్టిని సారిస్తాడు. వాటిని దూరం చేయడానికి తపనపడతాడు. మానవులు చేస్తున్న అపరాధాల పట్ల చింతాక్రాంతుడవుతాడు. వారి మార్గదర్శకత్వాన్ని కోరుకుంటాడు. మనిషిలోని ఈ సహజ గుణం మసకబారిపోతే అతని హృదయం సుఖదుఃఖాల పట్ల సరైన స్పందనను కోల్పోయి మానవ స్థాయి నుండి దిగజారి పశుస్థాయికి చేరుకుంటుంది. ఈ స్థితిలో తనలోని ప్రత్యేకతలన్నింటిని - ఉత్తమ నైతికతను కోల్పోతాడు. కారుణ్యపు ఉత్తేజం - ప్రేమ జాలి వల్ల కలుగుతుంది. జంతువుల్లో సయితం ఈ భావాలు తాత్కాలికంగా సమయానుకూలంగా జనిస్తాయి. దాని ఫలితంగానే అది తమ బిడ్డలపై ప్రేమానురాగాలు కలిగి వాటిని పోషించి పెద్ద చేస్తాయి. కనుక హృదయ కాఠిన్యం గల మనిషి పశు స్థాయి కంటే హీనుడైపోతాడు. ఈ మనిషి స్థానం కఠిన శిలల వంటి నిర్జీవ పదార్థాన్ని పోలి వుండి - ఎటువంటి చలనం-భావోద్వేగాలు లేనివిగా వుంటాయి.

కారుణ్యం, అల్లాహ్ గుణాల్లో అతి గొప్పగుణం. అల్లాహ్ కారుణ్యం విశ్వమంతటా వ్యాపించి వుంది. ప్రతి వస్తువునూ ఆవరించి వుంది. ఎక్కడైతే ఆయనకు ఆగ్రహం కలుగుతుందో- వెంటనే ఆయన అనుగ్రహం దానిని కప్పివేస్తుంది. దైవ దూతలు ఈ గుణం ప్రత్యేకతను విశేషంగా కొనియాడుతూ ఆయనను స్తుతిస్తూ వుంటారు.

**"కనుక పశ్చాత్తాపంతో నీవైపునకు మరలేవారిని, నీ మార్గాన్ని అనుసరించిన వారిని క్షమించు. వారిని నరకయాతన నుండి కాపాడు."**

**(ఖుర్ఆన్, 40 : 7)**

ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, "దైవప్రవక్త (స) వద్దకు కొంత మంది ఖైదీలు తేబడ్డారు. అందులో ఒక స్త్రీ కూడా ఉంది. ఆమె అటూ ఇటూ తిరుగుతూ పసిబిడ్డలు కనపడితే వారికి పాలు త్రాగిస్తుంది. కారుణ్యమూర్తి (స) ఆమె స్థితిని గమనించారు. తన సహచరులతో ఈ స్త్రీ తన బిడ్డను అగ్నిగుండంలో పడ వేస్తుందా" అని అడిగారు. సహచరులు 'వేయదు' అన్నారు. దానికి దైవప్రవక్తశ్రీ (స) అల్లాహ్

తన దాసుల పట్ల ఇంతకంటే ఎక్కువ కరుణ కలిగి వుంటాడు" అన్నారు. (బుఖారి)

అల్లాహ్ పేర్లలో అనేక పేర్లు కారుణ్యం, దయ, అనుగ్రహం, క్షమ మొదలైన అర్థాలపై ఆధారపడి వున్నాయి. ఒక హదీసె ఖుదసీలో ఇలా సెలవివ్వబడింది :

"నా కారుణ్యం, నా ఆగ్రహాన్ని కప్పివేసి వుంటుంది." (ముస్లిం)

అంటే అల్లాహ్‌కు తన దాసుల తప్పులను పట్టుకొని వారిని శిక్షించడం కన్నా వారి పాపక్షమాపణను అంగీకరించడం క్షమించడమంటేనే ఎక్కువ యిష్టమని అర్థం.

**"ఓ ప్రవక్తా! ఇలా వేడుకో, నా ప్రభూ! మన్నించు. కరుణించు. కరుణామయుల లోకెల్లా నీవు ఉత్తమ కరుణామయుడవు."** ***(ఖుర్‌ఆన్, 23 : 118)***

ఈనాడు భూమిపై మనం చూస్తున్న పరస్పర ప్రేమ, దయ, జాలి, కరుణ, ఆదరణ, మంచితనం, ఉపకారాల లాంటి ఉత్తమ సుగంధభరిత పుష్పాలు వికసిస్తూ వున్నాయో అవి అన్ని అల్లాహ్ కారుణ్య ఫలితాలే. అల్లాహ్ కారుణ్యంలోని ఒక చిన్న భాగాన్ని మానవ హృదయంలో నైజంలో వుంచిన దాని ఫలితాలే. హృదయంలో అత్యధిక కారుణ్యం కలిగి, బలహీనుల పట్ల అందరికంటే ఎక్కువ జాలి కలిగి వున్నవారే అందరికంటే సున్నిత, ఉత్తమ మనసుగలవారు.

ఇక కఠిన హృదయులైన దుర్మార్గులు, అహంకారులు, గర్విష్టులు నరకంలోని అతి నీచ అంతస్తులో వుంటారు. ఒక ప్రవచనంలో యిలా చెప్పబడింది :

"కఠిన హృదయులు అల్లాహ్‌కు కడుదూరంగా వుంటారు." (తిర్మిజి)

చెమర్చని కళ్ళు, కఠినమైన హృదయం దౌర్భాగ్యానికి చిహ్నమని దైవప్రవక్త (స) సెలవిచ్చారు. అల్లాహ్ ప్రపంచపు హృదయ విదారక స్థితిని గమనించి – దానిని సంస్కరించదలిచిన కారణంగానే–విశ్వకారుణ్యమూర్తి ముహమ్మద్ (స)ను ప్రభవింప జేశాడు. ఆయన ప్రజలపై కారుణ్య సాగరంగా వుండి, వారి దుఃఖాలను కష్టాలను తొలగించి–వారి హృదయగాయాలకు కట్టుకట్టారు. వారి అపరాధాల పట్ల సానుభూతి చూపి, వారికి మార్గదర్శకత్వాన్ని అందించారు. బలహీనుల హక్కులను పరిరక్షించారు. రక్షణాత్మక యుద్ధం ద్వారా – దౌర్జన్యపూరిత – ఈ అహంకారుల యుద్ధోన్మాదాన్ని తుత్తునియలు చేశారు. కదనరంగానికి సయితం కారుణ్యం నేర్పారు. ఆయన (స) ప్రజల హృదయాల్లో దైవభీతి, మంచితనం, పుణ్యాభిలాషల దివ్వెలను వెలిగించారు. ఆయన హృదయంలో నిర్మలత్వం, నమ్రతలు ఉంచబడ్డాయి. ఆయన హస్తాలు దాతృ

త్వానికి, దాన గుణానికి చిరునామాలుగా వుంటాయి. ఈ గుణాలన్ని కలిసి ఈ మహో మనిషి ముహమ్మద్ (స)ను దైవదాసులందరిలోకెల్లా సున్నిత మనస్సు, దయ, జాలి, విశాల హృదయం గలవారిగా చేశాయి.

**"అనంతమైన అల్లాహ్ కరుణ వల్లనే నీవు వారిపట్ల (ఓ ముహమ్మద్) మృదు స్వభావుడవు అయ్యావు. నీవే కనుక కఠిన హృదయుడవు అయినట్లయితే - వారందరూ నీ నుండి దూరంగా వెళ్ళిపోయి వుండేవారు"**

***(ఖుర్ఆన్, 3 : 159)***

ప్రవక్తశ్రీ (స) లోని ఈ కారుణ్యం యుద్ధ మైదానాన్ని సయితం వదలిపెట్టలేదు. ఉహుద్ యుద్ధ సమయంలో దైవ ప్రవక్త అత్యంత కఠిన స్థితిలో వున్నప్పుడు కూడా కనికర గుణాన్ని మానలేదు. దైవప్రవక్త (స) ఆ యుద్ధంలో ఒక గోతిలోకి త్రోసివేయ బడ్డాడు. ముఖం తల గాయాలు పాలయ్యింది. దంతాలు విరిగిపోయాయి. అటువైపు తన మిత్రులు సయితం రక్తసిక్తంగా పడివున్నారు. ఇంతటి సున్నిత సమయంలో కూడా ప్రత్యర్థులను శపించమని కోరగా - అందుకు దైవప్రవక్త (స) "ఓ అల్లాహ్ ఈ జాతికి మార్గదర్శకత్వం ప్రసాదించు. వీరికేమీ తెలియదు" అని ప్రార్థించారు.

ఉత్తమ వ్యక్తిత్వాల ఆచరణ ఇలాగే వుంటుంది. కష్టాలు, బాధలు, రణహాని తదితరాలు వీరిని అస్థిరపర్చలేవు. హృదయ కాఠిన్యతలు, నిర్దయలు, ఆగ్రహం, ప్రతీ కారాలకు బదులు క్షమాపణ, దయ, జాలి కారుణ్యాలకే ప్రాధాన్యతనిస్తారు.

హృదయ కాఠిన్యం ఆ వ్యక్తిలోని ఒక పెద్ద చెడు లక్షణానికి నిదర్శనం అవు తుంది. చరిత్రలో ఇటువంటి వారే కల్లోల జనకులుగా మిగిలి వున్నారు. ఈ కారణం గానే ఈ చెడు గురించి ఇస్లాం తీవ్రంగా హెచ్చరించింది. హృదయ కాఠిన్యత, దైవ ద్రోహానికి చిహ్నంగా చెప్పబడింది. రుజుమార్గం నుండి తప్పిపోవడంగా తీర్మా నించింది.

**"విశ్వాసుల హృదయాలు అల్లాహ్ ప్రస్తావనతో చలించే సమయం, ఆయన అవతరింపజేసిన సత్యం ముందు వంగిపోయే సమయం ఇంకా రాలేదా? పూర్వం గ్రంథం ఇవ్వబడిన ప్రజల మాదిరిగా వారు మారిపోకూడదు. ఒక సుదీర్ఘకాలం వారిపై గడచిపోయింది. అప్పుడు వారి హృదయాలు కఠిన**

**మయ్యాయి. ఈనాడు వారిలో అనేకులు పరమ దుర్మార్గులు. బాగా తెలుసు కోండి." (మీరు అలా కాకూడదు). (ఖుర్‌ఆన్, 57 : 16)**

ఇస్లాం సమస్త సృష్టిపై ప్రత్యేకించి మానవులపై కారుణ్యం కలిగి వుండటాన్ని విధి చేసింది. ఈ అంశాన్ని సంపూర్ణ విశ్వాసానికి సాక్ష్యంగా చెప్పబడింది. ఒక విశ్వాసి మరొక విశ్వాసితో కలుస్తాడు. అతని పట్ల ప్రేమాభిమానాలు కలిగి వుంటాడు. సహాయ సహకారాల బాహువులను అతని కొరకు విస్తరిస్తాడు. అతని బాధలను, కష్టాలను దూరం చేసే ప్రయత్నమూ చేస్తాడు.

దైవప్రవక్త (స) ఆదేశం ఇలా వుంది, "మీరు ఒకరిపట్ల మరొకరు కారుణ్యం కలిగి వుండకపోతే మీరు విశ్వాసులే కారు. అందుకు సహచర సమాజం 'ఓ దైవ ప్రవక్తా! మేము పరస్పరం కారుణ్యం కలిగి వున్నాము అని పలికారు. అందుకు ప్రవక్తశ్రీ, "కారుణ్యం కేవలం మీ సహచరుని పట్ల చూపడం కారుణ్యం అనిపించు కోదు. ఇదే భావన మీరు సమస్త మానవుల పట్ల కలిగి వుండాలి" అని విశదపర్చారు. (తిబ్రాని)

చాలా సహజంగా మనిషి తన వారిపట్ల కరుణ కలిగివుంటాడు. తన బిడ్డల వైపు దృష్టిసారిస్తూనే ప్రేమాభిమానాల మబ్బులు దట్టంగా అలుముకుంటాయి. ఇది చాలా సాధారణమైన విషయం. అయితే ఒక ముస్లింకు తన కారుణ్యపు భావన సంకు చితంగా వుంచుకోవడం శోభించదు. అతని కారుణ్య భావన చాలా విశాలంగా వుండాలి. విశ్వజనీనమైనదిగా వుండాలి. అతను సమస్త మానవుల పట్ల ప్రేమాభి మానాలు, దయ, కరుణలతోబాటు బాధ్యతలు కలిగి వుండాలి. దైవప్రవక్త (స) ఈ విషయంగా అనేక ప్రవచనాలను సెలవిచ్చి వున్నారు. తద్వారా విశ్వాసుల సంఘానికి మార్గదర్శనం అందించారు. దైవప్రవక్త (స) ప్రవచనాల్లో అత్యంత క్లుప్తమైనది విశాల భావనగల ప్రచవనం ఇలా వుంది :

"మానవులపై కారుణ్యం చూపనివారిని అల్లాహ్ కనికరించడు." (బుఖారి)

మరో ఉల్లేఖనంలో "ఇతరులను క్షమించని వాడిని అల్లాహ్ క్షమించడు"

మరో ఉల్లేఖనంలో ఇలా వుంది, "ధనవంతుడై వుండీ వినమ్రత పాటించేవాడు. తన్నుతాను అల్లాహ్ అనుగ్రహానికి పాత్రుడనని తలించేవాడు, కూడబెట్టిన ధనాన్ని చెడుమార్గంలోకాక, మంచి మార్గంలో ఖర్చుచేసేవాడు, బలహీనులు, అగత్యపరులను

కనికరించేవాడు. జ్ఞానవంతుల, వివేకవంతుల సహవాసంలో వుండేవాడు ఎంతో అదృష్టవంతుడు అని దైవప్రవక్త (స) తెలిపారు. (తిబ్రాని)

అల్లాహ్ విశ్వాసుల యొక్క ప్రత్యేకతను పేర్కొంటూ వారు విశ్వాసుల పట్ల వెన్నలా మెత్తగా, మృదువుగా వుండి, అవిశ్వాసులైన దుర్మార్గుల పట్ల అత్యంత కఠినులుగా వుంటారని సెలవిచ్చాడు.

**"వారు విశ్వాసుల పట్ల మృదువుగా, (దుర్మార్గులైన) అవిశ్వాసుల పట్ల కఠినులుగా వుంటారు."** ***(ఖుర్ఆన్, 5 : 4)***

మరోచోట:

**"వారు (దుర్మార్గులైన) అవిశ్వాసుల పట్ల కఠినులుగానూ వుంటారు. పరస్పరం కరుణామయులుగా వుంటారు."** ***(ఖుర్ఆన్, 48 : 29)***

## తన వారి పట్ల మెతక - శతృవుల పట్ల కాఠిన్యం

**(మంచి పట్ల మెతక - చెడు పట్ల కఠినం)**

కారుణ్యం గురించి వివరిస్తూ అందులో కఠినత్వం గురించి చెప్పడం ఎందుకు అనే ప్రశ్న ఇక్కడ ఉత్పన్నం అవుతుంది. వాస్తవమేమంటే, ఇస్లాం కారుణ్యాన్ని విశ్వవ్యాపితం చేసింది. మానవులు, పశుపక్షాదులు, జలచరాలు, అన్నింటి పై కారుణ్యాన్ని విధి చేశాడు. కాని, కొంతమంది మనుషులు, జంతువులు సామూహిక జీవితానికి నష్టదాయకులుగా వుంటాయి. సమాజానికి వారు శాపాలుగా, కల్లోల జనకులుగా భయనష్టాలు కలిగించేవారిగా వుంటారు. విశాల ప్రజానీకపు రక్షణ, లాభాన్ని దృష్టిలో వుంచుకొని ఈ శాపాలను, నష్టదాయకులను తుదకంటా నాశనం చేయడం అత్యంత అవసరం. కనీసం వారి ద్వారా జరిగే నష్టాలను కనీస స్థాయిని నియంత్రించడం తక్షణ కర్తవ్యం. అటువంటి పరిస్థితుల్లో ఆ మానవుల పట్ల కఠినవైఖరి తప్పనిసరి అవుతుంది. నిజానికి ఈ కఠినత్వం కూడా ఆ వ్యక్తి పట్ల కారుణ్య చర్యగా రుజువు అవుతుంది.

ఇస్లాం సంపూర్ణంగా తల నుండి పాదాల వరకు కారుణ్య సాగరంగా వుంది. మానవులందరినీ తన కారుణ్య ఛత్రఛాయలో సమీకరించుకుంటుంది. అల్లాహ్ తన ప్రవక్తను ఉద్దేశించి యిలా సెలవిచ్చాడు:

**"ఓ ప్రవక్తా! మేము మిమ్మల్ని ప్రపంచానంతటికి కారుణ్యంగా చేసి పంపాము."**

***(ఖుర్ఆన్, 21 : 107)***

ఇస్లాం కారుణ్యసాగరమని చెప్పే ప్రబల సాక్ష్యంగా దివ్యగ్రంథపు అధ్యాయాల ప్రారంభమే సాక్ష్యమిస్తుంది. దాని ప్రతి అధ్యాయపు ప్రారంభం (ఒక్క తౌబా అధ్యాయం తప్ప) "అనంత కరుణామయుడు అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో" అని ప్రారంభమవుతుంది.

కాని, మానవ మృగాలు కొన్ని ఇస్లాం యొక్క ఈ విశ్వజనీన కారుణ్యంలో అడ్డంకులు కల్పిస్తున్నారు. ఒక్కోసారి ఈ దారిలో పెద్దపెద్ద అవరోధాలను నిలబెడు తున్నారు. తద్వారా ఈ కారుణ్య సరోవరం నుండి ప్రజలు లబ్ధి పొందకుండా దూరంగా వుంచుతున్నారు. ప్రజలను అజ్ఞానాంధకారంలోనే వుంచే వీరి ప్రయత్నా లను వమ్ముచేయవలసిన అవసరం ఎంతైనా వుంది. సమాజానికి నష్టదాయులైన ఈ మృగాల చర్యలను కఠినంగా ఎదుర్కొనక పోతే వీరి ద్వారా ఉత్పన్నమయ్యే సమస్యలు, కల్లోలాలు మానవ సమాజాన్ని కకావికలం చేసివేస్తాయి. కనుక వీరి పట్ల కఠినత్వం ప్రదర్శించక తప్పదు. ఈ ప్రయత్నంలో స్వయంగా ఈ మృగాలు సయితం ఈ కారుణ్య ఛత్ర నీడలో చేరిపోయేందుకు తమ మృగత్వాన్ని విడనాడేందుకు అవకాశమూ వుంచాలి. అల్లాహ్ కారుణ్యపు విశ్వజనీనత నుండి వీరు కూడా దూరం కాలేరు కదా! తమను తాను సంస్కరించుకోవాలని భావించేవారికి పూర్తి సహకార హస్తాన్ని అందిస్తుంది. కారుణ్యం స్వయంగా ఇతరుల సంస్కరణ కోసమే ఉనికిలోకి వచ్చింది:

**"నా కారుణ్యం ప్రతి వస్తువునూ ఆవరించి ఉంది. నా పట్ల అవిధేయతకు దూరంగా ఉండేవారి కొరకూ, జకాత్ ఇచ్చేవారి కొరకూ, నా ఆయతులను విశ్వసించేవారి కొరకూ నేను దానిని (కారుణ్యాన్ని) వ్రాస్తాను."**

***(ఖుర్ఆన్, 7 : 156)***

ఇస్లామీయ ఛత్రఛాయలోకి ప్రవేశించేందుకు అవసరమైన షరతును అల్లాహ్ స్పష్టపర్చేశాడు. పై దైవవాక్యాన్ని అందులోని గాఢమైన అర్థాన్ని తెలుసుకునేందుకు వేయి అధ్యయన సమావేశాలూ తక్కువే అవుతాయి. కనుక ప్రవేశానికి అర్హత లేనివాడు ఈ నీడలో సేదదీరలేడు. ఈ విషయాన్ని ప్రవక్త శిఖామణి (స) ఇలా తెలిపారు:

"నా అనుచర సమాజానికి చెందిన ప్రతి వ్యక్తీ స్వర్గంలో ప్రవేశిస్తాడు. తిరస్కరిం

చినవాడు తప్పు" దానికి ప్రజలు (మీ ఉమ్మత్‌లో మిమ్మల్ని) ఎవరు తిరస్కరిస్తారు? అని ప్రశ్నిస్తారు. అవిధేయత చూపేవారు తిరస్కారులే" అని చెప్పారు. (బుఖారి)

అప్పుడప్పుడు కారుణ్యం కఠినత్వపు దుస్తులను ధరిస్తుంది. కాని లోపలి పదార్థం మాత్రం అదే వుంటుంది. కొంతమంది పిల్లలను పాఠశాలకు పంపడానికి బలవంతపెట్టవలసి వస్తుంది. వారిని క్రమశిక్షణ నేర్పడానికి కొంత కాఠిన్యం ప్రదర్శించవలసి వస్తుంది. పాఠాల పఠనం-జ్ఞాపకం-పరీక్షలు-హెూంవర్క్ లాంటి విషయాల్లో కాఠిన్యం వున్నప్పటికీ దాని అసలు ఆత్మ ఆ విద్యార్థిపై కారుణ్యాన్ని వర్షింపజేయడమే అవుతుంది.

ఒక వైద్యుని ఆచరణ రోగి పట్ల ఇలాగే ఉంటుంది. రోగ నిర్ధారణలో రోగిని వైద్యుడు ఒక్కోసారి బాధిస్తాడు. చికిత్సలో - ఆపరేషన్ చేయడంలో సాధారణ సమయంలో ఆమోదించలేని అనేక విధానాలను అవలంభిస్తాడు. కోస్తాడు, రక్తాన్ని స్రవింపజేస్తాడు. కొన్ని భాగాలను తొలగిస్తాడు. అయితే ఈ చర్యలన్ని ఆ రోగిపై కరుణతోనే చేస్తాడు.

కనుక కారుణ్యంలో కేవలం వెన్నలాంటి మెదకదనమేకాక, అవసర సమయంలో ఉపయోగించే కాఠిన్యమూ కలిసి వుంటుంది. కల్లోల జనకుడు, రక్తపాతాన్ని సృష్టించిన దుర్మార్గునికి ఉరిశిక్ష విధించడం సమాజం మొత్తంపై కరుణ చూపడమే అవుతుంది. ఉరి సమయంలో కలిగే కష్టాన్ని బాధను తలుచుకొని ఆ దుర్మార్గుడిని వదిలివేయడం సమాజ హితం పట్ల న్యాయం కాదు గదా! కారుణ్యానికి సహేతుకత తప్పనిసరిగా అవసరమవుతుంది.

**"ఓ వివేకవంతులైన మానవులారా! ఈ ప్రతీకార (సమ) న్యాయం మీ సమాజానికి ఊపిరి. (ఇందులోనే మానవ క్షేమం వుంది) ఈ ఆజ్ఞా ఉల్లంఘనకు దూరంగా ఉంటారని ఆశించబడుతోంది."** ***(ఖుర్‌ఆన్ 2 : 179)***

ఇస్లాం వ్యతిరేకించే, అసహ్యించుకునే కాఠిన్యం వాస్తవానికి వ్యక్తిత్వం, హృదయానికి సంబంధించినది. ఈ సంబంధంలో బుద్ధి జ్ఞానాలకు, న్యాయధర్మాలకు ఎటువంటి సంబంధమూ వుండదు. ఇస్లాం వ్యతిరేకించే కాఠిన్యం, మనోకాంక్షలు స్వార్థంతో వ్యాపించే ఒక భయానక చెడు. ఈ చెడుకు వ్యతిరేకమైన కరుణ దైవంచే ప్రసాదించబడిన మానవ సహజంగా వుంటుంది. మనిషిని మంచి వైపునకు దైవనిష్ఠ

వైపునకు నడిపిస్తుంది. కష్టనష్టాల్లోనూ, భయభీతుల స్థితిలోనూ, బాధల పరిస్థితులలోనూ వారి జీవితాలను సుఖవంతంగా, తాజాగా వుంచుతుంది.

దైవప్రవక్త (స) ఇలా తెలిపారు: "అల్లాహ్ తన కారుణ్యాన్ని వంద భాగాలుగా చేసి అందునుండి ఒక్క భాగాన్ని భూమిపై అవతరింపజేశాడు. ఈ ఒక్క భాగపు ప్రభావం వల్లనే సృష్టిలో పరస్పర కనికరం, కారుణ్యం కలిగి ఉంది. జంతువులు సయితం తమ పిల్లలకు తమ పంజా దెబ్బ తగలకుండా జాగ్రత్త పడతాయి." (బుఖారి)

మరో ఉల్లేఖనంలో, "అల్లాహ్ భూమ్యాకాశాల సృష్టిరోజే 100 కారుణ్యాలను చేశాడు. ఒక్కొక్క కారుణ్యం భూమ్యాకాశాల మధ్య ఒక తెరలాగా వుంటుంది. అందు నుండి ఒక కారుణ్యాన్ని భూమిపైకి దించాడు. దాని ప్రభావం వల్లనే తల్లి బిడ్డలపై కారుణ్యం కలిగి ఉంటుంది. జంతువులు, పక్షులు, ఈ కారుణ్యం మూలకంగానే పరస్పరం సహకరించుకుంటాయి" అని వుంది. (ముస్లిం)

మనిషి తన జ్ఞానాన్ని ఏ విధంగా అనేక అంశాలను, విషయాలను పరిశీలించడం ద్వారా పెంచుకుంటూ పోతాడో - అదే విధంగా కారుణ్యం కూడా అనేక విధాలుగా, మార్గాల్లో అధికమవుతూ ఉంటుంది. ఈ కారుణ్యాన్ని నిర్జీవంగా ఎవదిలివేస్తే మానవుడు నరకానికి అర్హుడవుతాడు.

అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం, "దైవప్రవక్త అబుల్ ఖాసిం (స) ఈ మాటలను పలుకుతూ వుండగా నేను విన్నాను, "కారుణ్యం కేవలం కఠిన హృదయుని నుండి గుంజుకోబడుతుంది"

## కారుణ్యానికి ప్రథమ అర్హులు

ఇస్లాం, కారుణ్యానికి ప్రథమ అర్హులుగా, హక్కుదారులుగా కొందరిని ప్రత్యేకంగా పేర్కొంది. వీరు దగ్గరి రక్తసంబంధీకుల (జవిల్ అర్హామ్)లోని వారు. మొట్టమొదటి అర్హులు హక్కుదారులు వీరే. మన సహాయానికి, సానుభూతికి ప్రథమ హక్కుదారులు వీరే.

దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు, "కరుణించేవారిని అల్లాహ్ కనికరిస్తాడు. భూవాసులను కనికరించండి. ఆకాశాలవాడు కారుణ్యం కురిపిస్తాడు. బంధుత్వాలను కలిపి వుంచేవారితో అల్లాహ్ కలిసి వుంటాడు. బంధుత్వాలను తెంచేవారితో అల్లాహ్ తన బంధాన్ని తెంచుకుంటాడు. సానుభూతి అల్లాహ్ హద్దులలోని విభాగమే." (తిర్మిజి)

బంధువుల, రక్త సంబంధీకుల హక్కులను నెరవేర్చడం ప్రతి ముస్లిం యొక్క బాధ్యత. ప్రేమాభిమానాల ద్వారా పరస్పర సంబంధాలను అతను పటిష్టపర్చాలి. అందులోనూ తల్లిదండ్రులు అందరికంటే ప్రేమాభిమానాలకు, గౌరవాలకు హక్కు దారులై వున్నారు.

**"వారితో మర్యాదగా మాట్లాడండి. మృదుత్వమూ, దయాభావమూ కలిగి వారి ముందు వినమ్రులై వుండండి. ఇలా ప్రార్థిస్తూ వుండండి: ప్రభూ! వారిపై కరుణ చూపు, బాల్యంలో వారు నన్ను కారుణ్యంతో, వాత్సల్యంతో పోషించినట్లు."**

**(ఖుర్ఆన్, 17 : 24)**

ఆ తదుపరి తనకు జన్మించిన బిడ్డలు అధికంగా హక్కుదారులవుతారు.

బరా (రజి) ఉల్లేఖనం ప్రకారం, "హజ్రత్ అబూ బక్ర్ (రజి) తన పుత్రిక ఆయెషా (రజి) గారి వద్దకు వచ్చారు. ఆమె అప్పుడు తీవ్ర జ్వరంలో వున్నారు. అప్పుడు ఆయన ఆమె నుదుటిని ముద్దాడి "ఓ నా ప్రియకుమారీ! నీ ఆరోగ్యం ఎలా వుందమ్మా?" అంటూ కుశలమడిగారు. (బుఖారి)

అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం, ఒకసారి దైవప్రవక్త (స) తన మనుమలైన హసేన్, హుసైన్ (రజి)లను ముద్దు పెట్టుకున్నారు. ఆ సమయంలో అక్కడే వున్న హాబిస్ అత్తమీమీ (రజి) నాకు పది మంది పిల్లలు. నేను ఏనాడూ ఎవరినీ ముద్దాడలేదు' అన్నారు. అప్పుడు ప్రవక్త(స) ఆయన వైపు దృష్టిసారిస్తూ "కరుణించని వారిని కరుణించడం జరగదు" అని హెచ్చరించారు లేక "నీ హృదయం నుండి కారుణ్యాన్ని అల్లాహ్ గుంజుకున్నాడని భావించనా" అని ప్రశ్నించారు. (బుఖారి)

అనస్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (స) సైఫ్సల్ఖైన్ వద్దకు వెళ్ళారు. ఆమె ప్రవక్త గారి పుత్రులు ఇబ్రాహీం (రజి)కు పాలు తాగించేవారు. ప్రవక్త(స) తన ప్రియ పుత్రుడిని ఒడిలోకి తీసుకొని ముద్దాడారు. మరోసారి దైవప్రవక్త (స) ఇబ్రాహీం (రజి) గారి మరణ సమయంలోనూ ప్రవక్తతో వున్నాము. ఆయన కనుల నుండి అశ్రువులు ధారాపాతంగా కారుతున్నాయి. అప్పుడు ఇబ్నె ఔఫ్ (రజి) ప్రవక్తా! మీరు కూడా....! అని ఆశ్చర్యంగా అడిగారు. అప్పుడు ప్రవక్తశ్రీ "ఇది కారుణ్యానికి చిహ్నం' అని చెప్పారు. ఆ తరువాత "అశ్రువులు కారుతున్నాయి. హృదయం పగిలిపోతుంది. అయినా మన ప్రభువుకు ఇష్టమైనదే పలుకుదాం! ఓ ఇబ్రాహీం మేము మా పట్ల చాలా దుఃఖంగా వున్నాం" అని చెప్పారు. (ముస్లిం)

ఒక ముస్లింకు తన బంధువులు, రక్త సంబంధీకులకు తన యింటి తలుపులు మూసివేయడం ధర్మబద్ధం కాదు. వారితో సంబంధాలను తెంచుకొని జీవితం గడప కూడదు. వారిని కష్టాల్లో, ఆపదల్లో ఆదుకోకుండా వుండకూడదు. ఈ స్థితిలో వున్న ముస్లిం జీవితం నుండి దైవకారుణ్యం, శుభసంక్షేమాలు గుంజుకోబడతాయి.

అబూ హురైరా (రజి) ఉల్లేఖనం ప్రకారం, దైవప్రవక్త (స) ఈ విధంగా పలుకుతూ వుండగా నేను విన్నాను అన్నారు: "బంధుత్వ సంబంధం, కరుణా మయుడైన అల్లాహ్ హద్దులో వున్నది. అది ఇలా అంటుంది : 'ఓ నా ప్రభూ! నన్ను నిర్లక్ష్యం చేయడం జరిగింది. ఓ నా ప్రభూ! నా పట్ల చెడుగా ప్రవర్తించటం జరిగింది. ఓ నా ప్రభూ! నాపై దౌర్జన్యం జరిగింది." అప్పుడు విశ్వప్రభువు అల్లాహ్ బంధుత్వ సంబంధాన్ని ఉద్దేశించి ఇలా సమాధానమిస్తాడు, "నిన్ను కలిపేవారిని నేను కలుపు తాను. నిన్ను తెంచేవారిని నేను తెంచుతాను." (అహ్మద్)

## అనాధలకు ఆపన్న హస్తం

అనాధలు కూడా కారుణ్యానికి, ఆదరణకు అర్హులైన వారి కోవలోకే వస్తారు. వీరిని కనికరించడం, ఆదరించటం, మంచిగా ప్రవర్తించడం, సంరక్షించడం, వారి భవిష్యత్తు మరల్చిదిద్దడానికి ప్రయత్నించడం, అత్యంత స్వచ్ఛమైన ఆరాధన అవుతుంది. కఠిన హృదయులైన దుర్మార్గులు సైతం ఈ ఆచరణను కొనసాగించడం ద్వారా న్యాయవంతులుగా ధర్మాచరణగల వారిగా పరివర్తన చెందుతాడు.

అబూహురైరా ఉల్లేఖనం ప్రకారం ఒక వ్యక్తి దైవప్రవక్త(స)ను హృదయ కాఠిన్యను గురించి వివరించుకున్నారు. అందుకు ప్రవక్త శ్రీ "అనాధలను కనికరిం చువారి తలను చేతితో నిమరు. అతనికి భోజనం పెట్టు. అప్పుడు నీ హృదయం మెత్తబడుతుంది. నీ అవసరమూ తీరుతుంది" అని హితవు పలికారు. (తిబ్రాని)

మరో ఉల్లేఖనం ప్రకారం ఒక వ్యక్తి దైవప్రవక్త(స)వద్దకు వచ్చి తన హృదయ కాఠిన్యం గురించి విన్నవించుకున్నాడు. అందుకు ప్రవక్త (స) "అనాధల తల నిమురు. పేదవారికి అన్నం పెట్టు" అని చెప్పారు. (అహ్మద్)

ఇలా ఎందుకు జరుగుతుందంటే, మనిషి ప్రాపంచిక వెంపర్లాట కలిగిన ఈ సమాజంలో వుండటం ద్వారా అతని హృదయం జీవం కోల్పోతుంది. ఇటువంటి వారికి తమ స్వార్థం, సుఖం, సరదాలు తప్ప మరేమీ కనపడవు. ప్రజల కష్టాలు,

ఈతిబాధలను వీరి కళ్ళుచూడనియ్యవు. అనాధల, పేదల ఆర్తనాదాలు వినపడకుండా కనపడకుండా కళ్ళకు గంతలు, చెవులకు తాళాలూ పడి వుంటాయి. కాని సాధారణ ప్రజలు, ఈ కష్టనష్టాల మధ్య తిరుగుతూ వుండటం మూలాన వారి మనస్సులు సజీవంగానూ హృదయాలు దయార్ధతతోనూ నిండి వుంటాయి. వీరు ఇటుకష్టాన్ని కొన్ని సందర్భాల్లో, సుఖాలనూ అనుభవిస్తూ వుంటారు. ఈ కారణంగా వీరికి అనాధల పరిస్థితులు, అసహాయతలు అన్ని అర్ధమవుతాయి. వితంతువుల కష్టాలూ, వారు ఎదుర్కొంటున్న ఇబ్బందులూ తెలుస్తాయి. పేదల, అగత్యపరుల స్థితిగతుల గురించి వారికి అర్ధమవుతుంది.

## దౌర్భాగ్యుల పట్ల ఆత్మీయత

వ్యాధిగ్రస్తులను, కష్టాలలో వున్న వారిని ఉత్తమరీతిలో ఆదరించాలి. వీరివద్ద తమ అవసరాలను తీర్చుకోవడానికి అవసరమైనన్ని వనరులు వుండవు. ఈ కారణంగా జీవితపు పరుగుపందెంలో ఇతరులతో సమంగా పరుగెత్తలేరు. తమ అవసరాలు పరిపూర్తి చేసుకోనూలేరు. ఇటువంటి స్థితి కలవారిని స్వయంగా అల్లాహ్ బలహీనులుగా పేర్కొన్నారు. వ్యాధిగ్రస్తులు, వికలాంగులకు అల్లాహ్ కష్టతర విధుల నుండి క్షమించాడు. ఈ విషయంగా వారిని విచారించడం ధర్మసమ్మతం కాదు.

> **ఒకవేళ అంధుడూ, కుంటివాడూ, వ్యాధిగ్రస్తుడూ జిహాద్ కొరకు రాకపోతే అందులో ఎలాంటి దోషమూ లేదు.అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకూ విధేయత చూపేవానికి అల్లాహ్ క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింప జేస్తాడు. విముఖుడయ్యే వానిని వ్యథా భరితమైన శిక్షను విధిస్తాడు" (48;17)**

వ్యాధిగ్రస్తుడు తన రోగపు కబంధ హస్తంలో బంధించబడివుంటాడు. వ్యాధి తీవ్రత మందుల ప్రభావం రోగిని బలహీనతకు, ఆందోళనకు గురిచేస్తాయి. ఈ పరిస్థితుల్లో ఆ రోగి అల్లాహ్ ప్రీతిని కోరి సహనం పాటిస్తే అతనికి దైవ సాన్నిహిత్యం లభిస్తుంది. ఆ రోగి దైవకారుణ్యానికి అర్హుడవుతాడు. కేవలం ఒక ముల్లు గుచ్చుకున్న కారణంగానే ఒక విశ్వాసి పాపం క్షమించబడుతున్న సమయంలో తీవ్ర రోగానికి, భాదకు గురైన విశ్వాసి పాపమన్నింపు గురించి చెప్పవలసిందే ముంటుంది. ఈ వ్యక్తి దైవ రక్షణలో వుంటాడు. ఈ కారణంగానే వ్యాధిగ్రస్తుని పట్ల మంచిగా ప్రవర్తించాలి.

అతనిని పరామర్శించాలి. కష్టాలలో, బాధలలో వున్నవారిని ఆదరించాలి. వారిని విమర్శించడం, అగౌరవపర్చడం చేయకూడదు.

## సేవకుల పట్ల సత్ప్రవర్తన

మన సేవకులు, పనివారు (కార్మికులు) కూడా మన కారుణ్యానికి అర్హతగల వారే. మనం వారి యోగక్షేమాల పట్ల శ్రద్ధ వహించాలి. వారి శక్తి మేరకే వారికి పనులు అప్పగించాలి. వారి తప్పులను, పొరపాట్లను క్షమించాలి.

యజమానులు అయినందుకు గర్వం, అహంకారం ప్రదర్శించకూడదు. వారిని ఎగతాళికి, సూటి పోటి మాటలకు గురి చేయరాదు. దైవం ప్రసాదించిన అధికారపు బాధ్యత పట్ల గర్వించిన వానిని, ఆ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించని వానిని అల్లాహ్ వివక్షకు గురిచేస్తాడు. అతనిని బాధ్యతల నుండి తొలగించివేసే ప్రమాదమూలేక పోలేదు.

అబూసయిద్ ఖుద్రీ (రజి) యిలా సెలావిచ్చారు: 'నేను, నా బానిసను ఒకసారి కొరడాతో కొడుతున్నాను. హఠాత్తుగా నా వెనుక నుండి జాగ్రత్త ! అబూసయిద్ అని వినిపించింది. నా కోపం కారణంగా నేను ఆ పలుకులను పట్టించుకోలేదు. కాని అవే మాటలు దగ్గరగా వినిపించేసరికి వెనుతిరిగి చూశాను. దైవప్రవక్త(స) వెనక నిలబడి వున్నారు. ఆయన నాతో "గుర్తుంచుకో అబూ సయిద్ ! నీకు ఈ బానిసపై ఎంత అధికారం ఉన్నదో అంతకంటె అధికంగా అల్లాహ్‌కు నీపై అధికారం వుంది" అని అన్నారు. అందుకు దైవప్రీతి కోసం నేను ఈ బానిసను విడుదల చేస్తున్నాను ఓ దైవప్రవక్తా ! అని చెప్పారు. అందుకు ప్రవక్త శ్రీ "నీవు అలాచేసి వుండకపోతే నరకాగ్ని నిన్ను దహించివేసి వుండేది" అని హితవు పలికారు. (ముస్లిం)

మరో ప్రవచనంలో అభివృద్ధి, సంక్షేమాలు గలదే ఉత్తమ సంపద, దైవ సృష్టితాల పట్ల బాధ్యతా రాహిత్యం కూడా దురదృష్టకరం" అని ప్రవక్త (స) సెలవిచ్చారు. (అబూదావూద్)

మరో సందర్భంలో ఒక వ్యక్తి దైవప్రవక్త(స)ను నేను రోజుకు ఎన్నిసార్లు నా బానిసను క్షమించాలి (లేక మన్నించాలి) అని ప్రశ్నించాడు. అందుకు కారుణ్యమూర్తి "డెబ్భైసార్లు" అని పలికారు.

మనలో చాలా మంది స్త్రీ పురుషులు, తమ సేవకుల, పనివారల శ్రమను దోచుకుంటూ వుంటారు. వారిలోని బలహీనతల నుండి తాము లబ్ధిపొందారు. అక్రమంగా లాభం పొందడానికి ప్రయత్నించారు. ఇస్లాం ఇటువంటి శ్రమ దోపిడిని నిర్భయంగా ఖండించింది. పని చేయడం కొరకు హింసిచడాన్ని, కొట్టడాన్ని నిషేధించింది.

దైవప్రవక్త(స) యిలా సెలావిచ్చారు : అన్యాయంగా ఒక్క కొరడా దెబ్బకొట్టినా, తీర్పుదినాన, అతని నుండి ప్రతీకారం తీర్చుకోబడుతుంది." (బజ్జార్)

## జంతువుల పట్ల జాలి

మనుషుల పట్లనే కాదు, జంతువుల పట్ల జాలి చూపడం ఇస్లామీయ సూత్రాలలో ఒకటి. జంతువులకూ హక్కులు వున్నాయని ఇస్లాం ప్రకటించింది. ఒక వ్యక్తి ఒక మేకను కాలు పట్టుకొని చివరగా ఈడ్చుకొని వెళుతుండగా ఖలీఫా హజ్రత్ ఉమర్(ర) అతనిని ఖండించారు: "నీ పాడుగానూ ! దానిని సవ్యంగా తీసుకొని వెళ్ళు" అని కసిరారు. దానికి ఒక వ్యక్తి ప్రవక్త (స)ని 'ఓ ప్రవక్తా ! నేను మేకను జిబహ్ చేసేటప్పుడు కష్టం లేకుండా చేస్తాను అన్నారు. అందుకు దైవప్రవక్త(స) నీవు జంతువుల పట్ల దయ చూపకపోతే అల్లాహ్ కూడా నీ పట్ల దయచూపడు" అని చెప్పారు. (హాకిం)

జంతువులను, పెంపుడు పశువులను హింసించే వారితో ఇస్లాం కఠినంగా వ్యవహరిస్తుంది. జంతువులను చిత్రవధ చేయడాన్ని ఇస్లాం నిషేధించింది. హింసించే వ్యక్తి ఎంతటి ఉత్తమ వంశానికి చెందిన వాడైనా అతనిని హెచ్చరిస్తుంది. ఈ హింసకు బదులుగా ఆ వ్యక్తి నరకశిక్షను బహుకరించింది.

దైవప్రవక్త(స) యిలా తెలిపారు : 'ఒక స్త్రీని నరకంలో పడవేయడం జరిగింది. ఎందుకంటె ఆమె ఒకపిల్లిని యింటిలోనే కట్టివేసింది. దానికి అవసరమైన ఆహరం అందించలేదు. దానికి కనీసం వదిలేసివుంటె ఆ పిల్లి దాని ఆహారం తనే సంపాదించుకునేది." (బుఖారి)

హృదయంలో మెదిలే కారుణ్యభావన ఎంతటి చిన్న లేక పెద్ద పాపాన్ని సైతం తుడిచివేస్తుంది. మానవ మహోపకారి ముహమ్మద్(స) యిలా తెలిపారు :

"ఎడారిలో ప్రయాణం చేస్తున్న ఒక వ్యక్తి దాహంలో వుండి ఒక బావి దగ్గర ఆగాడు. బావిలో దిగి తృప్తిగా నీళ్ళు త్రాగాడు. బయటకు వచ్చినప్పుడు అక్కడ ఒక కుక్క దాహంతో శోష వచ్చేలా పడివుంది. దాని స్థితీ తనలాంటిదేనని భావించిన ఆ వ్యక్తి తన (త్రోలు) కుజోళ్ళలో నీళ్ళు నింపి బయటకు వచ్చి ఆ నీళ్ళు ఆ కుక్కకు త్రాగించాడు. అల్లాహ్ ఈ ఆచరణ చాలా నచ్చింది. ఫలితంగా అతను క్షమించబడ్డాడు."

ఒకసారి ప్రజలు ప్రవక్త(స)ను ఉద్దేశించి 'ఓ దైవప్రవక్తా! జంతువుల పట్ల జాలి, దయ కలిగి వున్నందుకు కూడా పుణ్యఫలం లభిస్తుందా?' అని ప్రశ్నించారు. అందుకు కారుణ్యమూర్తి(స) ప్రతి ప్రాణి పట్ల మంచి చేయడం వల్ల పుణ్యఫలం లభిస్తుంది" అని సెలవిచ్చారు.

మరో ఉల్లేఖనంలో ఒక పాపాత్మురాలైన స్త్రీ ఒక కుక్క తీవ్ర దాహ స్థితిని చూసి జాలిపడింది. బావి నుండి తన బూట్ల ద్వారా నీటిని తెచ్చి కుక్క దాహన్ని తీర్చింది. ఈ జాలి గుణానికి బదులుగా అల్లాహ్ ఆమె పాపాలను క్షమించి వేశాడు." (ముస్లిం)

కేవలం ఒక కుక్కపై జాలి, దయ చూపిన ఫలితంగా పాపాలు క్షమించగా ఇక, మానవులపై జాలి, ప్రేమాభిమానాలు కలిగివుంటే మరి ఇంకెంత ఫలితం లభిస్తుందో కదా !



# 25వ భాగం

# జ్ఞానం మరియు బుద్ధి

- జ్ఞాన సముపార్జనకు అత్యధిక ప్రాధాన్యత
- విద్యా జ్ఞానాలు నేర్పడం - ఆరాధన కంటె ప్రథమం
- (ఆధునిక ప్రాపంచిక ) శాస్త్ర విద్యలు నేర్పడం కూడా ఆరాధనే
- సంకల్ప శుద్ధికే ప్రాధాన్యత
- ఇతర భాషలు నేర్పడం అభిలషణీయం

# జ్ఞాన సముపార్జనకు అత్యధిక ప్రాధాన్యత

ఇస్లాం తన నైజం రీత్యా తన అనుయాయులందరినీ జ్ఞానవంతులు, విజ్ఞాన వంతులు, విద్యావంతులుగా వుండాలని ఆదేశిస్తుంది. ఈ కారణంగానే విద్యాజ్ఞానాల సముపార్జనను ధార్మిక విధిగా చేసింది. ఇస్లామీయ సమాజంలో ఆ విద్యకు నిరక్షరాశ్యతకు చోటులేదు.

విద్యా జ్ఞానాలు, వంశపారంపర్యంగా లభించే వారసత్వ సంపదలు కావు. తాయెత్తులు-మంత్రతంత్రాలతో వచ్చేవికావు. ధార్మిక సిద్ధాంతాలు, ఉపదేశ ఆదేశాలు న్యాయచట్టాలు అన్నీ నేర్చుకుంటేనే లభిస్తాయి. అదికూడా పఠించితే సరిపోదు. వాటిని అధ్యయనం చేయాలి. ఆచరణలో పెట్టాలి. తద్వారా ఆమోదాలు ఏవో-నిషేధాలు ఏవో తెలుస్తాయి. విధులు-హక్కులు స్పష్టమవుతాయి. తద్వారా జీవితం విసిరే సమస్యలన్నింటికీ సహేతుక, శాస్త్రీయ పరిష్కారాలు లభిస్తాయి. సాముహిక జీవిత సూత్రాలు వాటి మర్యాదలు తద్వారా ఉనికిలో వచ్చే ఆరోగ్య, సంక్షేమకర వాతావరణం విద్యాజ్ఞానాల పునాదుల పైనే ఏర్పడుతుంది. మంచిని ఆదేశించే-చెడును నిరోధించే పునాదులు ఏర్పడుతాయి. సరైన కోణంలో శాంతి స్థాపన దిశలో అభివృద్ధి పదానికి అవసరమైన ఆలోచనల ఘర్షణ పుష్పాల వికసన ఎంతో అవసరం. మానవ సమాజంలో ఎదుర్కొనే సమస్యలన్నింటికీ పరిష్కారాలు విద్యాజ్ఞానాల ద్వారానే అందుబాటు అవుతాయి. ఇస్లామీయ ఆలోచనా విధానపు వట వృక్షానికి నీటి వనరు కేవలం విద్యాజ్ఞానాల ద్వారానే లభ్యమవుతాయి. అవి లభ్యం కాని రోజున ఇస్లామీయ ఆలోచనా విధానపు వృక్షం ఎండి మోడుబారి పోతుంది.

విశ్వశోధన- పరిశోధనల తర్వాత విద్యాజ్ఞానాల వినియోగం సరైన విధంగా జరగాలంటే దివ్యఖుర్‌ఆన్ అధ్యయనం- తద్వారా ఉనికిలోకి వచ్చే దృఢ విశ్వాసం అత్యవసరం అవుతాయి. ఇక శాంతి సంక్షేమాలకు పునాదులుగా వుంటాయి. దివ్య ఖుర్‌ఆన్ జ్ఞానం అర్థం కాని అనేకవిషయాల పరదాలను తొలగించి వాస్తవాలను ప్రజల ముందుంచింది. సృష్టిలోని సమతుల్యత విధివిధాన సహితచలనం లాంటి విషయా లను బహిర్గత పర్చడం ద్వారా సృష్టిని మనిషి అధీనం చేసింది. గతంలో అజ్ఞానంతో అంధవిశ్వాసాలను మూఢనమ్మకాలను కాదని, తర్కం, పరిశోధన, ఆలోచనలను మనిషికి అందించింది. ప్రతి విషయాన్ని పరిశీలించిచూడాలనీ,

అభిప్రాయాలు, సంప్రదింపులు చేయడం ద్వారా జ్ఞానం మరింత విశాలవంత మవుతుందని మార్గదర్శకత్వం చేసింది.

ఒక మనిషికి శ్వాస ఎంత అవసరమో ఇస్లాంకు విద్యాజ్ఞానాలు అంతే అవసరం. ఇస్లామీయ ధర్మం జ్ఞానవంతుల హృదయాలలోనే ప్రఫుల్లమవుతుంది. సకారాత్మక అభివృద్ధి ప్రయోజనకర బుద్ధీ వికాసాలకు పునాదులు వేస్తుంది. ఈ కారణంగానే అల్లాహ్ ఈ విధంగా ఆదేశించాడు :

> **"సర్వమానవులకు ఇది (ఈ దివ్యఖుర్‌ఆన్) ఒక సందేశం. వారిని హెచ్చరించాలనీ, యదార్థంగా దేవుడు ఒక్కడేనని వారు తెలుసుకోవాలనీ, బుద్ధి వున్నవారు గ్రహించాలనీ ఇది పంపడమైంది."** ***(ఖుర్‌ఆన్, 14 ; 52)***

మరో చోట నరకవాసుల సంభాషణను యిలా తెలపడమైంది:

> **"అయ్యో, మేము గనక (ఆనాడు ఖుర్‌ఆన్ సందేశాన్ని) వినివుంటే, లేదా గ్రహించివుంటే ఈనాడు యిలా మండే నరకాగ్ని శిక్షకు గురయ్యే వారిలో చేరి వుంటే వారము కాదు గదా !** ***(ఖుర్‌ఆన్, 67 ; 10)***

ఎవరి అవగాహనలు మృతి చెందుతాయో, ఆలోచనల కిటికీలు మూసివేయ బడి పోతాయో, ఎవరి సహజ నైపుణ్యాలు బంద బారిపోతాయో వారి ఉదాహరణ దివ్యఖుర్‌ఆన్ ఈ క్రింది పదాలతో వివరించింది :

> **"అల్లాహ్ చూపిన ఈ (దివ్యఖుర్‌ఆన్) మార్గాన్ని తిరస్కరించే వారి పోలిక యిలా వుంది. పశువులను కేకవేస్తాడు కాని, అది ఆ కేకల, అరుపుల ధ్వని తప్ప మరిదేనినీ వినలేవు. వారు చెవిటివారు, మూగవారు, గ్రుడ్డివారు. అందు కని ఏ విషయమూ వారి బుర్రకు ఎక్కదు"** ***(ఖుర్‌ఆన్, 2 ; 171)***

వ్యక్తి జీవితం యవ్వనదశకు చేరినప్పుడు అతనిలో శక్తియుక్తులు ప్రతిభలు ఉన్నతస్థాయికి చేరుతాయి. ఇప్పుడు ఈ ప్రతిభలకు, శక్తియుక్తులకు, ఉత్తమవిద్య, జ్ఞానం ఆలోచనా విధానం అవకాశమవుతాయి. ఈ దశలో అల్లాహ్ ఆ వ్యక్తికి ఇస్లాంను అందజేస్తాడు. తద్వారా ఆ వ్యక్తి జీవితం సంపూర్ణత్వం సాధించగల్గుతుంది. ఈ మార్గంలో నడవడం వల్ల ఆ వ్యక్తిలోని గుణాలు ఉత్తమ స్థాయికి చేరుతాయి.

ఉదాహరణకు నమాజ్‌ను తీసుకుందాం. నమాజ్‌కు అన్నింటికంటే ప్రప్రథమైన ఆరాధనాస్థానం ఉంది. అయితే దీని ప్రకటన, ఆచరణ బుద్ధీ వికాసాలకు,

అవగాహనా జ్ఞానానికి సంబంధించిన విషయం. నమాజ్ పిలుపు అయిన 'అజాన్' మనిషి హృదయాన్ని తడుతుంది. దానిని చైతన్యపరుస్తుంది. ఆజాగృతి నుండి అల్లాహ్ గొప్పతనం ప్రకటించబడుతుంది. సాఫల్య మార్గం వైపునకు ఆహ్వానిస్తుంది. ఇది కేవలం ఒక పొలికే కాదు గాలిలో ప్రకటించబడి గాలిలోనే తేలిపోయేదీ కాదు.

ఈ విధంగా నమాజ్ స్వయంగా పవిత్రవాక్యాలు, దైవస్తోత్రాలు, వేడుకోళు ళ్ళ, విజ్ఞప్తుల సమాహారంగా వుంటుంది. ఈ వాక్యాలన్ని ఏకమొత్తంగా మనిషికి మార్గదర్శకత్వం, సాఫల్యం, అందించే పవిత్రగ్రంథం ఖుర్ఆన్‌లోనివి. వీటిని పఠిస్తూ-అర్థం చేసుకుంటూ ఆచరిస్తేనే స్వీకరించబడుతుంది.

ఏ వ్యక్తి అయినా గౌరప్రద స్థానానికి చేరుకోవడం అతనిలోని బుద్ధిజ్ఞానాలూ, సహజ నైజంలో వున్న సరితులనత్వంపై ఆధారపడి వుంటుంది. విద్యాజ్ఞానాలు లేనివారు ఇస్లామీయ జీవితాచరణలో ముందుకుసాగలేరు. ఈ విషయాన్ని దివ్యఖుర్ఆన్ ఈ క్రింది విధంగా తెలిపింది;

**"ఓ ప్రవక్తా ! పఠించు, సర్వాన్ని సృష్టించిన నీ ప్రభువు పేరుతో. ఆయన పేరుకుపోయిన నెత్తుటి ముద్దతో మానవుడిని సృజించాడు. పఠించు-నీ ప్రభువు పరమదయాళువు. ఆయన కలం ద్వారా జ్ఞానం నేర్పాడు. మనిషి ఎరుగని జ్ఞానాన్ని అతనికి ప్రసాదించాడు"** ***(ఖుర్ఆన్, 96;1-5)***

కలం యొక్క గొప్పతనాన్ని బహిర్గత పర్చిన ఈ వాక్యాలు మొట్టమొదటగా అవతరించాయి. అజ్ఞానం, నిర్లక్ష్యంలకు వ్యతిరేకంగా యుద్ధభేరిని మ్రోగించాయి. జ్ఞానసంపన్నునికి మొట్టమొదటి మెట్టు పఠించడం-అధ్యయనం చేయడం తప్పమరేది కాగలదు. అప్పుడే అల్లాహ్ ఆ వ్యక్తికి ఉత్తమస్థానాలు అందిస్తాడు. ఈ జ్ఞానం ద్వారానే దేవుని ఏకత్వపు సాక్ష్యం మనిషి యివ్వగలడు. వ్యక్తిని, దైవదూతలను, పండితులను ఈ జ్ఞానమే ఒకే వరుసలో నిలబెట్టింది.

**"తాను తప్ప మరొక దైవం లేదు' అనే సత్యానికి స్వయంగా అల్లాహ్యే సాక్ష్యమిచ్చాడు. దైవదూతలు, సమస్త జ్ఞానులు కూడా ఆ మహాశక్తిమంతుడూ, ఆ మహాజ్ఞాని తప్ప మరొక దైవం లేదు అని నిజాయితీగానూ, న్యాయంగానూ సాక్ష్యమిస్తారు"** ***(ఖుర్ఆన్, 3 ; 18)***

హ్రస్వదృష్టికలవారు, అజ్ఞానులు మహోన్నతుడైన విశ్వ సృష్టికర్త పాలకుడు,

పోషకుడు, విశ్వప్రభువు అయిన అల్లాహ్ మహోజ్వలత్వాన్ని ఎలా గ్రహించగల్గుతారు? ఏ వ్యక్తి తన అజ్ఞానపు అంధకారంలో కొట్టుమిట్టాడుతూ వుంటాడో అతను విశ్వసృష్టికర్త అయిన అల్లాహ్ యొక్క వాస్తవికతను ఎలా గ్రహించగలడు ?

అందువల్లనే అల్లాహ్ జ్ఞానవంతులను, ధర్మజ్ఞానం కలవారిని గౌరవనీయులుగా పేర్కొన్నాడు. వారి విద్యాజ్ఞానాల పునాదులపైనే వారికి ప్రాధాన్యత యివ్వబడింది. దైవప్రవక్త(స) ఈ విషయాన్ని ఈ క్రింది విధంగా స్పష్టపర్చారు :

"తీర్పుదినాన అల్లాహ్ తన దాసుల మధ్య తీర్పుచేయడానికి ఉద్యుక్తుడై ధర్మజ్ఞానంగల వారితో యిలా అంటాడు: "నేను మీ మధ్య నా జ్ఞానాన్ని, వివేకాన్ని ఉంచాను. దానిద్వారా మీ తప్పులను మన్నిస్తున్నాను. ఈ మన్నింపుకు జ్ఞానాన్ని కారణంగా స్వీకరించాను." (తిబ్రాని)

హాఫిజ్ మంజరీ గారి మాటల్లో అల్లాహ్ వాగ్దానం: "నా జ్ఞానం మరియు వివేకం"ల పదాలు లోతైన అర్థం కలిగి వున్నాయి. పై రెండు గుణాలను లోతుగా అధ్యయనం చేస్తే-సంకల్పశుద్ధి వివేకాలు లేని జ్ఞానం గురించి అల్లాహ్ ప్రస్తావించడంలేదని అర్థమవుతుంది. వివేకం అంటే మనుషుల మధ్య అభిప్రాయ భేదాలను సృష్టించేదిగా వుండకూడదు. మనోకాంక్షలు, స్వార్థపర కోరికలను అదుపులో వుంచలేనిదిగానూ వుండదు.

## విద్యాజ్ఞానాలు నేర్పడం - ఆరాధన కంటే ప్రథమం

అర్థవంతం కాని ఆచరణ వ్యర్థం. అల్లాహ్ వద్ద జ్ఞానాత్మక ఆచరణకు చాలా విలువ వుంది. విద్యాజ్ఞానాలు ఆరాధనల కంటే శ్రేష్ఠత పొందడానికి ఇదే కారణం. అజ్ఞానపు అంధకారం నుండి బయటపడే కరదీపిక (ఇదొక్కటే). విద్యాజ్ఞానాలే.

"విద్యాజ్ఞానాల ప్రాముఖ్యత, ఆరాధనల ప్రాముఖత కంటే గొప్పది" అని దైవప్రవక్త (స) స్పష్టం చేశారు. (బజ్జార్)

"అజ్ఞానంతో చేసే అధిక ఆరాధన కంటే కనీస జ్ఞానం శ్రేష్టమైనది." (తిబ్రాని)

"అత్యుత్తమ ఆరాధన (జ్ఞానాత్మక) ఆలోచన." (తిబ్రానీ)

ఒక సందర్భంగా దైవప్రక్త దివ్యఖుర్ఆన్ అధ్యయనాన్ని దాని శుభలాభాలను వివరిస్తూ యిలా చెప్పారు :

"ఓ అబూజర్! ఉదయాన్నే నీవు అల్లాహ్ గ్రంథం నుండి ఒక వాక్యం నేర్చుకో. ఇది నీవు వంద రకాతుల (నఫిల్) నమాజ్ కంటే శ్రేష్ఠమైనది. అదే విధంగా ప్రతి రోజు ఒక అధ్యాయం నుండి జ్ఞానం సంపాదించు - దానిని ఆచరించినా, ఆచరించక పోయినా వేయి రకాతులు ఆచరించటం కంటే ఉత్తమం." (ఇబ్నెమాజ)

పై బోధనలో దాగివున్న రహస్యం ఏమిటంటే ఒక అజ్ఞాని, మూర్ఖుని యొక్క ఆరాధన, అతను చేసే స్నేహాన్ని పోలి ఉంటుంది. అది ఎవరికీ లాభం చేకూర్చదు సరికదా తమ అజ్ఞానం వల్ల నష్టాన్ని చేకూరుస్తారు. అజ్ఞాన ఆరాధకులు, ఆరాధనల బాహ్యరూపాలను కడు నిష్ఠతో ఆచరిస్తారు. ఇదే అత్యుత్తమ ఆరాధనగా భావిస్తూ జీవిస్తారు. అయితే జ్ఞానవంత ఆరాధన ద్వారా విద్యాజ్ఞానాలు కలవారు ఇతరులకు లాభం చేకూరుస్తారు. ఇతరులకు దీపంలా మార్గం చూపుతారు. వీరి ఆరాధనలు కొంత తక్కువగా ఉన్నప్పటికీ అవి ఫలవంతాలై వుంటాయి. వారి చూపులు దూరదృష్టి కలిగి - ఆలోచనలు అభివృద్ధి పథాన వుంటాయి.

ఈ కారణంగానే దైవప్రవక్త (స), "ఒక ధర్మజ్ఞానం కలజ్ఞాని వేయి సాధారణ ఆరాధకుల కంటే అధికంగా షైతాన్‌పై ఆధిక్యత కలిగి వుంటాడు" అని చెప్పారు. (తిర్మిజి)

మరో ఉల్లేఖనంలో ప్రవక్తశ్రీ, "ఒక ధర్మజ్ఞానం గల జ్ఞానికి ఎంతటి స్థానం వుందంటే - మీ మధ్యన నాకు వున్న స్థానం వంటిది" అని నుడివారు. (తిర్మిజి)

మరోచోట 'ఒక ధర్మజ్ఞానం గల జ్ఞాని డెబ్బయిమంది సాధారణ ఆరాధకుల కంటే శ్రేష్ఠతముడు' అని చెప్పబడింది. మరోచోట "షైతాన్ ప్రజల మధ్య బిద్దత్ (అందంగా కనపడే భ్రష్టాచారం)లను ప్రవేశపెడతాడు. ధర్మజ్ఞానం కల జ్ఞాని వాటిని గుర్తిస్తాడు. ప్రజలను దాని నుండి హెచ్చరిస్తాడు. ఆరాధకుడు తన ఆరాధనలో నిమగ్నుడై వుంటాడు. కాని ధర్మజ్ఞాని, ఆ బిద్దత్‌లను పారద్రోలడానికి అవిరళ కృషి చేస్తాడు" అని వుంది. (అస్‌బహాన్)

విద్యాజ్ఞానాల ప్రాముఖ్యతను స్వయంగా సృష్టికర్త అల్లాహ్ ఇలా తెలియపర్చాడు:

**"మేము ఈ దృష్టాంతాలను ప్రజల అవగాహన నిమిత్తం వివరిస్తాము. కాని జ్ఞాన సంపన్నులే వాటిని అర్థం చేసుకొంటారు.** ***(ఖుర్ఆన్, 29 : 43)***

మంచివైపునకు పరుగిడేవాడు - చెడు నుండి దూరంగా తొలగిపోయేవాడూ దైవాభీష్టానికి అనుగుణంగా విధేయత ప్రకటించేవాడు జ్ఞాన సముపార్జన ద్వారా సుసంపన్నమైనవాడు ధన్యులను అల్లాహ్ ముందస్తుగానే తెలియపర్చాడు.

**"ఎవరైతే విధేయుడో, రాత్రి ఘడియలలో (తహజ్జుద్ నమాజ్‌కై) నిలబడతాడో, సజ్దాలు చేస్తాడో, పరలోకానికి భయపడతాడో తన ప్రభువు కారుణ్యాన్ని ఆశిస్తాడో (వారి వైఖరియే గొప్పది). తెలిసిన జ్ఞానులూ, తెలియని అజ్ఞానులూ సమానులు కాగలరా? (39 : 9) జ్ఞానులు మాత్రమే హితబోధను స్వీకరిస్తారు.**

## ఆధునిక (ప్రాపంచిక) శాస్త్ర విద్యలు నేర్పడం కూడా ఆరాధనే!

ముస్లింలు ఆధునిక శాస్త్ర విజ్ఞానాన్ని నేర్చుకోవాలి. తత్ సంబంధిత విద్యను నేర్చుకోవడానికి ప్రాక్ పశ్చిమాల దూరాలకు చేరుకుంటాడు. మానవ కళ్యాణానికి అవసరమైన విద్యాజ్ఞానాలను నేర్చుకుంటాడు. తాళం పడివున్న ఆలోచనలకు స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని విశాలత్వాన్ని అందిస్తాడు. తద్వారా విశ్వరహస్యాలను ఛేదించడానికి తన ఉనికి యొక్క లక్ష్యాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తాడు. జ్ఞాన సముపార్జన శాస్త్ర సాంకేతిక రంగాలలో ప్రగతీ వికాసాల ద్వారానే ఇతరుల మెదళ్ళను తనకు అనుకూలంగా మలచుకోగలడు. వారి ఆలోచనా స్రవంతులను ప్రభావితం చేయగలడు. విజ్ఞాన సముపార్జన యొక్క విశాల మైదానంలో ప్రపంచ మానవాళికి నాయకునిగా ఎదుగుతాడు. విశ్వం - ప్రకృతిలో దాగివున్న రహస్య ఖజానాలను స్వంతం చేసుకుంటాడు. ఈ చర్యలు, ఆచరణలు, కృషి ప్రయత్నాలు అన్ని విద్యాజ్ఞానాలలోని విడదీయలేని భాగాలే. ఈ ప్రయత్నంలో ముస్లిం తన వంతు భాగాన్ని తప్పకుండా పొందాలి. విద్యాజ్ఞానాల సముపార్జన ప్రతి ముస్లింకు ఈ కారణంగానే విధి చేయబడింది. ఈ జ్ఞాన సంబంధం విధి అయిన ఆదేశం గురించి దైవ వాక్యాలు- ప్రవక్త (స) ఉపదేశాలు అనేకం వున్నాయి. వాటి ద్వారా పూర్తి లబ్ధి పొందే ప్రయత్నం చేయాలి. అందు నుండి కొన్ని ఇక్కడ పొందుపర్చడమైంది.

"విద్యాజ్ఞానాల సముపార్జనకు బయలుదేరిన వ్యక్తికి, అల్లాహ్ స్వర్గపు దారిని సులభతరం చేస్తాడు" (బుఖారి)

"అన్నింటికంటే ఉత్తమ సంపాదన ఒక జ్ఞాని యొక్క జ్ఞానం. అది అతడ్ని

అజ్ఞానాంధకారం నుండి, మార్గభ్రష్టత్వం నుండి కాపాడుతుంది. ఎవరి బుద్ధి జ్ఞానంతో నిండి వుండదో అతని ధర్మాచరణ సవ్యంగా వుండజాలదు." (తిబ్రాని)

"కేవలం ఇద్దరు వ్యక్తుల పట్ల అసూయ చెందడం మాత్రమే ధర్మబద్ధం చేయబడింది. అందులో మొదటివాడు అల్లాహ్ ప్రసాదించిన ధర్మాన్ని దైవమార్గంలో విరివిగా ఖర్చుచేసేవాడు. రెండవవాడు, అల్లాహ్ వివేకజ్ఞానాన్ని ప్రసాదించిన వ్యక్తి తన జ్ఞానం ద్వారా తీర్పులు తీరుస్తాడు. శిక్షణనూ అందిస్తాడు." (బుఖారి)

"అల్లాహ్, ఆయన దూతలు, భూమ్యాకాశాలలో వున్న ప్రాణులు, చివరికి పుట్టల్లోని చీమలు, సముద్రంలోని చేపలు సైతం సంక్షేమం, అభివృద్ధికి సంబంధించిన జ్ఞానాన్ని బోధించే వారి కోసం దుఆ చేస్తూ వుంటారు." (తిర్మిజి)

ప్రజలకు మేలు చేకూర్చే ప్రతి పనిని - దానికి సంబంధించిన జ్ఞానాన్ని పై హదీసులన్నింటిలోనూ శ్లాఘించడం జరిగింది. నష్టం కలిగించే విషయాల నుండి కాపాడటం, మేలు చేకూర్చే విషయాల వైపునకు మార్గదర్శనం చేయడం కంటే వివేకం - జ్ఞానం మరేదై వుంటుంది. విద్యాజ్ఞానాలను ప్రత్యేక రంగులో రంగరించడం సాధ్యం కాదు. వారసత్వంలో వచ్చిన సంపద నుండి భూమిని సంపదగా భావించి పశువులను సంపదగా భావించకుండా వుండటం కుదరదు కదా! ఈ రెండూ సంపద యొక్క రెండు రూపాలు మాత్రమే.

మనిషికి ప్రతికాలంలోనూ మానవులపై అల్లాహ్ హక్కులు ఏవి? మానవుల మధ్య ఒండొకరులపై వున్న హక్కులు ఏమిటి? అని తెలుసుకోవడం జ్ఞానం యొక్క షరతుగా వుండింది. ఆత్మ సంబంధ బోధనలు, ఉపదేశాలు, సన్యాసులు, సంతులు, మఠాలు, ఆశ్రమాలు అన్నీ ఈ హక్కును నెరవేర్చడానికే విశేషంగా ఉనికిలోకి వచ్చాయి. వివిధ సంఘాలు, రాజకీయ సంస్థలు నేడు కూడా ఈ విషయాలపైనే స్థాపించబడ్డాయి. ఈ క్రమంలో ఎవరైనా దైవమార్గదర్శక గ్రంథం దివ్యఖుర్ఆన్‌ను, చివరి దైవప్రవక్త ముహమ్మద్ (స) ఆచరణాత్మక బోధనలను కేవలం ధార్మిక విద్య అనే పేరుతో మిగిలిన శాస్త్రజ్ఞానంతో వేరుపరిస్తే, అంత కంటే మూర్ఖత్వం మరొకటి వుండదు.

పై విధంగా ఆలోచించడం క్షమించరాని నేరం అవుతుంది. ఎందుకంటే

ఖుర్ఆన్ హదీసు జ్ఞానం మనిషి ఆలోచనలకు అందని ఊహకు ఆవలవున్న అనేక సత్యాలను అందిస్తుంది. భౌతిక ప్రకృతిపర జ్ఞానం యొక్క పరిధులను, పరిమితులను సయితం విశదపరుస్తుంది. తన నిజప్రభువు యొక్క వాస్తవికతను, దైవ భావనను అత్యంత ప్రభావవంతమైన రీతిలో మనిషికి అందిస్తుంది.

ఈ క్రమంలో దైవగ్రంథమార్గదర్శకత్వం తప్పనిసరి అవుతుంది. భౌతిక విజ్ఞానం కేవలం జీవ నిర్జీవ పదార్థాలకు సంబంధించిన అంతర్గత విధి విధానాలను పరిశోధించడానికి మాత్రమే పరిమితమవుతుంది. కాని ఖుర్ఆన్ ద్వారా జ్ఞానం పొందినవారు ఈ భౌతిక వస్తువులు, వనరుల ద్వారా - సృష్టితాలు, సృష్టిలోని అనేక రుజువులు సాక్ష్యాల ద్వారా ఈ సృష్టిని సృష్టించిన భాగస్వామ్య రహితుడైన ఏకైక సృష్టికర్తను గుర్తిస్తారు. ఆయనకు సన్నిహితులు కావడానికి శ్రమిస్తారు. మహా అద్భుత మైన ఈ సృష్టి యొక్క అధ్యయనం ద్వారా విశ్వప్రభువు యొక్క సర్వోన్నతను తెలుసు కుంటాడు.

**"ఆకాశం నుండి అల్లాహ్ వర్షం కురిపించటాన్ని నీవు చూడటం లేదా? తరువాత దాని ద్వారా మేము రకరకాల రంగు రంగుల పండ్లను ఉత్పత్తి చేస్తాము. కొండలలో కూడా తెల్లని, ఎఱ్ఱని, కారునలుపు చారలు కనిపిస్తాయి, వాటి రంగులు వేర్వేరుగా ఉంటాయి. ఈ విధంగానే మానవుల, జంతువుల, పశువుల రంగులు కూడా భిన్నమైనవే. యథార్థమేమిటంటే, అల్లాహ్ దాసులలో జ్ఞానులు మాత్రమే ఆయనకు భయపడతారు. నిస్సందేహంగా అల్లాహ్ శక్తిమంతుడు, మన్నించేవాడు"** ***(ఖుర్ఆన్, 35 : 27 – 28)***

మరోచోట ఇలా ఉంది:

**"ఆయన సూచనలలో, ఆకాశాలనూ, భూమినీ సృష్టించటమూ, మీ భాషల, మీ రంగుల వైవిధ్యాలూ ఉన్నాయి. నిశ్చయంగా విజ్ఞులకు ఇందులో ఎన్నో సూచనలు ఉన్నాయి." (ఖుర్ఆన్, 30 : 22)**

ధార్మిక సేవలో - జీవిత సమస్యల పరిష్కారాలలో ధార్మిక జ్ఞానం, ఆధునిక శాస్త్రజ్ఞానం రెండూ మనిషికి సహాయకులుగా ఉంటాయి. ఆధునిక శాస్త్ర విద్యలు నేర్పడానికి సమయం ఎక్కువ పడుతుంది. కాని ధార్మిక విద్య నేర్పడానికి అంత

సమయం పట్టదు. అయితే ధార్మిక విద్యలో లోతైన అధ్యయనానికి కూడా సుదీర్ఘకాలం అవసరమవుతుంది. ప్రభుత్వ కార్యకలాపాలకు కూడా ఈ రెండు జ్ఞానాలు అవసరమవుతాయి. మానవ హక్కుల పరిజ్ఞానం ఎంత అవసరమో – వైద్య విజ్ఞాన జ్ఞానం కూడా అంతే అవసరం. అదే విధంగా ఈ రెండు జ్ఞానాలు కూడా ధర్మజ్ఞానం నుండి వేరైనవి కావు. అదే సత్యాన్ని తెలుసుకోవాలి.

ఈ విద్యాజ్ఞానాల సముపార్జనకు శ్రమ, కృషి, శ్రద్ధ నిజాయితీ, ప్రజా సంక్షేమ భావన తప్పనిసరి. అయితే మనిషి ఔన్నత్యం ఆయా విద్యలను ప్రజల సంక్షేమం, శాంతి, సంక్షేమాల కొరకు ఉపయోగించడంపై మాత్రమే ఆధారపడి వుంటుంది. ఆయా విద్యలకు గౌరవం, ప్రాధాన్యతలు కేవలం అవి ప్రజలకు ఎంతటి లాభదాయకంగా ఉన్నాయో అనే విషయంపై ఆధారపడి వుండటం తప్పనిసరి షరతు కూడా.

## సంకల్ప శుద్ధికే ప్రాధాన్యత

ధార్మిక విద్య – ఆధునిక విద్యల మధ్య తేడా చాలా చిన్నదిగా వుంటుంది. అయితే కేవలం ధార్మిక విద్య –కేవలం ఆధునిక విద్య'ల మధ్య వ్యత్యాసం పెద్ద అగాధాన్ని పోలి వుంటుంది. ఈ రెండు విద్యకు ఆర్జన, లక్ష్యాలలో సంకల్పశుద్ధి వుండాలి. మనిషి తన లక్ష్య సాధనలో సహాయకారులుగా వుండాలి. విద్యాజ్ఞానాలు ఏ కోవకు చెందినవి అయినా అవి అన్నీ దైవ ప్రసాదితాలే. చిత్తశుద్ధి, సత్‌సంకల్పం ఉంటే ఆచరణ పుణ్యకార్యంగాను లేని పక్షంలో అదే ఆచరణ పాపకార్యంగానూ మారిపోతుంది. ఈ విషయంగా ఖుర్ఆన్ వివరణ ఇలా వుంది:

**"ఈ సంపద, ఈ పరివారం కేవలం ఐహిక జీవితపు తాత్కాలిక అలంకారాలు మాత్రమే."** ***(ఖుర్ఆన్, 18 : 46)***

ఐహిక అలంకారాలుగా ప్రకటించబడిన ఈ సంపదలే ధర్మప్రచారం, దైవమార్గంలో సతత సమరం కొరకు ఖర్చు చేస్తే తద్వారా పై దైవకార్యాలకు శక్తి అందిస్తే అల్లాహ్ యొక్క అనుగ్రహాలుగానూ పేర్కొనబడ్డాయి.

**"తరువాత మేము మీకు వారిపై ప్రాబల్యం వహించే అవకాశాన్ని కలిగించాము. సంపదతోనూ, సంతానంతోనూ మీకు సహాయపడ్డాము."**

***(ఖుర్ఆన్, 17 : 6)***

ఇస్లామీయ సమాజానికి ధనం, సంతానాభివృద్ధి ద్వారానే బలహీనత నుండి ప్రఫుల్లత, పతనం తర్వాత ఉత్థానం అందింది. అల్లాహ్ అనుగ్రహం నుండి దూరమై మరలా ఆయన ప్రీతిని పొందగలిగింది.

విద్యా జ్ఞానాలకు కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది. ఒక వ్యక్తి వ్యవసాయ రంగంలో జ్ఞానం సంపాదించి తద్వారా భూమిని నిరంతరం పంటలతో కళకళ లాడింపజేస్తూ, ప్రజలకు ఉపయోగకారిగా ఉంటే, అతని ప్రతిఫలంలో ఎటువంటి కొరతా వుండదు. విశ్వాసంతోపాటు ఇస్లాం పై ఆచరణ కొనసాగిస్తూ ఉంటే – ఈ వ్యక్తి మెంబర్లకు, జానిమాజ్‌లకు, మసీదుకు అతుక్కుపోయిన వానికంటే కూడా అత్యధిక – అతి ఉత్తమ స్థానాన్ని పొందుతాడు.

ఇస్లాం శాస్త్ర విజ్ఞానం గల జ్ఞానులకు పెద్ద గౌరవాన్ని ప్రసాదించింది. వారి శ్రమ ప్రయత్నాలను గుర్తించి వాటికి తగిన ప్రతిఫలం లభిస్తుందనే శుభవార్తను అందించింది. ఈ క్రింది సుదీర్ఘ ఉల్లేఖనం ఈ విషయాన్ని స్పష్టం చేస్తుంది :

“ముఆజ్ బిన్ జబల్ (రజి) కథనం మేరకు దైవప్రవక్త (స) యిలా చెప్పారు: విద్యాజ్ఞానాలను అభ్యసించండి. ఇవి దైవనిష్ట వంటివి. వీటి అన్వేషణ ఆరాధన వంటిది. జ్ఞానవంతమైన చర్చ దైవ స్మరణ కాగా అందులో కృషి శ్రమ చేయడం దైవ మార్గంలో సతత సమరంలాంటిది. నిరక్షరాశ్యునికి విద్యా శిక్షణనివ్వడం దాన ధర్మాల కోవకు చెందుతుంది. అవసరమైనప్పుడు జ్ఞానాన్ని వినియోగించడం దైవసాన్నిహిత్యం ప్రసాదిస్తుంది. ఎందుకంటే ఇందులో దానధర్మాలు వుంటాయి. స్వర్గవాసుల మార్గంలో జ్ఞానం వెలుగు నింపుతుంది. ఒంటరి వ్యక్తికి జ్ఞానం తోడుగా వుంటుంది. అపరిచితునికి స్నేహితుని వంటిది. ఏకాంతంలోనూ మార్గదర్శిగా వుండి మంచి చెడుల విచక్షణను ప్రసాదిస్తుంది. శత్రువుకు వ్యతిరేకంగా ఆయుధంలా, పదిమందిలో అలంకరణలా వుంటుంది. జాతులకు ఉత్థానాన్ని ప్రసాదించి వారిని నాయకులుగా తీర్చి దిద్దుతుంది. ప్రజలు వారిని అనుసరించటానికి ఉబలాటపడతారు. దైవదూతలు వారితో స్నేహం చేయాలని కాంక్షిస్తారు. తమ రెక్కల ద్వారా వారిని దీవిస్తారు. క్రిమికీటకాలు కూడా వారి కోసం దుఆ చేస్తాయి. మనిషి జ్ఞానం ద్వారా అజ్ఞాన తిమిరాలను పారద్రోలుతాడు. హృదయాలను వెలుగుతో నింపుతాడు. జ్ఞానం ద్వారా మనిషి పరమపావనుల స్థానానికి అర్హుడవుతాడు. ఉభయ లోకాలలో ఉత్తమ స్థానాలు పొందుతాడు. అతని ఆలోచన ఉపవాసంగా, అతని శిక్షణ, రాత్రి ఆరాధనలుగా,

మారుతాయి. విద్యాజ్ఞానాల ద్వారా సత్‌సంబంధాలు ఏర్పడతాయి. ధర్మ-అధర్మాల మధ్య ఆమోద నిషేధాల మధ్య వ్యత్యాసం తెలుస్తుంది. అందుకనే విద్యాజ్ఞానాల వరం కేవలం అదృష్టవంతులకే లభ్యమవుతుంది. దురదృష్టవంతులు వీటికి దూరంగా వుండిపోతారు. (ఇబ్నె అబ్దుల్లాహ్)

## ఇతర భాషలు నేర్వడం అభిలషణీయం

ఇతర భాషలను నేర్వడం ఇస్లామీయ సాంప్రదాయంగా వుంది. దైవప్రవక్త (స) ఈ విషయంగా చాలా ప్రోత్సహించేవారు.

ప్రవక్త (స) గుమస్తాగా వుండిన జైద్ బిన్ సాబిత్ ఉల్లేఖనం యిలా ఉంది : "దైవప్రవక్త (స) నన్ను సిర్యానీ భాషలో ప్రావీణ్యం సంపాదించమని ఆదేశించారు. వారి ఆదేశం మేరకు ఆ భాషలో యూదులతో ఉత్తరప్రత్యుత్తరాలు చేయడం నేను నేర్చుకున్నాను. కేవలం సగం నెలలోనే నేను ఆ భాషను నేర్చుకున్నాను. ప్రవక్తశ్రీ వారి వైపు నుండి వారికి ఉత్తరాలు రాసేవాడిని, వారు రాసిన ఉత్తరాలకు ప్రవక్త శ్రీ వారి వైపు నుండి జవాబులు రాసేవాడిని." (బుఖారి)

ఇస్లాం కోసం ఇతర భాషలను నేర్వడం చాలా అవసరం. తద్వారా ఇస్లాం యొక్క విశ్వజనీన సందేశం ప్రపంచ ప్రజలందరికీ చేరాలి. భాషల వ్యత్యాసం దైవ నిదర్శనాల లోనిదే. కనుక, ప్రజలందరికీ అరబ్బీ భాష నేర్వడం కంటే - వారి మాతృభాషలోనే దైవ సందేశాన్ని అందజేయడం అత్యంత సులభమూ - ప్రయోజనకరమూ అవుతుంది. ఈ విషయంగా అల్లాహ్ యిలా తెలియజేశాడు :

**"మేము మా సందేశాన్ని అందజేసే నిమిత్తం ప్రవక్తను పంపినప్పుడల్లా, అతడు తన జాతి ప్రజలు మాట్లాడే భాషలోనే మా సందేశాన్ని అందజేశాడు."**

***(ఖుర్‌ఆన్,14 : 4)***

ఈ వాక్యానికి వ్యాఖ్యానం వ్రాసిన వ్యాఖ్యాన కర్తలు యిలా తెలిపారు: దైవ ప్రవక్త (స) అరబ్బీ ప్రాంతానికి చెందిన వారు కనుకనూ- అల్లాహ్‌కు ప్రథమ సుబోధకులు కనుకనూ, ఖుర్‌ఆన్ అరబ్బీ భాషలో అవతరింపజేయబడింది. కాని దారి సందేశం విశ్వజనీనమైన కారణంగా దైవప్రవక్త (స) తన అనుచరులను, ప్రతినిధులను ఇతర ప్రాంతాలకు పంపారు. వారు ఈ సందేశాన్ని వారి వారి భాషల్లోకి అనువదించి వారికి చేరవేశారు. అల్లాహ్ వైపునకు ఏకేశ్వరవాదం వైపునకు ఆహ్వానించారు.

పై చర్చవల్ల ముస్లింలు ఇతర భాషలు నేర్చుకోవాలనీ, అందులో పాండిత్యం సంపాదించాలనీ అర్థమవుతుంది. తద్వారా దైవ సందేశం పట్ల వారికి యివ్వబడిన బాధ్యత నెరవేర్చగలరు.

విద్యాజ్ఞానాలకు మాతృదేశంగాని, పుట్టినిల్లుగాని వుండదు. ఒక ప్రాంతానికి, జాతి తెగకు పరిమితమూ కాదు. విద్యాజ్ఞానాలు ఎక్కడ లభించినా ముస్లింలు వెళ్ళి విద్యాజ్ఞానాలను నేర్చుకోవాలి.

అనేక జాతులు – దేశాలు విద్యా విజ్ఞానాలలో ముందుండేవి. కాలచక్రంలో వారు అజ్ఞానాంధకారంలో మునిగిపోయారు. అనేక జాతులు అజ్ఞానాంధకారంలో వుండి తమ కృషి ద్వారా విద్యాజ్ఞానాలను సముపార్జించి ఉత్తమ స్థానానికి చేరు కున్నారు. స్వయంగా యూరప్ శతాబ్దాలుగా అంధకారంలో మునిగి వుండింది. కాని నేడు ప్రపంచానికి అధినాయకునిగా మారింది. అభివృద్ధికి చిరునామాగా వుంది. ముస్లింలు విద్యాజ్ఞానాలను వెతకాలి. ఎక్కడ లభించినా వాటిని నేర్చకోవాలి. హస్తగతం చేసుకోవాలి.

ప్రవక్త (స) ఇలా నుడివారు, “ఒక విశ్వాసికి (జ్ఞాన సంబంధ) మంచి విషయం విన్నంత మాత్రాన అతని కడుపు నిండదు. (నిరంతర జ్ఞాన పిపాసి అయి) చివరకు స్వర్గంలో ప్రవేశిస్తాడు.” (తిర్మిజి)

“వివేకవంతమైన జ్ఞానం, విశ్వాసి పోగొట్టుకున్న వస్తువు వంటిది. అది ఎక్కడ దొరికినా దానికి అతడు అర్హుడవుతాడు.” (తిర్మిజి)

“విద్యాజ్ఞాన సముపార్జన కోసం బయలుదేరినవాడు దైవ మార్గంలో పోరాటం (సతతసమరం) చేస్తున్నాడు.” (తిర్మిజి)

నేర్పడం–నేర్చుకోవడం ఇస్లాంకు ఆత్మ వంటిది. ఈ ఆచరణలేని నాడు భవిష్యత్తే లేకుండా పోతుంది. ఇస్లాంలో ఒక విశ్వాసి అయితే విద్యార్థిగా వుంటాడు లేక ఉపాధ్యాయునిగానైనా వుంటాడు. రెంటికీ చెందని వ్యక్తికి ఇస్లాంలో ఎటువంటి విలువా వుండదు. దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు:

“బోధకుడూ, విద్యార్థీ ఇద్దరూ శుభ సంక్షేమాలలో భాగస్వాములై వుంటారు. మిగతా వారు శుభానికి దూరంగా వుంటారు.”



# 26వ భాగం

# సమయాన్ని సద్వినియోగపర్చుకోవాలి!

- చరిత్ర నుండి గుణపాఠం నేర్వాలి!!
- గడిచిన సమయం మరలిరాదు!
- సమయం (కాలం) ఖడ్గం వంటిది.
- సమయం (తక్కువ) పరిమితం - విధులు అనేకం (పరిమితకాలం విధులు అనేకం)
- జాగృతి కలవారికి గుణపాఠం
- జాతుల సమాజాల అధ్యయనం

# గడిచిన సమయం మరలి రాదు

పోగొట్టుకున్న వస్తువు మరలా దొరకవచ్చు. ఓటమిని విజయంగా మలుచుకోనూవచ్చు. కాని గడిచిపోయిన ఒక్క క్షణాన్ని కూడా తిరిగి రప్పించడం సాధ్యం కాదు. మనిషి అధీనంలో వున్న సమస్త వనరుల్లో కాలం అత్యంత విలువైనది. ఈ కారణంగానే మనిషి కాలం యొక్క ప్రాముఖ్యతను గుర్తించి దానిని సద్వినియోగపర్చుకోవాలి. సమయాన్ని అత్యున్నత సంపదలా భావించాలి. దానిని వృధా చేయకూడదు. కాలం ముందు మిగిలిన వనరులన్నీ వృధాగా కనపడతాయి.

సాధారణంగా గడిచిపోతున్న సమయం గురించి మనం పెద్దగా ఆలోచించము. అప్పుడప్పుడు వర్తమానంలోని తన గురించి ఆలోచిస్తాం. గతకాలాన్ని నెమరు వేసుకుంటూ తప్ప నష్టపోయిన కాలం గురించి ఆలోచించం. ఈ స్థితిలోనే రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచిపోతాయి. సంఘటనలు, ఘట్టాలు ఇట్టే కళ్ళ ముందు జరిగి అన్నీ ఒకచోట చేరిపోతాయి. జీవితమంతా ఒకే రోజులో పూర్తి అయినట్టు అనిపిస్తుంది. సంఘటనలన్నీ ఒకే సమయాన జరిగినట్టు అనిపిస్తుంది. "నాలుగు దినాల జీవితాన్ని కోరి తెచ్చాను."

"రెండు ఆశలకు – రెండు ఎదురు చూపులలో ఖర్చయిపోయాయి."

భౌతిక ప్రపంచంలోని కాలం పరిస్థితి ఈ విధంగా వుంటే – మరి లెక్కల దినాన పరిస్థితి ఎలా ఉంటుందో కదా!

**"అల్లాహ్ వారిని సమావేశపరిచే రోజున (ఇహలోక జీవితం వారికి ఎలా అనిపిస్తుందంటే) వారు కేవలం ఒక ఘడియకాలం వరకు ఒకరినొకరు గుర్తు పట్టటానికి మాత్రమే ఆగారా అన్నట్లు."** ***(ఖుర్ఆన్, 10 : 45)***

**"అప్పుడు వారు ప్రపంచంలో మహా అయితే మీరు పదిరోజులు గడిపారేమో" అని పరస్పరం గుసగుసలాడుకుంటారు – వారు మాట్లాడుకుంటూ ఉండేది ఏమిటో మాకు బాగా తెలుసు. అప్పుడు వారిలో అతి జాగ్రత్తగా అంచనా వేసే వాడు సైతం 'కాదు' ప్రపంచంలో మీ జీవితం కేవలం ఒక రోజు జీవితం మాత్రమే" అనే అంటాడు.** **(ఖుర్ఆన్, 20 : 103–104)**

ఈ భావన మనిషికి చాలా ప్రయోజకరమైనది. మనిషి వాస్తవికత ఎరిగిన

వాడు, మనిషి మట్టి నుండి వచ్చాడు. మట్టిలోకే వెళ్ళవలసి వుందని గ్రహిస్తారు. అయితే ఇహలోకం కంటే పరలోకానికే ప్రాధాన్యతనిచ్చేవారు మాత్రమే ఈ భావన నుండి నిజమైన ప్రయోజనం పొందగలుగుతారు. తత్ వ్యతిరేకంగా కేవలం మట్టి మట్టిలో కలవడంగా భావించేవారు ఈ భౌతిక ప్రపంచానికే అత్యధిక ప్రాధాన్యత నిస్తారు. సుఖం, భోగం, లాలసలు వీలైనంతగా ఇక్కడే అనుభవించాలని తీవ్రంగా తాపత్రయపడతారు. గతం, వర్తమానాన్ని నిర్లక్ష్యం చేసి 'ఆనందో(బ్రహ్మ' అని సూత్రీ కరించుకొని ఆనందం-సుఖం జుర్రుకోవడానికే అధిక ప్రాముఖ్యతనిస్తారు. ఎప్పుడైతే శరీరం ఉడిగిపోయి, మరణం దగ్గర పడినప్పుడు కళ్ళు బైర్లు పడిపోతాయి. గగ్గోలు పెట్టడం ప్రారంభిస్తారు. "చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొని ప్రయోజనం లేదుకదా!

ఈ ప్రపంచంలో మానవుని స్థానం, వ్యవహారం చాలా విచిత్రమైనదిగా వుంటుంది. ఆటపాటల మత్తులో జీవిస్తాడు. కాని తన విధి తన పనితాను చేసు కుంటూ వెళుతూ వుంటుంది. ఏమరుపాటు మనిషిని పూర్తిగా కమ్ముకుని వుంటుంది. అయితే మనిషి యొక్క ప్రతి ఆచరణ రికార్డు చేయబడుతూ వుంటుందని ఎరుగడు. ఈ విషయాన్ని అల్లాహ్ ఈ క్రింది పదచిత్రంలో చూపించాడు:

> **"అల్లాహ్ వారందరినీ మళ్ళీ బ్రతికించి లేపి వారేమేమి చేసి వచ్చిందీ వారికి తెలియజేసే రోజున (వారికి అవమానభరితమైన శిక్ష పడుతుంది). వారు మరచిపోయారు కాని, అల్లాహ్ వారు చేసినవన్నీ ఒక్కొక్క దానిని లెక్కబెట్టి భద్రంగా ఉంచాడు. అల్లాహ్ ప్రతి ఒక్కదానికీ సాక్షిగా ఉన్నాడు."**
>
> ***(ఖుర్ఆన్, 58 : 6)***

ఒక సహజమైన ముస్లిం సమయానికి, అత్యధిక విలువను యిస్తాడు. ఈ కాలమే నిజానికి తన జీవిత సమయమని గుర్తిస్తాడు. దీనిని వ్యర్థపర్చడం లేక పోగొట్టు కోవటం అంటే తన జీవితాన్ని పోగొట్టుకోవడంగా గుర్తిస్తాడు. కాలం పట్ల నిర్లక్ష్యం వినాశన హేతువు అనీ తన కాళ్ళను తనే గొడ్డలితో నరుక్కోవడమని తెలుసుకుంటాడు.

మనిషి అత్యంత వేగంగా అల్లాహ్ వైపునకు (మరణం వైపునకు) పరుగిడు తున్నాడు. ప్రతి సూర్యోదయం ఈ ప్రయాణికి ఒక్కొక్క మెట్టుగా వుంది. ఈ ప్రయా ణంలో విరామ, విశ్రాంతులకు అవకాశమే లేదు. ఈ వాస్తవాన్ని గుర్తించకపోవడం

వివేకవంతుల లక్షణం కాదు. భూతవర్తమాన కాలాలను ఎన్నటికీ మరువకూడదు. రైలులో ప్రయాణిస్తూ బయటి ప్రపంచం వెనుకకు పరుగిడుతుందని భావించడం తగదు. నిజం ఏమిటంటే, బయటి ప్రపంచం నిలబడి వుంది. తాను మాత్రం సాగిపోతూ వున్నాడు.

## కాలం ఖడ్గం వంటిది

ఇస్లాం, సమయం యొక్క ప్రాధాన్యతను, విలువను గుర్తించిన ధర్మం. అది తన అనుయాయులకు "కాలం ఖడ్గం వంటిది. నిర్లక్ష్యం వహించావా అది నిన్ను ఖండించివేస్తుంది" అని హెచ్చరిక జారీ చేస్తుంది. దొరికిన జీవిత కాలంలోనే మనిషి జీవిత సత్యాన్ని తెలుసుకోవాలి. సమయాన్ని సంపూర్ణంగా సద్వినియోగపర్చుకోవాలి. ఈ ఆచరణ విశ్వాసానికి రుజువుగా దైవనిష్ఠకు గుర్తుగా వుంటుంది.

**"నిశ్చయంగా రేయింబవళ్ళ నిరంతర పరిభ్రమణంలో భూమ్యాకాశాలలో అల్లాహ్ సృష్టించిన ప్రతి వస్తువులో (తప్పుడు దృష్టికోణం నుండి తప్పుడు ప్రవర్తన నుండి) తప్పించుకోగోరే వారికొరకు సూచనలు ఉన్నాయి."**

***(ఖుర్‌ఆన్, 10 : 6)***

భవిష్యత్తు పట్ల ఏమరుపాటు కలిగి ప్రాపంచిక జీవిత భోగవిలాసాలలో వాటి ఆకర్షణల్లో జీవితం గడిపేవారిని అవివేకులుగా ఇస్లాం పరిగణించింది.

**యథార్థం ఏమిటంటే మమ్మల్ని కలుసుకోవాలని ఆశించనివారూ ప్రాపంచిక జీవితాన్నే వరించి దానితోనే తృప్తి చెందినవారూ మా సూచనల పట్ల నిర్లక్ష్య భావం కలిగివున్నవారూ - అటువంటి వారి అంతిమ నివాస స్థలం నరకమే అవుతుంది. వారు చేస్తూ వచ్చిన చెడుకు ఫలితంగా యివ్వబడుతుంది.**

***(ఖుర్‌ఆన్, 7-8)***

ఇస్లాం తన ముఖ్యమైన ఆరాధనలన్నింటిని - ప్రతిరోజు వివిధ సమయాల్లోనూ, విభిన్న రుతువుల్లోనూ, కాలాల్లోనూ విభజించింది. రోజువారి ఐదు నమాజులు ఉషోదయం నుండి రాత్రి వరకు విస్తరించబడి వున్నాయి. వాటి సమయాలు పగతి కాలానుగుణంగా వున్నాయి. జిబ్రయీల్, ఆకాశం నుండి నమాజుల విభిన్న సమయాలను తీసుకొని ఏతెంచారు. వీటి పునాదులపై ఇస్లామీయ జీవన వ్యవస్థ ఉనికిలోకి తేబడింది. ఆరాధనలు, దైవధ్యానం, స్మరణలను ఉషోదయం నుండి రాత్రి వరకు వివిధ సమయాల్లో ఆచరించేలా విభజించడమైంది.

**"కనుక నీవు అల్లాహ్ పరిశుద్ధతను కొనియాడు, సాయంత్రం అయినప్పుడు, ఉదయం అయినప్పుడు, ఆకాశాలలోనూ, భూమిలోనూ ఆయనే స్తుతింపదగిన వాడు, మధ్యాహ్నం అయినప్పుడు సూర్యాస్తమయం అయినప్పుడు (ఆయనను స్తుతించు)."** ***(ఖుర్ఆన్, 30 : 17-18)***

హ్రస్వదృష్టి కలవారి ఆలోచనలు కేవలం కొన్ని పరిమితులకు మదింపబడి వుంటాయి. కాలం విసిరిన అనేక ఘటనల్లో సుఖసంతోషాల అనుభవంలోనే బందీ అయి వుంటారు. అదే సమయంలో గర్వాంధులైన అనేక మందిని కాలం చరిత్రలోకి విసిరివేసింది. ఆశలు, కోరికలన్నింటిని నలిపివేసే శక్తి కాలానికి వుంది. అనేక సభ్యతా సంస్కృతులను వినాశపు గుంతల్లో పూడ్చిపెట్టింది. ఒకప్పుడు ఈ సభ్యతా సంస్కృతులను, వారి నాగరికతలనే ప్రపంచం చూసి అచ్చెరువు చెందుతూ వుండింది. ఈ మొత్తం 'కాలచరిత్ర' మనిషికి హెచ్చరికలాంటిది. శుభసంక్షేమకర – మంచి కార్యాల ద్వారా, లాభదాయక ఆచరణ ద్వారా కాలాన్ని సద్వినియోగపర్చుకొమ్మని తెలుపుతుంది.

**"ఆకాశంలో బురుజులను నిర్మించినవాడూ, అందులో ఒక దీపాన్ని, ఒక మెరిసే చంద్రుణ్ణి వెలిగించినవాడూ ఎంతో శుభప్రదుడు. ఆయనే రేయింబవళ్లను ఒక దాని వెంట ఒకటి వచ్చేలా చేశాడు, గుణపాఠం నేర్చుకోదలచిన లేదా కృతజ్ఞతలు తెలుపుకోదలచిన ప్రతి వ్యక్తి కోసం."** ***(ఖుర్ఆన్, 25: 61-62)***

పగటి తర్వాత రాత్రి– రాత్రి తరువాత ఖగోళ చలనం ద్వారా వెలుగులు చిమ్ముతూ పగలు వస్తూనే వుంటుంది. ఈ రాత్రి పగళ్ళను అల్లాహ్ అనవసరంగా సృష్టించలేదు. ఈ కాలచక్రాన్ని, జీవిత గమనాన్ని వ్యర్థమైనదిగా భావిస్తే అది మనిషి తెలివితక్కువ తనానికి నిదర్శనం. ఈ జీవితపు మైదానం మనిషికి పరీక్షా స్థలిగా ప్రసాదించబడింది. ఈ పరీక్షలో తమ నిజ విశ్వప్రభువును గుర్తించిన వారే పాల్గొనగలరు. ఆయన హక్కుల గురించి చైతన్యం కలవారే ఇక్కడ మనగలరు. దైవానుగ్రహానికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించేవారే ఇక్కడ తమ నిరంతర శ్రమ ద్వారా సత్కర్మలను ఆచరించగలరు. దానికి ప్రతిఫలాలనూ పొందగలరు. ఈ సత్యాల పట్ల ఏమరుపాటు నిర్లక్ష్యం ప్రదర్శించేవారూ– తాత్కాలిక ప్రాపంచిక లాభాల వెంట పరుగెత్తేవారు వాస్తవానికి అవివేకులుగా రుజువు అవుతారు. వారు ఎటువంటి హితబోధనూ గ్రహించలేరు. వారికి ఎటువంటి బోధనలు లాభం చేకూర్చనూ లేవు.

**"ప్రతి సంవత్సరమూ ఒకటి లేక రెండుసార్లు పరీక్షకు గురి చేయబడటం వారు చూడటంలేదా? కావి, దీని తర్వాత కూడా వారు పశ్చాత్తాప పడటంలేదు. ఏ గుణపాఠాన్ని నేర్చుకోవడం లేదు.** ***(ఖుర్ఆన్, 9 : 126)***

ఆయుష్షు అల్లాహ్ ప్రసాదించిన వరం. ఈ వరం గురించి ప్రతి వ్యక్తినీ ప్రశ్నించడం జరుగుతుంది. ప్రళయ దినాన ఈ వరప్రసాదాన్ని ఎలా ఉపయోగించావు? అని తప్పక అడగడం జరుగుతుంది. దైవప్రవక్త (స) ఈ విషయంగా ఇలా హెచ్చరించారు:

"తీర్పుదినాన ఎవ్వరూ ఈ నాలుగు ప్రశ్నలకు సమాధానం ఇవ్వనంత వరకు ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేరు. మొదటిది, తన జీవితాన్ని ఏ ఏ కార్యాల్లో గడిపావు. రెండవది, యవ్వనాన్ని ఏ పనులలో ఖర్చు చేశావు. మూడవది, డబ్బు ఎక్కడ నుండి సంపాదించావు. ఎక్కడ (ఎలా) ఖర్చు చేశావు. ఇక చివరిది, సంపాదిం చిన (పొందిన) జ్ఞానాన్ని ఎంత వరకు ఆచరణలో పెట్టావు."

ఇస్లాం తన ఆమోద- నిషేధితాలల్లో సమయపాలనకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చింది. అనవసర విషయాల్లో సమయాన్ని వృధా పర్చకూడదని హెచ్చరించింది. ఈ హెచ్చరికను బుద్ధిహీనులు అర్థం చేసుకోక, ఇతరుల మనసులను రంజింప జేయడానికి కాలాన్ని వ్యర్థపరుస్తూ వుంటారు. నిజానికి ఈ వ్యర్థ ప్రేలాపనలు-తన ఆయుష్షుతో ఆడుతున్న నష్టదాయక ఆట మాత్రమే సమయాన్ని వృధాపర్చడం. వ్యక్తిగతంగా వ్యక్తికి, సామాజికంగా సమాజానికి తీవ్ర నష్టాన్ని కలుగజేస్తుంది.

## పరిమిత కాలం - విధులు అనేకం

'విధులు అనేకం- కాలం పరిమితం' అనే సత్యం సాధారణ ప్రజల దృష్టికి అందదు. అదే విధంగా 'కాలం కొందరికి ప్రాణమిత్రుడైతే-మరికొందరికి క్రూర శత్రువుగా వ్యవహరిస్తుంది. హసన్ బస్రీ (రహ్మ) ఈ విషయంగా ఇలా వ్యాఖ్యానించారు:

"ఫజ్ర్ నమాజ్ అయిన వెంటనే ప్రతిరోజూ దైవం తరఫు నుండి ఒక దూత, "ఓ ఆదం కుమారుడా! నేను ఒక ప్రత్యేకమైన సృష్టిని. నేను నీ కర్మలకు సాక్షిగా వున్నాను. నా ద్వారా సత్కార్యాలు చేసి పుణ్యాల ఖజానాను నింపుకో. ఎందుకంటే నేను తీర్పు దినం వరకు మరలా తిరిగి నీ వద్దకు రావడం కుదరదు.'

ఇస్లాం అందించే ఈ బోధనలు, ఉపదేశ ఆదేశాలు అన్ని ఈ ప్రపంచం,

పరలోక జీవితానికి సేద్యపు భూమి వంటిదని రుజువు చేస్తున్నాయి. ఇక్కడ కష్టపడి సేద్యం చేస్తే అక్కడ దాని తాలూకు సుఖ సంతోషాల ఫలితం పొందవచ్చు. ఈ మహా ద్భాగ్యం కేవలం అల్లాహ్ అనుగ్రహం ద్వారానే లభ్యమవుతుంది. కనుక మనిషి తనకు దొరికిన ఈ జీవిత కాలంలో వీలైనంతగా మంచి పనులు చేయాలి. ఒక సత్కార్యం ముగిసిన వెంటనే మరో సత్కార్యానికి సంసిద్ధుడవ్వాలి.

> **"అల్లాహ్ నీకు యిచ్చిన సంపదతో పరలోకంలో గృహాన్ని నిర్మించుకునే యోచన చేయి. ప్రపంచంలో నీ వాటాను విస్మరించకు. అల్లాహ్ నీకు ఉపకారం చేసిన విధంగానే నీవూ ఉపకారం చేయి." *(ఖుర్ఆన్, 28 : 77)***

సాధారణ ప్రజలు తమ సమయ పరిరక్షణ పట్ల శ్రద్ధ చూపకపోవడం అత్యంత విచారకరం. తమ సమయాన్నే కాక ఇతరుల సమయాన్ని కూడా ధ్వంసం చేసే తీవ్రమైన నేరానికి కూడా ఒడిగడుతున్నారు. పనిలో నిమగ్నమయి వున్న వారికి అంతరాయం కలిగించి వారి పనినీ చెడగొడతారు. 'కూసే గాడిద-మేసే గాడిదను చెడిపింది' అనే సామెతకు సరిగ్గా సరిపోతారు. ఈ విషయంగా ప్రవక్తశ్రీ బోధన యిలా వుంది:

"రెండు దైవ అనుగ్రహాల పట్ల మనిషి తరచూ నిర్లక్ష్యం ప్రదర్శిస్తాడు. ఒకటి ఆరోగ్యం కాగా రెండవది తీరిక సమయం." (బుఖారి-ముస్లిం)

ఇస్లాం సమయ సద్వినియోగం కోసం అనేక విధానాలు సూచించింది. మనిషి నిరంతరం ఆచరణలో నిమగ్నుడవ్వాలి. ఒక పనిని ఆరంభ శూరత్వంలాగా ప్రారంభించి మధ్యలో వదిలివేయకూడదు. నిరంతరం చైతన్యవంతంగా చేయాలి. చిన్న ఆచరణ అయినా నిరంతరం చేస్తూ పోవాలి. చుక్క చుక్క నీరు చేరి సముద్రమైనట్లుగా సదాచరణ పేరుకొని ఒక పెద్ద కొండలా మారుతుంది. ప్రారంభంలో దీని గొప్పతనం మనకు ఏ మాత్రం తెలియదు.

సదాచరణ అనేది, బుద్ధిపుడితే చేయడం, సోమరితనం వల్ల మానివేయడం లాంటిది కాదు. ఇది అత్యంత అసహ్యకర విషయం. అతి ఉత్సాహానికి లోనై రెండడుగులు ముందుకు వేసి ఉత్సాహం చప్పగా చల్లారిపోతే నాలుగడుగులు వెనక్కు వేయడం క్షంతవ్యం కాదు.

ఒక ప్రవచనంలో ఇలా చెప్పబడింది: "ప్రజలారా! మీ శక్తి మేరకే సదాచరణ చేయండి. అల్లాహ్ పుణ్యం ప్రసాదించడంలో వెనకడుగువేయడు. ఆ సదాచరణతో

మీరు విసుగు చెందవచ్చుగాక! కాని అల్లాహ్‌కు ప్రతి చిన్న సత్కార్యం కూడా అత్యంత ప్రీతివంతమైంది." (బుఖారి–ముస్లిం)

మరో ప్రవచనంలో "చక్కగా జీవించండి. మధ్యేమార్గాన్ని అవలంభించండి. పగలు నడవండి. సాయంత్రమూ నడవండి. రాత్రి చివరి జాములోనూ నడవండి. ప్రయాణాన్ని కొనసాగించండి. గమ్యాన్ని చేరుకోగలరు." అని పేర్కొనటం జరిగింది (బుఖారి–ముస్లిం)

హజ్రత్ ఆయెషా (రజి) ఉల్లేఖనం ప్రకారం, "దైవప్రవక్త (స) నా వద్దకు వచ్చారు. బనూ అసద్‌కు చెందిన స్త్రీ నా వద్ద కూర్చొని వుంది. ప్రవక్తశ్రీ ఈమె ఎవరని అడిగారు. దానికి నేను 'ఫలానా స్త్రీ' అని చెప్పాను. 'ఈమె రాత్రంతా ప్రార్థనల్లో గడపు తుంది' అని అన్నాను. దానికి ప్రవక్తశ్రీ "ఆగు. నీవు చేయగలిగినంత ఆరాధనే నీపై విధిగా వుంది. ఏ కొద్ది సత్కార్యమైనా ఎల్లప్పుడూ క్రమం తప్పకుండా చేసేదే అల్లాహ్‌కు ఎంతో యిష్టం" అని చెప్పారు. (ముస్లిం)

సమయ సద్వినియోగం (Time Management)లో భాగంగానే ఇస్లాం ఉదయాన్నే మేల్కొనాలని ఆజ్ఞాపించింది. పనిని పూర్తి ఉత్సాహంతో - ఉత్తేజంతో ప్రారంభించడమేకాక దానిని ముగించాలని ఆదేశించింది. ఉషోదయం నుండే ఈ శ్రద్ధాశక్తులు ఉత్తేజ ఉత్సాహాలు వుంటే పని నుండి సంపూర్ణ లబ్ధి– ఈ సమయం నుండి సంపూర్ణ ప్రయోజనం పొందే వీలుంటుంది. సమయం వృథా కాకూడదనే దృఢ నిశ్చయం కలుగుతుంది.

ఇస్లామీయ జీవన వ్యవస్థ ఫజ్ర్ నమాజ్ నుండి ప్రారంభమవుతుంది. సూర్యోద యానికి పూర్వం నుండే మనిషి సంపూర్ణ చైతన్యవంతుడై కార్యరంగంలో దిగాలి. దానిని విధిగా భావించాలి. అదే సమయంలో రాత్రి ఆలస్యంగా నిద్ర పోవటాన్ని ఇస్లాం అసహ్యించుకుంటుంది. (Early to bed - Early to wake) 'త్వరగా నిద్రలేవాలి – రాత్రి త్వరగా నిద్రపోవాలి' అనే సూత్రాన్ని ఇస్లాం ఆచరిస్తుంది. తద్వారా ఫజ్ర్ నమాజ్ తప్పి పోకుండా వుండేందుకు జాగ్రత్త వహిస్తుంది.

దైవప్రవక్త (స) ఇలా ప్రార్థించేవారు, "ఓ అల్లాహ్! నా అనుచర సమాజానికి ఉషోదయపు శుభాలు అనుగ్రహించు." (అబూదావూద్)

ప్రొద్దువాలే వరకు నిద్రపోవడం, ఆలస్యంగా నిద్రలేవడం అసహ్యించుకోదగ్గ అలవాటు. ఇతరులు పనులలో నిమగ్నులై తమ తమ ఉపాధి పనుల్లో మునిగి వుండగా

వీరు దుప్పటి కప్పుకొని వుంటారు. ఇతరులు సంపాదన, పరలోక సాఫల్య కృషిలో వుండగా వీరు నిర్లక్ష్యపు నీడలో నిద్రిస్తూ వుంటారు. దైవప్రవక్త ముహమ్మద్ (స) ప్రియ పుత్రిక హజ్రత్ ఫాతిమా (రజి) యిలా తెలిపారు: దైవప్రవక్త (స) ఒకసారి నా యింటికి వచ్చారు. ఆ సమయంలో నేను కొంత నడుం వాల్చి వున్నాను. ఆయన నన్ను తన పాదంతో కదిలించారు. ఇలా అన్నారు: 'ఓ నా ప్రియకుమారీ! లే! లేచి నా ప్రభువు అనుగ్రహాన్ని అన్వేషించు. ఏమరుపాటుకు గురికాకు. ఎందుకంటే అల్లాహ్ ఉదయం నుండి సాయంత్రం వరకు ఉపాధిని పంచుతాను" అని చెప్పాడు (బైహఖి)

కష్టజీవులు, సోమరులపై ఆధిక్యత సంపాదించే సమయం ఇదే మరి. వారి వారి శ్రమకు తగ్గ ఫలితాన్ని ఉభయ లోకాల శుభాలను అల్లాహ్ వారికి ప్రసాదిస్తాడు.

## జాగృతి కలవారికి గుణపాఠం

కాలం కష్టనష్టాలతో, సమస్యలు, ఆపదలతో కూడి వుంటుంది. అదే విధంగా వ్యవహారాలు, వాటి తాలూకు తీర్పులను కూడా కాలం దైవదాసులపై వెలువరిస్తుంది. వీటన్నింటిని విశ్వప్రభువు అల్లాహ్ తన దాసులకై అవతరింపజేస్తాడు. ఈ తీర్పుల ద్వారా ఎవరైతే గుణపాఠం, ప్రబోధం స్వీకరిస్తారో వారు దూరదృష్టికలవారై వుంటారు.

**"రేయింబవళ్ల పరిభ్రమణమును ఆయనే చేస్తున్నాడు. కళ్ళున్న వారికి ఇందులో గుణపాఠం వుంది."** ***(ఖుర్ఆన్, 24 : 44)***

ప్రజలు సాధారణంగా సంఘటనలు, పరిణామాలను చూస్తారే తప్ప వీటికి కారుకుడైన సృష్టికర్త పట్ల దృష్టి సారించరు. యోచనా చేయరు. సుఖదుఃఖాల స్థితి నుండి పయనిస్తారు. కాని వాటి ప్రదాత పట్ల నిర్లక్ష్యం ప్రదర్శిస్తారు. జీవితంలో కష్టాలు బాధలు ఎదురయినప్పుడు కాలాన్ని తిట్టడం మొదలెడతారు. సృష్టికర్త, విశ్వప్రభువు ఘటనా ఘటన సమర్థుడైన అల్లాహ్ పట్ల ఏమరుపాటుకు ఇది నిదర్శనంగా వుంటుంది. దైవప్రవక్త (స) ఇలా తెలిపారు:

అల్లాహ్ ఇలా తెలియపరుస్తున్నాడు, "ఆదం కుమారుడు కాలాన్ని తిట్టడం ద్వారా నన్ను బాధకు గురిచేస్తున్నావు. వాస్తవానికి కాలాన్ని నేనే. నా చేతిలోనే వ్యవహారాలు అన్ని వున్నాయి. రాత్రి పగళ్ళు పరిభ్రమణం నా ద్వారానే జరుగుతుంది.' (అబూదావూద్)

కాలం నిజానికి మనిషి మంచి చెడులను కలగజేయలేదు. ప్రజల విచారం

లేక సుఖం కాలం చేతిలో లేదు. వీటన్నిటిని సృష్టించిన సృష్టికర్త అల్లాహ్ మాత్రమే కారకుడయి వున్నాడు.

**"ప్రతి ప్రాణి మృత్యువును తప్పక రుచి చూస్తుంది. మేము మీ అందరిని మంచి చెడు పరిస్థితులకు గురిచేసి పరీక్షిస్తున్నాము. చివరకు మీరు మా వైపునకే మరలవలసి వున్నది." *(ఖుర్ఆన్, 21: 35)***

అల్లాహ్ విభిన్న పరిస్థితులలోని విభిన్న దశలను, బుద్ధిజ్ఞానం కలవారు ఆలోచించాలని తద్వారా గుణపాఠం స్వీకరించాలనీ, ఫలితంగా వారిలో విశ్వాస–నమ్మకాలు మరింత వృద్ధి పొందాలని తెలుపుతున్నాడు.

**"ఆయన తన సూచనలను స్పష్టంగా వివరిస్తున్నాడు. బహుశా మీరు మీ ప్రభువును కలుసుకునే విషయాన్ని నమ్ముతారేమో అని." *(ఖుర్ఆన్, 13 : 2)***

బుద్ధిహీనులు, అవివేకులయిన వారు – మంచి, చెడు స్థితులను గమనించి నప్పటికీ, దాని ఎత్తుపల్లాల నుండి గుణపాఠాన్ని మాత్రం నేర్చుకోరు. ఒక ప్రవచనంలో దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు:

"ఒక కపటి అయిన ద్వంద్వ స్వభావి, జబ్బునపడి తిరిగి ఆరోగ్యవంతుడైతే అతని స్థితి ఒక ఒంటెను పోలి వుంటుంది. దాని యజమాని దానిని కొన్ని సందర్భాలలో కట్టి వుంచుతాడు. మరికొన్ని సందర్భాలలో వదిలివేస్తాడు. అసలు ఎందుకు కడతాడో ఎందుకు వదులుతాడో ఆ ఒంటెకు తెలియనే తెలియదు." (అబూ దావూద్)

అనుభవాల నుండి గుణపాఠాన్ని నేర్చుకోని వ్యక్తి విశ్వాసి కాలేడు అనేది నూటికి నూరు శాతం నిజం. అసలు కష్టాలు, బాధలు ఒక అజ్ఞానిని జ్ఞానవంతునిగా మలచడానికే వస్తాయి. ఏమరుపాటుకు గురైన వ్యక్తిని జాగృతపర్చడానికీ దైవం నుండి దూరంగా వున్న వారు ఆయన వైపునకు మరలడానికే వస్తాయి.

**"మీకు పూర్వం అనేక జాతుల వద్దకు మేము ప్రవక్తలను పంపాము. ఆ జాతులను మేము కష్టాలకు, కడగండ్లకు గురిచేశాము, వారు మా ముందు వినయంతో తలవంచాలని. మా తరఫు నుండి వారిపైకి ఆపద వచ్చిపడి నప్పుడు వారు ఎందువల్ల వినమ్రులు కాలేదు?" *(ఖుర్ఆన్, 6 : 42-43)***

మనిషి కష్టకాలంలో, విశ్వప్రభువును వేడుకుంటాడు. దుఃఖాల సుడిగుండంలో

చిక్కుకొని ఎటువంటి ఆధారం కానరాక – ఆధారాలన్నీ తెగిపోయి నిస్సహాయునిగా వున్నప్పుడు అల్లాహ్ శరణు వేడుకుంటాడు. అయితే ఒక బుద్ధిమంతుడైన వివేకి కష్టకాలంలో దైవ సహాయాన్ని అర్థిస్తాడు. తద్వారా కష్టాల నుండి బయటపడతాడు. సుఖసంతోషాలలో కూడా దైవానికి కృతజ్ఞతలు చెల్లిస్తూ వుంటాడు. కష్టాలలో వేడుకొని సుఖాలలో అహం ప్రదర్శించి కృతఘ్నతకు పాల్పడడు.

దైవద్రోహులు, దుర్ఘటనల్లో దుఃఖాల్లో దైవాన్ని శరణుకోరి సుఖసంతోషాలలో దైవాన్ని మరిచిపోతారు.

**"మానవుడి స్థితి ఎలాంటిదంటే అతడికి కష్టకాలం దాపురించినప్పుడు నిలబడీ, కూర్చుండీ, పరుండీ మాకు మొరపెట్టుకుంటాడు. కాని మేము అతడి ఆపదను తొలగించినప్పుడు అతడు ఎప్పుడూ తనకు కలిగిన ఏ గడ్డు కాలంలోనూ మాకు మొరపెట్టుకోనేలేదు అనే విధంగా ప్రవర్తిస్తాడు." *(ఖుర్ఆన్, 10 : 12)***

ఇది ఒక గౌరవనీయుడైన వ్యక్తికి తగని అతి నీచ నికృష్టమైన పనిగా భావించ బడుతుంది.

## జాతుల, సమాజాల అధ్యయనం

కాలం నుండి గుణపాఠం నేర్చుకోవడానికి చారిత్రక గ్రంథాల అధ్యయనం తప్పనిసరి. విశ్వసృష్టిలోనూ, స్వయంగా తన ఉనికిలోనూ వున్న సత్యాలను గ్రహించాలి. జాతుల, సమాజాల ఉత్థాన పతనాలను అధ్యయనం చేయాలి. వాటి అభివృద్ధికి కారణాలనూ, పతనాలకు హేతువులనూ అన్వేషించాలి. ప్రాచీన కాలాల చరిత్రను అధ్యయనం చేసి తమ బుద్ధివివేకాలతో ఆలోచించి తగిన గుణపాఠాలను నేర్చుకునే ప్రయత్నం చేయాలని సృష్టికర్త అల్లాహ్ కోరుకుంటున్నాడు:

**"వారు భూమిపై సంచరించలేదా? వారి హృదయాలు అర్థం చేసుకోగలవిగా, వారి చెవులు వినగలవిగా కావటానికి? యథార్థం ఏమిటంటే, కళ్లు గుడ్డివి అవవు, కాని వక్షముల లోపల ఉన్న హృదయాలు మాత్రం గుడ్డివి అయి పోతాయి." *(ఖుర్ఆన్, 22 : 46)***

మనుషుల్లో రెండు రకాల వారు వుంటారు. మొదటి రకం వారు తమ ప్రత్యేక అనుభవాల ద్వారా పరిస్థితులను అధ్యయనం చేయడం ద్వారా తన్ను తాను

సరిదిద్దుకుంటాడు. తన విశ్వాసానికి మరింత శక్తిని జోడించడానికి అవసరమైన సహాయాన్ని పొందుతాడు. ఇక రెండవ రకం వారు తనకు స్వంతంగా ఆలోచించే శక్తిసామర్థ్యం లేకపోయినా, ఇతరుల అనుభవాల ద్వారా లబ్ధి పొందే ప్రయత్నం చేయాలి. ఒకవేళ ఈ ప్రపంచంలో జరిగే సంఘటనలను చూసి కూడా గుణపాఠం నేర్చుకోకపోతే దానిని మూర్ఖత్వం, మార్గభ్రష్టత్వం, అంధత్వం అని అంటారు. ఒక విశ్వాసికి ఇది ఎంతమాత్రమూ తగనిది.

మనిషి జీవితకాలం చాలా స్వల్పమయింది. అత్యంత యిరుకైన స్థితిలో మనిషి శ్వాసిస్తున్నాడు. మానవుడు గుణపాఠం నేర్చుకోవడానికి శతాబ్దాల చారిత్రక అధ్యయనం, అనుభవం అవసరమవుతుంది. మానవుడు వాటిని అధ్యయనం చేయాలి. ఈ జీవిత కాల పరిమితిలోనే గుణపాఠం నేర్చుకోవాలి.

ప్రాపంచిక – పరలోక, భూత, వర్తమాన, భవిష్యత్తుల జ్ఞానం సంఘటనలు, సత్యాలు, గాథలు, కథలు అన్ని కలసి ఒక మహా విజ్ఞాన భాండాన్ని మనిషి ముందు ఆవిష్కరిస్తాయి. విజ్ఞాన భాండం ప్రపంచానికి సంబంధించిన వాస్తవాలను మనకు తెలుపుతుంది. ఈ ప్రచండమైన, అద్భుతమై విశ్వసృష్టి యొక్క సృష్టికర్తను, నిజ ప్రభువును గుర్తించడంలో సహాయకారిగా పనిచేస్తుంది. ఆలోచన, భావన, అధ్యయన–పరిశోధన, అనుభవాలు ఆధారాల పునాదులపై దృఢమైన, పటిష్ఠమైన విశ్వాసం నిర్మాణమవుతుంది.

ఈ కారణంగానే ఇస్లాం తన అనుయాయులను సుదూర ప్రాంతాలకు ప్రయాణం చేయమని ఉత్సాహపర్చింది. ప్రపంచమంతా తిరిగి విద్యాజ్ఞానాలను సముపార్జించమని, తద్వారా గుణపాఠ నేర్చుకొమ్మని ఉపదేశించింది. ఈ ప్రయాణాలు, యుద్ధం కొరకో, రక్తపాతం కొరకో లేక వినోదం కొరకో కాక విద్యాజ్ఞానాల కోసమని స్పష్టం చేసింది. అనుభవాల ద్వారా, ఇతరుల నుండి నేర్చుకోవడం తమ్ము తాము సరిదిద్దుకోవడం, పరిశోధన నిమిత్తం ఈ ప్రయాణాలు వుండాలని ఆదేశించింది.

**"మీకు పూర్వం ఎన్నో యుగాలు గతించాయి. (అల్లాహ్ ఉపదేశాలను) తిరస్కరించే వారి ముగింపు ఎలా జరిగిందో స్వయంగా భూమిపై సంచారం చేసి చూడండి. ఇది ప్రజలకు ఒక స్పష్టమైన హెచ్చరిక, అల్లాహ్‌కు భయపడే వారికి మార్గదర్శకత్వం, హితోపదేశం."** ***(ఖుర్ఆన్, 3 : 137-138)***

**"వారు భూమిలో ఎన్నడూ సంచరించలేదా, వారికి పూర్వం గతించిన ప్రజల ముగింపు ఎలా జరిగిందో వారికి కనిపించేందుకు? వారు వీరికంటే ఎక్కువ బలాఢ్యులు, వీరికి మించిన గొప్ప గుర్తులను భూమిపై వదలివెళ్లారు. కాని అల్లాహ్ వారి పాపాలకు గాను వారిని పట్టుకున్నాడు. అల్లాహ్ పట్టు నుండి వారిని రక్షించేవాడెవడూ లేకపోయాడు."** ***(ఖుర్ఆన్, 40 : 21)***

ఈ విధంగా దైవ చివరి గ్రంథం దివ్యఖుర్ఆన్, గడిచిన ప్రాచీన నాగరికతలను వాటి పతనాలను అధ్యయనం చేయమని ఆదేశిస్తుంది. రానున్న తరాలకు, తమ పూర్వీకులు చేసిన పాపాలు, తప్పులు తెలియాలి. వారు ఈ తప్పుల నుండి గుణపాఠాలు నేర్చుకోవాలి. చరిత్ర అధ్యయనం ద్వారా ఈ వాస్తవాలు వెలుగులోకి వస్తాయి.

కాలం స్వయంగా ఒక నిదర్శనంగా వుంటుంది. దీని వాస్తవికత తెలుసుకోవడానికి బుద్ధి, వివేక జ్ఞానాలకు పూర్తిగా సాధ్యం కాదు. కాలం యొక్క అడుగుజాడలు ఏ మేరకు పరిశీలన కొనసాగుతుందో ఆ మేరకే దాని తాలూకు పరిజ్ఞానం పొందగలం. ఎందుకంటే చరిత్ర యొక్క ప్రతి చిన్న, పెద్ద విషయం ఈ కాలం గర్భంలోనే సమాధి చేయబడి వుంది.

**"మిమ్మల్ని ధరణిపై వ్యాపింప జేసినవాడు ఆయనే, ఆయన వైపునకే మీరు సమీకరింపబడతారు. ఆయనే జీవితాన్ని ప్రసాదిస్తాడు మరియు ఆయనే మరణాన్నీ కలిగిస్తాడు. రేయింబవళ్ల పరిభ్రమణం ఆయన అధీనంలోనే ఉన్నది. ఈ విషయం మీకు అర్థం కావటం లేదా?."** ***(ఖుర్ఆన్, 23 : 79-80)***

మన ఈ జీవితం దారితెన్నూ లేని వ్యర్థమైనది కాదని ముఖ్యంగా మనం తెలుసుకోవాలి. అల్లాహ్ ఈ జీవితాన్ని మనకు వ్యర్థంగా ప్రసాదించలేదు. ఈ రహస్యాన్ని తెలుసుకుంటే కాలం మనల్ని ఎన్నడూ నష్టపర్చదు. మన ఉనికిని తుడిచిపెట్టనూ లేదు.

**-: సమాప్తం :-**